కానీ నా ఆనందం భ్రమాన్వితమనీ, అది యదార్థానికి హింసాత్మకం తప్ప మరొకటి కాదనీ ఆ రెండు సంఘటనలూ తెలియజేశాయి.

"మొదటిది - ఒకరోజు నేను నా మండలంలోని ఒక సుదూరమైన మారుమూల గ్రామానికి ఒక భూమి తనిఖీకి వెళ్ళినప్పుడు జరిగింది. ఆరోజు నేను ఇంకా పని మొదలుపెట్టకుండానే ఆ గ్రామస్థులంతా నన్ను చుట్టుముట్టారు. వాళ్ళలో ఎక్కువమంది ముసలివాళ్ళూ, భర్తలు లేని దిక్కుమాలిన స్త్రీలూను. వాళ్ళ డిమాండ్ ఏమిటంటే గ్రామంలో ఉన్న వృద్ధులకీ, వితంతువులకీ పెన్షన్లు అందటం లేదని, అవి అందరికీ మంజూరు చెయ్యాలనీ, అంతటితో ఆగక వాళ్ళు నన్ను ఘెరావ్ చేశారు. అందరికీ పెన్షన్లు మంజూరు చేస్తామని హామీ ఇస్తే తప్ప నన్ను కదలనివ్వమన్నారు. పాపం వాళ్ళు చేసింది సత్యాగ్రహమే కానీ అది నాలో నేను ఊహించని సంవేదనలు రేకెత్తించింది. నిజానికి ఆ ముసలివాళ్ళపట్లా, ఆ దిక్కులేని స్త్రీల పట్లా నాకు కూడా ఆవేదన ఉంది. అటువంటి వాళ్ళ కోసం అదనంగా బడ్జెట్ ఇవ్వాలని నేను ఎన్నోసార్లు జిల్లా కలెక్టర్‌కు విజ్ఞప్తి చేసి ఉన్నాను కూడా. కానీ ఆ క్షణాన మాత్రం వాళ్ళు అలా పట్టుపట్టినప్పుడు వాళ్ళకి ఎప్పటికీ ఎవ్వరూ పెన్షన్ మంజూరు చెయ్యకూడదనిపించింది. వాళ్ళ వల్ల నాకు కలిగింది భయం కాదు. అదొక చిత్రమైన అనుభవం. అప్పుడు నాకు కలిగిన ఫీలింగ్ ఏమిటో ఆ రాత్రి జరిగిన అత్యంత దురదృష్టకరమైన మరొక అనుభవం వల్లగానీ అర్థం కాలేదు."

ఆ మాటల తర్వాత మోహనచంద్ర కొంతసేపు ఆగాడు. అది బహుశా తను తర్వాత చెప్పవలసిన మాటల్ని కూర్చుకోవడం కోసమో లేక ఆ మాటలు చెప్పాలా వద్దా అన్నది నిర్ణయించుకోవడం కోసమో తెలియదు. ఏమయితేనేం అతను మళ్ళా మొదలుపెట్టాడు.

"అయ్యా, అసలు సంఘటనకు వస్తున్నాను. అదే నేను మీ ముందు ఒప్పుకోవాల్సిన నేరం. మీ మొత్తం జూరిస్‌ప్రుడెన్స్ అంతటినీ జ్ఞప్తికి తెచ్చుకుని వినండి. ఆ రాత్రి నా ప్రతి ఒక్క కదలికా, ప్రతి ఒక్క చేష్టా నాకు ఎంతో గుర్తు. అవి నా జాగృత్, స్వప్నావస్థల్లో కూడా మరుపుకు రావు. ఆ సాయంకాలం ఆ ఊరు నుండి తిరిగి వచ్చానన్న మాటే కాని నేనేదో ఒక దుర్భరమైన శారీరక హింసకి గురైనవాడిలా ఉన్నాను. అంత అలసట నాకెందుకు కలిగిందో తెలియదు. ఆ దీనులైన పేదవాళ్ళు నన్నేమన్నారని? భరించలేని తమ జీవిత దీపం కొడిగట్టకుండా ఇంత భృతి కల్పించమన్నారు. అంతేకదా! మరి దానివల్ల నాకెందుకంత కలత కలిగింది? ఇంటికి వచ్చానన్నమాటే గానీ నా మనసు మనసులో లేదు. నా బంగళా సమీపిస్తూనే డ్రైవర్ హారన్ మోగించాడు. సాధారణంగా ఆ హారన్ వింటూనే చయనులు బయటికి వచ్చి నా బ్రీఫ్‌కేసు అందుకుంటుంటాడు. కానీ ఆరోజు చయనులకు బదులు ఆ ఆడమనిషి వచ్చింది. ఆమెని చూస్తూనే నా డ్రైవర్ ముఖం చిట్లించుకున్నాడు. అతనికి మొదటినుంచీ ఆమెని చయనులు ఈ ఇంట్లో ప్రవేశపెట్టడం ఇష్టంలేదు. ఒకటి రెండుసార్లు ఆమె నా గ్రహించేలా సూచన చేసాడు కూడా. ఆమె నా బ్రీఫ్‌కేసు అందుకోవడానికి వస్తుంటే నా డ్రైవర్ ఆమెమీద ఆ పెట్టె విసిరినంత పనిచేసి 'వాడేమయ్యాడు?' అని అడిగాడు. ఆమె డ్రైవర్ ముఖం కేసి చూసే సాహసం చెయ్యలేకుండా భయంతో వణుకుతూ 'అయ్యా,



ఇప్పుడే వస్తానని పోయిండు' అని వెనక్కి చూడకుండా తొట్రుపడే అడుగుల్తో లోపలకు వెళ్ళిపోయింది. నేను కూడా అలసటగా ఆమె వెనుకే అడుగుపెట్టాను.

"లోపలికి వెళ్ళి నిస్సత్తువగా కూచున్నానో లేదో ఆమె వచ్చి తలుపు పక్కన నించుని 'అయ్యా, మీరు అలిసిపోయినట్టుండారు. కొద్దిగా వేణ్ణీళ్ళు కాచి వుంచాను. స్నానం చెయ్యరాదా' అంది. ఆమె మాట కాదనలేక స్నానంచేసి వాలుకుర్చీలో రిలాక్స్ అవుతూ జారబడ్డాను. అలా కొంతసేపు గడిచాక ఆమె మళ్ళా వచ్చి 'అయ్యా భోంచేద్దురుగాని లేవండి' అంది.

"నేను 'చయనులు ఏమయ్యాడు' అన్నాను. ఆమె ఏమీ మాట్లాడలేదు. రెట్టించి మళ్ళా అడిగితే ఊరెళ్ళాడనీ మర్నాడు వచ్చేస్తాడనీ చెప్పింది. నాకు ఆశ్చర్యమేసింది. అంతవరకూ అతనెప్పుడూ ఎక్కడికి వెళ్ళింది లేదు. ఒకవేళ వెళ్ళినా చెప్పకుండా వెళ్ళవల్సిన అవసరమేముంది? 'మరి ఇందాక డ్రైవర్తో ఇప్పుడే వచ్చేస్తాడని అన్నావే' అన్నాను. 'వాడు మంచోడు కాదయ్యా. ఈడు లేడని చెప్తే మండిపడతడని అట్లన్నను' అంది. 'మరి వంటెవరు చేసారు' అని అడిగాను. 'నేనే చేసానయ్యా. ఈడు పోతా పోతా హోటల్ నుంచి తెప్పించమన్నడుగానీ నాకే మనసొప్పల' అంది.

"నేను భోజనానికి కూర్చోబోయేముందు ఆమె 'అయ్యా, నేను స్నానం చెయ్యకుండ నీకు వడ్డించలేను. ఒక్కక్షణం ఆగితే వస్త' అని స్నానం చేసి వచ్చింది. అన్నం పెట్టింది. చయనులు నాకు అన్నం పెట్టడంలో ఒక సేవ మాత్రమే ఉంది. కానీ ఆమె అన్నం పెట్టినప్పుడు అందులో మా అమ్మని గుర్తు చేసేదేదో కూడా కనిపించింది. కానీ కొద్దిసేపే. ఆ తరువాత జరిగింది అందుకు విరుద్ధం.

"నేను ఇంక విశ్రమించబోయే ముందు ఆమె తన భోజనం కూడా కానిచ్చుకుని గిన్నెలు సర్దుకునేదాకా ఆగాను. ఆమె వెళ్ళిపోగానే తలుపులు వేసుకుని నిద్రపోవాలని నా ఆలోచన. అంతదాకా నా మంచం మీద వెల్లకిలా పడుకుని దీపం వెలుతురు కళ్ళ మీద పడకుండా మోచేయి అడ్డుపెట్టుకుని ఉన్నాను. నా కాళ్ళు ఒకటే లాగుతున్నాయి. వళ్ళు నొప్పులుగా ఉంది. ఆమె తన పని ముగించుకుని నా బెడ్‌రూం తలుపు దాకా వచ్చి 'నేను వెళ్ళొస్తనయ్య' అంది. సరే అనాలికదా. కానీ అనలేకపోయాను. ఆమె వెళ్ళిపోతుందంటే నాకెందుకో అంగీకరించాలనిపించలేదు. 'చూడు, నా కాళ్ళు కొద్దిగా నొప్పులుగా ఉన్నాయి. పాదాలు పట్టగలవా?' అని అడిగాను. ఆమె కళ్ళల్లో కనీకనిపించని ఆశ్చర్యం ఒక్క లిప్తపాటు మెరిసి మాయమైంది. 'అలాగేనయ్య' అందామె. వచ్చి నా మంచం పక్కగా నేల మీద మోకాళ్ళ మీద కూచుని నా పాదాల్ని తన చేతుల్లోకి తీసుకుంది. ఆ క్షణాన్ని గుర్తుపెట్టుకోండి. మిలార్డ్! నాలోని మనిషి పూర్తిగా మరణించిన క్షణం అది. నాలోని అధికారి నా మానవత్వాన్ని పూర్తిగా కూల్చివేసిన క్షణం అది.

"ఆమె తన బలమైన అరచేతుల్తో, కాయకష్టంతో కాయలు కాచిన అరచేతుల్తో నా పాదాలు ఒత్తుతుంటే ఆ ఫ్లోరసెంట్ వెలుతుర్లో ఆమె లేత నీలంరంగు వాయిల్‌చీర, రంగు వెలిసిపోయిన ఆ బీదవస్త్రం నన్ను పూర్తిగా అంధుణ్ణి చేసింది. నేను ముందుకు వంగి నా పాదాలు పడుతున్న ఆమె చేతుల మీద నా చెయ్యి వేసాను సందేహంతో, బెరుగ్గా. అప్పటి నా చేతుల

వణుకు నాకు ఇప్పటికీ గుర్తు. ఆమె ఏమీ మాట్లాడలేదు. ఏమీ జరగనట్టే తల ఎత్తకుండానే నా పాదాల్ని వత్తుతూనే ఉంది. నేను నా చేతుల్ని ఆమె మణికట్టు మీదుగా జారిన మట్టిగాజుల్ని తడుముతూ ఆమె వక్షంవైపు పోనిచ్చాను."

## 6

ఉదయం మోహనచంద్ర వాంగ్మూలం న్యాయ పరిభాషలోకి తిరిగినప్పుడు కనిపించిన అసహనం ఇప్పుడు కోర్టుహాల్లో లేదు. చీమ చిటుక్కుమన్నా కూడా భరించలేనత ఉత్కంఠ అక్కడ అలుముకుంది. ఒక నేరగాథతో మనుషులకి అప్రయత్నంగా కలిగే తాదాత్మ్యంలోని పారవశ్యం అక్కడ ఆవరించి ఉంది.

"అయ్యా" ఆ యువకుడు తదుపరి మాటలకోసం తడుముకుంటున్నాడు. అతని కళ్ళల్లో మసగ్గా నీటిపొర కమ్మింది.

"అయ్యా, ఆ రాత్రి నేను మొదటిసారిగా ఒక లైంగికానుభవాన్ని పొందాను. కానీ అది ఇద్దరు స్వతంత్ర మానవుల మధ్య సంభవించింది కాదు. అది ఒక అధికారికీ, ఒక సేవకురాలికీ మధ్య, ఒక యజమానికీ, బానిసకీ మధ్య సంభవించింది. నాతోటి మానవుడిని సేవకుడిగా మార్చిన నా అనుభవం అతడిని ఒక స్త్రీగా, అతడి స్త్రీని ఒక సేవకురాలిగా, ఆ సేవకులిద్దరినీ నా శారీరక వినియోగాన్నిచ్చే వస్తువులుగా మార్చుకోవడంగా కొనసాగి చివరికి ఆ ఇంటిలోని ఆ దీనురాలిని నా శయ్యగా మార్చుకోవడంతో ముగిసింది. అవును ఆ అనుభవంతో నేను పూర్తిగా భ్రష్టుణ్ణయ్యాను. కానీ ఆ అనుభవమే నాకు నా ఉద్యోగం గురించిన జ్ఞానోదయాన్ని కలిగించింది. ఆ భ్రష్టత్వం లాంటిది మీకు సంభవిస్తే మీరు కూడా మీ ఉద్యోగం గురించిన నిజమైన జ్ఞానాన్ని పొందుతారని చెప్పడానికి నేను సాహసిస్తున్నాను.

"అవును. ఆ అనుభవం అయినప్పుడే నాకు ఆరోజు ఉదయం ఆ గ్రామంలో పేదవాళ్ళు నన్ను నిలదీయడం వల్ల కలిగిన ఫీలింగ్ ఏమిటో అర్థమయింది. నేను చెప్తున్నది నిజం. ఆ ఉదయం ఆ గ్రామంలో ప్రజా సంఘం నన్నట్లా నిలదీసినప్పుడు నాకు కలిగిన ఆ ఫీలింగ్ ఒక కాస్ట్రేషన్ ఫీలింగ్ అని, ఎవరో నా పుంసత్వాన్ని ఛేదిస్తున్న విదారుణ అనుభవం అనీ ఆ రాత్రి గ్రహించాన్నేను.

"ఎక్కడిదీ నాకీ పుంసత్వం? ఇదే నేను మీకు చెప్పాలనుకున్నది. ఉద్యోగంలోకి రాక ముందు నేను ఒక మనిషిని. నాకు అప్పుడు ఆడా మగా తేడా తెలియదు. ఉచ్చనీచ భావాలు లేవు. సూపర్ ఆర్డినేషన్, సబార్డినేషన్లు తెలియవు. అప్పుడు నాకు ఆగ్రహంలేదు. పగ తెలియదు. ప్రతీకారం తెలియదు. కానీ నా ఉద్యోగం నన్ను మార్చేసింది. ఈ లక్షణం నా ఉద్యోగానికి ఎక్కడి నుంచి వచ్చింది?

"అయ్యా! కోర్టువారికి నేను మనవి చేసుకునేదేమంటే నన్ను నేరస్థుడిగా మార్చిందీ, నాలోని మనిషిని నశింపజేసి నాతోటి మనిషికి యజమానిగా మార్చిందీ మీరు ఎంతో ఆరాధించే



ఇండియన్ పీనల్‌కోడ్ అంటే నమ్ముతారా? వినటానికి కష్టంగా ఉన్నా, మీరు ఈ మాటలు కూడా వినక తప్పదు. మీరు భారతీయ శిక్షాస్మృతి చరిత్ర చూడండి. అంతకుముందు ఈ దేశంలో హిందూ మహమ్మదీయ న్యాయస్మృతులుండేవి. అడవుల్లో ఆదివాసుల నోటిమాటల సత్యప్రమాణకమైన ధర్మం ఉండేది. అప్పుడు నేరమనేదానికి వాళ్ళిచ్చిన నిర్వచనమేమిటి? అయితే అది భగవంతుడి ఆజ్ఞని ఉల్లంఘించడం. లేదంటే తోటి మనిషిని కష్టపెట్టడం. అందుకు పరిహారమేమిటి? హృదయ పూర్వక పశ్చాత్తాపం లేదా కొంత జరిమానా. అదికూడా ఎలాగనుకున్నారు? తన సంఘంలో ఇరుగుపొరుగు అందరికీ ఒక విందు చెయ్యడం. అంటే తినిపించడం లేదా తాగించడం. దానికి డబ్బు కావాలి. కాబట్టి నేరస్థుడు తను దాచుకున్నదన్నా ఖర్చు చెయ్యాలి, లేదా అప్పు చెయ్యాలి. ఆ అప్పు తీర్చడానికి మరింత కష్టపడాలి. అంటే ఏ తప్పుకైనా శిక్ష మరింత శారీరక శ్రమ. అది కూడా అదనపు ఉత్పత్తిని ప్రోత్సహించే శ్రమ. అందులో అవమానం లేదు. దుఃఖం లేదు. న్యూనత లేదు. తప్పు మానవ సహజం. తప్పు చేసినవాడు తన తోటివాళ్ళ కన్నా మరిన్ని ఎక్కువ గంటలు కష్టపడాలి. అంతే ఆ తత్వశాస్త్రం.

"కానీ మన పీనల్ కోడ్ చూడండి ఎవరు దీని రూపకర్తలు? ఎవరు మనని బానిసల్ని చేసారో వాళ్ళే దీన్ని రచించింది. విజేతలు ఒక విజితభూమి కోసం చేసిన శాసనం అది. దానికీ, దానికి పూర్వం ఈ దేశంలోని స్మృతులకూ తేడా చూడండి. అంతకు ముందు చట్టాల్లేవు. ఒప్పందా లున్నాయి. వాటిని ఉల్లంఘించడం నేను ఇందాకా చెప్పినట్టుగా అయితే దేవుణ్ణి ధిక్కరించడం, లేదా మనిషిని మోసగించడం. కానీ ఈస్టిండియా కంపెనీ తయారుచేసిన శిక్షాస్మృతిలో మొదటి సారిగా స్టేట్ అనేది వచ్చింది. ఈ స్టేట్ ఎవరు. అది దేవుడూ కాదు, మనిషీ కాదు. కానీ ఇది కొందరు మనుషులకి అధిక సంఖ్యాకులైన తక్కిన మనుషుల్ని అణిచి ఉంచడానికి దేవుణ్ణి మించిన అధికారాల్ని కట్టబెట్టింది. మొదటిసారిగా పీనల్‌కోడ్ ఒక మనిషి చేసే ఒక నేరాన్ని స్టేట్ పట్ల నేరంగా చూపించే ప్రయత్నం చేసింద్. అంటే ఇద్దరు రహస్యంగా ఒక ఒప్పందం చేసుకున్నారను కోండి. అందులో ఒకడు మరొకడిని మోసగించాడనుకోండి. పూర్వం అయితే అది దేవుణ్ణి మోసగిం చడం లేదా మనిషి తోటిమనిషిని మోసగించడం. కానీ కంపెనీ స్మృతికారుల కొత్త భాష్యం ఏమిటంటే అటువంటి ఉల్లంఘన ఒక బ్రీచ్ మాత్రమే కాదు. క్రిమినల్ బ్రీచ్ మాత్రమే కాదు, అది స్టేట్‌ని మోసగించడం కూడా. అప్పుడు స్టేట్ దాని మీద ప్రతీకారం తీర్చుకోవడం మొదలు పెడుతుంది. అది కూడా ఎవరిద్వారా? మీ ద్వారా, నాద్వారా, ఈ లాయర్లద్వారా, ఈ కోర్టు బంట్రోతులద్వారా, మొత్తం ఈ వ్యవస్థ అంతటిద్వారా. కోర్టు అంటే ఒక న్యాయసమ్మతమైన తీర్పు మాత్రమే అనుకు నేరు. నేను ఒకసారి ఒక తీర్పు ఇచ్చినా ఒక నిందితుడిని వెంటనే విడుదల చెయ్యలేకపోయాం. ఎందుకో తెలుసా? నా కోర్టుసీలు నా బంట్రోతు మర్చిపోయి వచ్చినందువల్ల. నా సంతకం ఉన్నా ఆ సీలు లేకపోతే సబ్‌జైలు అధికారులు ఆ ఉత్తర్వుని అంగీకరించనందువల్ల. ఇప్పుడు చెప్పండి. స్టేట్ అంటే ఏమిటి? మనమా? మన సంతకమా? మన పేరు హోదా రాసి ఉండే ఒక రబ్బరు ముద్రనా?

"కోర్టువారు, దయచేసి నేను ఉపన్యాసం ఇస్తున్నానని అనుకోవద్దు. నా ఆవేదనని గమనించండి. స్టేట్ అంటే మనని జయించినవాడు మనని సర్వకాల సర్వావస్థల్లోనూ అణచి ఉంచే ఒక లైంగిక శక్తికి ప్రతీక అని నేను చెప్తే మీరు అన్యథా భావించకండి. మీ న్యాయ వ్యవహార మంతటికీ సారాంశప్రాయమైన పీనల్‌కోడ్ ఆ లైంగికశక్తికి ఒక జస్టిఫికేషన్ మాత్రమే. నేను ఒక ఎమ్మార్వోగా చేసినదంతా వాస్తవంగా ఏమిటి? అసలు నేను ఎమ్మార్వోగా ఒక మనిషిని కాను, ఒక మహా కాయుడైన రాజ్యపురుషుడి తొడల మధ్య వేలాడే ఒక మేఢ్రాన్ని కానా నేను?"

కోర్టు హాల్లో కలకలం రేగింది. మాజిస్ట్రేట్ ముఖంలో కోపాన్ని బలవంతంగా ఆపుకుంటున్న ఛాయలు కనిపించాయి. నిందితుడు వాడిన చివరిమాట ఏమిటో అర్థంకాక కోర్టు టైపిస్ట్ కంగారు పడ్డాడు. కానీ మోహనచంద్ర అదేమీ పట్టించుకోకుండా కొనసాగించాడు.

"అవును. నేను నా ఉద్యోగం తొలినాళ్ళలో అనుభవించిన ఆ ఆనందమేమిటో అర్థం చేసుకోగలిగాను. అది ఒక పెనిట్రేషన్‌లోని ఆనందం. నేను నా జీపు మీద నా మండలపరిధిలో తిరుగుతున్నప్పుడు నా ద్వారా స్టేట్ ప్రజాదేహంతో ఒక రతిని అనుభవించింది. పూర్వంరాజులు అశ్వమేథాలు చేసేవారు చూడండి. అప్పుడు గుర్రాన్ని వదిలిపెట్టేవారు. ఆ గుర్రం ఎంత దూరంపాటు ఎదురులేకుండా తిరుగుతుందో అంతమేరకు ఆ రాజు అధికారం చెల్లుబాటైనట్టు. అదిగో ఆ గుర్రంలాంటివాణ్ణి నేను. నేనెంత దూరం తిరిగితే అంత దూరం స్టేట్ లైంగికశక్తి అప్రతిహతంగా సాగుబాటయినట్టు. ఇది ఒక స్వస్థ మానవుడు కోరుకునే అనుభవమేనా? ఇటువంటి అనుభవానికి నన్ను అలవాటు చేసేముందు స్టేట్ నాలోని మానవత్వాన్ని ఒక పథకం ప్రకారం ఎండగట్టింది. నేను చదువుకునే రోజుల్లో ప్రయాణాలు చేసేటప్పుడు బస్సెక్కితే ఎక్కడో ఒక సీటుకిటికీ పక్క వెతుక్కుని దారి పొడవునా చెట్లనీ, పొలాల్నీ, మేఘాల్నీ, పక్షుల్నీ చూస్తూ కలల్లో తేలిపోతుండేవాణ్ణి. కానీ ఇప్పుడు ఒక వెహికిల్ ఎక్కితే నా దృష్టి ఎంతకూ దిగబోయే ఊరు ఎప్పుడు వస్తుందా అనే. ఇప్పుడు నేను తీరకని భరించలేను. ఎందుకంటే తీరిక నన్ను నాకు గుర్తు చేస్తుంది కనుక. నాకు నా టైము అంటూ ఉండడానికి వీల్లేదు. ఎందుకంటే ఇప్పుడు నేను నాకు చెందను కనుక. మీకు తెలుసుకదా ఉద్యోగంలో చేరినప్పుడే ప్రభుత్వం మనకి చెప్పింది మనది 24 గంటల పని అని. ఆ మాటకి అర్థం నెమ్మదిగా తెలుసుకున్నాను. అవును. నేను ప్రభుత్వ సేవకుడిని అయ్యానంటే దానర్థం ప్రభుత్వం తన లైంగిక ఆనందానికి నా శరీరంతో నేను తోడ్పడాలనే కదా! అందుకే నేను ఒక సేవకుడిని పెట్టుకున్నప్పుడు, అతడు తనకు మరొక సేవకురాల్ని తెచ్చుకున్నప్పుడు అందరం చేసింది ఒకరి లైంగిక ఆనందానికి మరొకరి శరీరాన్ని వాడుకోవడమే కదా! నా కథలో ఇంకా ఒక చిన్నభాగం ఉండిపోయింది. అది కూడా చెప్పనివ్వండి. చయనులు ఆ ఆడమనిషిని తెచ్చుకోవడం నా డ్రైవర్‌కి, ఆఫీసు సిబ్బందికీ ఇష్టం లేకపోయింది అని చెప్పాను కదా. నేను ఒకసారి వారంరోజులు సెలవు పెట్టి మా ఊరు పోయిరావల్సి వచ్చింది. ఆ వారంరోజులూ నా బంగళాని చయనులు మీదే వదిలిపెట్టి వెళ్ళాను. నేను తిరిగి వచ్చేటప్పటికీ నా ఆఫీసు సిబ్బంది మొత్తం కూడబలుక్కుని మరీ చయనులు మీదా, అతని ఆడతోడు మీదా అభియోగాల్తో నన్ను ముంచెత్తారు. నేను లేనప్పుడు



చయనులూ, ఆ ఆడమనిషీ నా ఇంట్లోనే మకాం పెట్టారనీ, అంతేకాక నా బెడ్‌రూం వాడుకోగా కూడా తాము చూసామనీ వాళ్ళ ఆరోపణ. అంతేకాదు, చయనులు నా పేరు మీద ఊళ్ళో అందినచోటల్లా అప్పులు చేసాడనీ, బట్టలకొట్లో ఖాతా తెరిచాడనీ కూడా. ఇవన్నీ వింటున్నా చలించనివాణ్ణి, చివరకు మా ఆఫీసు అటెండర్ ఒకడు, ఆఫీసు పనిమీద వచ్చేవారి దగ్గర నుండి చయనులు డబ్బు వసూలుచెయ్యగా తను చూసానని చెప్పడంతో నేను ఆగలేకపోయాను.

"ఇంటికి వెళ్ళడమేమటి చయనుల్ని బయటికి నడవమన్నాను. తెల్లబోయిన అతడి ముఖం కూడా చూడకుండా, అతనికి చెప్పుకునే అవకాశం కూడా ఇవ్వకుండా అతని గుడ్డలు పెట్టుకునే డొక్కు సూట్‌కేసును బయటకు విసిరేసాను. అతని వెనుకే అతని ఆడమనిషి కూడా గుడ్లనీళ్ళు కుక్కుకుంటూ బయటకు నడిచింది. ఆ పనిమనుషులిద్దరినీ నా ఆఫీసు పనిమనుషులు దొంగ ల్లాగా, జంతువుల్లాగా యుద్ధంలో ఓడిపోయి పట్టుబడి బానిసలుగా మారిపోతున్న వాళ్ళని చూసి నట్టుగా ఉండిపోయారు.

"న్యాయమూర్తీ! నాకు చెప్పండి. నేను చేసిన పని సమంజసమేనా? అది మహాపాపం కాదా? నేను అతనికి విధించిన శిక్ష ప్రిన్సిపుల్స్ ఆఫ్ నాచురల్ జస్టిస్‌కి వ్యతిరేకం కాదా? ఇంతకీ అతను, లేదా వాళ్ళిద్దరూ చేసిన నేరమేమిటి? వాళ్ళు దేవుణ్ణిగానీ మనిషినిగానీ మోసగించలేదే. వాళ్ళు ఆ బంగళాలో వారంరోజులు మకాంపెడితే తప్పేమిటి? నేను వాళ్ళ శరీరాల్నే సుఖసామగ్రిగా వాడానే.

"అతను అర్జీదారుల నుండి డబ్బులు వసూలు చేసినట్లయితే అది తప్పే. కానీ దానికి అదే శిక్ష అయితే, ఆ శిక్ష నా ఆఫీసు సిబ్బంది మొత్తానికి నేను అంతకుముందే విధించి ఉండాలే. ఇప్పుడు ఆలోచిస్తే అనిపిస్తోంది. నాకు కోపం రావడానికి కారణం అతడు డబ్బు తీసుకుంటున్నాడన్న ఆరోపణ కాదు. అంతకు మించిందేదో రహస్యమైన కారణం ఉంది. అది నా లైంగికతని, నా పుంసత్వాన్ని దేన్నో రెచ్చగొట్టిన కారణం. ఆ పుంసత్వం నాది కాదు. నా యజమాని అయిన స్టేట్‌ది. అంటే నా ఉద్యోగం నన్ను మనిషిగా పూర్తిగా నశింపజేసి ఒక మగవాడిగా, ఒక లైంగికావ యవంగా మార్చినదాని పర్యవసానమే కదా అది.

"ఇప్పుడు స్టేట్ నామీద ఈ కేసులో పీనల్‌కోడ్‌లోని సెక్షన్లు 441, 442, 509ల ప్రకారం అభియోగాలు మోపింది. ఒకటి క్రిమినల్ ట్రెస్‌పాస్. రెండవది హౌస్ ట్రెస్‌పాస్. మూడవది ఒక స్త్రీ పట్ల అసభ్యకరమైన హావభావాలు ప్రదర్శించడం. ఇవి నిజం కాదనీ, వీటి వెనుక నా మెన్స్‌రియా పరిశుద్ధమైందని నా లాయర్ వాదించాడు. కానీ యువరానర్! అసలు ఈ సెక్షనలను రూపొందించిన వారి సంకల్పమే పరిశుద్ధమైంది కాదు. ఈ దేశంలోకి అన్యాయంగా చొరబడినవాడికి క్రిమినల్ ట్రెస్‌పాస్ గురించి మాట్లాడే హక్కు ఏముంది? అటువంటివాడి సృష్టిగా కొనసాగుతున్న ఈ రాజ్యానికి ఒక పాశవిక అంగంగా మారినపుడే నేను ఇక్కడి స్త్రీలకీ, నేలకీ, జాతికీ, ప్రజకీ అవమానం చేసిన వాణ్ణయ్యాను. ఇక కొత్తగా నా మీద ఇప్పుడు కేసు ఏమిటి?

"ఇది కూడా గమనించాను నేను. ఎప్పుడన్నా ఈ రాజ్యం, లేదా ఈ రాజ్య పరికరాలమైన మేము అన్యాయాన్ని సరిదిద్దాలని అంటున్నామంటే దాని అర్థం మా లైంగికత ఎక్కడో గాయపడిందన్నమాట. ఎవడో రాజ్య యంత్రాంగానికి బయట ఆ అన్యాయాన్ని సరిదిద్దే ప్రయత్నం చేస్తున్నట్లుగా మేం గుర్తించామన్నమాట. దాన్నే మన భాషలో చట్టాన్ని వాళ్ళ చేతుల్లోకి తీసుకుంటున్నారు అంటాం. అలా ఎవరన్నా చట్టాన్ని తమ చేతుల్లోకి తీసుకోవడం మనని ఒక కాస్ట్రేషన్ ఫీలింగ్‌కి గురిచేస్తుంది. మనం ప్రతీకారం తీర్చుకునేలా చేస్తుంది. ఆరోజు ఆ తల్లీపిల్లా తిండి లేక మాడుతుంటే ఒక మనిషిగా నేను ప్రతిస్పందించాల్సిన పద్ధతి అదేనా? బహుశా వాళ్ళకి నా దగ్గర ఏముంటే అదిచ్చి, ఆ పూట వాళ్ళ ఆకలి మాన్చి ఉండాలి కదా. అది నా మానవ సామర్థ్యానికి ఒక సవాలుగా తీసుకుని ఉండాలి కదా. కానీ ఒక అధికారిగా నా ప్రతిస్పందన ఆ విధంగా లేదు. అది నా లైంగిక సామర్థ్యానికి సవాలుగా భావించాన్నేను.

"అందుకనే నా రెయిడ్‌ని ఒక లైంగిక అత్యాచారంగా వాళ్ళు భావించడంలో నాకు ఇప్పుడేమీ ఆశ్చర్యం కలగట్లేదు. రామినాయుడు ఒక దురుద్దేశంతోనే నా మీద ఈ కేసు పెట్టాడనుకున్నా ఆ దురుద్దేశం వెనక రాజ్యంపట్ల అతని అవగాహన సదవగాహనే అని అనుకుంటున్నాను. ఎన్ని లోపాలున్నా అతడు ప్రజా ప్రతినిధి. ఎన్ని సుగుణాలున్నా నేను కలోనియల్ అవశేషాన్ని."

ఇక ఆపైన మోహనచంద్ర మాట్లాడటానికేమీ లేదన్నట్లుగా ఆగిపోయాడు. మళ్ళీ ఒక్కక్షణం తరువాత "కాబట్టి కోర్టువారికి నేను విన్నవించుకునేదేమంటే నేను తప్పు చేసాను. నేను శిక్షార్హుణ్ణి. కానీ ఆ తప్పుకి బాధ్యత నాలోని మనిషిది కాదు. నాలోని అధికారిది. ఆ అధికారాన్ని విచక్షణా రహితంగా నాకు ధారాదత్తం చేసి, నన్ను నాతోటి మనుషుల పైన తీర్పరిగా, యజమానిగా మార్చిన మీ సకల శిక్షాస్మృతులదీను. మీరు శిక్ష విధించవలసింది నాలోని అధికారికీ, ఆ అధికారిని తయారుచేసిన ఈ రాజ్యానికీ" అన్నాడు.

ఇక ఆపైన మాట్లాడలేక మౌనంగా ఉండిపోయాడు. అప్పుడు అతని వదనంలో ఒక దీర్ఘకాలపు డిప్రెషన్ నుండి బయటపడిన మానసిక రోగి ముఖంలో కానవచ్చే తేటతనం లాంటిదేదో కానవచ్చింది.

ఆ సమయానికి బయట మధ్యాహ్నపు ఎండ సన్నగిల్లి చలికాలపు గాలుల తొలితెమ్మెరల చల్లదనం అంతటా ఆవరిస్తో ఉంది.

7

ఆ కేసు ఏ విధంగా డిస్పోజ్ అయిందన్నది ఏమంత ముఖ్యం కాదుగానీ ఆ తరువాత కొన్నిరోజులకే మాజిస్ట్రేట్‌గారి దగ్గర బంధువుల అమ్మాయితో మోహనచంద్ర వివాహం అయ్యిందని తెలుసుకుంటే చాలు.

*ప్రజాతంత్ర వర్తమాన సాహిత్య సంచిక, ఏప్రిల్ 2002*



# 2

# నిచ్చెన

**ఇనాయతుల్లా**





రాయలసీమ ప్రాంతంలో ఫ్యాక్షన్ హింసను అణిచివేసే పేరున బడుగు జీవులను బలి తీసుకుంటున్న రాజ్య స్వభావాన్ని వివరించిన కథ 'నిచ్చెన.' రచయిత ఇనాయతుల్లా 16 ఫిబ్రవరి 1963లో పుట్టారు. వీరి మొదటి కథ 'వలస' 2000 సం॥లో కర్నూలు నుండి వెలువడిన *కథా సమయం* సంకలనంలో అచ్చయింది. ఉపాధ్యాయ వృత్తిలో వున్నారు.

చిరునామా : *11-129 సి, ఆదర్శ విద్యాపీఠం ఎదురుగా, అబ్బాస్‌నగర్, కర్నూలు-2*

నేషనల్ హైవే మీద తొంభై కిలోమీటర్ల వేగతో మెత్తగా పరిగెత్తుతున్న నల్లని క్వాలిస్ బండి సడన్‌గా ఆగింది. మూసిన రైల్వేగేటు రేడియం లైట్లు చీకట్లో మెరుస్తున్నాయి. క్వాలిస్ వెనుక నుంచి వచ్చిన టాటా సుమో కూడా సైడ్ తీసుకొని ఆగింది. గేటు అవతలివైపు లారీల హారన్‌లు వినిపిస్తున్నాయి. ఇవేవీ పట్టనట్టుగా తన గది బైట దిమ్మపై కూచున్న గేట్‌కీపర్‌చుట్ట లాగిస్తున్నాడు. ఆగి ఆగి దమ్ము లాగి పొగ వదుల్తున్నాడు.

క్వాలిస్ ముందుభాగంలోని అద్దం కిందకు దిగింది. కిటికీలో నుంచి రమణారెడ్డి తల బైటకు పెట్టి సుమో డ్రైవర్‌ను పిల్చాడు. డ్రైవర్ పరిగెత్తుకుంటూ వచ్చాడు. జేబులు వెతికి అగ్గిపెట్టె బైటికి తీసిచ్చాడు. రమణారెడ్డి సిగరెట్ అంటించాడు. అగ్గిపెట్టె తిరిగి ఇస్తూ ఎడమచేతి వేళ్ళు ఊపుతూ ఏవో జాగ్రత్తలు చెప్పాడు. ఎడమచేతికున్న బ్రాస్‌లెట్ చీకట్లో మెరుస్తూ ఉంది. డ్రైవర్ తల ఊపుతున్నాడు. ఆ చీకటిని నిశ్శబ్దాన్ని ధ్వంసం చేస్తూ ఒక్కసారిగా నిజాముద్దీన్ ఎక్స్‌ప్రెస్ గట్టిగా కూతేసింది. రైల్వేట్రాక్‌ను దడదడలాడిస్తూ గేటు దాటింది.

ఆ శబ్దానికి సుమోలో ఉన్న కిష్టిగాడు నిద్ర లేచాడు. ఆవలించి నాలుకతో మీసాలు తడుముకున్నాడు. కళ్ళు తెరవాలని ఉంది. కాని కనురెప్పలు బాగా బరువెక్కినాయి. ఎవర్నో పిలవాలని ఉంది. కాని నాలుక తడబడుతోంది. శరీరాన్ని కదిలించాలని ఉంది. కాని అది సారాపీపా అయ్యింది. కిష్టిగాడు బీడీకోసం వెతుకుతున్నాడు. చెయ్యి జేబులోనికి పోవడంలేదు. మైకంలోనే పిలుస్తున్నాడు.

"ఒరే బూసి... బూసిగా... జోగిట్ల బీడీ బుడుకులాడురా" పంటి కింద పెదవి నొక్కుతున్నాడు, తూలుతున్నాడు.

సుమో స్టార్టయ్యింది. క్వాలిస్‌ను ఫాలో అయింది. కిష్టిగాడి ప్రేలాపనలు ఆగలేదు.

"ఒరే బాసగా! గీ నడుంగుల ఉండే లైటెయిర నీయవ్వ... బీడీ కనబడకుండుంది" గట్టిగా అరిచాడు.

"ష్. రేయ్. అర్సగా కర్రిలే. ముందు బండిలో రొడ్డి మేల్కొండడు. సప్పిడి జేసినారంటే సప్పరిలిస్తడు" డ్రైవర్ బాష లైటేస్తూ అన్నాడు.

కిష్టిగాని జుబ్బా జేబులో నుంచి నలిగిపోయిన బీడీ బైటికి తీసినాడు బూషి.

"థూ నీయవ్వ మామా! మాంచి సీగ్రెట్ తాగాల్సిన లెవిలు నీది. ఏంది మామ గీ తుంట బీడీలు తాగుతున్నవ్" అన్నాడు బూసిగాడు.

"దీం తల్లి... ఒరే. బాయ వాకొడక. నాకు గిన బంగి రేగిందంటే నేను మన్సిని కాను. యియాల పైట్యాల నుండి ఒక్క బీడీ గూడ తాగల్యా. యాడన్న బీడీ బుడుకులాడిలే. ఒరే బాసగా! నువ్వు బండి ఆపుతావా లేదా" గర్జించాడు కిష్టిగాడు.

కుడిచెయ్యి స్టీరింగ్ మీద పెట్టి ఎడమచేత్తో నెత్తిన బాదుకున్నాడు బాష.



"రేయ్ పట్రా. ఇగో బీడీకట్ట, అగ్గిపెట్టె. నీయవ్వ సంత బెట్టినారు. ఇంగ అర్సకుండ పడుకోని సావర్రి" అంటూ లైటార్పేసినాడు.

బూసిగాడు కట్టలో నుండి బీడీ తీసి కిష్టిగాని నోటికి అందించాడు. అంటించాడు. చాలా సేపటి తర్వాత దమ్ము లాగుతున్నందుకు కిష్టిగానికి హాయిగా ఉంది.

మామూలుగా అయితే సారాయి తాగినాక కిష్టిగాడు మొత్తం మర్చిపోయి నులక మంచం మీద పడి నిద్రపోయేడు. మళ్ళీ తన భార్య రత్తాలు నిద్రలేపే వరకూ లేచేవాడు కాదు. రత్తాలు మొఖం కడిగించేది. ఇష్టమైనవి వండిపెట్టేది. కిష్టిగానికి రత్తాలన్నా మూడేళ్ళ కొడుకు మణిగాడన్నా ప్రాణం. రత్తాలు ఎదురుగా ఉంటే అన్నీ మర్చిపోవచ్చనుకున్నాడు. అందుకే కిష్టి బూషిగాణ్ణి "ఒరే బూషి, మనం మళ్ళీ ఇంటికెప్పుడు పోతాంరా" అడిగాడు.

"ఇప్పుడు ఇంటికాన్నుంటే గదా వస్తుండేది? మల్లా ఎప్పుడు పోతామనేది మనకు తెల్సా? రొడ్డి చెప్పాల. మనం పోవాల" అన్నాడు బూషిగాడు.

"ఏం బావ. మల్లా అప్పుడే ఇంటిగాలి మల్లిందా? అవు. ఉప్పుకారం తిన్నోడు ఉండబట్క లేడు కదా బావా" కుశాలుగామాట్లాడాడు కురవ బాలయ్య.

"నిన్ని బెంగులూరుకు తీస్కపోతున్నారు. అట్లాంటిదానికి తక్కవ ల్యాకుండా సూస్కుంటాడులే రొడ్డి" అందుకున్నాడు మద్దిలేటి.

"థూ నీయవ్వ. నేనొకటి అడిగితే మీరొకటి చెప్తరు గదిలే. ఇంటికాడ రత్తాలు ఒక్కతే ఎన్నాల్లుంటదీ? అని నా ఎదారు" బీడీ పారేస్తూ అన్నాడు కిష్టిగాడు.

"ఇప్పుడు నీ లెవిలే మారిపోయింది బావా! నీ ఇంటి ఎదారి ఒంటి ఎదారి మొత్తం రొడ్డి సూస్కుంటాడు. నూ నెత్తిన తడి గుడ్డేస్కొని సల్లగ పండ్కో" చెప్పాడు బాలయ్య.

కాని కిష్టిగాని మనసు రత్తాలు సుట్టే తిరుగుతోంది. యియ్యాల చేసిన పని రత్తాలుకు తెలిస్తే... అమ్మో... ఆ ఊహే కిష్టిగాన్ని కంపరమెత్తించింది. అందుకే అంత మైకంలో కూడా ఆయాల చేసిన పని మళ్ళీ మళ్ళీ మతికి చేసుకుంటున్నాడు. కళ్ళు మూసుకుంటున్నాడు. మళ్ళీ తెరుస్తున్నాడు. రత్తాలు, మణి మాటిమాటికీ కన్నీళ్ళ ధారలతో వణుకుతూ కనిపిస్తున్నారు.

కిష్టిగాడు మనిషి రాయి లెక్కటోడు. కష్టానికి వంగేటోడు కాదు. వంగితే మరి లేసేటోడు కాదు. వరికోతల్లో కొర్రకోతల్లో కిష్టిగానితో అందరూ పంద్యాలు కాసెవోల్లు, ఓడిపోయేటోల్లు. గుండ్ల సింగారంల ద్యావర జరిగినప్పుడు పెద్ద గుండు నెత్తినాడు. వెండి కడెం గెల్చినాడు. కొలిమి గుండ్లలో మాబు సుబాని ఉరుసులో ఇసక బిందెలెత్తినాడు. ఉంగరం గెల్చినాడు. ఊర్లో పీర్లపండుగ నాడు అల్లాయిగుంత కాడ పంచ్యాతి పడింది. బారా యిమాం పీరు పట్కొని గుంతలో కిష్టిగాడే దుంకాల అని బోయోళ్ళు కాదు బలి రంగన్న దుంకాల అని బలిజోళ్ళు. గలాట పడింది. కిష్టిగానికి కోపమొచ్చింది. పిడిబాకు తీస్కొని బలిజ రంగన్నను పొడిసినాడు. మనిషైతే సావలేదుగాని కేసు చాలారోజులు నడిచింది.

సరింగా ఆ టయానే చెన్నంపల్లి శంకర్రెడ్డికి బలిజ సిద్ధారెడ్డికి ఊర్లో పార్టీ పడింది. ఎం.పి.టి.సి ఎలక్షన్లకు శంకర్రెడ్డి తమ్ముడు రమణారెడ్డి మీద సిద్ధారెడ్డి తమ్మున్ని నిలబెట్టినాడు. అందుకని శంకర్రెడ్డి బలిజ గుంపును ఊరిడ్పియ్యల్ల అని చూస్తున్నాడు. అప్పుడు శంకర్రెడ్డి దృష్టి కిష్టిగాడి మీద పడింది. కేసులో ఇరుక్కున్న కిష్టన్నకు బెయిలిప్పించాడు. అప్పటి నుంచి ఇప్పటిదాక కిష్టిగాని కుటుంబానికి గొడుగైనాడు. కిష్టిగాడు శంకర్రెడ్డి అడుగులో అడుగైనాడు, అని అనుకుంటుంటారు ఊర్లో జనమంతా. కాని నిజంగా కిష్టిగాడే శంకర్రెడ్డికి గొడుగైనాడు. కిష్టిగాని సాయంతో రాజకీయం నడిపినాడు రెడ్డి. కిష్టిగాడు లేకుండా ఊరుదాటి అడుగు బయటికి వేసేటోడు కాదు.

"ఈ పార్టీలు మనకొద్దు బావా! మట్టసంగా కూలిసేస్కొని బత్కుదాం" రత్తాలు కిష్టన్నతో చాలాసార్లు చెప్పింది. మొదటిసారి కిష్టన్న పోలీసుస్టేషనుకు పోయినప్పుడు రత్తాలు నిండు మనిషి. బెయిలు మీద ఇడ్సినంక ఇంటికొచ్చినప్పుడు రత్తాలు నోట్లో చీరకొంగు పెట్టుకొని చాలాసేపు ఏడ్చింది.

గుండెల మీద తలపెట్టి "బావా! ఇట్టగానైతే నన్నిడ్సిపెట్టు. నేను మా యమ్మోల్ల ఇంట్లనే ఉంట. నువ్వు బజార్ల పడి కొట్టుకుంట సంపుకుంట బత్కన్న బత్కు సావనన్న సావు" అని ఏడ్చింది.

కిష్టిగాడు ఆరోజు మాటిచ్చినాడు మళ్ళీ ఇట్లాటి పని చేయనని. కాని శంకర్రెడ్డి ఊరుకోలేదు. ఇంటికి జీపులు పంపడం పిలిపియ్యడం. తనతోపాటు కూర్చోబెట్టుకుని తాగడం... ఇవన్నీ చేస్తుంటే కిష్టన్న కాదనలేకపోయాడు. రత్తాలుకు కూడా ఇక అలవాటైపోయింది. కాన్పు కోసమని పుట్టింటికి పోయింది. సుమారు ఏడునెలలు అక్కడే ఉంది. ఆమధ్యకాలంలో కిష్టిగానికి పగ్గాలే లేవు. హైద్రాబాద్, విజయవాడ, మద్రాసుకు రెడ్డెంబడి చాలాసార్లు పోయొచ్చినాడు. బంజారాహిల్స్‌లో శంకర్రెడ్డికి పెద్ద బంగళా ఉంది. అక్కడ శంకర్రెడ్డి ఎన్నిరోజులు మకాం వేస్తే అన్నిరోజులు హైద్రాబాదులో ఉండేటోడు. యమ్మెల్లేలు, మంత్రులు, ఆఫీసర్లు కిష్టిగానికి రోజూ కనబడే మనుషులు.

చిన్నప్పుడు సందుల్లో గోలీలాడుతూ పోలీసోణ్ణి చూసి నిక్కరు తడుపుకున్న కిష్టిగానికి ఇప్పుడు సి.ఐలు, డి.ఎప్పీలు, ఎస్.పిలంటే లెక్కలేదు. కట్టలు కట్టలు నోట్లు కిష్టిగాని చేతుల మీదుగా పోలీసులకు చేరేవి.

కాని ఇయ్యాల చేసిన పని కిష్టిగాడు తన జీవితంలో చేసిన మొదటి పెద్ద పని. అందుకే కిష్టిగాడు ఎంత వద్దనుకుంటున్నా అదే దృశ్యం... కళ్ళముందు కదుల్తోంది. గుండె దడ ఆగకుండా ఉంది. మాటలు తడబడుతున్నాయి.

సుమో చిక్‌బళ్ళాపూర్ మిట్ట మీద మెత్తగా పరిగెడుతోంది. తెలతెలవారుతోంది. డ్రైవర్ బాష టేప్ ఆన్ చేశాడు. శరణం అయ్యప్ప పాటలు సన్నగా వినిపిస్తున్నాయి. కిష్టన్నకు మత్తు దిగిపోతోంది. మళ్ళీ బీడీ ముట్టించాడు. టేప్‌లో పాటాగిపోయింది. బాలయ్య ట్రాన్సిస్టర్ ఆన్



చేశాడు. సుప్రభాతం వినిపిస్తోంది. కొండమీది రోడ్డు నుంచి సుమో కిందికి దిగుతుంటే కిష్టన్న అద్దం కిందికి దించాడు. నీరెండ వెచ్చగా ఉంది. ట్రాన్సిస్టర్‌లో ప్రాంతీయవార్తలు మొదలైనాయి.

"యాడన్నా బోరంగి సూసి వాపురేయ్ బాషగా!"... మద్దిలేటి కేకేశాడు.

"ధయ్. ఊకే పండ్కో. వాపేది పోయేది అంత నీ యిష్టమనుకొండవా. ముందు పెద్ద బండి జూడు. రయ్యిమని తూనీగ లెక్క పార్తుంది. అది యాడ వాగితే మనం ఆడ వాగాల" గట్టిగా అరిచాడు బాష.

"వాయనకేంలే బండినిండా బిస్లర్‌లా, బ్రస్లర్‌లా ఏమంటారో దాండ్లని. అవి బాటల్లు మస్తుగుండయ్" అందుకున్నాడు బూషిగాడు.

"బాటల్లుంటే కొనుక్కున్న నీల్లతోని అన్నీ కడుక్కుంటారాసా?" మద్దిలేటి కసురుకున్నాడు.

"పెట్టిపుట్నోడు నీల్లతోనేంరా నూనెతో గూడా కడుక్కుంటాడు అన మామా" మద్దిలేటి చెప్పిన మాటల్తో అందరూ నవ్వడం మొదలుపెట్టినారు.

"అర్సాకండిరా. ఏదో కర్నూలు వార్త చెప్తుండడు రేడిగలో ఇనర్రి" బాలయ్య గట్టిగా అరిచాడు.

"కర్నూలు మాజీ జిల్లా పరిషత్ ఛైర్మన్ ప్రస్తుత కాంగ్రెస్ పార్టీ ప్రచార కార్యదర్శి అయిన శ్రీ ముక్కమల్ల సిద్ధారెడ్డి నిన్న హత్యకు గురయ్యారు. కర్నూలు జిల్లా సంజామల మండలం యెగ్గోని, కోయిలకుంట్ల రహదారిలో జీపులో ప్రయాణం చేస్తున్న సిద్ధారెడ్డిపై కొందరు గుర్తు తెలియని దుండగులు బాంబులతో దాడిచేసి, వేటకొడవళ్ళతో హత్య చేశారు. శ్రీ సిద్ధారెడ్డి మృతికి జిల్లా డి.సి.సి. ప్రధాన కార్యదర్శి శ్రీ కౌలుట్ల సూర్యచంద్రారెడ్డి, రాష్ట్ర పి.సి.సి. ప్రధాన కార్యదర్శి శ్రీ కె.ఎస్. సోమశేఖర్‌రెడ్డి తమ ప్రగాఢ సంతాపాన్ని వ్యక్తం చేశారు" వార్తలు చదువుకుంటూ పోతున్నారు రేడియోలో.

సుమోలో కూర్చున్నవాళ్ళంతా ఒక్కసారిగా స్తబ్ధులైపోయారు. ఎవరూ ఏం మాట్లాడడంలేదు.

"దుండగుల కోసం పోలీసులు తీవ్ర గాలింపు చర్యలు చేపట్టారు" చిన్నగా వినిపించిన వార్త కిష్టిగాడికి గుచ్చుకుంది.

"ఇంటివా మామా"... బూషిగాడు కిష్టిగాడిని చేత్తో పొడిచాడు.

"నవ్వుండసీ... ఇంగ కొంచెం పుండు మీద కారం చల్లుతావ్. మధ్యాహ్నం నుంచి ఒగటే గుండె దడ మొదలైంది. కాళ్ళు పీకుతుండై. నీకేమిరా. నన్ను మూతికి పెట్టి మీరల్ల గడ్డకు పోయినారు" కోపంగా అన్నాడు కిష్టిగాడు.

"ఎహె. బండెక్కినాల్నుంచి ఆందెం తాగిన మొగం బెట్టినవ్. ఆడేమో రొండు సీసాల సారాయి తాగినవ్. ఇప్పుడేమో మెత్తిపడిపోయినవ్. ఉసారుగుండు మామా... సేపిచ్చేటోడు... అనకసేయిచ్చేటోడు నీకు ముందుండాడు గదా! నువ్వేం దిగులుపడాకు" కిష్టన్నను ఓదార్చాడు మద్దిలేటి.

"తక్కి... నీ లెవిలు చూడు బావా... అప్పట్లో ముందర రొడ్డి నడుస్తుంటే నూ ఎనక పోతుంటివి. బండిలో వేలాడుకుంటనో, యిరుక్కుంటనో కూసొని పోతుంటివి. యియ్యాల రొడ్డితో సమానంగా నీకో సప్రేట్ బండి. బెంగులూరులో లాడ్జింగ్. దిన్నం బిర్యాని... బీరు... దెబ్బకు రొట్టి రిగి నెయ్యిల పడిందిపో" ఉషారుగా మాట్లాడుతున్నాడు బూషిగాడు.

"నోటికాడి రొట్టె ఎగిరిపోకుంటె సాల్లెయిలే. నువ్వాకె అర్సగాకు"... కిష్టిగాడు ముందు పోతున్న క్వాలిస్ వైపు చూస్తూ చెప్పాడు. బాష టేప్ ఆన్ చేశాడు. సౌండ్ పెంచాడు. బండి బెంగుళూరు శివార్లలో ఉరుకుతోంది. వార్తలలో చెప్పిన వాక్యాలు కిష్టన్న చెవుల్లో గింగురు మంటున్నాయి. బాంబుదాడి, వేట కొడవళ్ళు, చిందిన రక్తం... తల్చుకుంటేనే ఒళ్ళు జలదరిస్తోంది. అప్పుడేమీ అనిపించలేదుగాని, చేలల్లో కాళ్ళకు కుచ్చుకున్న ఫారం ముళ్లు... బాగా నొప్పి పుట్టిస్తున్నాయ్. ఒంటి మీద తువ్వాలు, బట్టలు కమురు వాసన కొడుతున్నయ్. కాళ్ళను చేతుల్తో తడిమాడు. అరికాళ్ళలో అక్కడక్కడా ఫారం ముల్లు గుర్తులు కనిపిస్తున్నాయ్. తన కాళ్ళు తనే ఒత్తుకుంటూ ఉంటే తెలియకుండానే కళ్ళు మూతలు పడిపోయినయ్.

మళ్ళీ కళ్ళు తెరిచేలోపు టాటా సుమో ఏదో పెద్ద హోటల్ ముందు ఆగింది. కొంచెం దూరంలో క్వాలిస్‌ను పార్కింగ్ చేయడానికి డ్రైవర్ తిప్పుతున్నాడు. చెట్టు కింద క్వాలిస్ ఆగింది. ఇద్దరు బండిలో నుంచి దిగి పరిగెత్తుకుంటూ వచ్చి డోర్ తెరిచినారు. రమణారెడ్డి దిగినాడు. సెల్ ఫోన్‌లో మాట్లాడుతున్నాడు. పైనుండి కిందివరకు గంజి పట్టిచ్చిన తెల్లని బట్టలు. బండిని సైడుకు పార్క్ చేయమని బాషాకు చెప్పినాడు. సెల్ బంద్‌జేసి "బూషి! మన హీరోని దింపండిరా!"... అన్నాడు. "రేయ్! ఆ సూట్‌కేసులు పట్కరండి" అందరికీ ఆదేశాలు జారీ చేస్తున్నాడు. రమణారెడ్డి ముందు నడిచాడు. రిసెప్షనిస్ట్ నమస్తే చెప్పాడు.

"రాండి! రాండి! సామి... శానారోజులకి వచ్చినారు. రేయ్ ఆ ఏసీలు చూపీరా పెద సామికి"... లావుపాటి గొంతులతో కేకలు వేశాడు హోటల్ 'మయూర' యజమాని.

"ఇదిగో రెండేసీలు... 405, 406 పక్కపక్కనే యిచ్చెయ్యి. సర్ సిక్స్త్ ఫ్లోర్‌కు పోండి సార్" రిసెప్షనిస్ట్ రూంబాయ్‌ను పిల్చి తాళాలిచ్చాడు.

అందరూ లిఫ్ట్‌లో వెళ్ళారు. రూంలో సామాన్లు సర్దినారు. 405లో రమణారెడ్డి దిగారు. 406లో కిష్టన్న బ్యాచ్‌ను దింపారు.

"కిష్టీ! వారంరోజులు హాయిగా తిని పండుకో. ఏం దిగులు చేయకు. వారం లోపల మొత్తం సెటిలైపోతది" రమణారెడ్డి కిష్టన్నకు ధైర్యమిచ్చాడు.

"ఏమో రొడ్డీ! నాకేమో బయం బయం అవుతుంది. ఇంటికాడ మా ఆడిది, పిలగాడు ఉండారు. ఏమన్నా పోలీసోల్లు గీలోసోల్లు పోయి దౌర్జన్యం చేస్తరో ఏమో"... నసిగాడు కిష్టన్న.

గట్టిగా నవ్వాడు రమణారెడ్డి.



"పోలీసోడు... నీ యింటికాడికా... వాడు పొద్దుగల్ల యింటికి పోవాలనుకుంటె మన యిండ్ల మీదికి వస్తడు. పోలీసోడు మనల్ని తల్సుకుంట పండుకునేటోడు. వాణ్ణి నువ్వేమి తల్చుకోవద్దు. నీ యింటి ఎదారి నాకిడ్సిపెట్టు. నెత్తిన తడిగుడ్డేస్కొని సల్లగ పండ్కో" రమణారెడ్డి బెడ్ మీది నుంచి లేస్తూ చెప్పాడు.

మెట్ల మీద బూట్ల శబ్దం. చూస్తున్నంత లోపే గబగబా పోలీసులు పైకొచ్చేశారు. ఫోర్నాట్ ఫైవ్ ఫోర్నాట్ సిక్స్ అంటూ కన్నడలో మాట్లాడుతున్నారు. ఎస్ఐ ఆదేశాలిస్తున్నాడు. పోలీసులు రూంలలో దూరి సోదా చేస్తున్నారు. కిష్టిగాని గుండెల్లో దడ పట్టింది. అందరూ లేచి నిలబడి ఆశ్చర్యంగా చూస్తున్నారు.

ఆంధ్ర పార్టీ... అదొక్కటి మాత్రమే పోలీసోల్లు మాట్లాడినదానిలో అందరికీ అర్థమైన మాట.

"రమణారెడ్డి యం.యల్.ఎ, కర్నూలు డిస్ట్రిక్ట్. ఏం కావాలి మీకు?" అబద్ధమే అయినా గట్టిగా చెప్పాడు రమణారెడ్డి.

"ఎ. చెన్నగౌడప్ప, సిఐ ఎక్సైజ్ పార్టీ రైడింగ్... శేషాద్రినాయుడు... ఆంధ్ర పార్టీ ఫ్రం కడప... ఇల్లిసిట్ లిక్కర్ బిజినెస్" చెప్పాడు సి.ఐ.

"లిక్కర్ గిక్కర్ ఇల్లె... ఫ్రెండ్స్ జాలీ ట్రిప్" చెప్పాడు రమణారెడ్డి.

"సారీ... థాంక్యూ"... మెట్లు దిగి వెళ్ళిపోయారు పోలీసులు.

కిష్టిగాడు హమ్మయ్య అనుకుంటూ ఊపిరి పీల్చుకున్నాడు.

అందరూ ప్రశాంతంగా కూర్చున్నారు.

"ఏందంట రెడ్డీ... మల్లొస్తారా వాల్లు" మద్దిలేటి భయపడుతూ అడిగాడు.

"ఆ ఎవరో దొంగసారాయిఅమ్ముతున్నారని"... ఈ రూం నంబర్ చెప్పినారట. పట్కపోనీక వచ్చినాడు పోతావా"... వెటకారంగా అన్నాడు రెడ్డి.

"నాకేం పట్టింది రెడ్డీ... అట్లాటి దర్పేసి యాపారం మనం ఎన్నడన్నా సేసినామా" నెత్తి గీరుకుంటూ చెప్పాడు మద్దిలేటి.

"ఒరే బూసి. ఎంతమంది ఉండారో ఎంచుకొని... కిందికిపోయి బువ్వ తిని మీరొచ్చేతప్పుడు రొండు బిర్యాని ప్యాకెట్లు పట్కరండి" డబ్బులిచ్చాడు రెడ్డి.

"అరె ఓబులేశూ... మన బండికాడికి పోయి ఒకసారి లోపలి సామాన్లన్నీ బద్రంగా వున్నాయో లేదో చూసిరా. బాషగాణ్ణి బండ్లోనే ఉండి, ఆడే టిపిన్లు, భోజనాలు చెయ్యమని చెప్పు. అసలే కాలాలు బాగాలేవు. బండిడ్సి పక్కకు పోవద్దని చెప్పు"

సామాన్లు అనగానే ఓబులేశుకు బండిలో కార్పెట్ కింద వుండే పొడవాటి వేటకొడవళ్ళు, గొడ్డళ్ళు గుర్తుకొచ్చినాయి.

"అట్లే... రెడ్డి" అంటూ బూసి, ఓబులేశు మెట్లు దిగిపోయినారు.

"ఒరే బూసి... మన రెడ్డి ఎమ్మెల్లె ఎప్పుడైనాడురా" అడిగాడు ఓబులేశు.

"ఉత్త సుల్ల కూతలు. ఎమ్మెల్లే అనేపాటికే పోలీసోడు... పీనిగెలెక్క పక్కగ నీలుక్కుని. సూస్తివా లేదా... ఇట్ల సుల్లలు సెప్పేరా... ఈని గాల్లు పెద్దోలయ్యేది" చెప్పుకుపోతున్నాడు బూషి.

"అవుగదరా... ఎంత సుల్పంగా జెప్పే అబద్దాలు. మనూర్లోనే అనుకుంటే తక్కి... బెంగుళూర్ల గూడా పోలీసోల్లు బయపడ్తరు మన రెడ్డికి" ఓబులేశు ఆశ్చర్యం వ్యక్తం చేశాడు.

"గంజి పట్టిచ్చిన తెల్లబట్టలు కిర్రుచెప్పులు... చేతిలో ఆ గొలుసు ఆ ఫోను... ఆ లెవిల్ సూసినాక ఎవనికైనా... తడైపోతది. నీకు నాకు వస్తద్యా ఆ లెవిలు" అడిగాడు బూషి.

"ఎన్ని జన్మలెత్తినా రాదులేగాని... ఇంతకీ కిష్టిగాని గతేందిర ఇప్పుడు?" అడిగాడు ఓబులేశు.

"ఏమో. వాని రాత ఎట్లుందో ఏం కతనో ఎవడు సూసినాడు వాని అదురుష్టం" మాట్లాడుకుంటూ పోతున్నారిద్దరూ.

*

"నీకేం పొయ్యే కాలమొచ్చిందిరా. సగరు పొద్దైనా యింగా నిద్దరపోవు... పండ్కో" నులక మంచం మీద మణిగాడిని జోకొడుతున్న రత్తాలు మొఖం మీద ఏదో లైటు పడింది.

కటిక చీకట్లో కమాండర్ జీపు గుంతల రోడ్డు మీద గుంజుకుంటూ వస్తోంది. లైటు పడినవైపే చూస్తుంది రత్తాలు. సరిగ్గా తన యింటి దగ్గరే ఆగింది. ఒక జులపాల మనిషి జీపు దిగి "రత్తాలు... రత్తాలు!" పిల్చాడు.

కొంగు సవరిచ్చుకుంటూ వచ్చింది రత్తాలు.

"ఎవరూ"... కనుగుడ్లు తేలేసి అడిగింది.

"పెద్దరొడ్డి వచ్చినాడు నిన్న పిలుత్సున్నాడు రానంటరా"... జులపాల మనిషి చెప్పాడు.

మణిగాడిని ఒక చేత్తో జోకొట్టుకుంటూ బైటికొచ్చింది రత్తాలు. పెద్దరెడ్డి అనబడే శంకర్రెడ్డి బండిలో కూర్చుని ఉన్నాడు. రెండు చేతుల్తో నమస్కరించింది రత్తాలు.

"ఆ రత్తాలు... నీకేం గావాలన్నా యింటికాడికొచ్చి చెప్పు. కిష్టిగాడి ఎదారి చెయ్యకు. వాడు బద్రంగా ఉండాడు" అన్నాడు రెడ్డి.

"యాడుండాడు రెడ్డి"... గొంతు పెగలకుండా ఉంది రత్తాలుకు.

"యాడో ఒకచోట బద్రంగా ఉన్నాడు. ఓ వారం పదిరోజుల్లో తిరిగొస్తడు" చెప్పాడు రెడ్డి.

"ఏమో సామి... నాకు బయమైతాంది... పొద్దున సింగారం కొన్నుండి మంచులొచ్చి మావాయన కోసం బుడికినారంట... నేను కూలికి పోయింటి. పక్కనుండేటోల్లు సెప్పిరి" పిల్లగాణ్ణి భుజం మారుస్తూ చెప్పింది రత్తాలు.

"కూలికి పోతున్నావా! ఎందుకు పోతున్నవ్ సల్లగ మా ఇంట్ల యింత పని చేస్కోని యింత ముద్ద తిని ఉండు... అర్థమైందా" రెడ్డి రత్తాలు కళ్ళలోనికి సూటిగా చూస్తూ మాట్లాడుతున్నాడు.



అంత చీకట్లో రత్తాలు తెల్ల మొగం, చక్కని ముక్కు, పొడవాటి కళ్ళూ బాగా కనిపిస్తున్నయ్. ఇంకా ఏమో అడగాలనుకుంది రత్తాలు. అంతమంది మొగోళ్ళ నడుమ నిలబడి మాట్లాడడం ఇష్టంలేదు తనకు. జీపు స్టార్టయ్యింది. రత్తాలు లోపలికెళ్ళింది. తడక అడ్డం పెట్టింది.

"నన్నాసోడు... సంసారం సేయనీక క్యాతకానోనికి పెండ్లామెందుకు... పిల్లలెందుకు?" మణిగాణ్ణి మంచం మీద దబ్బున పడేసింది. సిద్ధారెడ్డిని చంపినారని తెలిసింది. సిద్ధారెడ్డికి, శంకర్రెడ్డికి పార్టీ ఉందని తెల్సు. ఇప్పుడు కిష్టిగాడు కనపడకుండా పోవటం... శంకర్రెడ్డి వచ్చి పరామర్శించడం... రత్తాలుకు అనుమానం బలపడింది.

"మొగుడనే ముండాకొడుకు యాడో ఉంటే ఈ మూడుగాసలోని యింట్ల పన్జేసుకొని బత్కలంట... ఛూ... జలమగాల నాకేం ఖర్మ పట్టింది. నా కూలిపని నాకు బువ్వ పెట్టద" మణిగాణ్ణి నిండుగా కప్పుతూ వాడిమీద చెయ్యేసి... "నన్నాసిచ్చుకోనోడిని నేనెందుకు కాసిచ్చుకోవల పోనీ"... నిద్రలోకి జారిపోయింది రత్తాలు.

*

ఆదివారం... ఊళ్ళో అక్కడక్కడా కుప్పలు వేసిన మాంసం అంగళ్ళు, కూరగాయల గంపలు, రోడ్డు పొడవునా కనిపిస్తున్నాయ్. చాలాసేపటి నుంచి కొడ్తున్నా బోరింగు చుక్క రాల్చడం లేదు. వదులుగా ఉండే అంగీని ఎగేసుకొంటూ కొడ్తున్నాడు పదేళ్ళ పిలగాడు. బోరింగ్ దగ్గరాగింది టాటా సుమో. దిగిన వాళ్ళంతా పంచలు దులుపుతున్నారు. తలలో నుంచి దుమ్ము రాల్చుతున్నారు.

"ఇంత మొగాలన్నా కడుక్కోని పోదాం పాఠ్రా. ఇండ్లకాడ మొగాలు జూసి వాకిండ్లన్నా ఏసేరు" మద్దిలేటి సరదాగా మాట్లాడుతున్నాడు.

కిష్టిగాడు దిగిందే తడవు ఇంటిదారి పట్టాడు. నడుస్తుంటే కొద్దిసేపట్లో రత్తాలును చూడబోతున్నానన్న ఆనందం... నరాలు కరెంటు తీగల్లా మారుతున్నై. పిడికిళ్ళు మూస్తూ తీస్తూ వెళ్తున్నాడు. తడిక తీశాడు. మణిగాడు మట్టిలో ఆడుతున్నాడు. చూడగానే "నానొచ్చె... నానొచ్చె..." ఆనందంతో పరిగెత్తుకొచ్చి చుట్టుకున్నాడు. కిష్టి వాణ్ని వెంటనే చంకకెత్తుకుని ముద్దులాడుతున్నాడు. కళ్ళు రత్తాలునే వెతుకుతున్నై.

"అమ్మేది బుజ్జీ. యాడికి పొందిరా" గోము చేస్తూ అడిగాడు. చంకలో బిందెతో కొంగు తలపై చుట్టుకుని వాకిలి దగ్గర నుంచి వచ్చింది రత్తాలు. ఒక్క నిముషం ఆగిపోయింది. నెలరోజుల తర్వాత కనిపించిన తన మొగుడిలో మార్పు లేమున్నాయోనన్నట్టు చూసింది. కిష్టిగాడు నిశ్చేష్టుడైనాడు. పిలగాణ్ణి దించేసినాడు. రత్తాలునే చూస్తున్నాడు. ఏం మాట్లాడలేదు. రత్తాలు బిందెలో నీళ్ళతో లోపలికి నడిచింది. కిష్టిగాడు వెంట నడిచాడు. కిష్టి తలుపెయ్యబోయినాడు.

"ముందు కాళ్ళు మొగం కడక్కరా పో" విసురుగా అనింది.

ఎలాగైతేనేం రత్తాలు తనతో మాట్లాడినందుకు చాలా సంతోషించాడు కిష్టి. గబగబా వెళ్ళి కాళ్ళు కడుక్కున్నాడు. రత్తాలు సిల్వరు కంచంలో అన్నం పెట్టింది. ఎల్లిపాయ కారెం, చింతొక్కు కలుపుకొని కిష్టి లొట్టలేసుకుంటూ తింటున్నాడు.

"ఎన్నాళ్ళయిందే నీ సేతి బువ్వ తినక" అన్నాడు.

"బెంగూలూర్ల బిర్యానీ తిన్నా ఈ రుసి రాల్య" అన్నాడు.

పొయ్యిలో కందికట్టె పెట్టి వూదరగొట్టంతో వూదుతూ "సిన్నా! అంగి యిప్పెయ్యి లాల పోసుకుందువుగాని" అంటోంది రత్తాలు.

రత్తాలు తనను పట్టించుకోవడంలేదు. తాను బెంగుళూర్లో ఏ హోటల్లో ఉన్నదీ ఏమేమి తిన్నదీ ఏమేమి చూసింది మొత్తం చెప్పుకుపోతున్నాడు కిష్టి.

"ఇగో. రత్తాలు ఇక్కడ సూడే నేన్చెప్పేది ఇను" రత్తాలు వెంట వెంటనే తిరుగుతున్నాడు కిష్టి.

"నువ్వు నాకేం సెప్పేదీ వొద్దు. నేనిన్నడిగేదీ వొద్దు. నన్ను నా పిల్లగాన్ని సల్లగా బత్కనీ నువ్విట్లనే... వాల్లింటి కాడ కుక్కలెక్క శానా యిశ్వాసంగా బత్కుతనంటే నీ యిష్టం. నేను మా యమ్మోల్లింటికెల్లి పోతా" పిల్లోణ్ణి తువ్వాలుతో తుడుస్తూ విసురుగా అనింది రత్తాలు. రత్తికి కోపం తగ్గేవరకు ఏ మాటా మాట్లాడకుండా ఉండడమే మంచిదనుకున్నాడు కిష్టి. అలసిపోయి ఉన్నాడు. దుప్పటి కప్పుకొని కుక్కి మంచలో నిద్రపోయినాడు.

*

ట్రింగ్... ట్రింగ్... కొత్త సైకిల్ శబ్దం విని మట్టిలో ఆడుకుంటున్న మణిగాడు పరిగెత్తు కొచ్చినాడు.

"నాయే... కొత్త చేకిలు... టింగ్... టింగ్... నాకు"... మణిగాడు సైకిల్ మీది కెక్కించమని పట్టుపట్టాడు.

కిష్టిగాడు స్టాండేసి వాడ్ని సైకిల్ సీటు మీద కూర్చోబెట్టినాడు. అద్దంలో వాని మొగం చూసి మురిసిపోయినాడు. కొద్దిసేపు సైకిల్లో తిప్పి తెచ్చి ఇంట్లో పెట్టినాడు.

సైకిల్‌కు తగిలించిన సంచీ లోపలికి తీసుకెళ్ళి "రత్తాలు, దాంట్లో ఏమున్నాయో చూడు... నీకు శానా యిష్టమైనవి ఉండై" అన్నాడు ఆమెను ఊరిస్తూ.

రొట్టెలు చేస్తున్న చేతిని గబగబా నీళ్ళతో కడుక్కొని రత్తాలు సంచి తీసింది. ప్యాకెట్ విప్పింది. రోజారంగు చీర, జాకెట్, లోబాడీ... రత్తాలు ముఖం విప్పారింది.

"ఎక్కడివి... దుడ్లు ఎవురిచ్చినారు?" చీర మడతలు తీసి చూస్తూ అడిగింది.

"నావే... నీకోసం... కష్టపడి తెచ్చాను" కిష్టిగాడు జవాబిచ్చాడు.

"అన్ని డబ్బులెక్కడి నుంచి వచ్చినయ్ నిజం చెప్పు" కళ్ళు వెడల్పు చేస్తూ అడిగింది.



"చెంద్రబాబిచ్చాడు" నవ్వుతూ అన్నాడు కిష్ట.

"ఇగో... ఇట్లాటి ఎగతాలి కూతలే వద్దనేది. నిజం చెప్పు బావా!" కొంచెం గోముగా అడిగింది రత్తాలు.

"నిజ్జంగానే చెంద్రబాబే ఇచ్చినాడు. గ్యాస్‌స్టవ్ పోయింది. డుం...డుం...డుం... నీకు సీర రైకొచ్చింది డుం...డుం...డుం" ఊగుతూ చెప్పాడు కిష్టి. రత్తికి అవి ఎక్కడి నుంచి వచ్చినాయో అర్థమైపోయింది.

"ఇగో నువ్వు కష్టపడి సంపాయిచ్చిన దుడ్లతో ఇట్లాటివి తీస్కరా... అంతేగాని... ఇట్ల ఉద్దర దుడ్లతోని కొన్కరావాకు" విసిరి మంచం మీద పడేసింది రత్తి.

నిజంగానే తనకు ఆ రంగు చీర చాలా ఇష్టం. వదులుకోవాలని లేదు. కాని అట్లాంటి డబ్బుతో కొన్నవి తొడగాలని లేదు. కిష్టి కొంచెం దగ్గరగా వచ్చి "పోనీ అప్పు కింద తెచ్చినామనుకో నీ కూలి దుడ్లు నెలకింత కట్టు. కాదనకే" అన్నాడు.

పక్కన పొయ్యి మండుతోంది రత్తాలు మొగం లెక్కనే. ఇంగ చాలాసేపు కిష్టి నిలబడలేదు. మణిగాన్ని ఎత్తుకొని వెళ్ళిపోయాడు.

*

పార్టీ కార్యాలయం చాలా బిజీగా ఉంది. లోపల శ్రమదానం, జన్మభూమి పోస్టర్లు, కటౌట్లు నిండిపోయి ఉన్నాయి. రమణారెడ్డి ఛాంబర్‌లోకి పోవడానికి బయట చాలామంది వెయిట్ చేస్తున్నారు. అప్‌స్టేర్స్‌లో శంకర్రెడ్డి ఛాంబర్. పైనుంచి కొంతమంది దిగి వస్తున్నారు. కొంతమంది పైకి వెళ్తున్నారు. కోయిలకుంట్లలో 'మయూరి' పేరు మీద నడుస్తున్న థియేటర్, వైన్స్, లారీ సప్లయి, శ్లాబ్ పాలిషింగ్, చిప్స్, ఛిట్స్ మ్యానేజర్లు రమణారెడ్డికి అకౌంట్ల అప్పగింత కోసం రోజూ సాయంత్రం వస్తుంటారు. నాపరాళ్ళ క్వారీలలో ట్రాక్టర్లు లారీల లోడ్లకు మామూళ్ళు వసూలు చేసే కౌంటర్ ఓబులేశు, మద్దిలేటి చూసుకుంటారు. అటెండర్ కోసం బెల్ మ్రోగింది. అటెండర్ లోనికెళ్ళాడు.

"బయట కాంట్రాక్టర్ రామస్వామిని పిల్చు" రమణారెడ్డి రివాల్వింగ్ ఛెయిర్‌లో తిరుగుతూ చెప్పాడు.

రామస్వామి లోపలికెళ్ళాడు.

"ఏమబ్బా! యాడివరకొచ్చింది నీ యింకుడు గుంతల పని?" కూర్చోమని చేయి చూపుతూ అడిగాడు.

"ఐపోతాది రెడ్డి. ఇంగ రెండ్రోజుల్లో కంపిలీట్ అయితది. బిల్లు తొందరగ చేయమని కొంచెం ఆ డి.యికి చెప్పు రెడ్డి. ఆ ప్రాక్లెయిన్ల బాడుగ గూడ కొంచెం చూసి తీస్కో రెడ్డి."

"చూసేది గీసేది ఏం లేదుగాని ఎంత చెప్పింటే అంత. డి.యికి చెప్తలే. రేపు సాయంత్రం కల్సు" ఎక్కువసేపు మాట్లాడే టైం లేదు రెడ్డికి. ఒకరి తర్వాత ఒకరు మొత్తం మయూరి గ్రూప్స్, అకౌంట్స్ లావాదేవీలు చూస్తున్నాడు.

ఇంతలో బయట తప్పెట్లు, ఈలలు, కేరింతలు వినిపించాయి. సిటీ కేబుల్‌లో స్క్రోల్ వస్తుంది.

కోయిలకుంట్ల అసెంబ్లీ స్థానానికి అధికారపార్టీ టిక్కెట్ భీమునిపాటి శంకర్రెడ్డికి లభించింది. రేపు 11 గంటలకు నామినేషన్... స్క్రోల్ చూసి రమణారెడ్డి ఇంటర్‌కం ఫోన్ అందుకున్నాడు. జనం పూలదండల్తో శంకర్రెడ్డిని ఉక్కిరిబిక్కిరి చేస్తున్నారు.

మర్సటిరోజు నామినేషన్ పర్వంలో కిష్టి చెన్నంపల్లె నుంచి జనాన్ని లారీల్లో తోలాడు. భారీగా ఊరేగింపు జరిగింది. అల్లర్లు జరగకుండా పోలీసుశాఖ బందోబస్తు ఏర్పాటు చేసింది. "ఫ్యాక్షన్ ఖిల్లాలో హోరాహోరీ" బాక్సులు కట్టి పత్రికలు వార్తలు రాశాయి. ఒకపక్కన ముక్కమల్ల యర్రారెడ్డి కాంగ్రెస్ అభ్యర్థి. సిద్ధారెడ్డి తమ్ముడిగా, యువజన కాంగ్రెస్ అధ్యక్షుడిగా శంకర్రెడ్డికి గట్టి పోటీనిస్తున్నాడు. మరొకపక్కన అధికారపార్టీ అభ్యర్థిగా అన్ని హంగులు కలిగిన శంకర్రెడ్డి అంటూ పత్రికలు ఉత్కంఠభరితమైన వార్తలు వ్రాశాయి. ఇరుపక్షాలలోని డబ్బు, సారా, రిగ్గింగ్ గ్యాంగ్‌ల మధ్య రసవత్తర పోటీ జరిగింది. ఎట్టకేలకు పధ్నాలుగు వేల మెజార్టీతో శంకర్రెడ్డి ఎమ్మెల్లే అయినాడు. మంత్రి జీవన్‌రెడ్డి జోస్యం చెప్పినట్టు పాత ముఖ్యమంత్రి మళ్ళీ ప్రమాణ స్వీకారం చేశాడు.

*

"ఈనే సూడ్రేయ్ కొత్తగొచ్చిన ఎస్.పి. దేవానంద్" పేపర్లో ఫోటో చూపిస్తున్నాడు బూసిగాడు.

"ఏదీ ఏదీ సూద్దాం" టీ తాగుతున్న వాళ్ళంతా పేపరు చుట్టూ మూగారు.

"ఒరే పూర పొట్టిగాని లెక్కున్నడుగాని జిల్లాను అల్లాడిస్తున్నాడు కదర"... మద్దిలేటి పేపర్ దగ్గరగా పెట్టుకుంటూ అన్నాడు.

"ఆళ్ళగడ్డల భాస్కర్‌రెడ్డిని, పత్తికొండలో హనుమంతరెడ్డిని, అవుకులో రాజారెడ్డిని... ఎవరు దొర్కితే వాల్లని బొక్కలో పెట్టినాడంట" ఆనోట ఈనోట విన్నదంతా చెప్పుకుపోతున్నారు జనం.

"పాతకేసులన్నీ మల్లా తోడి ఒక్కొక్కని తోలు తీస్తున్నాడంట. పైనుండి ముక్యమంత్రే వాయనను అదేపనిగా పంపిచ్చినాడంట" గుంపులో ఒకరన్నారు.

"బ్రాడ్‌గేజీల, రిజర్వాయరుల, కెనాల్‌కట్టలో... యాడబడితే ఆడ కమిషన్లు గుంచి దుడ్లు కుప్ప పోస్కుంటుండరు ఈల్లంతా"... టీ సప్పరిస్తూ మాట్లాడుతున్నాడు హోటల్ యజమాని.

"పెద్ద పెద్ద నాయకులంతా ఊర్లిడిసి హైద్రాబాద్‌ల మకాం బెడ్తున్నారంటనే" అడిగాడొకాయన.



"అందుకోసమేనా మన శంకర్రెడ్డి గూడ కర్నూలుకు కాపురం మార్చినాడు" ఓబులేశు చప్పట్లు కొడుతూ రహస్యం కనుక్కున్నట్టు గట్టిగా అరిచాడు.

"మల్ల కిష్టిగాని గతేందిరా" బూషిగాడు అడిగాడు.

"ఏముందీ! వాయిలేసినోని లెక్క వాయిదాలకు తిరుక్కుంట ఉంటడు" పెదవులు విరుస్తూ చెప్పాడు మద్దిలేటి.

ఎస్.పి. పర్యటనలో చెన్నంపల్లి ఒకనాటి మజిలీ అయింది. స్థానిక పోలీసుల సమాచారం మేరకు రమణారెడ్డి, కిష్టిగాడు, ఓబులేశు, బూసిగాడు ఊరి నుంచి పరారైనారు. ఎన్నికల్లో జరిగిన గొడవల్లో సంజామల ఎస్.ఐ. దాడికేసులో వీళ్ళు నిందితులు. కిష్టి ప్రధాన ముద్దాయి. కారు ఊర్లోకి రాగానే స్థానిక పోలీసులు పరుగెత్తి పోయి సెల్యూట్ చేశారు. ఎలిమెంటరీ స్కూల్ ఆవరణలో మీటింగ్ జరిగింది.

"ఊళ్ళో ఎన్ని వర్గాలున్నాయి?" గుమిగూడిన జనాన్ని ప్రశ్నించాడు ఎస్.పి.

"అస్సలు వర్గాలే లేవు సార్" జవాబు.

"సారాయి బాగా అమ్ముతున్నారా?" ప్రశ్నించాడు.

"అస్సలీ ఊర్లో దాని వాసనే రాదు సార్" జవాబిచ్చారు.

"మరెందుకు ఫ్యాక్షన్ గ్రామమని ముద్రపడింది" ప్రశ్నించాడు.

"మేమెప్పుడో సిన్నగున్నపుడు శంకర్రెడ్డి వాళ్ళ నాయన శివనాగిరెడ్డిని వాయన జీతగాళ్ళే సంపినారు సార్. ఇంగప్పటి నుండి యిప్పటిదాంక ఈ ఊర్లో ఎవరేగాని సంపడంగాని, సంపుకోవడంగాని జరగనేలేదు సూడు సారూ" ఒక ముసలాయన చెప్పాడు.

"సిద్దారెడ్డి ఎలా చచ్చిపోయాడు" అడిగాడు ఎస్.పి. జనం అందరూ ఒకరి మొగాలు ఒకరు చూసుకున్నారు.

"ఆయన హత్యతో మీ ఊరివాళ్ళకు సంబంధం ఉందా?" గద్దించాడు ఎస్.పి.

"అదేమో మాకు తెలదు సూడు సారూ... వాయనది సింగవరం. మాది సెన్నంపల్లే. కోర్టు వాయిదాలకేమో, మా ఊరోల్లు ఇద్దరు తిరుగుతుండారు. అదగటి తెల్సు సూడు సారూ!" ఒకామె లేచి చెప్పింది.

ఆమె వైపే అందరూ చూశారు.

"సరే! అది నాకు తెలుసుగాని... ఇంతవరకూ జరిగిందేదో జరిగిపోయింది. యిప్పటి నుంచి ఊర్లో గలాటా లేకుండా ప్రశాంతంగా గడపాలి. పంచాయితీలు చెప్పించుకోవడానికి పెద్ద మనుషులు దగ్గరకు పోవద్దు. సమస్య ఉంటే స్టేషన్‌కు రండి. ఊర్లో బాంబులు పేలడంగాని, సారాయి అమ్మడంగాని, కొట్టుకోవడం గాని చేశారంటే ఎవ్వరని చూడకుండా లోపలేస్తా. జన్మలో బైటికి రాలేరు. అర్థమైందా"... వేలు చూపుతూ ఉపన్యాసమిస్తున్నాడు ఎస్.పి. అందరూ నిశ్శబ్దంగా

విన్నారు. కారెక్కిన తర్వాత ఎస్.ఐ. స్వామినాథంను పిల్చాడు. ఏవేవో ఆదేశాలిస్తున్నాడు. ఈన తల ఊపుతున్నాడు. కారు స్టార్టయ్యింది. పోలీసులు సెల్యూట్ చేశారు.

*

చెన్నంపల్లె నుండి మకాం మార్చినాక కిష్టిగాడిని శంకర్రెడ్డి పిలిపించడం లేదు. కోర్టు వాయిదాలప్పుడు తప్ప మధ్యలో కిష్టిగాడు వాళ్ళను కలవడంలేదు. ఎస్.పి. వచ్చిపోయిం తర్వాత కిష్టిగాడిలో భయం పెరిగింది. ఊళ్ళో కిష్టిగాడ్ని ఎవ్వరూ కూలికి పిలవడం లేదు. రచ్చకట్ట దగ్గరికి పోగానే ఎవరంతకు వాళ్ళు అక్కడి నుంచి మెల్లగా జారుకుంటారు. మరీ మాట్లాడితే భయపడతారు. ఇక ఆ ఊళ్ళో బ్రతకడం కష్టమనుకున్నాడు కిష్టి. రత్తాలు పుట్టిల్లు 'అస్పరి'కి వెళ్ళిపోదామనిపించింది. అక్కడైతే కిష్టిగాడు హాయిగా పనిచేసుకొని బ్రతకొచ్చనుకున్నాడు. చెన్నంపల్లె నుంచి అస్పరికి మకాం మార్చారు. ఒకసారి కర్నూలుకు వెళ్ళి శంకర్రెడ్డికి కనబడాలనుకున్నాడు.

*

"మొత్తం రెండు లక్షల అరవైనాలుగు వేలు సార్. నాలుగు లోడ్లు... లెక్క చూసుకోండి సార్" పి.ఎ ఇచ్చిన డబ్బులందుకున్నాడు శంకర్రెడ్డి.

'ఇదిగో జన్నారెడ్డి, తీసుకోబ్బా 'నీ "పనికి" ఆహారం'... వాటా. లక్షా ముప్పై రెండువేలు తీసుకొని మిగతాది లోపలిచ్చేయి. ఇగ సాలిచ్చండి. లోడ్లు పట్టుకుంటున్నారు. పరిస్థితులు బాగ లేవ్"... మాట్లాడుతూ మధ్యలో చెయ్యెత్తాడు శంకర్రెడ్డి.

"రేయ్ శీనూ... బండి రెడీ చెయ్" అంటూ డ్రైవర్‌ను పిలిచాడు. తనను చూసి కేవలం చెయ్యెత్తినందుకు మనసు కలుక్కుమనింది కిష్టిగానికి. సంవత్సరకాలంలోనే ఇంత మార్పు వస్తుం దనుకోలేదు. డ్రైవర్ క్వాలిస్‌ను బైటికి తెచ్చాడు. గన్‌మెన్‌లు రెడీ అవుతున్నారు. ఒకప్పటి తన టాటా సుమో గుర్తొచ్చింది కిష్టన్నకు. ఇప్పుడా స్థానంలో గన్‌మెన్‌లు, పి.ఎలు, ఆఫీసర్లు... వింతను చూస్తూ కిష్టి క్వాలిస్ డోర్ దగ్గర నిలబడినాడు.

సెల్‌ఫోన్ బైటికి తీస్తూ "ఆ! ఏరా కిష్టి... బాగున్నావ్ కదా... ఐపాయలే, రొండు వాయిదా లుంటై... పోయి రమణారెడ్డన్నతో మాట్లాడు"... అంటూ క్వాలిస్ ఎక్కాడు. బయల్దేరింది. గేట్లు మూసుకున్నాయి.

రమణారెడ్డి కోయిలకుంట్లలో వ్యాపారాలు చూసుకుంటూ అక్కడే ఉన్నాడని తెలిసింది. అంత దూరం వెళ్ళడానికి కిష్టికి ఛార్జీలకు యిబ్బందిగా ఉంది. పొరలు పొరలుగా గతం గుర్తొస్తోంది. సుమో, ట్రాక్స్, క్వాలిస్‌లు తనకిప్పుడు ఎంత దూరమో తెలిసొచ్చి ఏడుపొచ్చింది. కిష్టి కర్నూలు బస్టాండులో పత్తికొండ బస్సెక్కాడు.

*



"రత్తీ... లోపల్నుంచి చిలుకు పెట్టుకో. నేను పత్తికొండ సంతకు పోయొస్తా"... కిష్టన్న సంచితో బయల్దేరినాడు.

"నానే... నేనొత్త... పత్తికొన్న సంతకు" మణిగాడు వెంటబడ్డాడు.

"వద్దు నాయనే... నీకేం గావల్ల? చెప్పు నేను తీసుకొస్తగానీ"... సముదాయించాడు కిష్టన్న.

"మల్లీ రేపు దీప్యాల పండగ... నాకు లచ్చింబానాలు, వంకాయ బాంబులు, సురసుర బత్తీలు, భూచక్రాలు తెస్తవు గదా"... మణిగాడు గోముగా అడిగాడు.

"ఊ... తెస్త... నూ లోనికిపో"... పంపించి పక్కింటి సోములన్నతో బయల్దేరినాడు కిష్టిగాడు.

పండగ సంత జనంతో కిటకిటలాడుతోంది. పండగ సరుకులు కొన్నాడు. మణిగాడు చెప్పిన వంకాయ బాంబులు, భూచక్రాలు కొన్నాడు కిష్టన్న. సోములన్నతో కలిసి హోటల్లో టిఫిన్ చేశాడు. సంత గేటు దాటి బస్టాండువైపు మలుపు తిరుగుతున్నారిద్దరు. రెండు జీపులు సర్రున వాళ్ళిద్దరికి అడ్డంగా వచ్చి నిలబడినాయి. దబదబ పోలీసులు దిగారు.

"కిష్టన్న... ఎస్.ఐ. పిలుస్తున్నాడు పోదాంరా" అంటూ రెండు చేతులు పట్టుకొని జీపు దగ్గరికి తీసుకపోయినారు.

సోములన్నకు ఏం జరుగుతుందో అర్థం కాలేదు.

కిష్టన్న "ఎందుకు సార్! నేనేం జేసినానని?" అన్నాడు. అతని ఒళ్ళంతా చెమట్లు పట్టినాయి.

"ఏం చెయ్యాలా ఎస్.ఐ నీతో మాట్లాడి పంపిస్తడంట రా. జీపెక్కు" అన్నాడు కానిస్టేబుల్.

"సోములు! ఇంటికాడ చెప్పు కొంచెం సేపుండి వస్తాను" భయంతోనే జీపెక్కాడు కిష్టి.

*

"కిరాయి హంతకుని ఎన్‌కౌంటర్" అన్న వార్త అన్ని దినపత్రికల్లో మెయిన్‌పేజీలో ఫోటోలతో సహా వచ్చింది.

"కర్నూలు జిల్లాలో ఒక మాజీ జిల్లా పరిషత్ ఛైర్మన్ హత్యకేసులో మరియు పలు హత్య కేసులలో, రేప్ కేసులు, ఒక ఎస్సై దాడి కేసులో ప్రధాన నిందితుడైన ఆరేకంటి కృష్ణుడు అలియాస్ కిష్టిగాడు కర్నూలు జిల్లా పత్తికొండ శివార్లలో పోలీసుల ఎన్‌కౌంటర్లో మృతి చెందాడు. అరెస్టు చేసి స్టేషన్‌కు తరలిస్తుండగా తన సంచీలో ఉన్న నాటు బాంబులతో పోలీసులపై ఎదురుదాడికి దిగిన కిష్టన్నను ఎన్‌కౌంటర్ చేయవలసి వచ్చిందని జిల్లా ఎస్.పి వివరణ ఇచ్చారు."

పేపర్లో ఫోటోలో కిష్టిగాని శవం పక్కన అక్కడక్కడ నాటుబాంబులున్నై. పక్క పేజీలో శవం పక్కన రోదిస్తున్న కిష్టన్న భార్య, కొడుకూ అంటూ ఫోటోలున్నాయి. సిటీ కేబుల్ రిపోర్టర్ కిష్టన్న కొడుకు మణిగాడితో మాట్లాడించాడు.

"వంకాయ బాంబులు త్యానీకి సంతకు పోనాడు మా నాయన... ఎవులో సంపేసి నారు"... వెక్కి వెక్కి ఏడ్చినాడు మణిగాడు.

రత్తాలుతో కూడా మాట్లాడించినారు.

"కూలి సేస్కాని బత్కేతోల్లం సారూ... పిల్లగాడు అనాదైపోయినాడు గద సారూ... అందరు పెదపెద దొంగోల్లు బతికిపోయినారు. మా సన్న పానాన్ని తీసేసినారు గదా సామి. ఇదేమి నాయమో మీరే చెప్పండి సారూ" అంటూ రత్తాలు ఏడుస్తున్న టి.వి క్లిప్పింగ్ కొంతమందికి కంట తడి పెట్టించింది.

*

'ఫ్యాక్షన్ నిర్మూలన - శాంతి సంఘాల స్థాపన' అంశంపై జిల్లా పోలీసు యంత్రాంగం ఆధ్వర్యంలో కర్నూల్లో సునయన ఆడిటోరియంలో సదస్సు జరిగింది. రాయలసీమ ఫ్యాక్షన్ జోన్ డి.ఐ.జి వి.ఎస్.ఎన్. మూర్తి సదస్సుకు అధ్యక్షత వహించారు. మంత్రివర్గ విస్తరణలో అటవీశాఖ లభించిన శంకర్రెడ్డి సభకు ముఖ్య అతిథిగా విచ్చేశారు. మంత్రిగారి చేతుల మీదుగా జిల్లా ఎస్.పి. దేవానంద్ ఫ్యాక్షన్ అణచివేతలో ముందంజలో ఉన్నందుకు షీల్డు అందుకున్నాడు.

కర్నూలు జిల్లాలో బూటకపు ఎన్‌కౌంటర్లకు వ్యతిరేకంగా ప్రజా సంఘాల ధర్నా బ్యానర్ ఆడిటోరియం బయట గాలికి రెపరెపలాడుతోంది.

*ప్రజాతంత్ర వర్తమాన సాహిత్య సంచిక, ఏప్రిల్ 2002*



# 3

# పెండెం సోడా సెంటర్

**మహమ్మద్ ఖదీర్‌బాబు**





విదేశీ పానీయాల్ని కాదని స్థానికంగా పానీయాల్ని తయారుచేస్తూ ఏటికి ఎదురీది గంభీరంగా కావలి సెంటర్లో నిలబడ్డ 'పెండెం సోడాసెంటర్' వారి చారిత్రాత్మక కథ ఇది. రచయిత మహమ్మద్ ఖదీర్‌బాబు 28 ఏప్రిల్ 1972లో పుట్టారు. వీరి మొదటి కథ 'పుష్పగుచ్ఛం' **ఆంధ్రజ్యోతి** ఆదివారం అనుబంధంలో 1995లో అచ్చయింది. 'ఖాదర్ లేడు', 'దర్గామిట్ట కథలు' పుస్తకాలు ప్రచురించారు. ఆంధ్రజ్యోతి ఆదివారం అనుబంధంలో 'పోలేరమ్మబండ కథలు' ధారావాహికంగా వస్తున్నాయి. వృత్తిరీత్యా జర్నలిస్టు.

*చిరునామా : ఆంధ్రజ్యోతి ఆదివారం, రోడ్ నెం. 8, బంజారాహిల్స్ హైదరాబాద్-500 034*

సముద్రపు దాపున ఉన్న ఊరికి ఎండలకాలం వస్తే చేటు.

ఎండలకి ఉప్పు తోడవుతుంది. చెమటకి ఒళ్ళు బద్దలు కొడుతుంది. ఇంక పడమటి గాలి మళ్ళిందా ఒంట్లో చుక్కనీరు మిగలదు.

అట్లాంటి ఎండలకాలంలో, అట్లాంటి ఉప్పు గాలి మధ్యనా, అట్లాంటి సముద్రపు దాపున ఉన్న ఒక ఊరిలో నడుముకు అడ్డపంచె కట్టుకున్న ఒక మనిషి వీధుల్లో తిరుగుతున్నాడు. పైవస్త్రం లేని అతడి పలుచటి వక్షం మీదా, వెన్ను పైకి తేలిన అతడి చామనచాయపు వీపు మీదా రెండు అట్టముక్కలు వేలాడుతున్నాయి. వాటిమీద సుద్దముక్కతో రాసిన అక్షరాలు అక్కడక్కడా చెమటకు నాని చెరిగిపోయి ఉన్నాయి. అవి యిలా ఉన్నాయి.

'హరిజనుల ఆలయప్రవేశము

మానవసేవయే మాధవసేవ'

గత కొంత కాలంగా ఆ మనిషి ఎవరు మతించినా ఎవరు మతించకపోయినా ఎవరు విన్నా ఎవరు వినకపోయినా ఎవరు నవ్వినా ఎవరు నవ్విపోయినా ఆ అట్టముక్కల సందేశాన్ని ఊరూరా తిరుగుతూ వినిపిస్తూనే ఉన్నాడు. ఆగిన చోటల్లా సందేశం వినిపించడం, మెడలోకి కొత్త అట్టలు వేలాడదీసుకోవడం, చెరిగిన అక్షరాలను మళ్ళీ రాసుకోవడం అతడి పని.

ఆవేళ అతడు ఆ ఊరిలో ఆ పనికోసం నేరుగా ఇలింద్ర గురునాథం శ్రేష్టి వస్త్రాలయం ముందు ఆగాడు.

"శ్రేష్టిగారూ, నేనూ. అట్టల కొరకు వచ్చానండీ" అన్నాడు గొంతెత్తి.

శ్రేష్టి అతణ్ణి చూసి ముఖం మాడ్చుకొని, పైకి మాత్రం నవ్వుతూ "మహానుభావా, రండి రండి" అన్నాడు బల్ల చూపిస్తూ.

ఎండకు అలసిన ఆ అడ్డపంచె మనిషి బల్లమీద అలసటగా కూర్చున్నాడు సేదకి.

"దప్పికగా ఉంది. కాస్త నీళ్ళు ఇప్పించండి" అన్నాడు.

అంతటి పుణ్యాత్ముడు, పైగా యజమాని స్వకులమువాడు నోరు తెరిచి నీళ్ళు అడిగితే ఇవ్వడం కన్నా ఇంకో భాగ్యం ఉంటుందా అని అంగడిలోని ఒక గుమాస్తా గబగబా పైకి లేచి కూజాలోని చల్లటి నీళ్ళను ఇవ్వబోయాడు. అంతే. శ్రేష్టి గొంతు కంగారుగా రంకె వేసింది.

"ఒరే ఒరే గాడిదా, వచ్చింది ఎవరనుకున్నావురా. మహానుభావులు శ్రీశ్రీశ్రీ పొట్టి శ్రీరాములుగారు. అంతటి పెద్దమనిషికీ, ఉత్తమునికీ ఉత్త మంచినీళ్ళు ఇవ్వబోతావా? గ్లాసు అక్కడపెట్టి గబాల్నపోయి పెండెం వాళ్ళ అంగడి నుంచి సోడా తెచ్చివ్వు. ఎండనపడి వచ్చిన పెద్దలకి అది గదరా మర్యాద" అన్నాడు కోపంగా.

గుమాస్తా అదిరిపడి, నీళ్ళు అక్కడపెట్టి, సోడా కోసం పరుగెత్తబోయాడు.



అది చూసిన ఆ అడ్డపంచె మనిషికి - 'వచ్చాడండీ యోధుడు' అని ఊరి జనాలు చాలా కాలం దాకా ఎగతాళి చేస్తూ ఉండిన అనామక పొట్టి శ్రీరాములుగారికి - నవ్వు వచ్చింది.

పైకి లేచి నిలబడి "శ్రేష్టిగారూ, మీకెందుకా శ్రమ. మన ఊరి మర్యాద నాకు తెలియదా. ఆ సోడా ఏదో నేనే తాగుతానులెండి" అని మొగమాటానికి శ్రేష్టి వారిస్తున్నా వినకుండా బయలు దేరాడు.

కొంతసేపు నడిచి, పెండెం వాళ్ళ అంగడికి చేరి, పీచు వేసి మెత్తబరిచిన కొయ్య కుర్చీలో విశ్రమిస్తూ "చంద్రయ్యగారూ, అదండీ సంగతి. దాహానికి మంచినీళ్ళు అడిగినా ఇవ్వడం లేదండీ" అన్నాడు నవ్వుతూ.

ఆ మాటకు పెండెం చంద్రయ్యకు నోట మాట రాలేదు.

గబగబా అతడికి మంచినీళ్ళు అందిచ్చి, అంతకంటే చల్లటిసోడాను చేతుల్లో పెట్టి, భక్తునిలా పక్కన ఒదిగి నిలబడి, కాస్త గొంతు సర్దుకొని "ఎందుకని శ్రీరాములుగారూ, ఎందుకని అలాగా?" అన్నాడు నొప్పిగా.

అతడు మళ్ళీ నవ్వి "హరిజనుల ఆలయ ప్రవేశం కొరకు మాలమాదిగవాడల్లో తిరుగుతున్నా గదయ్యా. మైల పడినానంట. ఇప్పుడు వీళ్ళు తాగే గ్లాసుల్లో నాకు నీళ్ళు అందిస్తే అంటు గదా, అందుకని" అన్నాడు.

అది విని చంద్రయ్య చాలాసేపటి దాకా ఏమీ మాట్లాడలేదు.

ఆ తర్వాత అన్నాడు "శెట్టిగారూ, మీమీదొట్టు. ఊరి నీళ్ళకు అంటు ఉన్నదేమోగానీ ఇక్కడి నీళ్ళకీ, సోడాకీ అంటు లేదండీ."

*

సముద్రపు దాపున ఉన్న ఆ ఊరి పేరు కావలి.

బ్రహ్మంగారు కాలజ్ఞానం చెబుతూ 'నెల్లూరు నేలమట్టం, కావలి కనకపట్నం' అన్నారట. ఆ బైరాగి నోటి చలవ వల్ల అది ఆది నుంచీ కనకపట్నమే.

ఇలింద్ర గురునాథం శ్రేష్టిది ఆ ఊరే. పొట్టి శ్రీరాములుగారిదీ ఆ తాలూకాయే. ఇంకా చాలామంది షావుకార్లు అక్కడ పుట్టి పెరిగారు కానీ పెండెం చంద్రయ్య మాత్రం కాదు!

అతడిది చీరాల. ఆనాటి నేత వస్త్రాల మహాకూడలి.

పద్మశాలి కులాన పుట్టినందుకు అందరిలాగే అతడు కూడా మగ్గాన్ని చేతబట్టి ఉంటే అతడు కూడా ఈపాటికి చీరాలలో పనిమంతుడిగా రాజ్యం ఏలుతుండేవాడే గానీ గాంధీగారు 'ఓయ్' అని పిలిస్తే 'ఓయ్' అని పలికిన లక్షలమంది యువకులలో అతడొకడు. మూతిమీద సరిగా మీసాలు కూడా మొలవని వయసులో ఉన్నది కాస్తా ఉద్యమానికి ఇచ్చి ఉత్త చేతులతో మిగిలిన అతణ్ణి చూసి ఒంటి నిండా గుడ్డ కట్టుకున్న సొంతకులం వాళ్ళు పైకి ఎత్తాల్సిందిపోయి లోకువ చేశారు.

'వీడికి పిల్లనివ్వడం దరిద్రం' అన్నారు.

'కులవిద్య కూడా రాదుగదా, ఎట్లా బతుకుతాడు?' అని పరాచికం ఆడారు.

ఇక అప్పుడు ఈ ఊరిలో ఉండటం భావ్యంకాదని చెప్పి రెండు జతల గుడ్డలు మూట గట్టుకొని చీరాల నుంచి దక్షిణ దిక్కుగా బయలుదేరి నెల్లూరు దాకా యాత్ర చేశాడతడు ఏ ఊరు అనువుగా ఉంటే ఆ ఊరిలో స్థిరపడిపోదామని.

ఆ యాత్రలో మొదట అతడికి ఒంగోలు తగిలింది. కానీ అక్కడ కంపచెట్లు ఎక్కువగా ఉన్నాయట. ఊరు మొరటుగా కనిపించిందట. ఆఖరున నెల్లూరు తగిలింది. అక్కడ పట్నవాసం ఛాయలు ఎక్కువగా కనిపించాయట. అక్కడక్కడా అరవం వాసన తగిలిందట.

ఈ రెండూ కాదని వీటి నడిమధ్యన ఉన్న కావలిని చూసి అంత పట్నమూ కాదు అంత పల్లే కాదు అంత మంచీ కాదు అంత చెడ్డా కాదు ఈ ఊరే బాగున్నదని ట్రంకురోడ్డు పక్కగా కాస్త అనువుగా ఉన్న జాగాలో చిన్న వసారా వేసుకుని కూర్చున్నాడు.

"వీడెవడు? చీరాల నుంచి వచ్చి మన రోడ్డు పక్కన వసారా వేసుకున్నాడేంది?" అని ఎవరైనా అడిగితే –

"వరే, ఎక్కణ్ణించో వచ్చిన తెల్లోడు ఈ దేశమే నాదంటున్నాడు. పొరుగూరి నుంచి వచ్చిన దోవలేనివాణ్ణి. ఈ వసారా నాదంటే తప్పా" అని అన్నాడంట.

ఆ మాటకు కావలి జనం మారు మాట్లాడలేదు.

వాళ్ళను మళ్ళీ మాట్లాడనీకుండా చేసిన సంగతి ఇంకోటి కూడా ఉంది. అది పెండెం చంద్రయ్య సోడా!

గ్యాసుబండను పక్కన నిలబెట్టి, ముఖానికి తీగల వల తగిలించుకుని, సీసా నిండుగా గ్యాసు బిగించి, నీళ్ళతొట్టెలో చలువచేసి అడిగినవారికి పెద్ద శబ్దంతో గోలీ కొట్టిచ్చే చంద్రయ్య సోడా అంటే అందరికీ నాలుగురోజుల్లోనే అభిమానం ఏర్పడిపోయింది. ఇంతకు మునుపు వాళ్ళు అంత గ్యాసున్న సోడానిగానీ, అంతటి కమ్మని తేన్పునిగానీ ఎరగరు.

"చంద్రయ్యా, సాలోనివి. నీకెట్టా అబ్బిందయ్యా ఈ విద్య?" అని అడిగితే నవ్వి ఊరుకునే వాడతడు.

చంద్రయ్య ఈ పని ఎప్పుడు నేర్చాడు, ఎక్కడ నేర్చాడు, ఎట్లా నైపుణ్యం సంపాదించాడు ఎవరికీ తెలియదుగానీ మొత్తం మీద కావలి సెంటర్లో చంద్రయ్య సోడా ఒక అలవాటుగా మారింది. పొద్దుగూకే వేళకి చంద్రయ్య సోడా కడుపులో పడితే అటు పొద్దుతో పాటు ఇటు ప్రాణం కూడా తెరిపిన పడుతుందని కావలి జనం మాట.

ఆ మాట అటూ ఇటూ పాకింది. వ్యాపారం పుంజుకుంది. చలువచేసే నీళ్ళతొట్టెలు రెండు నాలుగయ్యాయి. పార్సిలు చేసే సోడా కేసులు ఆరుకు పన్నెండయ్యాయి. గాలికీ ఎండకూ లోకువగా ఉన్న ఆ వసారాకు రానురాను నాలుగువైపులా నాలుగు గోడలు లేచాయి. పైన



పెంకులు పడ్డాయి. ఆ తర్వాత ద్వారబంధానికి పెద్ద అట్టముక్క ఒకటి వేలాడుతూ కనిపించింది. దాని మీద ఇలా ఉంది.

"హరిజనుల ఆలయ ప్రవేశము - పొట్టి శ్రీరాములుగారి సందేశము"

"వందేమాతరము - పెండెం సోడాసెంటర్ నినాదము"

అది చూసి కావలి జనం "నీవు రాజకీయవాదివా?" అని ఆశ్చర్యపోయారు.

"కాదు. గాంధేయవాదిని" అని జవాబిచ్చాడు చంద్రయ్య.

చంద్రయ్య కావలి వచ్చి బాగుపడ్డాడు, నాలుగు డబ్బులు సంపాదించాడు. తిరిగి వాటిని కాంగ్రెసు కోసమో ఇంక దేనికోసమో ధారాదత్తం చేయకముందే ముకుతాడు వేయడం మంచిది అని చీరాల నుంచి బంధువులు వచ్చి, తగిన పిల్లను చూసి పెళ్ళి చేసి వెళ్ళారు.

పిల్ల బలశాలి. చురుకు చూపులు గలది. సోడాసీసాకు గోళీ అతుక్కుపోయినట్టుగా రావడం రావడమే చంద్రయ్యను అతుక్కుపోయింది.

"లక్ష్మమ్మా నీళ్ళు పట్టావా?" అని అడిగితే "పట్టి జాము సేపయ్యింది" అనేది.

"లక్ష్మమ్మా సీసాలు కడిగావా?" అని అడిగితే "కడిగి పొద్దు గడుస్తూ ఉంది" అనేది.

జుట్టు కొప్పు గట్టి వంగిందంటే ఇంటిపనీ, అంగడిపనీ చేసిగానీ పైకి లేచేది గాదు.

ఆమె తెగువ చూసి ఇంక లాభం లేదనుకొని ఇంటి దగ్గరకు గ్యాసుబండను తెచ్చి సోడాలు పట్టడం నేర్పించాడు చంద్రయ్య. అప్పట్లో ఈ పనిచేసే ఆడమనిషిని చూడటం లోకులకో వింత.

వాళ్ళంతా తొంగితొంగి చూస్తూ ఉంటే లక్ష్మమ్మ లెక్కలేనట్టుగా గిర్రున చక్రం తిప్పుతూ ఉండేది.

రానురాను పెండెం సోడాసెంటరు సంగ్రామయోధుల అడ్డాగా మారింది. మాటలూ, సోడాలూ నిత్యం అక్కడ ఘాటుగా పేలేవి. వీళ్ళ కోసమని ఆంధ్రపత్రికకు మొదటి జీవితచందా పెండెం చంద్రయ్య అంగడి నుంచే వెళ్ళింది. నెల్లూరులో జరిగే కాంగ్రెసు సభలకూ, ప్రదర్శనలకూ, హర్తాళ్ళకూ కావలి నుంచి వెళ్ళాల్సిన మనుషులూ అందించాల్సిన తోడ్పాటూ ఆ అంగడి నుంచే ఖరారయ్యేది.

కానీ అందుకు కావలసిన నిధులు ఆ దేశాభిమానుల దగ్గర ఉండేవికావు. ఒక్కోసారి నెల్లూరుకు కాలినడకే భేషని వెళుతుండేవాళ్ళు. ఇంకోసారి ఆ అవస్థ పడలేక ఆగిపోయేవారు. అది చూసి వీళ్ళకు వీలైనంత సాయం చేస్తే బాగుంటుంది కదా అనుకున్నాడు చంద్రయ్య. అందుకు ఉన్న వ్యాపారం చాలదు. పెంచాలి. అణాకు కాణీ కలిపి నాలుగు డబ్బులు సంపాదించాలి.

"ఎట్లా?" అనుకున్నాడు.

"ఎట్లా ఏముంది? ఒకదానినే నమ్ముకుంటే కుదిరే పనేనా? బంగారంలాంటి సెంటరు. ఒకటికి నాలుగు పెట్టాలి. అప్పుడే డబ్బులు" అంది లక్ష్మమ్మ.

"ఏం చేద్దాం?" అన్నాడు చంద్రయ్య.

"నువ్వే ఆలోచించు" అందామె.

అప్పుడు చంద్రయ్య బాగా ఆలోచన చేసి, భార్యతో కలిసి తగిన ప్రయోగాలు చేసి ఒక పానీయం ప్రవేశపెట్టాడు.

దాని పేరు 'సుగంధ పాల్.' దీనినే కావలి జనం 'పెండెం సుగంధ' అని పిలుస్తారు.

వట్టివేర్లతో తయారుచేసే ఈ పానీయం అప్పట్లో సింహపురి గడ్డ మీద రెండు మూడుచోట్ల మాత్రమే దొరుకుతుండేది. చంద్రయ్య దీనిని కావలికి పరిచయం చేశాడు. యానాదులకు చెప్పి ఏరోజుకారోజు వేర్లు తవ్వుకొని వచ్చి, వాటిని రెండు రోజులు నానబెట్టి, మూడోరోజు మరిగించి ఆరేక వాటి నుంచి చిక్కటి ఎసెన్సు తీసేవాడు. ఆ ఎసెన్సుకి చక్కెర ద్రావణం, ఘాటు సోడా కలిపి పైన నాలుగు నిమ్మచుక్కలు పిండి 'ఒంటికి మంచిది, తాగండి' అని అందించేవాడు.

ఇది ఎండాకాలంలో అమృతం, వానాకాలంలో స్నేహితం, శీతాకాలంలో సరదా.

జనం దీనిని తాగడానికి సాకులు వెతుక్కునేవాళ్ళు. చంద్రయ్య వ్యాపారం పైకి ఎగబాకింది. 'సోడా, సుగంధలు తాగితే చంద్రయ్య దగ్గరే తాగాలి' అని జనం ఒట్టు పెట్టుకున్నట్టయ్యింది.

"చూశావా, ఒకటికి రెండు కలపగానే ఎంత మేలు జరిగిందో. ఈ రెండుని నాలుగు చేయాలి. మన దగ్గరున్న సరంజామాతో ఎన్ని చేయగలిగితే అన్ని తయారుచేద్దాం" అంది లక్ష్మమ్మ.

అది మొదలు అక్కడ తడవలు తడవలుగా పానీయాలు వచ్చి చేరాయి.

ఆరంజి సోడా, నిమ్మకాయ సోడా, లైమ్ జ్యూస్, క్రష్, ద్రాక్ష, బాదంపాలు, కడుపునొప్పికి జింజర్...

తక్కినవాటి సంగతి ఏమోగానీ జింజర్ విషయంలో మాత్రం చంద్రయ్య ఆడవాళ్ళకు దేవుడితో సమానమయ్యాడు. వాళ్ళకు మైలనీ, ముట్టనీ రకరకాల సమయాలలో రకరకాల కారణాల వల్ల కడుపునొప్పి వచ్చేది. ఆ సమయంలో వారికి చంద్రయ్య జింజరే మందు. అది తాగగానే నొప్పి చేత్తో తీసేసినట్టుగా పోయేది. పెద్దప్రపు కడుపునొప్పి అయితే ఒక వాంతితో తగ్గిపోయేది.

చంద్రయ్య అక్కడితో ఆగలేదు. పొడుం అలవాటు ఉన్న ముసలివాళ్ళ అవసరాన్ని గమనించాడు. అప్పట్లో నాసిరకం ముక్కుపొడి అన్నిచోట్లా దొరికేదిగానీ మద్రాస్ ఆండార్‌కుప్పం ముక్కుపొడి అవస్థ పడినా దొరికేది కాదు. దీని డిపాజిట్టు ఎక్కువ. ఖరీదు కూడా ఎక్కువ. అయినాగానీ కష్టపడి, ఇంగ్లీషులో లేఖలు రాయించి దానిని కూడా తెప్పించగలిగాడు చంద్రయ్య. నాణ్యత కలిగిన సరుకు కావడంవల్ల పొడుం అలవాటు ఉన్నవారికి అది వైకుంఠం చూపించేది.



ఇప్పుడు చంద్రయ్య వ్యాపారం కట్టుదిట్టంగా ఉంది. దేశభక్తులకు సహాయంలో అతడి చేతికి ఎముక లేకుండా పోయింది. కాలం గడుస్తూ ఉంది. దేశమంతటితో పాటు నెల్లూరు చుట్టుపక్కల కూడా ఉద్యమాలు ఊపందుకుంటూ ఉన్నాయి.

సరిగ్గా అప్పుడే గాంధీగారి ఖద్దరు ఉద్యమం దక్షిణాదికి పాకి భగ్గుమంది.

ఆ మంట చిటపటలు పెండెం సోడా సెంటర్‌లో కూడా పడ్డాయి.

ఇది చంద్రయ్యకు కొత్త మెలకువ. ఇంకా చెప్పాలంటే జీవితంలో అతణ్ణి ఎక్కువసేపు ఆలోచించేలా చేసిన ఏకైక సంగతి అది.

అప్పటిదాకా అతడు స్వరాజ్యం వస్తే చాలు, అందరూ బాగుపడిపోతారు, కష్టాలేవీ ఉండవు అని అనుకుంటూ ఉండేవాడు. కానీ స్వరాజ్యం వచ్చినా రాకపోయినా, ఇచ్చినా ఇవ్వకపోయినా - ఇక్కడి సొత్తుని దోచుకొని పోవడానికి తెల్లవాళ్ళు వ్యాపారం సాకుతో రకరకాల ఏర్పాట్లు చేసుకుంటున్నారని అతడికి అర్థమైంది. విదేశీ వస్త్రాల వల్ల ఇక్కడ తను పుట్టి పెరిగిన కులానికీ, నేతపనివారికీ ఎలా నష్టమో ఇతర విదేశీ వస్తువుల వల్ల తక్కిన దేశవాళీ వ్యాపారులకీ, పని మంతులకీ అలాగే నష్టం కదా అనుకున్నాడాయన. అది అర్థమయ్యాక స్వదేశీ ఆత్మాభిమానంతో కొత్త జన్మ ఎత్తాడతడు.

'మన తక్షణ కర్తవ్యము - స్వదేశీ ఉద్యమము'

ఈ అక్షరాలు రాయించిన అట్టముక్కను ద్వారబంధానికి వేలాడగట్టాక అతడు చేసిన మొట్టమొదటి పని ఇంటికి వెళ్ళి కనిపించిన ప్రతి ఫిరంగి వస్తువునీ తెచ్చి అంగడి ముందు వేసి తగులబెట్టడం.

ఆ తర్వాత జీవితంలో ఎప్పుడూ కూడా అతడు పరాయి వస్త్రాన్ని కట్టలేదు. పరాయి వస్తువుని ముట్టుకోలేదు. ఎసెన్సుల ఖజానా అయిన మద్రాసు వాల్టేక్స్ రోడ్డుకు వెళ్ళే విదేశీ ఎసెన్సులు కాదని స్వదేశీ ఎసెన్సులని ఎంచి ఎంచి కొంటున్న అతణ్ణి చూసి వర్తకులు విచిత్రపోయేవారు. అతడు వాళ్ళని పట్టించుకునేవాడు కాదు గానీ ఆ మహానగరంలో అతణ్ణి కలవరపాటుకు గురిచేసిన సంగతి ఒకటి ఉంది.

అదే విదేశీ పానీయాల మోజు.

ద్రవిడుల దేశాభిమానం శంకించదగ్గది కాకపోయినా వారిని కూడా తుత్తునియలు చేయగల మహత్తు,మాయా వాటిలో ఉందని అతడికి అనుమానం కలిగింది. 'ఇది ఇక్కడ దాకా వచ్చింది రేపు ఎక్కడిదాకా వస్తుందో' అని భయపడ్డాడతడు.

నాలుగు నాళ్ళు నడిచాయి. అతడి భయం నిజమైంది.

నూనె సుబ్రహ్మణ్యశ్రేష్టి అనే వర్తకుడు ఆరు అణాల 'పొట్టిల్లో' అనే విదేశీ పానీయాన్ని ఊరిలోకి తీసుకువచ్చాడనీ - అలవాటు చేయడానికి నాలుగు అణాలకే విక్రయిస్తున్నాడనీ -

ఇది పెండెం సుగంధ కంటే భిన్నంగా ఉందనీ - చంద్రయ్య బలిమిని చూసి ఓర్వలేకే అతడు ఈ పనికి పూనుకున్నాడనీ ఒక వార్త గుప్పుమంది.

ఈ మాట పెండెం చంద్రయ్యను పిడుగుపాటులాగా తాకింది. ఆరోజతడు అన్నం తినలేదు.

"ఊరుకో. దీనికే ఇట్లయిపోతే ఎట్లా? మాయదారిగా వచ్చిన పీడ మాయదారిగానే పోతుంది. మనకేమీ కాదులే" అని ఊరుకోబెట్టింది లక్ష్మమ్మ.

కానీ చంద్రయ్య ఊరుకోలేదు.

అప్పటివరకూ వేదికలన్నా, ఉపన్యాసాలన్నా దూరంగా మసలే ఆ మనిషి ఆరోజు సాయంత్రం మొట్టమొదటిసారిగా పెండెం సోడా సెంటర్‌లో నలుగురి ముందూ నిలబడి చిన్న ఉపన్యాసం ఇచ్చాడు.

"అయ్యలారా, ఇదంతా తీపి తినమరిగిన చీమల వ్యవహారంలా ఉంది. తీపి జాడను మొదట ఒక చీమే పసిగడుతుంది. ఆ తర్వాత తక్కిన చీమలన్నీ దారి చేసుకుంటాయి. ఈ విదేశీ సరుకులు కూడా అంతే. ఇవి ఒకదానితో ఆగేవి కావు. ఇవి మన దేశ సౌభాగ్యానికి ప్రథమ శత్రువులని మనం గ్రహించగలగాలి. నూనె సుబ్రహ్మణ్యశ్రేష్ఠిది ఈ వ్యాపారం కాదు. అతడికి ఈ విద్య తెలియదు. దీనిపై బతకాల్సిన అవసరంలేని వ్యాపారాలు అతడికి అనేకం ఉన్నాయి. అయినాగానీ అతడు ఈ పని చేశాడంటే - నాలుగు డబ్బులు ఉన్న ఇట్లాంటి వాళ్ళ వల్లా, ఏ సరుకునైనా అమ్మి సొమ్ము చేసుకుందామని చూసే ఇట్లాంటి వర్తకుల వల్లా భవిష్యత్తులో మన దేశానికీ, స్థానికులకీ, పనిమంతులకీ తీవ్రనష్టం కలిగే ప్రమాదం ఎక్కువగా ఉంది. ఈ ప్రమాదాన్ని మనం ఎక్కడికక్కడ నిలవరించగలగాలి. ఆ పని ఇప్పుడే మొదలెట్టాలి. కావలి నుంచి అతడు ఆ విదేశీ పానీయాన్ని ఉపసంహరించేంత వరకూ నేను గాంధేయమార్గంలో ఆమరణ నిరాహారదీక్ష చేయడానికి నిశ్చయించుకున్నాను."

ఈ చివరిమాటలు ఊరిలో కలకలం సృష్టించాయి.

వర్తకులు దీనిపై రకరకాల వ్యాఖ్యానాలు చేశారు. కొందరు చంద్రయ్య తరపున మాట్లాడారు. కొందరు సుబ్రహ్మణ్యశ్రేష్ఠికి వంత పలికారు. కానీ పెండెం సోడా సెంటరు మాత్రం నివురుగప్పిన నిప్పులా ఉంది. చంద్రయ్యతోపాటు దీక్షలో కూర్చోవడానికి ఇతర గాంధేయవాదులు ఏర్పాట్లు చేసుకుంటూ ఉండగా ఆ రాత్రి బాగా పొద్దుపోయాక నూనె సుబ్రహ్మణ్యశ్రేష్ఠి దుకాణం హఠాత్తుగా తగులబడింది. నల్లటి ఆకాశంలో నాలుకలు సాచి ఎగురుతున్న ఎర్రటిమంటలు ఊరిని భయభ్రాంతం చేశాయి.

ఇది చంద్రయ్య ఊహించని దెబ్బ.

దెబ్బ మీద దెబ్బగా ఇది చంద్రయ్య చేయించిన పనే అన్న పుకారు కూడా చిలువలు పలువలుగా వ్యాపించింది. తర్జనభర్జనలు మొదలయ్యాయి. నిజానిజాలు తేల్చడానికి పెద్దలు



రంగంలోకి దిగారు. చంద్రయ్య మద్దతుదారుల్లోని కొందరు అతివాదులు అతడికి తెలియకుండా ఈ సాహసానికి ఒడిగట్టారని చివరకు బయటపడింది. అయితే ఆ అతివాదులు ఎవరన్నది తేలలేదు.

ఇది జరుగుతున్నంతసేపూ చంద్రయ్య మౌనంగా గంభీరంగా మాట లేనట్టుగా ఉండిపోయాడు. ఆఖరున అన్నాడు.

"ఇంత పెద్ద దేశానికి స్వాతంత్ర్యం తేవడానికి గాంధీగారు అహింసను ఆయుధంగా చేసుకున్నారు. ఒక చిన్నపనికి మనవాళ్ళు హింసను ఎంచుకున్నారు. ఇది నా మనసుకు ఎంతో కష్టం కలిగించింది. ఇందుకు నిరసనగా పక్షంరోజుల పాటు నిరాహారదీక్ష చేస్తున్నాను."

ఈ ప్రకటన చేశాక అతడి నిర్ణయాన్ని ఎవరూ మార్చలేకపోయారు.

పిడికెడంత మనిషి పదిహేనురోజులపాటు అన్నపానీయాలు మాని నిరాహారదీక్ష చేయడం చూసి ఊరు ఊరంతా అతడికి దగ్గరైంది. పదిహేనవ రోజున స్వయంగా సుబ్రహ్మణ్యశ్రేష్ఠి అతడి వద్దకు వచ్చి కాళ్ళ దగ్గర కూర్చున్నాడు.

"చంద్రయ్యా, జరిగిందేదో జరిగిపోయింది. తప్పుడు పనిచేశాను. మీవాళ్ళు బుద్ధి చెప్పారు. మధ్య నువ్వెందుకు ప్రాణాన్ని కష్టపెట్టుకోవడం. నీ మాట ప్రకారమే చేస్తాను. సరేనా?" అన్నాడు మనస్ఫూర్తిగా.

చంద్రయ్య దీక్ష విరమణ అయ్యింది. ఊరి నుంచి ఆ విదేశీ పానీయం నిష్క్రమించింది.

రోజులు గడుస్తున్నాయి.

భారత స్వాతంత్ర్య పోరాటం ఉచ్ఛదశకు చేరుకుంది.

దేశభట్ల రంగయ్య, బెజవాడ గోపాలరెడ్డి వంటి కాంగ్రెసు నాయకులు పెండెం సోడా సెంటరుని వేదికగా చేసుకొని వీరోచిత ఉపన్యాసాలు సాగిస్తున్నారు. ముక్కుపొడుం పీల్చడం అతి ప్రియమైన అలవాటుగా గల వెన్నెలకంటి రాఘవయ్య వంటి పెద్దలకు కావలిలో ఇది చాలా ప్రియమైన చోటుగా మారింది. వార్తాపఠనాలతో, గేయాలతో, వందేమాతర ధ్వానాలతో దినదినం ఉగ్రరూతలూగిపోతున్న ఈ దేశీయ శిబిరానికి ఇక రేపో మర్నాడో భారత స్వాతంత్ర్య ప్రకటన వెలువడనుందని అర్థమైపోయింది.

సంబరాలకు ఏర్పాట్లు మొదలయ్యాయి.

"ఆరోజు మనమంతా పండుగ జరుపుకోవాలి" అన్నాడొక దేశభక్తుడు సంతోషం పట్టలేనట్టుగా.

"మన జాతీయపతాకం మొదట ఈ సెంటరులోనే ఎగరాలి" అన్నాడింకో దేశభక్తుడు ఉత్సాహంగా.

"అవన్నీ తర్వాత. ముందు ఈ సంగతి ఊరంతా వినాలి. అందుకు తగిన ఏర్పాట్లు చేయాలి" అన్నాడు చంద్రయ్య.

"అదెట్లా?" అన్నారు వాళ్ళు.

"రేడియో తెద్దాం" అన్నాడు చంద్రయ్య.

ఆ మరుసటిరోజే చంద్రయ్య నిర్ణయం ప్రకారం నడుమంత ఎత్తున్న ఐదు వాల్వుల రేడియో ఒకటి మద్రాసు నుంచి వచ్చి అంగడిలోకి అడుగుపెట్టింది.

అప్పటిదాకా షావుకార్ల ఇళ్ళల్లో అలంకారప్రాయమైన వస్తువుగా పడి ఉండే ఖర్మను ఏడి, తొలిసారిగా రోడ్డు మీద నిలబడి భారత తొలి ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ చారిత్రాత్మక ఎర్రకోట ప్రసంగాన్ని ఊరు ఊరంతటికీ వినిపించిందది.

ఆడవాళ్ళు, పిల్లలు, ముసలివాళ్ళు, అక్షరజ్ఞానం లేని అమిత దేశభక్తులు ఎందరో పెండెం సోడాసెంటర్ ముందు గుంపులుగా మూగి ఆ అద్భుత ప్రసంగానికి పరవశులౌతూ కేరింతలు కొట్టారు.

అది మొదలు.

ఆ తర్వాత ఆ రేడియో అలా ఎన్నో వార్తల్ని ఊరి జనానికి వినిపిస్తూనే ఉంది. రోజుల తరబడి, నెలల తరబడి, సంవత్సరాల తరబడి ఈనాటికీ వినబడుతూ వస్తున్న ఆ వార్తల్లో ఒక్క రెండింటిని మాత్రం చంద్రయ్య ఏనాటికీ మర్చిపోలేడు.

ఆ రెండింటిలో మొదటిది మతోన్మాదుల చేతిలో గాంధీ మహాత్ముని దారుణ హత్య.

రెండవది ఆంధ్ర రాష్ట్రం కొరకు పొట్టి శ్రీరాములుగారి ప్రాణత్యాగం.

ఈ రెండూ కాకుండా అతడు మర్చిపోలేని ఇంకో వార్త కూడా ఉంది.

అది – భారతదేశంలో కోకాకోలా రంగప్రవేశం.

నల్లటి కారుమేఘంలాగా భారతదేశంలో ఆ విదేశీ పానీయం ఎలా ప్రవేశించిందంటే దెబ్బకు దేశవాళీ వ్యాపారులందరూ ఉక్కిరిబిక్కిరి అయిపోయారు. వాళ్ళ గుండెలు జారి పోయాయి. సణుగులు విరిగిపోయాయి.

అది వచ్చీరావడంతోటే మహానగరాలను జయించేసిందనీ, కాలేజీ కుర్రకారంతా దానివెంట వేలంవెర్రిగా పడుతున్నారనీ, దీన్ని తాగడమొక ఫ్యాషనైపోయిందనీ అప్పటికే చంద్రయ్యకు వాళ్ళూ వీళ్ళూ చెబుతూ ఉన్నారు. ఇంక రేపో మాపో పల్లెలవైపూ పట్టణాల వైపూ బయలు దేరిందంటే ఆ కొరవ కూడా పూర్తయినట్టేనని భయపెడుతున్నారు.

వాళ్ళు భయపడినట్టే జరిగింది.

ఒకరోజు మిట్టమధ్యాహ్నం ఎర్రటిఎండలు కాస్తూ ఉండగా ఆ కంపెనీ దక్షిణాది జనరల్ మేనేజరే స్వయంగా వచ్చి చంద్రయ్యను కలిశాడు.

"చంద్రయ్యగారూ, నేను ఈ ఉద్యోగంలో చేరి ఇప్పటికి ఆరునెలలు అవుతూ ఉంది. ఈ ఆరునెలలుగా మద్రాసు మొదలు బెజవాడ దాకా తిరుగుతూనే ఉన్నాను. ఏ ఊరు వెళ్ళినా ఏ బజారు చేరినా మా కూల్‌డ్రింకు ఏజెన్సీ కొరకు అంత డిపాజిట్టు కడతాం ఇంత డిపాజిట్టు కడతాం అని అనేవారేగానీ వద్దు పొమ్మన్నవాళ్ళు ఒక్కరు కూడా లేరు. మీరు పెద్దలు. ఎన్నో



ఏళ్ళుగా ఈ రంగంలో ఉన్నారు. కొత్తగా వస్తున్న మా డ్రింకును మొదట మీలాంటివాళ్ళు అమ్మితేనే మాకు మర్యాద. జనానికి నమ్మకం. అందుకే స్వయంగా వచ్చి అడుగుతున్నాను. డిపాజిట్టు అక్కరలేదు. ఏజెన్సీ ఇస్తాను. కాదనకండీ" అన్నాడతను.

చంద్రయ్యకు ఏం చెయ్యాలో పాలుబోలేదు.

ఎదురుగా ఉన్నది చిన్నవాడు. చదువుకున్నవాడు. చదివిన చదువుకు ఏదో ఒక ఉద్యోగం వస్తే అదే పదివేలు అని చేరినవాడు. పిచ్చుక మీద బ్రహ్మాస్త్రంలాగా అతడితో తకరారు ఏల అనుకొని "బాబూ, ఒక్క నిమిషం" అని అన్నాడు.

అని, లోపలికి వెళ్ళి స్వహస్తాలతో శుభ్రంగా గ్లాసు కడిగి, అందులో చల్లటి సుగంధ కలిపి "బాబూ, ఇది మా అంగడి ప్రత్యేకం. తాగు" అని అందించాడు.

అతడు తాగాడు.

"బాగున్నదా?"

"బాగున్నదండీ" అన్నాడా యువకుడు.

"మీ కోకాకోలా కంటే బాగున్నదా?" మళ్ళీ అడిగాడాయన.

"నిజం చెబుతున్నానండీ. మా కోకాకోలా కంటే బాగున్నది" అన్నాడతను.

"మరి యింకేమి. ఒప్పుకున్నావు కదా. వెళ్ళు బాబూ. నేను మీ కోకాకోలా అమ్మను" అన్నాడాయన.

వచ్చినవాడు హతాశుడయ్యాడు.

"చంద్రయ్యగారూ, మీ గురించి ఏమీ తెలుసుకోకుండానే ఇక్కడకు వచ్చానని అనుకోకండి. అవన్నీ పాతరోజులు. ఇప్పుడు అవేవీ నడవవు. వాస్తవం చెబుతున్నాను. ఇక మీదట మీరు ఎంతో కాలం ఇవన్నీ అమ్మలేరు. మా కంపెనీ పెట్టుబడి చూశారా? మా కంపెనీ ప్రచారం చూశారా? ఈ భూమండలంలో ఎక్కువమందికి తెలిసిన ఏకైక కంపెనీ ఇదేనండీ. దీని ముందు మీరు నిలువగలరా? ఇప్పుడు వస్తున్న ఆదాయానికి రెట్టింపు ఆదాయం సునాయాసంగా మీకు వస్తుంది. మీ మీద గౌరవంతో చెబుతున్నాను. నా మాట కాదనకండి..." అన్నాడతను.

చంద్రయ్యకు ఆ మాటలకు నవ్వు వచ్చింది.

"బాబూ, ఏ ఆదాయం గురించి చెబుతున్నావు? మంచి ఎండలకాలంలో ఒక్కపూట సోడాలు అమ్మిన ఆదాయంతో నూరుమంది దేశభక్తులకు భోజనం పెట్టినవాణ్ణి. ఈ వ్యాపారంలో ఆదాయం సంగతి నాకు చెబుతున్నావా? ఏది ఆదాయం? నా సరుకు పావలాకు అమ్ముకుంటే నాకు మిగిలే ఇరవైపైసల ఆదాయమా? నీ సరుకు పావలాకు అమ్మిపెడితే నీకు మిగిలే ఇరవై పైసల ఆదాయమా? నా ఇరవైపైసలు ఇక్కడే ఉంటుంది. నీ ఇరవైపైసలు దేశం దాటుతుంది. అట్లాంటి పనికోసం నన్నూ, నా కష్టాన్నీ నా అంగడినీ వాడుకొని అందుకు బదులుగా అయిదుపైసల

భిక్ష పడేసి దానికి ఆదాయం అని పేరు పెడుతున్నావా? దీనికి నన్ను లొంగమంటావా?" అన్నాడాయన శాంతంగా.

వచ్చినవాడు ఏమీ మాట్లాడలేదు.

కాసేపటిదాకా కూర్చుని కూర్చుని ఇంక చేసేదిలేక లేచి వెళ్ళబోతుంటే "బాబూ, మాట" అని ఆపాడు చంద్రయ్య.

"బాబూ, నీకు తెలుసో తెలియదో. రెండువందల ఏళ్ళపాటు తెల్లవాళ్ళ కింద నలిగిపోయిన ఈ దేశాన్ని ఎందరో మహానుభావులు ఎందరో ప్రజలు కష్టాలు పడీ త్యాగాలు చేసీ చెర నుంచి విడిపించి మీలాంటి యువకుల చేతుల్లో పెట్టారు. దీనికి మీరు చేతనైనంత మేరకు మేలు చేయండి. అంతేగాని ఇట్లాంటి ద్రోహాలు చేయకండయ్యా..." అన్నాడు.

ఆ యువకుడికి మాటలు తడబడ్డాయి.

"ద్రోహమా..." అన్నాడు.

"ద్రోహం కాక దీనిని ఏమంటారు? ఏమయ్యా ఈ దేశంలో ఎన్నో నదులున్నాయి. కాలువలున్నాయి. ఎండలు కాస్తే దప్పిక తీర్చడానికి తీయతీయటి కాయలున్నాయి. చలువ వేర్లున్నాయి. మనం కనిపెట్టుకున్న షర్బతులున్నాయి. ఇక్కడ ఇన్ని ఉండగా ఎక్కడి నుంచో వచ్చి సముద్రాలు దాటొచ్చి నువ్వు చెబుతున్న నీ కంపెనీ ఇక్కడ వ్యాపారం చేయాలనుకుంటోం దంటే ఇక్కడ ఎంత ఆదాయం రాందే ఆ పనికి దిగుతుందయ్యా. ఎంత దోచుకోవాలనుకోందే నీబోటి వాడికి కారు ఇచ్చి పంపుతుందయ్యా? ఇట్లాంటి ద్రోహపు పనికి నీలాంటివాళ్ళు సహక రించవచ్చునా?" అని అడిగాడాయన.

ఈ ప్రశ్నకు అతడు జవాబు చెప్పలేదు.

కాసేపు నిలబడి, "వస్తానండీ" అని తలదించుకొని వెళ్ళిపోయాడు.

అతడు వెళ్ళాక ఇంక అంగడిలో కూర్చోవాలనిపించలేదు చంద్రయ్యకు. రిక్షాను పిలిచి ఇంటికి బయలుదేరాడు.

ఆవేళ ఆయనకు ఎంతో అస్థిమితంగా అనిపించింది. అప్పటిదాకా ఆయనలో మినుకు మినుకుమంటూన్న ఆశ ఆవేళతో ఆరిపోయింది.

గాంధేయవాదులు ఉన్నారు, కోకాకోలా రావడంతో దేశంలో నిరసన ప్రకటనలు తెగ కుమ్మరిస్తున్నారు. వారి మాటకు విలువ ఉండకపోతుందా, ప్రభుత్వం దానిని తరిమికొట్టక పోతుందా అని ఆయన అనుకుంటూ ఉన్నాడు. ఇవాళ జరిగిన దానిని చూశాక, పల్లెపల్లెలకు కూడా చేరడానికి అది ఫన్నాగాలు పన్నుతోందని తెలిశాక ఇంక నమ్మకం పోయింది.

'ఇంక అందరం ఇంతేనా?' అనుకున్నాడాయన.

చుట్టుపక్కల పల్లెల్లో తగిన ఆదరువు లేక, ఏం చేయాలో తోచక "చంద్రయ్యగారూ, మేము కూడా సోడాసెంటర్లు పెట్టుకుంటాం. మాక్కూడా మార్గం చెప్పండి. సిలిండర్లు బాడిగకి



ఇవ్వండి. ఎసెన్సులు ఎట్లా కలపాలో చెప్పండి" అని ఎందరో అడిగితే వాళ్ళందరికీ తగిన మార్గాలు చెప్పి స్వహస్తాలతో ఎసెన్సులు కట్టి ఇచ్చి సంతృప్తి పడ్డాడాయన. వాళ్ళంతా ఒకరి మీద పడి బతకకుండా పెళ్ళాం బిడ్డలతో కలిసి ఆ వ్యాపారాలు చేసుకుంటూ ఉంటే చూసి ఎంతో సంతోష పడ్డాడు.

ఇక మీదట ఆ కష్టమూ ఆ స్వతంత్రమూ పోవలసిందేనా? వీళ్ళంతా గల్లాపెట్టెల ముందు సోంబేరుల్లాగా పడి ఉండవలసిందేనా? అని అనుకున్నాడాయన.

ఆ ఆలోచన చేస్తూ ఉంటే ఆయనకు కొడుకు గుర్తుకు వచ్చాడు. వాడు ఏమనుకుంటు న్నాడో కదా అనుకున్నాడు.

ఇంటికి వచ్చి భార్యతో సంగతి చెప్పాడు.

"మంచిపని చేశావు. ఇంతకు మించి ఇంకెట్లా మాట్లాడతావు?" అంది లక్ష్మమ్మ.

"అబ్బాయి ఏమనుకుంటున్నాడో గదా" అన్నాడు చంద్రయ్య.

"వాడు మన బిడ్డ కాదా? మనలాగే అనుకోడా" అంది లక్ష్మమ్మ.

ఆ రాత్రి భోజనాల దగ్గర చంద్రయ్యా, లక్ష్మమ్మా కొడుకూ కోడలూ కూర్చున్నారు.

చంద్రయ్య కొడుకుతో అన్నాడు.

"కృష్ణుడూ, మా వయసులు తీరిపోయాయి. బతుకులు చివరికొచ్చాయి. ఇప్పటిదాకా ఒకలాగా బతికాము. ఉద్యమాలనీ, పోరాటాలనీ పాకులాడాము. చూడబోతే ఇప్పుడు కాలం మారిపోయినట్టుగా ఉంది. నీలాంటి యువకులు ఏమనుకుంటున్నారో నాకు తెలియడం లేదు. మధ్యాహ్నం అంగడిలో జరిగింది చూశావు గదా, ఏమంటావు. నీకు ఇట్లా ఉండటం ఇష్టమా? అట్లా ఉండటం ఇష్టమా? చెప్పు బాబూ, నా నిర్ణయాలు నీకు గుదిబండలు కారాదు నాయనా..."

కొడుకు తింటున్నవాడల్లా ముద్దను పళ్ళెంలో పెట్టేశాడు.

"నాన్నా, మీరు నన్ను ఇట్లా అడగవచ్చునా?" అన్నాడు నొచ్చుకుంటూ.

"అట్లా కాదురా. నీ మనసులో మాట నాకు తెలియవద్దా?" అన్నాడు.

"నాన్నా, చిన్నప్పటి నుంచి చూస్తున్నాను. మీరూ, అమ్మా ఎంతో కష్టపడ్డారు. అంగడి నిలబెట్టారు. ఇప్పుడు నేనూ, నా భార్యా కూడా అంతే కష్టపడుతున్నాం. మీ ఇద్దరికీ ఎంత విద్య వచ్చో మా ఇద్దరికీ అంతే విద్య వచ్చు. ఇంత విద్య ఉండి మన నలుగురం ఒకరి కిందకు పోకుండా మన బతుకు మనం బతకలేమా?" అన్నాడు కొడుకు.

చంద్రయ్య మనసుకు చాలా తృప్తి కలిగించింది ఆ మాట.

ఆ రాత్రి ఆయన చాలారోజుల తర్వాత ప్రశాంతంగా నిద్రపోయాడు.

తెల్లవారి లేచేసరికి కాళ్ళ దగ్గర నిలుచొని ఉన్నాడు కొడుకు.

"కృష్ణుడూ, ఏమిరా సంగతి?" అన్నాడు.

"ఏమి లేదు నాన్నా. నిన్న రాత్రి ఆ కోకాకోలా ఏజెన్సీని మన కట్టవతల బండ్ల శేషారెడ్డి తీసుకున్నాడంట. మనం కాదన్నాక ఒకరిద్దరి దగ్గరకు వెళితే మీకు భయపడి తీసుకోము అన్నారంట. చివరికి నేను తీసుకుంటాను ఎవరడ్డం వస్తారో చూస్తాను అని ఆ రెడ్డి తీసుకున్నాడంట. పొద్దున్నే టీ అంగడి దగ్గర కనిపించాడు. రెటమతంగా మాట్లాడాడు" అన్నాడు కృష్ణుడు.

"రెటమతమా? ఏమన్నాడూ?" అన్నాడు చంద్రయ్య.

"అబాయా, మీ నాన్నను నాతో తకరారుకి రావద్దని చెప్పు. ఏజన్సీ తీసుకున్నాను గదా అని పాతకాలంలోలాగా దుకాణాలు తగులబెట్టించడానికీ, సత్యాగ్రహాలు చేయడానికీ ఇది తెల్లవాళ్ళ కాలం కాదనీ చెప్పు. అట్లా ఇట్లా చేస్తే బొక్కలో తోస్తారనీ చెప్పు అన్నాడు."

చంద్రయ్య ఏమీ మాట్లాడలేదు.

కొయ్యకు తగిలించి ఉన్న చొక్కా వేసుకొని నేరుగా బండ్ల శేషారెడ్డి ఇంటిదారి పట్టాడు.

వేపపుల్లతో పళ్ళు తోముకుంటున్న శేషారెడ్డి అంత పొద్దుటిపూట గడప ఎదుట నిలిచిన చంద్రయ్యను చూసి కంగారుపడ్డాడు.

"చంద్రయ్యగారా, రండి రండి" అన్నాడు తడబాటుగా.

అయన లోపలికి అడుగు పెట్టలేదు.

"రెడ్డా, మా అబ్బాయితో ఏదో అన్నావంట గదా, మళ్ళీ అను" అన్నాడు.

రెడ్డి ఇంకా కంగారుపడిపోయాడు.

"అబ్బే, నేనేమీ అనలేదండీ. నేనేమీ అనలేదు" అన్నాడు.

"సరే చూస్తూ ఉండు. మూడు నెలల కిందట మూతపెట్టిన నీ మురుగునీళ్ళు గెలుస్తాయో ఇప్పటికిప్పుడు ఈ నేల నుంచి తవ్వితీసిన ఈ ఊరినీళ్ళు గెలుస్తాయో తేల్చుకుందాం ఉండు" అని వెనక్కి వచ్చేశాడు.

రెడ్డి ఆ మాటలను పెద్దగా పట్టించుకోలేదు.

ఆ మరుసటిరోజే మూడునెలల కిందట మూతపెట్టిన కోకాకోలాను ధూంధాంగా తప్పెట్లతో తాళాలతో ఊరిలోకి తీసుకొని వచ్చాడు.

అది వచ్చిన తొలిరోజు కావలి జనానికి పెద్ద వింత. దానిని తాకి చూసేవాళ్ళూ, తాగి చూసేవాళ్ళూ, పిల్లల కోసం, ఆడవాళ్ళ కోసం సంబరంగా ఇళ్ళకు పార్సిలు తీసుకెళ్ళేవాళ్ళూ... చంద్రయ్య కూడా ఒకటి తెప్పించాడు.

దానిని నేరుగా ఇంటికి తీసుకొని వచ్చి, నేల మీద పెట్టి "దీనికి మనం నకలు తయారు చేయాలి" అన్నాడు.

"నకలా?" అన్నాడు కృష్ణుడు.

"అదెంతసేపు" అంది లక్ష్మమ్మ.



"దీనికంటే మెరుగ్గా, దీనికంటే ఘాటుగా, దీనికంటే మంచి రంగులో మనం తయారు చేయాలి. దీనికంటే తక్కువరేటుకి అమ్మాలి. ఇట్లాంటి కుక్కల్ని అట్లాంటి చెప్పుతోనే కొట్టాలి" అన్నాడు చంద్రయ్య.

చంద్రయ్యా, లక్ష్మమ్మ, కృష్ణుడు, కృష్ణుడి భార్యా ముక్కులు మూసుకొని తలా ఒక గుక్క తాగి చూశారు దానిని.

ఏళ్ళ కాలంగా ఆ రంగంలో తలలు పండిన ఆ మనుషులకీ, ఆ పనిమంతులకీ అందులోని కిటుకేమిటో అర్థమైపోయింది. ఆ రాత్రికి రాత్రే ప్రయోగమూ ప్రారంభమైంది.

ఆ మరుసటి రోజు చాలాకాలం తర్వాత పెండెం సోడా సెంటర్ ద్వారబంధానికి ఒక అట్టముక్క వేలాడుతూ కనిపించింది.

దానిమీద ఇలా ఉంది.

"పెండెం వారి కొత్త పానీయము - పెండెం కోలా - నేడే తాగండి!"

అది చూసి 'ఆహా' అంటూ మూగారు జనం.

'ఇదేందయ్యో' అని ఆశ్చర్యపోయారు మొదలు.

'ఇదేమి చమత్కారమయ్యో' అని తాగి చూశారు తరువాత.

తాగాక చంద్రయ్యకు నమస్కారం పెట్టారు.

కోకాకోలా కంటే తక్కువ రేటుకి కోకాకోలా కంటే మెరుగైన రుచితో కోకాకోలా కంటే మెరుగైన ఘాటుతో దొరుకుతున్న ఆ పానీయం మళ్ళీ ఒకసారి బజారు గెలిచింది. దాని గెలుపు ఎంతటి ఘనమైనదంటే దెబ్బకు ఊరిలో కోకాకోలా అమ్మకాలన్నీ పడిపోయాయి.

ఇది తెలిసి గిలగిలలాడిపోయాడు రెడ్డి. పెండెం కోలాను తెప్పించుకొని తాగి చూశాక ఇది తాగిన నోటితో అది తాగడం కష్టమని అర్థమైపోయింది.

పడుతూ లేస్తూ వార్తను మద్రాసు పంపించాడు.

జనరల్ మేనేజర్ పరుగెత్తుకుంటూ వచ్చాడు.

"చంద్రయ్యగారూ, ఇది పద్ధతి కాదు. మమ్మల్ని నకలు చేసినందుకు మీ మీద దావా వేయగలం" అన్నాడు బెదిరిస్తూ.

చంద్రయ్య తొణకలేదు.

"మీకు చేతనైనది మీరు చేసుకోవచ్చు" అన్నాడు చింత లేనట్టుగా.

జనరల్ మేనేజర్ దావా వేయలేదు. అట్లాగని ఊరిలో కోకాకోలాని నిలబెట్టడానికి ప్రయత్నాలూ మానలేదు.

అది ఊరిలోకి పారుతూనే ఉంది. అలంకరణగా బజార్లలో వేలాడుతూనే ఉంది. రకరకాల సైజులలో, రకరకాల బాటిళ్ళలో జనాన్ని ఆకర్షించడానికి ప్రయత్నాలు చేస్తూనే ఉంది. సినిమా

వాళ్ళు కొత్తగా దీనిపై పాటలు కడుతున్నారు. మద్యం వ్యాపారులు ఇది మద్యంలోకి ఎంత బాగాఉపయోగపడుతుందో సెలవిస్తూ ఉన్నారు.

మొత్తం మీద చంద్రయ్య ఉన్నచోటనే నిలబడి కత్తి తిప్పుతూ ఉంటే అది చుట్టుపక్కల నుంచి అతడిని కబళించుకుంటూ వస్తూ ఉంది.

ఒక సంవత్సరం. రెండు సంవత్సరాలు. మూడు సంవత్సరాలు.

అంతే. ఆ తర్వాత జనం నెమ్మదిగా దానికి అలవాటు పడిపోయారు.

చెట్టుకి పట్టిన పురుగు కాలం గడిచేకొద్దీ డొల్లను చేసినట్టుగా చంద్రయ్య అమ్మకాలు కూడా రోజురోజుకూ డొల్లయిపోయాయి. ఇప్పుడు అక్కడ సందడి లేదు. కోలాహలం లేదు. సోడా కొరకో, సుగంధం కొరకో, రేడియోలో వార్తల కొరకో అక్కడ మూగేవారి సంఖ్య పలుచబడి పోయింది. జింజరు అవసరం తీరిపోయింది. ఆరంజి, ద్రాక్షల డిమాండ్ పడిపోయింది. రాజకీయాలు మాట్లాడేవాళ్ళు లేరు. దేశభక్తుల గతకాలపు పౌరుషాల్ని తలచుకునేవారూ లేరు.

చంద్రయ్య ఒక్కడే నిండు ఖద్దరు బట్టల్లో తెల్లపులిలా అక్కడ కూర్చుని కనిపిస్తూ ఉన్నాడు. ఆయనకు ఈమధ్య చూపు మందగించింది. ఆరోగ్యం సన్నగిల్లింది. సోడా కొడుతూ ఉంటే చేయి తొణుకుతూ ఉంది.

"ఎందుకు నాన్నా ఇంకా మీరు - ఇంట్లో విశ్రాంతి తీసుకోవచ్చుగా" అని కొడుకు అంటే "ఏం విశ్రాంతిరా, చేతినిండా పనితో బతికినవాడిని. ఇప్పుడు ఖాళీగా కూర్చోగలనా?" అని అనేవాడాయన.

"కృష్ణుడూ, గాంధీగారు చెప్పేవారురా... మనదేశంలో ఉన్నవే పల్లెటూళ్ళు, ఇక్కడ కుటీర పరిశ్రమలే కరెక్టు అనీ. మనది కూడా కుటీర పరిశ్రమేరా. మీ అమ్మా, నేనూ, నువ్వూ, అమ్మాయీ మన పనివాళ్ళు అందరం కలిసి కష్టం చేసేవాళ్ళం. ఇప్పుడు నాతోపాటు మీరంతా ఖాళీగా కూర్చుంటున్నారు గదా, ఇట్లా ఎన్ని వందలమంది ఖాళీగా అయిపోయి ఉంటారో ఆలోచించు. ఈ పని చేసింది అదేరా, ఈ గుణం దాని రంగులోనే ఉన్నట్లుందిరా. ఎప్పుడైనా గమనించావా? రక్తం. ఆ రక్తపుకూటికి ఎప్పుడూ ఆశపడబోకు నాయనా" అనేవాడు.

"దానిని ఎప్పటికైనా దేశం నుంచి తరిమికొట్టడం చూడాలని ఉందిరా" అని గొణుక్కునే వాడు.

ఆయన కోరిక తీరలేదు. రానురాను ఆయన ఆరోగ్యం ఇంకా క్షీణించింది. కృష్ణుడు మందులనీ, మాకులనీ అవస్థ పడుతున్నాడు. లక్ష్మమ్మ కంటికి రెప్పలాగా కాచుకుంటూ ఉంది.

ఇది తెలిసి ఒకరోజు శేషారెడ్డి ఉన్నవాడు ఉండకుండా "చంద్రయ్యగారి పని కష్టంగా ఉందని తెలిసింది. జరుగుబాటు అవస్థగా ఉందని చెబుతున్నారు. నా సరుకు వేస్తానని చెప్పండి. ఆయన కోసరంగా నా కమీషను కూడా వదులుకుంటానని చెప్పండి" అని కబురు చేశాడు.

అది విని 'ఆఁ' అని గుండె పట్టుకున్నంత పని చేశాడంట చంద్రయ్య.



ఆ తర్వాత ఆయన సంగతి ఏమయ్యిందో చాలామందికి తెలియదు. కొంతకాలం మంచాన ఉండి ఆ తర్వాత చనిపోయాడని చెబుతారు.

ఆయన చనిపోయిన మరికొంత కాలానికి భారతదేశం నుంచి నిజంగానే కోకాకోలాని తరిమి కొట్టారు.

అప్పట్లో జార్జి ఫెర్నాండెజ్ పేరును దేశమంతా గొప్పగా చెప్పుకుంది. కావలిలో కూడా చెప్పుకున్నారు.

కానీ చంద్రయ్యను గుర్తు చేసుకున్నవారు లేరు.

*

సముద్రపు దాపున ఉన్న ఊరిలో ఇప్పుడు ఎక్కడ చూసినా తెగి నల్లగా కమిలిన తలల్లాగా కోకాకోలా వేలాడుతూ ఉంది.

ఆ తలలన్నీ స్థానికులవి. దేశవాళీ పనిమంతులవి.

కాసింత చక్కెర, కాసింత నిమ్మరసము, కాసిన్ని చలువవేర్లతో చమత్కారాలు చేయగల మహానుభావులందరూ ఇప్పుడు గతించారు. వారి పనితనమూ గతించింది.

భారతదేశంలో మళ్ళీ కోకాకోలా ప్రవేశించాక, నిండు కాలువలు పారే పచ్చటి పల్లెసీమల నుంచి మొదలుకొని చుక్క నీళ్ళు కూడా దొరకని ఎర్రటి ఎడారి నేలల వరకూ అది విస్తరించాక, ఇక్కడి పసిపిల్లలకు ఉగ్గుపాలకు బదులు కోకాకోలానే అలవాటు చేసేంతగా జాతి వృద్ధి చెందాక, ఒక చలువపెట్టె పెట్టుకొని కొంత సరుకు వేయించుకొని, దానిని అమ్ముకుంటూ సోంబేరుల్లాగా గల్లాపెట్టెల ముందు కూర్చోవడానికి నవయువకులందరూ సిద్ధపడ్డాక ఊరుఊరునా ఎన్నో తలలు తెగిపడుతూనే ఉన్నాయి.

ఇంకా ఒకటీ అరా ఏవైనా మిగిలి ఉంటే అవి కృష్ణుడిలాంటివి.

ఇప్పుడు కృష్ణుడికి అరవై ఏళ్ళు.

తండ్రిలాగే అతడు ఆ అంగడిలో అట్లాగే కూర్చుని ఉంటున్నాడు. తెల్లటి గడ్డమూ, అక్కడక్కడా పిగిలిన నిండు ఖద్దరు దుస్తులు, ఏ రక్తపుకూటికీ మలినపడని తేజోమయమైన కళ్లూ, అదృశ్య కరవాలాన్ని రెండు చేతులతో దృఢంగా పట్టుకొని ఝుళిపిస్తున్న అజ్ఞాతయోధుడి లాంటి రూపమూ...

గతం గుర్తులు ఏవీ లేవు అక్కడ.

పెండెం వారి వంశానికి కల్పతరువులా నిలిచిన సోడా ఏనాడో అదృశ్యమైపోయింది. కోకాకోలాను తరిమికొట్టాక తిరిగి పుంజుకున్న దేశీయ పానీయాలన్నీ అక్కడ మళ్ళీ ఒకసారి మృతి చెందాయి. రోజంతా రొదపెడుతూ ఉండిన చలువపెట్టెలు ఏ కొద్దిసేపో పనిచేస్తూ ఉన్నాయి.

లక్షమంది జనాభా కలిగిన ఊరు. లక్షలు సంపాదించగల బంగారంలాంటి సెంటరు.

అయినాగానీ మొండిగా అట్లాగే ఉంటున్నాడతడు.

కల్పన కంటే అనూహ్యమైన ఈ వాస్తవంలో ఇటీవల ఒక సంఘటన చోటు చేసుకుంది.

భారతదేశంలో మంచినీళ్ళు అమ్మకానికి బయలుదేరిన ఒక విదేశీ కంపెనీ దక్షిణాదిలోని అన్ని ఊర్లలో వ్యాపారాన్ని స్థిరపరచుకున్నట్టే కావలిలో కూడా స్థిరపరచుకోవడానికి వచ్చింది. దాని ప్రతినిధి ఒకడు కృష్ణుడిని కలిశాడు.

"కృష్ణమూర్తిగారూ, ఏమిటికని మీరు ఇట్లా ఉన్నారు? దయచేసి మా మంచినీళ్ళు అమ్మండి. రూపాయికి రూపాయి లాభం. కావలిలో ఇంత మంచి సెంటరు ఎక్కడా లేదు. కాళ్ళ ముందుకు వచ్చిపడే డబ్బును కాదనుకోకండీ. నా మాట వినండి. మా ఏజన్సీ తీసుకోండి" అని బతిమిలాడి వెళ్ళాడు.

అతడు ఉన్నంతసేపూ "అట్లాగేలెండీ, చూద్దాం లెండీ" అని అంటూ ఉండిన కృష్ణుడు అతడు వెళ్ళాక, ఒక అట్టుముక్క తెప్పించి, దానికి పురికొస కట్టి, పెండెం సోడా సెంటరు ద్వార బంధానికి వేలాడదీయించాడు. ఆ తర్వాత దాని మీద ఇలా రాయించాడు.

"ఇచ్చట కంపెనీ కూల్‌డ్రింకులు అమ్మబడవు"

"ఇచ్చట కంపెనీ మంచినీళ్ళు లభించబడవు"

మంచి ఎండల కాలంలో పడమటి గాలి ఎర్రగా అమ్మని లేచినప్పుడు కూడా ధైర్యంగా ఆ అట్టుముక్క అలా వేలాడుతూనే ఉంది.

*ప్రజాతంత్ర వర్తమాన సాహిత్య సంచిక, ఏప్రిల్ 2002*



# 4

# నిత్య గాయాల నది

**బెజ్జారపు రవీందర్**





దగాపడ్డ, గాయపడ్డ తెలంగాణాను ఆర్తితో ప్రతీకాత్మకంగా చెప్పిన కథ 'నిత్య గాయాల నది.' రచయిత బెజ్జారపు రవీందర్ 9 జనవరి 1967లో పుట్టారు. వీరి మొదటి కథ 'చరణం జారిపోయాక' వార్త ఆదివారం అనుబంధంలో 28 మే 2000లో ప్రచురితమైంది. కథా ప్రపంచంలోకి ఎగసిపడుతున్న మరో కొత్త తరంగం.

*చిరునామా : 2-6-7, నల్లపోచమ్మవాడ, పెద్దపల్లి - 505 175.*

సాయంకాలమయింది. చీకట్లు ముసురుకుంటున్నాయి. ఆకాశపు కాషాయ వస్త్రం మాసిపోతోంది. నింగి బ్లాటింగ్ పేపర్‌పైన జరజరా పాకుతూ వస్తున్న నల్లటి సిరాలా ఉంది చీకటి.

ఏ రిక్రియేషనులేని కిక్కిరిసిన చిన్న పట్టణాల్లో రైల్వేస్టేషనే గొప్ప రిలాక్సింగ్ పాయింట్! చాలా సాయంకాలాలు చీకటిపడ్డాక మా పెద్దపల్లి రైల్వేస్టేషన్‌లో ఒంటరి సిమెంట్ బెంచీపై కూర్చుంటాను. అల్లసాని పెద్దన వర్ణించిన అందమైన సాయంత్రాల్ని ఆస్వాదించేది ఇక్కడే. ఏకాంతంలో గొప్ప సమూహాన్ని, జాతరలాంటి జనం మధ్య ఏకాంతాన్ని అనుభూతి చెందేది ఇక్కడే!

కాని గత కొద్దిరోజులుగా నా సమస్త ఆలోచనల్ని ఆక్రమించుకుంటోందామె. దాదాపు ప్రతిరోజు వస్తోంది. నాలాగే ఒంటరిగా, దూరంగా కూర్చుంటుంది.

ఆమె పట్ల పట్టరాని కుతూహలం, ఆకర్షణ ఏర్పడ్డాయి నాలో. రోజుకొకరకంగా కనిపిస్తుంది. ఒక్కోసారి ఆమె వేల సంవత్సరాల అనుభవంతో పండిన వృద్ధురాలిలాగా అనిపిస్తుంది. మరోసారి ముసలితనపు జాడలేని నూత్న జవ్వనిలాగా కనిపిస్తుంది. అసలు ఎవరీమె?

ఆమెలో ఎన్ని ద్వంద్వాలున్నా, వైరుధ్యాలున్నా ఆమెలో గొప్ప ఆకర్షణ ఉంది. అది మాత్రం నిజం. ఎన్నో ఏళ్ళ పరిచయం, ఆత్మీయత మామధ్య ఉన్నట్లు అనుభూతి చెందుతాను. ఆమెను చూసినప్పుడల్లా తొలకరి స్పర్శకు మురిసిన మట్టి తొలి పరిమళం నన్ను అలుముకుంటుంది.

ఆసక్తిని చంపుకోలేక, ఒకరోజు ఆమె కూర్చున్నచోటుకు వెళ్ళాను. నా ఉనికి గమనించి తల పైకెత్తి ఏమిటన్నట్లు చూసింది.

"మీరెవరో తెలుసుకోవచ్చా?" అంటూ వినయంగా అడిగాను.

"నేనా...?" అంటూ నవ్వింది. అంతలోనే ఆమె ముఖం గంభీరంగా మారిపోయింది.

"నువ్వు నన్ను పోల్చుకోలేవు. నేను నిత్యం కుబుసం విడిచే మహాసర్పాన్ని. నేను అంటార్కిటికా ఖండాన్ని కాదు. ఆరుతువుల అందమైన భూమిని. నడినెత్తిన సూరీడున్న నిత్య మధ్యాహ్నాన్ని!" అంటూ దాదాపు అరుస్తున్నట్లు చెప్పింది.

ఆమె కంఠంలోని తీవ్రతకు వణికిపోయాను. తిరిగి తన వాక్ప్రవాహాన్ని ఇలా కొనసాగించింది.

"...పదితలల మనిషిన్నేను. రావణున్ని కాదు. రావణుడు నా ముఖాల్లో ఒక ముఖం మాత్రమే. అడవులకు నెత్తురు పులిమిన సమ్మక్క సారలమ్మను. చారెడు భూమికోసం పోరు సలిపి గెలిచిన చాకలి అయిలమ్మను. సాంస్కృతిక శిలాజాల్లోంచి దేవుళ్ళను వడగట్టిన కోశాంబిని.



అలాగనీ ఎథీస్ట్‌ను కాను. వేదాల్ని ఆరాధించే దాశరధి రంగాచార్యను. జోడేఘాట్‌లో నిద్రిస్తున్న కొమురం భీమును. తెగిన అవయవాల్ని తిరిగి అతికించుకున్న శంబూకుడ్ని. పెదబొంకూరులో బయటపడిన కుండపెంకుని. మరీ నన్ను రాతియుగం మనిషిననుకునేవు. నేను... చిప్స్ స్పందనల కంప్యూటర్‌ని... అయితే మిత్రమా, నా ఆధారముఖం మాత్రం నాకే తెలియదు. అది వట్టి బ్లాంక్ ముఖం. అలాగనీ ప్రతి దృశ్యాన్నీ ప్రతిబింబించే ప్లెయిన్ అద్దం కాదు. అది వట్టి బ్లాంక్... అంతే!" ఆయాసపడుతూ ఆగిందామె.

ఆమె మెటఫర్‌లకు కొట్టుకుపోతూ అస్తిత్వాన్ని మరిచిపోయి వింటున్న నాకు తెరిపి దొరికినట్లయింది.

ఆమెవైపు పరీక్షగా చూశాను. పదితలలు లేవు! చిన్న కళ్ళు, నల్లటి ముఖం... జిమ్‌లలో కాకుండా కాయకష్టంతో గట్టిపడ్డ పొందికైన శరీరం... అంతకుమించి చెప్పుకోదగిన విశేషమేమి లేదు. కాని ఆ చిన్నకళ్ళలో మహాస్వప్నాలున్నట్లనిపించాయి.

"అది సరేగానీ, నీ సంగతేంటి?" తిరిగి ప్రశ్నించిందామె.

నవ్వొచ్చింది.

"నాలో అంతమంది లేరు. నా పేరు రవి. నాలో నేను మాత్రమే ఉన్నాను" అంటూ నవ్వాను.

నా నవ్వును చూసి తీవ్ర ఆగ్రహంతో ఊగిపోయిందామె.

"ఛీ... ఒక్క నువ్వేనా? ఏకవచనం గాళ్ళంటే అసహ్యం నాకు" అందామె ఛీత్కారంగా.

నవ్వు నా ముఖం నుండి ఆవిరైపోయింది. ఆమె దురుసు మాటలకు నొచ్చుకున్నాను. కాని ఆమె మాటల్లో ఏదో అవ్యక్త ఆకర్షణ ఉంది. డెప్త్ ఉంది. ఇంత మాటపడి కూడా ఆమె వివరాలు తెలుసుకోలేకపోయాను. -

*

ఆమె కనిపించిన ప్రతిసారి ఆమెనే పరిశీలిస్తూ ఉండడం అలవాటయ్యింది. ఆమె రాని రోజు వెలితిగా అనిపించేది.

చాలాసార్లు ఏదో ఒక పుస్తకం చదువుతూ కూర్చునేది. లేదా ఎవరో ఆప్తుల కోసం ఎదురు చూస్తున్నట్లు ప్లాట్‌ఫాంపై ఆత్రుతగా అటూ ఇటూ తిరిగేది. కాని ఆమె ఎన్నడూ ఎవరితో మాట్లాడగా చూడలేదు.

అసలు రైల్వేస్టేషన్‌లోని జనం ఆమె ముందు నుండి వెళుతూ కూడా ఆమెను గమనించకుండానే వెళ్ళిపోయేవారు. ఒక్కోసారి అనుమానం వేసేది - బహుశా ఆమె నా ఒక్కడికే కనిపిస్తోందేమో అని!

*

ఒకరోజు ఓ వింత దృశ్యం నన్నాకర్షించింది. ఒక్కో చేత్తో ఒక్కో పుస్తకం పట్టుకుని ఏక కాలంలో రెండింటిని చదువుతూ ఆమె కనిపించింది. తెగ ఆశ్చర్యపోయాను. ధైర్యం చేసి మెల్లగా ఆమెను సమీపించాను.

"రెండు పుస్తకాల్ని ఒకేసారి చదువుతున్నట్లున్నారే?" అంటూ జోక్ చేశాను.

కాని ఆమె నవ్వలేదు. నావైపు సీరియస్‌గా చూసింది.

"అవును. నాకు బైనరీ విజన్ ఉంది. రెండు పుస్తకాల్ని ఏకకాలంలో చదవగలను... ఒక్కో కంటితో ఒక్కో పుస్తకం!" అంది.

తమాషాకు అలా అంటుందేమో అనుకున్నాను. కాని ఎప్పటిలాగే ఆమె ముఖంలో నిజాయితీతో కూడిన గాంభీర్యం కనిపించింది. అనాదికాలం నాటి దండకారణ్యంలోని ఋషులు, రాక్షసుల ఆత్మలు నా చుట్టూ నృత్యం చేస్తున్నట్లనిపించింది. ఆ వాతావరణం భయం వేసింది. ఎందుకో చెప్పలేనుగానీ, అకస్మాత్తుగా ఆమె పోతపోసిన మా ఊరిలా అనిపించింది. ఈ భావన రాగానే ఆమెపట్ల అవ్యాజ్యమైన ప్రేమ కలిగింది.

ఎవరీమె? నాకన్నా చిన్నదా, పెద్దదా... నా స్నేహితురాలా, బంధువా? ప్రేయసా, తల్లా?... ఇవేవి కాదు అనుకున్నాను. బహుశా అన్నీ కలిపితే ఈమేనేమో!

"ఏమిటా పుస్తకాలు?" అంటూ అడిగాను. రగు చేపముల్లు గుండిక్కాయల దిగేసినట్లు ఏదో మాట అంటుందని... వినడానికి మానసికంగా సిద్ధమయ్యాను.

కాని నా ప్రశ్న ఆమెకు చిరాకును కలిగించలేదు. పైగా నచ్చినట్లుంది. ప్రశాంతమైన స్వరంతో జవాబిచ్చింది.

"ఈ పుస్తకాలా?... ఒకటి దాస్ కాపిటల్... రెండోది పోతన భాగవతం!" అందామె.

వాటి పేర్లు చెపుతున్నప్పుడు ఆమె గొంతులోని తన్మయత్వాన్ని గమనించాను.

నా ఆశ్చర్యానికి అంతేలేదు. ఆమెకు బైనరీ విజన్ ఉంటే ఉండొచ్చుగాక. ఏకకాలంలో రెండు పుస్తకాల్ని చదివే సామర్థ్యం ఉండనీ... కాని పొంతనలేని మార్క్సును, పోతనను ఎలా చదవగలుగుతోంది?

నా ఆశ్చర్యాల్ని, సందిగ్ధాల్ని పట్టించుకోకుండా...

"ఇవి కావాలా నీకు?... చదువుతావా?..." అంటూ అడిగింది.

నేను సమాధానం ఇవ్వకముందే నా చేతుల్లో దాస్ కాపిటల్ పడేసి చక్కా వెళ్ళిపోయింది.

నేనూ, దాస్ కాపిటల్ మాత్రమే మిగిలామక్కడ.

*

దాస్ కాపిటల్‌ను చదవడం ప్రారంభించాను. అందులోని పదాలు, వాక్యాలు అర్థమవుతున్నకొద్దీ, అక్షరాలు నేలజారడం ప్రారంభమయ్యాయి. కొద్దిసేపటి తరువాత అవి మనుషులుగా



మొలకెత్తడం గమనించాను. క్రమంగా ఎదిగి... ఎదిగిన మనుషులు సమూహాలు, సమూహాలుగా గది తలుపులు తెరుచుకుని జనంలో కలవడం మొదలుపెట్టారు. భయంవేసి పుస్తకాన్ని చదవడం ఆపాను.

కాని ఆమెలో ఉన్నటువంటి ఆకర్షణే ఆ పుస్తకంలోనూ ఉంది. ఆమెలోని మార్మికతే పుస్తకంలోనూ ఉంది.

పుస్తకాన్ని వాపసు చేద్దామని ఆమెకోసం వెతికాను. కనిపించలేదు. ఆమె కనిపించకుండా ఉన్నకొద్దీ నాలో ఆరాటం ఎక్కువయింది. పుస్తకాన్ని చేతిలో పట్టుకుని తిరిగే ప్రతిసారి, ఒక గొప్ప జనసమూహాన్ని వెంటేసుకుని తిరుగుతున్నట్లుగా ఊపిరాడేది కాదు.

ఎట్టకేలకు ఒకరోజు కనిపించింది. పరిగెత్తుతూ ఆమె వద్దకు వెళ్ళాను. పుస్తకాన్ని ఆమె చేతిలో పెట్టాను. ఒకసారి ఆప్యాయంగా దాన్ని నిమిరి తెరిచి చూసింది. పట్టరాని సంతోషం ఆమె కళ్ళలో కనిపించింది.

"అదీ!... నువ్విప్పుడు నాకు నచ్చావు. అక్షరాల్ని మనుష్యులుగా మార్చే ఇంద్రజాలికులంటే నాకిష్టం" అంది బిగ్గరగా నవ్వుతూ.

ఆమె నవ్వు విరగబూసిన మోదుగులా ఉంది. స్త్రీ రూపం దాల్చిన సిద్ధార్థుడి నవ్వులా సమ్మోహనంగా ఉంది.

ఆమె పుస్తకాన్ని తెరిచి, పేజీలు తిరగేసి చూపిస్తూ –

"చూడు చూడు ఖాళీపేజీలు... మానవ సమూహాలుగా మారిన పేజీలు... ఇప్పుడు వాళ్ళెక్కడెక్కడో తిరుగుతుంటారు. కన్నీళ్ళు కారుస్తారు. కలియబడతారు. అంతమవుతారు. ఎవడో ఒక కవి పుస్తకంలో అక్షరాలుగా సుషుప్తావస్థ పొందుతారు. మళ్ళీ నీలాంటివాడు ఎవడన్నా తట్టి లేపేదాకా..." అంటూ పుస్తకాన్ని పైకెగరేసింది.

ఆకాశానికి నిచ్చెన వేయడం కోసం అర్జునుడు ప్రయోగించిన మొదటి బాణంలా పుస్తకం పైకి దూసుకెళ్ళింది. అలా పైకే చూస్తుండిపోయాను. ఎంతకూ కిందకు పడకపోయేసరికి మెడలు నొచ్చి ముందుకు చూస్తే... ఆమె లేదు!

ఆమె నన్ను ఇంద్రజాలికుడు అంది. కాని వాస్తవమేమిటంటే ఆమె నిజమైన ఇంద్రజాలికురాలు. ఆ... తెలిసింది. ఆమె మెజీషియన్ అనుకున్నాను. కాని అలా అనుకోవడం సంతృప్తి కలిగించలేదు.

వాస్తవం ఏదైతేనేం, మనకు నచ్చినట్లు వ్యాఖ్యానించుకోవడమే కదా జీవితం! ఆమె మెజీషియన్ కాదు. ఎందుకు కాదంటే అలా అనుకోవడం నాకిష్టంలేదు. మరి ఎవరామె? తెలుసుకోవలసిన విషయమే అది!

*

ఇన్నిరోజుల పరిచయం తరువాత కూడా ఆమె ఎవరో... ఆమె పేరేమిటో... ఏదీ తెలుసుకోలేకపోయాను. కాని ఆమె నాకు అత్యంత పరిచయమున్న సన్నిహితమైన ఆప్తురాలు అనిపిస్తోంది. కాని ఎవరామె? ఆమెను గుర్తించలేనంతగా మతిమరుపు నన్ను కమ్ముకొందా? ఆమెను పోల్చుకోవడానికి నిరంతరం ప్రయత్నిస్తూనే ఉన్నాను.

సాయంత్రం ఏడున్నర అయింది. భాగ్యనగర్ పాసింజర్ వచ్చింది. కొంతసేపటి దాకా ప్రయాణికుల ప్రవాహం. తరువాత నిశ్శబ్దం. ఏకాంతం. ప్లాట్‌ఫాంపైన నేనొక్కడినే మిగిలాను. ఒక వ్యక్తి సుమారు అరవై ఐదు, డెబ్బై ఏళ్ళు ఉంటాయనుకుంటా, అక్కడే తచ్చాడుతున్నాడు. నా దగ్గరికి వచ్చాడు. ధోతి, ఖద్దరు బనియన్, చేతిలో కర్ర... ఏలె లక్ష్మణ్ గీసిన పల్లెటూరి మనిషిలాటి నిరాడంబరమైన ముఖం.

"చూడు బాపూ... ఇక్కడో తల్లి ఉండాలే..." అంటూ గొణిగాడు.

అది ప్రశ్న కాకపోవడంతో నేనేమీ మాట్లాడలేదు.

"ఇయ్యాలగానీ నీకు కనిపించిందా?" అంటూ ప్రశ్నించాడు.

"మీరెవరి గురించి అడుగుతున్నారు?" అంటూ తిరిగి ప్రశ్నించాను.

"నీకు తెలిసినామె గురించే అడుగుతున్నా. తంగెడుపూల చెట్టు లెక్క నిండుగ ఉంటది. తాటిచెట్టు తీరుగ నిటారుగా ఉంటది. గునకపూల లెక్క నవ్వుతది... అదో... గా తల్లి ఇయ్యాల కనపడ్డదా?"

అతను ఎవరి గురించి ప్రశ్నిస్తున్నాడో అర్థమయింది. పక్కన కూర్చోమన్నట్లుగా జరిగాను. కూర్చున్నాడు.

"ఆమె కనపడక చాలారోజులవుతోంది. ఇంతకీ ఆమె నీకు ఏమవుతుంది?" అంటూ అడిగాను. ఎట్టకేలకు ఆమె రహస్యం ఏదో తెలుస్తుందని ఆశపడ్డాను.

"మట్టికి, మనిషికి ఉండాల్సిన సంబంధమే ఆమెకు, మనకు నడిమిట్ల ఉన్నది" అన్నాడతను.

అంతా కలిసి నన్ను గొప్ప సందిగ్ధంలోకి నెట్టేస్తున్నారు అనుకుంటూ విసుక్కున్నాను.

"మీరెక్కడి నుండి వచ్చారు?" అడిగాను.

"బోనగిరి" అంటూ సమాధానమిచ్చాడు.

"ఆమెకు ఏదన్నా చెప్పే ముచ్చట ఉంటే నాకు చెప్పండి. ఆమె కనిపించినంక నేను చెప్తా" అన్నాను.

అతడు గొంతు సవరించుకుని తన సంగతి చెప్పడం ప్రారంభించాడు.

"ఇప్పటికి అరవైఏండ్ల సంది గూసులాడుతనే వున్నా. రజాకార్ల తోటి కొట్లాడిన. దొరల్ని గజ్జుమనేటట్లు చేసిన. నిజాంతోటి నిల్చుండి కొట్లాడిన. ఇండియన్ మిలిట్రీ కండ్లల్ల కారం గొట్టిన. గిప్పుడు గూడ కొందరు నా పిలగాండ్లు కొట్లాడుతున్నరు.



"కాని బాపూ, గప్పుడు నా అసొంటి బక్కోళ్ళ కోసం బందూకు పట్టక తప్పిందికాదు. మమ్ముల్ని పీక్కతినే బలిసిన దొరల మీదికి బందూకు ఎక్కుపెట్టిన. ఒక్కడ్ని... ఒక్కడ్ని కూడ ఊర్లల్ల ఉంచకుండా ఎల్లగొట్టినం. గోసీలు సదురుకుంట గడీగోడలు దుంకి పారిపోయిన్రు. దోచుకునేటోళ్ళను ఎల్లగొట్టుడే సిద్ధాంతం. అంతకుమించి తెల్వదు నాకు.

"కాని, గిప్పుడు గూడ దోపిడీ జరుగుతాంది. అయితే దోపిడి చేసెటోడెవ్వడో కనిపిస్తలేడు. లక్ష్మణుడు, ఇంద్రజిత్తు యుద్ధంల ఇంద్రజిత్తు జేసిన మాయల మంత్రాల యుద్ధం లెక్క ఉన్నది. దోపిడి ఉంది. అది చేసేటోడెవ్వడో కంటికి కనిపించడు.

"ఊరోళ్ళందరి ఉమ్మడి శత్రువు దొర ఉండె. ఆళ్ళను ఎల్లగొడితె దీపావళి జరుపుకున్నరు జనం. ఇప్పుడు కూడా శత్రు స్పర్శ తెలుస్తూనే ఉన్నది. కాని ఎటువైపు కత్తి విసరాల్నో తెలుస్తలేదు. పోలీసోళ్ళ మీదికి బందూకెత్తుతున్నాం. కాని జనం పండుగలు జేసుకుంటలేరు. ఎందుకంటే దొరల జాగాల పోలీసోళ్ళు పనికిరారు.

"అందుకే ఆ తల్లిని అడుగుదామని వచ్చిన. కంటికి కనిపించని దుష్మన్‌తోని ఎట్లా కొట్లాడేది? అది సమఝైతలేదు నాకు..." అన్నాడా వృద్ధుడు ఆవేదనతో.

*

అతనూ, అతని సమస్య అర్థమైంది నాకు. మా ఊరి దొర ప్రకాశరావు గురించి మా తాత చెప్పిన విషయాలు యాదికొచ్చినయ్. ఊరి పంటభూముల్లో బారానా మందం దొరవే! ఊరి జనంలో చాలామంది కూలీలుగానో, వెట్టిచాకిరీ చేసే కట్టుబానిసలుగానో బతకాల్సి ఉండేది.

ప్రకాశరావు దొర పరమ కర్కోటకుడిగా పేరు పడ్డాడు. కోపమొస్తే, చిన్నప్పుడు తల్లి దగ్గర తాగిన పాలను కూడా కక్కేటట్లు కొట్టిస్తాడని ప్రతీతి. స్త్రీల విషయంలో కీచకుడు కూడా ప్రకాశరావు ముందు చిన్నబోతాడు.

అట్లాంటి ప్రకాశరావు దొర ప్రజల చైతన్యం చూసి, జరుగుతున్న సంఘటనలు గమనించి భయంతో ఊరు వదిలి పారిపోయాడు. ఆ వార్త తెలిసిన మరుక్షణం ఊరోళ్ళ హృదయాల్లో విరిసిన సంతోషం, ఊరిలో జరిగిన సంబరం గురించి మా తాత మెరిసే కళ్ళతో చెప్పేవాడు.

పారిపోయిన దొర కొన్నేళ్ళకు ఎమ్మెల్యే అయ్యాడు. అతని కొడుకు పెద్ద ఇండస్ట్రియలిస్ట్. మనుమడు గ్రూప్ వన్ అధికారి.

దొర భూముల్లో ఎర్రజెండాలు పాతారు. వాటిని పంచాలనుకున్నా పంచడం జరగలేదు. ప్రకాశరావు ఎస్.సి కార్పొరేషన్‌కు భూముల్ని అమ్మాడు. కొన్ని లక్షల రూపాయలు వచ్చాయి. ఎస్.సి. కార్పొరేషన్ ఆధ్వర్యంలో పేదలకు భూములు పంచారు. కాని వాటిలోనూ రాజకీయాలు, కమీషన్లు, లంచాలు.

ప్రకాశరావు దొరకు వచ్చిన నష్టమేమి లేదు. భూములు పోయాయి. నగదుగా మారాయి. రాజకీయ పునాదులుగా మారాయి. పరిశ్రమల యంత్రాలుగా మారాయి. బ్యూరోక్రసీ తెల్ల అంగీల గళ్ళలుగా మారాయి. సంపద రూపం మారిందంతే.

ప్రస్తుతం ప్రజల ముందు ప్రకాశరావులాంటి ప్రత్యక్ష దోపిడీదారుడు లేడు. తక్షణ శత్రువు లేడు. ఇప్పుడు మనమీద శిలువలు మోపుతున్న, మన కష్టాలకు కారణమైన వ్యవస్థ ప్రకాశరావు కాలంలోలాగా నా ఊరిలోనే, నా కళ్ళెదురుగానే ఉండడం లేదు. దాని ఉనికి, రాష్ట్రాలు, దేశాల సరిహద్దులు దాటి ఖండాంతరాలుగా వ్యాప్తి చెంది ఉంది.

అందుకే విప్లవకారుడు ప్రకాశరావు దొరను ఎదుర్కొన్న తీరులోనే ప్రస్తుత దోపిడీ వ్యవస్థను ఎదుర్కోలేడు. అసాధ్యం. దోపిడీ తీరు మారినప్పుడు పోరాట పంథా కూడా మారాలి. లేకపోతే నా ముందున్న ఈ వృద్ధుడిలాగా సందిగ్ధంలోకి జారిపోవాల్సి ఉంటుంది.

ఆ ముసలాయన్ని చూస్తే జాలేసింది. నిరంతర అజ్ఞాతవాసం ఎంత భయంకరమైనది! ఒక లక్ష్యం కోసం, సిద్ధాంతం కోసం శ్రమించంలో ఆనందం ఉంటుంది. కాని తానంతవరకు రక్తం ధారపోసిన సిద్ధాంతంలో బలహీనతలుండడాన్ని గమనించడం... మన నమూనాకు సిద్ధాంతం ఆశిస్తున్న నమూనాకు మధ్య వ్యత్యాసం ఏర్పడినప్పుడు కలిగే బాధ నరకప్రాయం.

"ఎందుకయ్యా, చిన్నతనం నుంచే బందూకు పట్టినవ్?" అంటూ ప్రశ్నించాను.

కొద్దిసేపటిదాకా మాట్లాడలేదతను. కళ్ళు మూసుకున్నాడు. అతని మనోఫలకం మీద ఏయే దృశ్యాలు కుండపోత వర్షంలాగా, వడగళ్ళవానలాగా జారుతున్నాయో!

"శివారెడ్డి కవిత్వం చదివినవా? కరుణ గలవాడే కృపాణం ధరించగలడు అంటాడా యన!" అన్నాడు కళ్ళు తెరవకుండానే.

*

ఒకవైపు పోలీస్ ఇన్‌ఫార్మర్ల హత్యలు... మరోవైపు ఎన్‌కౌంటర్లు... ఇంకోవైపు మత కలహాలు... మనం ఎవరికి టార్గెటో తెలియని విచిత్ర యుద్ధభూమిలో ఉన్నాం. వీటన్నింటితో పాటు మనమీద మెల్లగా పరుచుకుంటున్న ప్రపంచీకరణ ఆక్టోపస్ నీడ... పాము పడగ ఎంత నీడ ఇవ్వగలదో, ఎంత భద్రమైనదో అంత సురక్షితం మన జీవితాలు అనుకుంటూ రైల్వేస్టేషన్‌లోకి వెళ్ళానో లేదో అకస్మాత్తుగా ఆమె ప్రత్యక్షమైంది. ఆమె పరిస్థితి చూసి పరేషానయ్యాను. రేణుకా ఎల్లమ్మ తల్లిలాగా నిండుగా, గంభీరంగా ఉండే ఆమె, బదాబదలైన దేహంతో రక్తసిక్తమై జాలి గొలిపేటట్లు కనిపించింది!

ఒళ్ళంతా దెబ్బలు... ఆగకుండా స్రవిస్తున్న రక్తం. ఆమెను చూడగానే హృదయం ద్రవించి పోయింది.

ఉరుకుతూ ఆమె వద్దకు వెళ్ళాను. జేబులోంచి దస్తీ తీసి రక్తస్రావాన్ని ఆపబోయాను. ఆమె వారించింది.



"వద్దు... వద్దు... నేనో రక్తనదిని. ఈ ప్రవాహం ఆగదు" అంది నిర్వేదంగా.

"ఎలా అయ్యాయి ఈ గాయాలన్నీ?" అంటూ ప్రశ్నించాను. నా గొంతులోని దుఃఖం ఆమెను కదిలించినట్లయింది. నావైపు ఆపేక్షగా చూసింది.

"ఇవ్వాళ ఓ ఇద్దరు హైస్కూలు పిల్లలు కనిపిస్తే వాళ్ళని అడిగిన - నా బిడ్డ కొమురం భీము మీకు తెలుసా అని? కాని వాళ్ళు తెలియదన్నరు..." అంటూ ఆమె వివరించబోతుంటే మధ్యలో ఆపాను.

"నువ్వు కొమురం భీము తల్లివా?" అంటూ ప్రశ్నించాను. నా ప్రశ్నకు ఆమె విసుక్కుంది.

"మధ్యలో అడ్డంరాకు బిడ్డా... సరే ఆ పిలగాండ్లకు తెలువదేమో అనుకున్నా. అనుమానం వచ్చి అక్కడికి దగ్గర్లోని హైస్కూలుకు వెళ్ళిన. పదో తరగతి రూములకు పోయి అడిగిన - మీకు నా బిడ్డ కొమురం భీము తెలుసా? అని. ఎందుకో ఈరోజు వాడి గురించి పదిమంది నోటి తోటి వింటే మంచిగుండు అనుకున్న. కాని ఆ క్లాసు పిలగాండ్లకు ఎవరికీ భీము గురించి తెలువదట. ఏడుపొచ్చింది నాకు. చదువుకునే పోరగాండ్లే నా బిడ్డ కొమురం భీము గురించి నా చెవిల నాలుగు మంచి మాటలు వెయ్యకపోతే ఇంకెవరు చెప్తరు? అయినా ఆశ చావక జంగలల్ల ఉంటూ సర్కారును 'బందూకుల్తోటి, బాణాలతోటి, అడవిల బిడ్డల సాయంతోటి ఎదిరించినోళ్ళ పేర్లు చెప్పుమన్నా. అప్పుడు చెప్పిన్రు వాళ్ళు - అల్లూరి సీతారామరాజు పేరు!

"నువ్వే చెప్పరా తండ్రీ!... అల్లూరి సీతారామరాజు గొప్పవాడే... కాని నా బిడ్డ కొమురం భీముడు ఏం తక్కువ? సీతారామరాజు పేరు తెలిసిన పిలగాండ్లకు కొమురం భీము గురించి తెలువకుండా జేసిన వాళ్ళెవరు? మన్నెం వీరుడితో నా జోడేఘాట్ పోరడు సాటిరాడా?

"కొమురం భీము గురించే తెలువనోళ్ళకు నా మిగతా పిల్లలు దొడ్డి కొమురయ్య, రావి నారాయణరెడ్డి... ఎవ్వరి పేర్లైనా ఎట్ల తెలుస్తయ్? అవున్లే బాపూ, నా టాంక్‌బండ్ గుండెలపైనే నా పోరగాండ్ల ఆనవాలు కానరానప్పుడు మీ తరానికి వాళ్ళ గురించి ఏం తెలుస్తుందిలే!

"మనల్ని తమ ఇనుప పాదాల కింద నలిపేసిందెవరో తెలుసా? మనం ఎవరి నుండి విముక్తి పొందామో తెలుసా అని ఆ పదో తరగతి పిలగాండ్లను అడిగిన. బ్రిటిషోళ్ళు అని చెప్పిన్రు. దొరలు తెలుసా... దేశ్‌ముఖ్‌లు తెలుసా... రజాకార్లు తెలుసా... నిజాం సర్కారు తెలుసా... అని అడిగిన. ఏదో పరాయిదేశపు పేర్లు వింటున్నట్లు నోరు తెరిచి చూస్తున్నరు గానీ, ఒక్కని కండ్లల్ల వాళ్ళ వివరం తెలిసిన జాడల్లేవు.

"ఈ చదువులు గిట్లెందుకు తగలబడ్డయి బిడ్డా? వాని మట్టి గురించి వానికి తెలియకపోతే ఎట్లా?

"ఈ లొల్లి అంతా వింటున్న పోలీసొకడు వచ్చి కొమురం భీము గురించి చెప్తున్నవేందే... నక్సలైట్లతోటి మిలాఖతైనవా అంటూ ఎటుపడితే అటు గుద్దిండు. గవ్వే గీ దెబ్బలు!

"అల్లూరి సీతారామరాజు గురించి మాట్లాడితే దేశభక్తి. కొమురం భీము గురించి నోరిప్పితే తీవ్రవాదం! తమ తల్లి గురించి తామే మాట్లాడుకోవడం నిషిద్ధమైన కాలంలో ఇక అన్నదమ్ముల గురించి ఏం మాట్లాడతారులే..." అంటూ చెప్పుకుపోతోందామె.

ఆమె మాటల్లో ఆవేశం ఉంది. ఆవేదన ఉంది.

అర్థమవుతోంది తల్లీ... నాకర్థమవుతోంది! నువ్వెవరో నీ ఆవేదన దేనికోసమో... నీ ఆగ్రహ మెందుకో! వణుకుతున్న శరీరంతో, చెమర్చిన కళ్ళతో ఆమెవైపు చూశాను.

"ఇంకా ఏం పోల్చుకోవాలని చూస్తావు... నేనురా.. తీగెలు తెగిన నీ కోటి రతనాల వీణను... కరువులో వచ్చిన బతుకమ్మ పండుగను... ప్రసవంలోనే బిడ్డల్ని పోగొట్టుకున్న పచ్చిబాలింత రొమ్మును" అంది.

*ఆదివారం వార్త, 1 సెప్టెంబరు 2002*



# 5

# గుండ్లకమ్మ తీరాన

కాట్రగడ్డ దయానంద్





నమ్ముకున్న నేల చేపల కోసం చెరువవుతోందని గుండె చెరువైన రైతుల ఆత్మవేదనే 'గుండ్లకమ్మ తీరాన' కథ. రచయిత కాట్రగడ్డ దయానంద్ 14 అక్టోబర్ 1965లో పుట్టారు. వీరి మొదటి కథ 'లాటరీ' 1982లో **ప్రజాసాహితి** పత్రికలో అచ్చయ్యింది. వీరి కథల సంపుటి 'పండుటాకు' 1998లోనూ, కవితా సంపుటి 'మెదక్' 2003లోనూ వెలువడ్డాయి. పోస్టల్ డిపార్ట్ మెంట్‌లో ఉద్యోగం.

చిరునామా : సబ్ పోస్ట్‌మాస్టర్, టంగుటూరు, ప్రకాశం జిల్లా

సముద్రపు పోటు తగిలినట్టుంది. ఎండ పెరిగేకొద్దీ గుండ్లకమ్మలో నీటిమట్టం కొద్దికొద్దిగా పెరుగుతోంది. దరిన ఉన్న ఇసుక మెల్లిమెల్లిగా నీటి అలల నురగతో తడుస్తూ కరిగి నీళ్ళ కిందికి చేరిపోతూ ఉంది. అక్కడక్కడా అప్పుడప్పుడూ ఒక మాదిరైన చేపలు గాల్లో మూకుమ్మడిగా పల్టీలు కొడుతూ ఉప్పునీళ్ళలో సయ్యాటలాడుతున్నాయి.

వెంకటేశ్వర్లు చేతికర్ర చివరను రెండు పిడికిళ్ళతో బిగించి గడ్డం కింద ఆనించుకుని రెండో చివరను ఇసుకనేలకు తాటించి గుండ్లకమ్మ ఒడ్డున నిలబడే కలగంటున్నాడు.

అది అతడికి నిరంతరం వచ్చే కల. నిద్రలోనూ, మెలకువలోనూ, పగలూ, రాత్రీ ఎప్పుడంటే అప్పుడు పిలిస్తే పలికే కల. ఏళ్ళ తరబడి అతణ్ని వెంటాడుతున్న ఒక మధురస్వప్నం.

గుండ్లకమ్మ నుంచి కాలువలు కాలువలై పొలాల్లోకి గలగలమని జల దూకుతున్నట్టు, మట్టిని ముద్దిడి సలిబిండి ముద్దని చేసి పచ్చపచ్చని చెట్లపాదుల్ని మొలిపించి, సన్నటి తీగెల చేతుల్తో ఆకాశాన్ని భూమితో ఆలింగనం చేయించినట్టు, రాశులు రాశులుగా రకరకాల పరిమాణంలో కూరగాయాల్ని సృష్టించినట్టు, గుండ్లకమ్మ తీరమంతటా కూరగాయలన్నీ బండ్లయి సాగిపోతున్నట్టు... ఇంకా...

ఇంతలో కనబడని జల జీవొకటి బుడుంగున పెద్ద శబ్దం చేస్తూ నీళ్ళలో కదిలిపోయింది. వర్తమానంలోకి వచ్చేడు వెంకటేశ్వర్లు. నీళ్ళల్లో శబ్దం వచ్చినవైపు చూచేడు. తళతళమని మెరిసే నీళ్ళు తప్ప మరేమీ కనబడలేదు. నీళ్ళల్లో మునిగి మోరలు మాత్రం పైకెత్తి కళ్ళు మూసుకుని నెమరేస్తూ ఆనందాన్ని అనుభవిస్తున్న బఱ్ఱెగొడ్లవైపు దృష్టి సారించాడు. కాపుగారి చిన్న జీతగాడు యాకోబు దున్నకర్ర తోక పట్టుకొని గుండ్లకమ్మను ఈదుతున్నాడు. పడ్డదూడలు రెండు గుండ్లకమ్మను దాటి అవతలి ఒడ్డునున్న సవక తోటలవైపు పని ఉన్నట్లుగా బయల్దేరాయి. కల పూర్తిగా కరిగిపోయింది.

"ఈటమ్మ. ఈటికెప్పుడు తిండి యావేరా. ఒరేయ్ యాకోబూ! కాస్త ఆ పడ్డ దూడల్ని ఏట్లోకి మళ్ళగొట్టరా" అరుస్తూ చెప్పేడు వెంకటేశ్వర్లు. దున్నకర్ర తోక వదిలిపెట్టకుండా మాటలు వినవచ్చినవైపు చూచి తనకేమీ పట్టనట్లు నీళ్ళలోనే ఉండిపోయేడు యాకోబు.

"ఒరే నాయనా! నిన్నేరా. కాస్త వాటిని అదిలిచ్చి పెట్టరా" బతిమిలాడేడు వెంకటేశ్వర్లు. యాకోబు దున్నుకర్ర తోకను వదిలి ఈదుకుంటూ వెళ్ళి నాలుకతో రిచ్చగొడుతూ అవతలి గట్టుకి చేరేడు.

ఎండ తీక్షణమయ్యేకొద్దీ చేలల్లో ఎండు దుబ్బుల్ని కొరుకుతున్న పశువులు గుండ్లకమ్మ దారిపట్టేయి. పశువులన్నీ గుండ్లకమ్మలో చేరినాక ఒడ్డున విస్తరించి ఉన్న జపాన్ తుమ్మచెట్ల కిందకు చేరి పై కండువాల్ని పరిచి కూర్చున్నారు గొడ్లను కాయడానికి వచ్చినవాళ్ళు.



ఆడా మగా మొత్తం పది పన్నెండుమంది. కాపుగారి జీతగాడు యాకోబు తప్ప మిగతా అందరూ సొంత పొలాలున్నవాళ్ళే. కాపుగారికి అరవై డెబ్బై ఎకరాల పొలముంటే మిగతా వాళ్ళంతా ఎకరా నుంచి నాలుగైదెకరాల లోపువాళ్ళే. గుండ్లకమ్మ ఒడ్డున భూమి ఉన్నవాళ్ళు మాత్రమే అక్కడకు పశువుల్ని తోలుకొస్తుంటారు. అదొక కనబడని కట్టుబాటు. అందరూ బఱ్ఱెగొడ్లను మేపుకుంటూ నడిమధ్యాహ్నం కల్లా అక్కడకు చేరి గొడ్లను నదిలోకి తోలి తెచ్చుకున్న ముద్ద తిని కాస్సేపు చెట్ల కింద నడుంవాల్చి మళ్ళీ పొద్దు కాస్త వాలగానే బఱ్ఱెగొడ్లను మేపుకుంటూ ఇంటిదారి పడతారు. గుండ్లకమ్మ ఒడ్డు పొడుగూతా కూతవేటు దూరాలలో గుంపులు గుంపులుగా జనం ఎండపూట నీడ చూచుకుంటారు.

"ఏం మామా నీడకు రావా ఏంది? మనవడు గుర్తొచ్చినాడా ఎట్ట. ఆలోచిస్తా అట్టనే ఎండలో నుంచున్నావ్" కోడలు వరసైన కమల, వెంకటేశ్వర్లుని కేకేసింది. వెంకటేశ్వర్లు ఒక చేత్తో కింద పెట్టిన అన్నం టిఫిన్నీ, మరోచేత్తో మంచినీళ్ళ సీసా తాడును పట్టుకుని కర్రకు ముందూ వెనకా తగిలించి కావిడిలా భుజమ్మీద పెట్టుకొని తనూ జపాన్ చెట్టు నీడకు చేరేడు. అంతమంది ఎప్పుడొచ్చి చేరారో గమనించనేలేదు వెంకటేశ్వర్లు. అతడి చిన్నాయిన కొడుకు రంగయ్య, ఆయన ఇద్దరు కొడుకులు, దగ్గర బంధువులైన మరో ముగ్గురు ఆడవాళ్ళు, మగవాళ్ళు మాదిగ రోశయ్య, కాపుగారి జీతగాడు యాకోబు చెట్ల కింద దూరదూరంగా కూర్చుని ఉన్నారు. వెంకటేశ్వర్లు కర్రను కిందకు దించి నేలమీద ఉంచి పై కండువాను కింద కువ్వలా చేసి దానిమీద కూర్చుని మోకాళ్ళు మడిచి అరికాళ్ళు నేలకు తాటించేడు.

"అవునే కోడలా! నాకొక్కడైతే వాడికొక్క నలుసు. గుర్తు రాకుండా ఎట్టుంటాడు? ఏడో తరగతి పరీక్షలు రాసేడు. ఎండాకాలం సెలవులకొస్తాను. పొలం తీసుకపోయి తాటిముంజలు కొట్టిస్తావా అంటూ రాత్రి ఫోన్ చేసేడే పిల్లా" అన్నాడు వెంకటేశ్వర్లు.

"తాటి చెట్లెక్కడంలో మొనగాడివి కదా! నీకేం నాయనా. ఎన్ని గెలలైనా కొట్టి మనవడికి పెట్టుకోవూ" ఒకామె నిష్టూరమాడింది.

"తాటిచెట్టేంది. దానెమ్మ చెట్టునైనా చిటికెలో ఎక్కేస్తానే కోడలా! ఏదీ ఎవుడినైనా నాతో పందెం పెట్టుకోమను" కమలతో కళ్ళెగరేస్తూ అన్నాడు వెంకటేశ్వర్లు.

"సాల్లే. ఎచ్చులకేం తక్కువలేవు. ఏదీ నాలుగ్గెలలు దించు చూద్దాం" ఇంటి దగ్గర ముంజల కోసం మొహం వాచిపోయిన పిల్లల్ని గుర్తుకు తెచ్చుకొని రెచ్చగొడ్తున్నట్టుగా అంది కమల.

"ఆహాఁ అట్టనా" అని నవ్వి "కోడలుపిల్లా! నీ వయసెంతో ఇప్పుడు. నలభైయుంటయ్యా. నువ్వప్పటికి పుట్టలేదనుకుంటా. ఇదే కరణంగారి చేనుని కౌలుకు చేస్తన్నా. అంతకుముందు మా తాతలూ, మా అయ్యా కరణంగారి దగ్గర జీతానికుండేవాళ్ళు. వాళ్ళు సాగుచేసినయ్యే ఈ భూములన్నీ. కరణం కుటుంబాలు పట్నాలు పట్టిపోతే ఆ భూమినే నేను కౌలుకు తీసుకున్నా. నాకు నీళ్ళన్నా, వానన్నా, మొయిలన్నా, మెరుపులన్నా, ఎంత సంబరమో. వాన కురిస్తే చాలు పొలాన్ని వదలబుద్ధయేది కాదు. మిగతా వాళ్ళంతా వాన కురిస్తే పొలం దిక్కు చూచేవాళ్ళు

నివసించే మురికికూపాలలోకి చేరుకుంటావు. మరి నీవు అక్కడి నుండీ తప్పించుకొని బయట పడలేవు. ఇక నీ జీవితమంతా వారి మధ్యనే రోగంతో, శోకంతో, దుర్భర దారిద్ర్యంతో గడపవలసిందే. గుర్తు పెట్టుకో! ఆ తలుపు మరి లోనికి తెరుచుకోదు సుమా!"

తలుపులు మూసుకుపోయినా చీకట్లో కూడా ఆ స్వర్ణమందిరం వెలుగులు విరజిమ్ము తూనే ఉంది. అక్కడక్కడ అమర్చిన మణిదీపాల కాంతులు గోడల మీద ప్రతిఫలిస్తున్నాయి.

రాజు చెప్పింది నిజం. జీవితకాలంపాటు అడుగు కూడా బయటపెట్టే అవసరం లేని విధంగా ఆ మందిరంలోనే మహా వైభవ విలాసాలతో గడపగలిగే ఏర్పాట్లున్నాయి. అందులోకి ఒకసారి ప్రవేశించినవారు శరీరాలనే కాదు చూపుని కూడా మరల్చుకోలేనంత అద్భుతంగా ఉంది.

అక్కడ ఉన్న విశేషాలను పరిశీలనగా చూసింది సుమేధ. గదిలోని అరల నిండా అపురూప మైన బంగారు జరీ దుస్తులూ, ఎటుచూసినా కుప్పతెప్పలుగా కనిపిస్తున్న అమూల్యాభరణాలూ... అలంకార సామగ్రీ, మరోచోట ఘాటైన పరిమళాలు వెదజల్లుతున్న ఆహారపాత్రలూ ఉన్నాయి. కుతూహలంతో వాటివంక చూసింది.

వాటిలో ఒక్కటి కూడా సహజసిద్ధంగా అంటే చెట్టుని పండిన పండుగానీ, నేలన పండిన పంటగానీ ఉన్నది ఉన్నట్టుగా అమర్చలేదు. అంతా కృత్రిమం.

రాజ్యానికి వచ్చిన ఇన్ని రోజుల్లోనూ ఏనాడూ రాజు కల్పించబోయిన సౌకార్యలను తను వినియోగించుకోలేదు. వస్త్రాభరణాలని తాకలేదు.

ఆకలికి తట్టుకోలేని వేళల్లో విధిలేక పళ్ళూ, పాలూ తీసుకున్నదే తప్ప మరో విధమైన తిండిని తాను ముట్టలేదు.

అన్నీ తెలిసీ వీటన్నిటినీ అమర్చిన గదిలో తనని బందీని చెయ్యడంలో రాజు ఆంతర్యం ఏమిటి...?!

ఆలోచనగా వెనుదిరిగింది సుమేధ.

అక్కడ –

తాను ప్రవేశించిన బంగారు ద్వారానికి సరిగ్గా ఎదురుగా ఓ చిన్న ఇనుపతలుపు కనిపిం చింది. నిర్మించిన దగ్గరి నుంచీ దానినెవరూ తాకనట్టు ఆ తలుపు బాగా తుప్పు పట్టి బిగుసు కున్నట్టుగా కనిపిస్తూంది.

గది మధ్యని నిల్చున్నది సుమేధ.

చిరునవ్వు నవ్వుకుంది.

*ప్రజాసాహితి, అక్టోబరు 2002 సంచికలో 'నేలబారు ద్వారం' పేరుతో ప్రచురితమైంది.*



# 7

# అన్నంగుడ్డ

సుంకోజి దేవేంద్రాచారి





అన్నంగుడ్డను శిథిలమైపోతున్న గ్రామీణ చేతివృత్తులకు సంకేతంగా తీసుకుని రాసిన కథ 'అన్నంగుడ్డ.' రచయిత సుంకోజి దేవేంద్రాచారి 22 జులై 1974లో పుట్టారు. వీరి మొదటి కథ 'బంగారు పంజరం' 1997 నవంబర్ వార్తలో అచ్చయింది. కార్పెంటర్ వృత్తి నుండి ఇటీవలే జర్నలిజంలోకి మారారు. ఒక నవల, ఓ 15 కథలు రాశారు.

చిరునామా : సబ్ ఎడిటర్, ఆంధ్రజ్యోతి, తిరుపతి.

ఆకాశం మూడురోజుల నుంచి మబ్బులతో నిండి ఉంది. వీధిలోకి వచ్చి ఆకాశం వైపు చూశాడు ఆచారి. సూర్యుడు కన్పించకపోవడంతో టైము ఎంతయిందో అర్థం కాలేదతనికి.

"పొద్దుతో పనేముండాది. తినేసి ఎలబారుదురు రాండి" అంటూ లోపల నుంచి పిలచింది ఆచారి భార్య.

"సోమవారం గదా. ఏడున్నర నుంచి తొమ్మిద్దాంకా రావుకాలం. ఆయుధాలతో పని. రావుకాలం చూడకుండా పోయినామంటే కాళ్ళూ చేతులూ తెగతాయి" అన్నాడు వీధిలో నుంచే.

"రావుకాలాలు, మంచిరోజులు - అన్నీ పాటించే మన బతుకులు ఈడికుండాయి" అని గొణుక్కుంటూ తన పనిలో మునిగిపోయింది.

"పద్దన్నే ఏందే వదరతాండావు. మొబ్బుతోనే లేసి అన్నంకూర చేసేసింటే ఈపాటికి ఎలబారి పోయిందుము కదా" అన్నాడు ఆచారి కోపంగా లోపలకు వచ్చి.

"తెల్లారకముందే అన్నంకూర అయిపోయింది" అందామె, నీదే ఆలస్యం అన్నట్లుగా. దానికి ఆచారి "అన్నం కూర చెయ్యడమనుకొన్నేవా నా పని. రంపం రాయద్దా. బాడిశ నూరుకోవద్దా. బుడ్డి (దీపం) పెట్టుకోనైనా నీ పని చేసుకోవచ్చు. నాపని అట్ల కాదుగదా" అన్నాడు తన ఆలస్యాన్ని సమర్థించుకుంటున్నట్టుగా.

"టైము ఎనిమిదిన్నరంట నాయనా" అంటూ వచ్చాడు ఇరవై రెండు సంవత్సరాల కొడుకు.

"అంతయిందా. మోడంలో పొద్దే తెల్లా. బిన్నే పెట్టే. అన్నం తినేసి ఎలబారేలకు సరి పోతాది" అన్నాడు ఆచారి.

ఆమె రెండు పీటలు వేసింది. నీళ్ళగ్లాసులు, అన్నం కంచాలు పెట్టింది. అన్నంలోకి చింతపండు ఊరిమిండి వేసింది.

తండ్రీకొడుకులు పీటల మీద కూర్చొని తినసాగారు.

ఆచారి భార్య దండెం మీద వేలాడుతున్న అన్నంగుడ్డను చేతికి తీసుకొంది. దానిని నీళ్ళతో తడిపింది. చాప పరిచి, దాని మీద అన్నం గుడ్డనుంచింది. వెడల్పుపాత్రలో చల్లారబెట్టిన అన్నాన్ని తీసి గుడ్డలో వేసింది. అన్నం మధ్యలో చింతపండు ఉరిమిండి వేసి, గుడ్డ నాలుగు చెరుగులను జాగ్రత్తగా ఒకచోటకు చేర్చింది. ఒక చెరగును మిగిలిన మూడు చెరగుల చుట్టూ తిప్పి ముడివేసింది. అన్నంమూటను చేతిసంచిలో ఉంచింది.

అన్నం తింటున్నా, భార్య చేస్తున్న పనిని తదేకంగా చూస్తూనే ఉన్నాడు ఆచారి. తమ పెళ్ళయి ముప్పయి సంవత్సరాలయింది. పెళ్ళయినప్పటి ఉంచి ఒక క్యారేజీ తేవాలని, అన్నం గుడ్డకు బదులు పనికి క్యారేజీని తీసుకొనిపోవాలని అనుకుంటున్నాడు. కట్టుకునే రెండు పంచెల్లో ఒకటి చిరిగిందాకా ఇంకొకటి కొనలేడు. ఆ చిరిగిన పంచె అన్నంగుడ్డగా మారుతోంది. రానురాను అతనికి క్యారేజీ మీద కోరిక నశించి, అన్నంగుడ్డ మీద మమకారం పెరిగింది.

తండ్రీ కొడుకులు అన్నం తినడం పూర్తయింది. ఆచారి భార్య వచ్చి చేతిసంచిని కొడుకు చేతికిచ్చింది. సురేంద్ర సంచి లోపలకు పరిశీలనగా చూశాడు. అన్నంమూట, ఆకురాయి, దారం,



గజంటేపు కనిపించాయి. సంతృప్తిగా తలాడించాడు. పెద్ద బాడిశెను భుజం మీద ఉంచుకొన్నేడు. 'పోయొస్తాం' అన్నట్లుగా తల్లివైపు చూశాడు.

"సందేళ 'బత్తెం' అడుగు. ఏరోజుకు ఆరోజు ఇచ్చెయ్యమను. బత్తెం ఒకసారిగా ఇస్తామం టారు. కడాన వాళ్ళకు మనసొప్పదు" అంది ఆమె.

"సరేమ్మా" అన్నాడు సురేంద్ర.

"వోళ్ళ బాయిగడ్డన మునగమాన్లు చానా ఉండాయి. వచ్చేటప్పుడు మునగాకు పెరుక్కోని రాండి" అంది.

"సరే సరే... అయ్యన్నీ నువ్వు చెప్పాల్నా. ఎదుర్రా" అంటూ ఆచారి రంపం ఎత్తుకొని భుజం మీద పెట్టుకొన్నేడు.

పొయ్యిన పని కానీ కాకపోనీ, భార్య ఎదురువస్తే తప్ప ఇంటి నుంచి కదలడు ఆచారి. తమ పెళ్ళయినప్పటి నుంచి ఆ అలవాటు అలా కొనసాగుతూనే ఉంది. తండ్రీకొడుకులు ఒకరి వెనుక ఒకరు నడవసాగారు.

"యాడికి ఆచారి. అబ్బా కొడుకు పోతాండారే"

"నీకు ఎన్నిసార్లు రమణా చెప్పేది. పనికి పొయ్యేటప్పుడు 'యాడికి' అని అడగద్దని" అన్నాడు ఆచారి కాస్త కోపంగా.

"అంత కోపమయితే ఎట్ల ఆచారి?" అంటూ వెళ్ళిపోయాడతను.

"ఎన్ని రోజులుంటాది నాయనా పని" అడిగాడు సురేంద్ర.

"నెలరోజుల పైన్నే ఉంటాది. ఇంతకు ముందొకసారి... అప్పుడు మీరు చిన్నబిడ్డలు. మీ అమ్మా నేనూ వారంరోజుల పని అని పొయ్యినాము. ఆడే రెండు నెలలు పని దొరికింది. ఒకర్ని చూసి ఒకరు పని చేయించుకుంటారు" అన్నాడు హుషారుగా ఆచారి. ఇంకా ఏదో మాట్లాడాలని అనుకున్నాడు. కొడుకు కూడా తండ్రిని ఏదో అడగాలనుకున్నాడు. బుర్రుమనే శబ్దం రావడంతో ఇద్దరూ తలలు తిప్పి చూశారు. ట్రాక్టరు జోరుగా పోతోంది. ట్రాక్టరును చూడగానే ఇద్దరూ స్తబ్ధుగా అయిపోయినారు.

ముందురోజు రాత్రి రెండు పదున్ల వాన అరగంటలోనే కురిసింది. ఆ వానకు రైతులందరూ దుక్కిలు చేయడం మొదలుపెట్టినారు. ఐదు సంవత్సరాలకు ముందయితే ఆచారి మాత్రం వానకు చాలా సంతోషించేవాడు. ఇప్పుడు తనకా వానతో ఎలాంటి సంబంధం లేనట్లుగా నిర్లిప్తంగా ఉన్నాడు.

"ట్రాక్టరొచ్చి మన కడుపులు కొట్టినె" అన్నాడు ఆచారి.

సురేంద్ర ఏం మాట్లాడకుండా మౌనంగా నడవసాగాడు. ఆ ట్రాక్టరు కంభిరెడ్డిది. తమ ఊరంతటికీ కలిపి అదొక్కటే. ఇట్లాంటి సమయాల్లో పెదినేకాలవపల్లె రమణ, ఎజ్జేనపల్లె సిద్ధారెడ్డిలు కూడా ట్రాక్టర్లు తీసుకొచ్చి దున్నుతాంటారు. ఆ మూడు ట్రాక్టర్లూ పల్లెకు మూడు పక్కలా దున్నుతున్నాయి. రైతులంతా బెల్లం చుట్టూ మూగిన ఈగల మాదిర్తో ఉండారు. రాత్రీ పగలూ తేడా లేకుండా వాటి వెంట తిరిగి తమ తమ పొలాలు దున్నించుకొంటా ఉండారు. ట్రాక్టర్‌ను

చూస్తుంటే ఈమధ్య ఆచారికి విపరీతమయిన కోపం వస్తాంది. దాని మూలంగా తమకూ, రైతులకూ ఉండే ఒక ఒక సంబంధం 'మడకలు' చెక్కడం పూర్తిగా లేకుండాపోయింది. తమకు బతుకు తెరువూ లేకుండాపోయింది.

పది సంవత్సరాల ముందు, తొలి ముంగార్లనాటి ఒకరోజు గుర్తొచ్చింది ఆచారికి.

చింతచెట్టు కింద రైతులు చాలామంది గుమిగూడినారు. చింతచెట్టు మొదులుకు దాదాపు ఇరవైకి మడకతుండ్లు ఆనుకొని ఉండాయి. చింతచెట్టు వేరొకటి వర్షాలకు మట్టి కొట్టుకొని పోవడంతో జానడెత్తు భూమి పైకి ఉంది. దానికి మడకకొయ్యను ఆనించి పెద్ద బాడిశతో చెక్కుతున్నాడు ఆచారి. ఆచారి భార్య దానిని కదలకుండా పట్టుకోనుంది. ఆకాశం మేఘావృతమై ఉంది. చల్లటి గాలులు వీస్తున్నాయి. అంత చల్లగాలిలో కూడా ఆచారి శరీరం నిండా చెమటలు.

చెక్కడం ఆపి, "నీళ్ళు తేపో... దప్పికగా ఉండాది" అన్నాడు భార్యతో. ఆమె లేచి ఇంటికి వెళ్ళింది.

"నేను పట్టుకొంటాను. చెక్కున్నా" అంటూ వచ్చాడు క్రిష్ణారెడ్డి.

"నేనూ మనిషినేప్పా. ఇంగా మద్దేన్నంగాలా. అప్పుడే ఐదు మడకలు చెక్కేసినా. ప్రాణాలన్నీ ఉగ్గబట్టి చెక్కతాండా బిన్నే అయిపోవాలని. కొంచేపుండు. నీళ్ళు తాగనీ, మీరందరూ ముందుగా చెక్కించుకుంటే నేమి? వానలు పన్నెప్పుడు వచ్చేది. గొంతు మింద కుచ్చొనేది" అన్నాడు ఆచారి.

"మాదయిందా ఆచారి" అంటూ వచ్చాడు కొండ్రెడ్డి.

"ఇంకా కాలా మామా. ఇది చెక్కేసినానంటే, అన్నం తినేసి కుచ్చొంటా. ముందుగా మీ మడక్కే మేడి. నగ ఏసిస్తాలే. 'కారు' అంపతానంటివి. అంపలేదే"

"మా కొడుక్కు చెప్పేసి వచ్చినా... ఎత్తుకోనొస్తాడు.

"అక్కొచ్చింది. నీళ్ళు తాగున్నా చెక్కుదువు" అన్నాడు క్రిష్ణారెడ్డి.

"పనులప్పుడు అరువులు పెట్టుకొన్నేవా ఆచారి" అన్నాడు నారాయణ.

"నాకంత తీరిగ్గూడానా" అంటూ భార్య చేతిలోని చెంబు తీసుకొని నీళ్ళు గటగటా తాగేసినాడు. తిరిగి పెద్ద బాడిశను చేతికి తీసుకొన్నాడు. క్రిష్ణారెడ్డి మడకను పట్టుకొన్నాడు. ఆచారి భార్య చెక్కిన పేళ్ళన్నీ తీసి గంపలో వేయసాగింది.

"అక్కో... పేళ్ళు మాయ్యి గదా" అన్నాడు క్రిష్ణారెడ్డి.

"ఒకసారి, ఇప్పుడు మాటగాదులే. మా పెద్దయ్య తాత బతికున్నెప్పటి మాట. శెట్టి ఒగ మడకతుండు తీసకచ్చినాడంట. దాంతోపాటు గంప కూడా తెచ్చుకొన్నేడంట. ఎందుకు శెట్టీ గంప, అంటే పేళ్ళకు అన్నేడంట. సరే పట్టుకో అని మా తాత బాడిశ తీసుకొని చెక్కడం మొదలు పెట్టినాడంట. అట్ల తిప్పు, ఇట్ల తిప్పు అంటా మొత్తం పేళ్ళుగా చెక్కేసినాడంట. ఇదేంది ఆచారి మడక చెక్కమంటే మొత్తం పేళ్ళు చెక్కసినావే అని శెట్టంటే, నువ్వేగదా పేళ్ళు కావాలన్నేవు అన్నాడంట మా తాత" అన్నాడు ఆచారి చేస్తున్న పనిని ఆపకుండానే.

ఆ మాటలకు అక్కడున్న రైతులంతా పకపకా నవ్వినారు.



"నువ్వీకత చెప్పావనే, నేనా మాటనింది. మాకేం పేళ్ళు వద్దులే. మడక బాగుంటే చాలు" అన్నాడు క్రిష్ణారెడ్డి కూడా నవ్వుతూ.

చుట్టుపక్కల నాలుగైదూర్లలో మరో ఆచారి లేడు. దానివలన తొలిముంగార్ల వానలప్పుడు ఆచారి అవసరం చాలా ఎక్కువ రైతులకు. మడకకు పదిశేర్ల వడ్లు, డబ్బా శనగకాయలు ఇచ్చే వాళ్ళు. వారం రెండు వారాలు కష్టపడితే దాదాపు ఆరునెలల తిండిగింజలు ఇంట్లోకి వస్తా ఉండేటియి. మిగిలిన రోజుల్లో ఆలూమగలు చెక్కలు తీర్లు కొయ్యడానికి పొయ్యేవాళ్ళు.

"ఏంబా ఆచారి... యాన్నో పని దొరికినట్టుందే" అంటున్న రామచంద్ర మాటలతో ఆచారి ఆలోచన్ల నుంచి తేరుకున్నాడు.

"చింతమాకల పల్లెలో దాలమంద్రం తీర్లు, పలకలు కొయ్యాలన్నా. నాకు వాళ్ళు చెప్పి సమచ్చరం పైనయింది. కోపించేసినారేమో అనుకోనుంటి. నిన్న కమ్మారపల్లెలో రోడ్డుమింద నిల్చుకోనుంటే, ఆసామి బస్సులో పోతాండి 'ఆచారీ... ఇంటికాడికొచ్చి అయ్యి కోసెయ్యగూడదా' అని అరిసి చెప్పె. అందుకే ఈ పొద్దు ఎలబారినాం" అన్నాడు ఆచారి.

"అయినా ఇప్పుడు ఎవరు కోపిస్తాండారు మీ దగ్గర. ట్రాక్టర్లొచ్చి, పీలేరు కలకడలో కోతమిషన్లు పడేలకు అందరూ ఆడికే పోతాండారే."

"అవున్నా. ఎక్కువగా ఉండేవోళ్ళు ఏసుకోని పోతాండారు. ఈ వానలు సరిగా పడేదిలేదు. రైతులకు పంటల్లేవు కదా. రైతుల చేతల్లో దుడ్డాడతాంటే మా దగ్గిర పని చేపిస్తారు. ఎవురేగాని పలానా పని చెయ్యి ఆచారి అని పిల్చి చెప్పేవోళ్లే లేరున్నా."

"నిజమే. వానలు పన్నే పడకపోయినా, పనులున్నే లేకపోయినా నీ బతుకంటే ఏందో అయిపోతాందనుకో. నీ కొడుకు బతుకు ఎట్లా? బాగా చదువుకోనున్నింటే ఉద్యోగమన్నా వచ్చిన్నేమో. అయినా ఈ కాలం ఎంత చదివినా యాడ ఉద్యోగాలొస్తాండాయి. చేతి పనులే మేలు. సేద్యం, చదువు కన్న! నువ్వు ఈ పల్లెను పట్టుకొని ఎందుకు ఏలాడతావు. ఏదన్నా టౌను చేర గూడదా" అన్నాడు రామచంద్ర.

ఆచారి మౌనంగా తలూపాడు.

"నాయనా తీరిగ్గా సందేళ మాట్లాడుకోవచ్చు. పోదాంరా. పొద్దు పోతాండ్లా" అన్నాడు సురేంద్ర.

"పొండి పొండి... నాగ్గూడా పనుండాది" అంటూ వెళ్ళిపోయాడతను.

ఇద్దరూ నడవసాగారు. ఆచారి మొదలుపెట్టాడు.

"పదైదేండ్ల ముందుమాట. అప్పుడు నువ్వూ, మీ అక్కా చదువుకుంటాంటిరి. మనకు దగ్గిర్లో బడి యాడుండాది? కమ్మారపల్లెలో ఏడుదాంకానే గదా ఉండాది. ఏడు పైన చదవాలంటే నారమాకలపల్లో, చీనేపల్లో పోవాల. అందూరం బిడ్డలను యాడలే పంపేదని, పీలేరుకు చేరుకోవాలనుకొంటిమి. ఆడయితే ఏదన్నా పని చేసుకొని బతకతా, మీ ఇద్దర్నీ చదివిపీయాలనుకొంటిమి. ఊరొదిలి పోతామంటే ఊర్లో రైతులంతా అరకీస్ పోనే గూడదనిరి. 'మాకు నువ్వు తప్ప ఇంగెవరుండారు? నీకూ, నీ బిడ్డలకు ఏ లోటూ రాకుండా చూసుకొంటాం గదా' అని చానా బంగపోయిరి.

ఇప్పుడు మాట్లాడినాడే, ఈయనే అప్పుడు పొయ్యేదానికి ఒప్పుకోంది. దుడ్డు గావాలంటే ఇస్తాం, నీ బిడ్డలు చదివేటిగా ఉంటే ఆస్టల్లో చేరిపిస్తా, ఎకరా రెండెకరాల చేను, పదిరవై కుంటల మడి చెప్తా చేసుకో. ఈ ఊరు మాత్రం వదిలిపోవద్దు అన్నోడు ఇప్పుడు ఏదన్నా టౌనుకన్నా పొగూడదా అంటాండు" అన్నాడు ఆచారి బాధగా.

సురేంద్ర తండ్రి మాటలకు ఊకొట్టలేదు. ఔననలేదు. కాదనలేదు. ముభావంగా నడుస్తున్నాడు. ఆచారిలో మాత్రం మాటలు ప్రవాహంలా రాసాగాయి.

"అప్పడే పొయ్యిన్నే బాగుండు. గుర్రం సాయిబోళ్ళు పీలేరుకు పొయ్యి టీ అంగడి పెట్టుకొని బాగా సంపాదించినారు. అప్పడే గన పొయ్యుంటే మీ అమ్మ ఇంటికాడ ఇడ్లీలు, దోసెలు అమ్మినా, నేను యాడన్నా కొయ్యల మిషన్లో పనికిపోయిందు. మీరు పుట్టకముందు మదనపల్లెలో కొన్నాళ్ళు కోతమిషన్లో డ్రైవరుగా పనిచేసినా. ఈపాటికి మనం గూడా టౌనులో సొంత ఇల్లు కట్టుకోన్నిందుము. ఇప్పుడు ఈ ముసలి మోపన ఆడికిపోయి ఏం పనిచేసి బతకతాము" అన్నాడు ఆచారి దిగులుగా.

తండ్రి ఎంతగా మాట్లాడుతున్నా సురేంద్ర ఉలుకూ పలుకూ లేకుండా నడుస్తున్నాడు.

కొడుకు మౌనం ఆచారి మాటలకు అంతరాయం కలిగించింది. అంతవరకు తన గురించి ఆలోచిస్తున్నాడే గాని కొడుకు గరించి ఆలోచించలేదు. కొడుకంత మౌనంగా ఎందుకున్నాడో ఆచారికి స్పష్టంగానే అర్థమయింది. ఆచారికి ఒక కొడుకు, కూతురు. కొడుకు కన్నా కూతురు చాలా పెద్దది. ఆమెకెప్పుడో పెళ్ళయిపోయింది. ఆచారి తన ఆశలన్నీ కొడుకు మీదే పెంచుకున్నాడు. చదువు రానందుకే తను ఇన్ని ఇబ్బందులు పడుతున్నాడని, అలాంటి ఇబ్బందులు పడకుండా ఉండడం కోసం కొడుకును బాగా చదివించాలనుకున్నాడు. తిండికే కనాకష్టంగా ఉంటే కొడుకును ఎలా చదివించగలడు? సురేంద్రను ట్యూషన్లు పంపనందుకో, తను చేరిన కాలేజీలో లెక్చరర్లు లేనందుకో, లేక తమకు అదృష్టం లేనందుకో తెలీదు గాని సురేంద్ర ఇంటరు ఫెయిలయినాడు.

ఆరోజు రిజల్టు పేపరులో తన నెంబరు లేకపోవడంతో సురేంద్ర ఇంట్లో మూలన కూర్చొని భోరున ఏడవసాగినాడు. ఆచారి కొడుకును సమీపించి –

"ఎందుకురా ఏడుస్తావు. ఫెయిలయితే మళ్ళీ బతుకే లేదా? మన రెక్కలుండాయి, మన పనుండాది. మీ తాతల కాలం నుంచి బతకడంలే మేము. నువ్వూ అంతే. రేపట్నుంచి పనికి పోదాం పద. చదివినా ఉద్యోగాలు రావు. ఉద్యోగం వచ్చినా ఒగనికి వంగి సలాం చెయ్యాల్సిందే గదా! అదే మన చేతిపని అయితే పెద్ద పెద్ద ఆఫీసర్లంతా మన దగ్గరికి వస్తారు. రెక్కల్లో సత్తువ ఉన్నెంతకాలం తిండికి గుడ్డకు లోటుండదులే" అన్నాడు.

అది మొదలు సురేంద్ర తండ్రి వెంట పనికి పోసాగినాడు. సురేంద్ర తమ కులవృత్తిలో అడుగుపెట్టిన వేళావిశేషమో ఏమో మరి అతని వెనకే ట్రాక్టరు ఊరులోకి వచ్చింది. రైతున్నూ, ఆచారినీ విడదీసింది. సురేంద్రకు చాలావరకు బతుకుతెరువు లేకుండా చేసింది. అదంతా ఆచారికి గుర్తు రావడంతో కొడుకు కన్నా ఎక్కువగా బాధపడ్డాడతను. తను కూడా కొంతసేపు కొడుకు



వెంట మౌనంగా నడిచాడు. కష్టాలతో పండిపోయిన అతని మనసు ప్రస్తుతం ఎంతటి కష్టమయినా అలవోకగా తీసుకోవడానికి అలవాటు పడింది. అందువలన కొంతసేపటికే తేరుకొని

"రోజులు ఎప్పుడూ ఇట్లే ఉండవులే. మన ముత్తాతల కాలంలో రంపాలు లేవంట. బాడిశలతో చెక్కి దాలమంద్రాలు తయారుచేస్తాన్నేరంట. రంపాలొచ్చాలకు చెక్కేవోళ్ళకు బతుకు తెరువు లేకుండా పాయనా? లేదే! నారు పోసినోడు నీరు పోస్తాడు. మనం దిగులు పడాల్సిన పనిలేదు. ఏదో ఒగ పని ఆ భగమంతుడు చూపిస్తాడు. అంతాదాకా ఎసనపడకుండా ధైర్నంగా ఉండాల" అన్నాడు ఆచారి కొడుక్కు గీతోపదేశం చేస్తున్నట్లుగా.

ఆ మాటలకు కూడా సురేంద్ర పెదవి విప్పలేదు.

"ఇంతకు ముందంతా మేమే 'తోపుడు' తోస్తాంటిమి. ఇప్పుడు మిషన్లొచ్చాలకు ఒగ వారం పట్టేపని ఒగరోజులో అయిపోతాండాది. అంతమాత్రాన ఏ ఆచారిగానీ పనిలేదని ఈదిన పడలేదే. ఎవరి బతుకు వాళ్ళు బతుక్కోంటాండారు. కాకపోతే కష్టాలు కొన్నాళ్ళుంటాయి. బయపడకుండా ధైర్నంగా ఉన్నేమంటే బతకతాము. లేకుంటేనా... ఈ భూమ్మీద ఒగ నెల కూడా ఉన్నిండము" అన్నాడు ఆచారి కొడుక్కు ధైర్యం చెబుతున్నట్లుగా.

ఆచారి మాట్లాడుతూనే ఉన్నాడుగానీ సురేంద్ర తనకు సంబంధం లేదన్నట్లుగా మౌనంగా నడవసాగాడు. "ఆ బేగు ఇట్లీ" అన్నాడు ఆచారి.

"తెస్తాలే" అన్నాడు సురేంద్ర చాలాసేపటి తర్వాత.

"దాంట్లో అన్నంమూట ఉండ్లా. పోనుపోను బరువెక్కుతాది. నేను తెస్తానీ" అంటూ కొడుకు చేతిలోంచి బలవంతంగా తీసుకొన్నాడు.

"పని బాయికాడనా, ఇంటికాన్నా నాయనా"

"బాయికాడే. ఇంతకుముందు మీ అమ్మా నేనూ తీర్లు కోసినప్పుడు కానిగమాని కింద గుంత తొగించినారు. ఇప్పుడా గుంత అట్లే ఉంటాది. కొంచెం పూడింటాదేమో. గుంత లేకపోతే మేము కొయ్యమంటాలే. వాళ్ళే మన్ను తీస్తారు. చానా తుండ్లుండాయి. అయ్యన్నీ కొయ్యాల గదా" అన్నాడు ఆచారి ఉత్సాహంగా.

"నీడుందా?"

"పెద్ద తోపుండాది. బాయికి అనుకొనే ఒక పెద్ద ఏపమానుండాది. ఆ మాను కింద గుంత, చల్లగా ఉంటాదాడ."

ఇద్దరూ మాటల్లో మునిగిపోయి చకచకా నడవసాగినారు.

"ఆ... వచ్చేసినాం. అదో ఏపమాన్ల గుంపుండాదే అదే మనం పని చేయాల్సిన తావు" అన్నాడు ఆచారి.

ఇద్దరి నడకలో వేగం పెరిగింది. కొంతసేపట్లో అక్కడికి చేరగానే ఆచారి ఆశ్చర్యంగా అటూఇటూ చూడసాగినాడు. సురేంద్రకు అనుమానం వచ్చింది.

"వాళ్ళ బాయి ఈన్నేనా నాయనా' అడిగాడు తండ్రిని.

"ఈన్నే... ఆ ఏపమాన్లకు అనుకొనే కొంచెం ఎడంగా పెద్ద ఏపమాను ఉన్నింది. దాని పక్కన్నే బాయి. నాకు బాగా గుర్తే" అన్నాడు ఆచారి మెల్లగా.

"ఉంటే ఏమీ" అన్నట్లుగా చూశాడు సురేంద్ర.

రంపం, బాడిశ, చేతిసంచిని తీసి ఒక చెట్టునీడన పెట్టారు.

"ఏం ఆచారన్నా... చానా రోజులకు కన్పిస్తాండావే."

"రెడ్డెప్పా... మీ పనికనే వచ్చినాం అన్నలేదా?" అన్నాడు ఆచారి.

"నిన్న ఊరికి పోతాన్నిట్లు ఉండె. వచ్చినాడో లేదో తెల్లేదే."

"మీరంతా ఉండేది ఒకే తావన్నే గదా" మెల్లగా అడిగాడు ఆచారి.

"ఒగతావన యాడుండాము. పాతింట్లో మా అన్నుండాడు. పాతిల్లు ఊరికపక్క గదా ఉండాది. ఊరికి ఈ పక్కన ఇంగో ఇల్లు కట్టుకొని అడ చేరిపోయినాం. మేము ఏరుబాగాలు పోయి చానా ఏండ్లాయనే."

"అవునా... నాకు తెలీదులే. ఈడొగ ఏపమాను, బాయి ఉండాల గదా"

"ఇంగా యాడ ఏపమాను, బాయి. అయ్యి రెండూ నా భాగానికి వచ్చె. ఇల్లు కడతాం టిమి. దాలమండ్రం తీర్లు, తలుపు చెక్కలు అవసరం గదా. మాను కోపించేస్తి. బాయి ఎప్పుడో ఎండిపొయ్యింది. బోరుగూడా ఆ పక్కన ఏసిండాము. అదో... చూడు... అడ మిరపతోట ఉండాదే అదే బాయి. బాయిని పూడ్చేసినాం" అన్నాడతను సిగరెట్ ముట్టిస్తూ.

తను ఇంతకుముందు పని చేసినప్పుడు ఉమ్మడి కుటుంబం రెడ్డెప్ప వాళ్ళది. అప్పుడితను సిగరెట్ తాగేవాడు కాదు. మనుషులు ఎంతగా మారిపోతాండారు అనుకొన్నాడు ఆచారి. "మాకు చెప్పలేదే ఏపమాను కోసేదానికి. తీర్లు పలకలు ఎవరు కోసిచ్చిరి?" అడిగాడు ఆచారి.

'ఎంత అమాయకమయిన ప్రశ్న వేసినావు ఆచారి' అన్నట్లుగా చూసి "ఊర్లో ట్రాక్టరుం డాది. కలకడలో కోతమిషనుండాది. ఇంగ దిగులెందుకు?"

ఆ మాటలు వింటూనే తండ్రీకొడుకుల మనసు విలవిలలాడింది.

"పోతే పోనీలే. నువ్వు పని చెప్పకుంటే పొయ్యినావు. మీ అన్న మాత్రం అన్నీ అట్లే పెట్టినాడంట గదా! నిన్న బస్సులోంచి అరిసి చెప్పి. అందుకే ఈ పొద్దు వచ్చినాం."

"మా అన్నయి మాత్రం యాడుండాయి. యిద్దరం ఒగసారే గదా ట్రాక్టర్లో ఏసుకొని పోయింది." అన్నాడతను.

"ఏసుకొని పొయ్యినారా!? అయితే మమ్మల్నెందుకు రమ్మనింది?" అన్నాడు కోపంగాను, ఆశ్చర్యంగాను ఆచారి.

అంతవరకు నిల్చుకొని వాళ్ళ మాటలు వింటున్న సురేంద్ర, చివరి మాటలతో అతని మనసు వికలం కావడంతో సామన్ల పక్కన మౌనంగా కూర్చొన్నాడు.

"ఇంగా ఏమన్నా ఉండాయేమో ఇంటికాడికి పోండి. నేను మడికి నీళ్ళు పట్టాల. మళ్ళా కరెంటు పోతాది" అంటూ వెళ్ళిపోయాడతను.

"లెయ్ నాయనా పోదాము" అన్నాడు ఆచారి కొడుకుతో.

"యాడికి?"

"ఇప్పుడు మాట్లాడినాడే, వాళ్ళన్న పెద్దరెడ్డెప్ప ఇంటికి"



"ఎందుకు...? తుండ్లు లేవంట గదా. గమ్మున ఇంటికిపోదాం పదా"

"తుండ్లు లేందే ఊరికే చెప్పే మనిషి గాదాయన. ఇంటికాడ తప్పకుండా ఉంటాయి. పోదాం పదా" అంటూ రంపం ఎత్తి భుజంమీద పెట్టుకొని, చేతి సంచిని తీసుకొన్నేడు. ఇక తప్ప దన్నట్లుగా సురేంద్ర కూడా బాడిశ ఎత్తుకొని తండ్రి వెంట బయల్దేరినాడు. పది నిముషాలకంతా వాళ్ళ ఇల్లు చేరుకొన్నారు. పెద్ద రెడ్డెప్ప ఇంటి దగ్గరే ఉన్నాడు.

"వచ్చినావా ఆచారి. వస్తావో రావో అనుకొంటాంటి. ఇంటెనక్కుపాండి. అడుండాయి తుండ్లు" అన్నాడతను.

అందరూ అక్కడికి వెళ్ళారు. తొడలావుతో ఆరడుగుల పొడవుతో ఉండే నాలుగు తుమ్మ తుండ్లు చూపించాడతను.

"మిగిలిన కొయ్యలన్నీ...?" అన్నాడు ఆచారి మెల్లగా.

"అయ్యన్నీ కలకడలో కోపించేస్తి. ఇయ్యి కూడా కోపించేద్దు. తుమ్మయి కదా... పర్మిట్ తీసుకోవాలంట. పర్మిట్ లేకపోతే కేసు. పదిరవైవేలు అపరాధం ఏస్తారు. ఎందుకొచ్చిన బాధలే, నువ్వుండావు కదా. కోపిద్దాం అనుకొంటి" అన్నాడతను నవ్వుతూ.

అతని నవ్వు సురేంద్రకు కంపరంగా ఉంది. ఆచారి కొంతసేపు ఏమీ మాట్లాడలేకపోయి నాడు. తనకెన్నో ఆశాభంగాలు అనుభవంలో ఉన్నా, ఈ ఆశాభంగం మాత్రం అతడ్ని చాలా కదిలించేసింది. అడవిలోకిపోయి చావడమో, టౌనులోకి పోయి మన్ను మోయడమో చేయాల తప్ప ఇంక ఈ పని మాత్రం చేయకూడదనుకొన్నాడు. ఆవేశంలో అలా అన్పించింది కాని, ఆలో చిస్తే ఇన్నేళ్ళు తనకు జీవనాధారం కల్పించిన ఆ వృత్తిని అంత సులభంగా వదులుకోలేననిపించింది. మళ్ళీ తమకు మంచిరోజులు వస్తాయి అనుకొన్నాడు.

"ఏమాచారి గమ్మునయిపోతివే?"

"ఆఁ... ఏంలేదు ఏంలేదు... కోస్తాం" అన్నాడు తడబాటుగా.

"దాలమందం తీర్లకు కోసేయండి. మద్దేనాలకు అయిపోతాదా"

"ఇదేమన్నా సంగటా... బిన్నే అయిపోయేదానికి, సందేళ దాంకా పడతాది"

"ఎందుకబ్బా అంతసేపు... సందేడు లావు కూడా లేవే...?! అబ్బులిచ్చి పట్టుకొనేంత లావు తుండ్లు కూడా మిషనులో అయితే అరగంటలో కోసి పారేస్తారు. అట్లాడిది ఒక తుండు కొయ్యాలన్నా మీకు పదిరవైరోజులు పడతాదేమో... సరేలే... మాటలు పెట్టుకొంటే పనికాదు. నేను పింఛాదాకా పోయొస్తా. ఏమన్నా కావాలంటే ఇంట్లో అడగండి... అన్నం తినేసి వచ్చినారా?"

"తిన్నేము... మద్దేన్నేనికి తెచ్చుకొన్నేం..."

"ఏంబా ఆచారి... మా ఇండ్లల్లో తింటే గొంతు పట్టుకొంటాదా. రెండు మైళ్ళ దూరం అన్నం మూటను మోసుకోని రాకుంటేనేమి!" అన్నాడు పెద్ద రెడ్డెప్ప నవ్వుతూ.

"మా తాతల కాలం నుంచి వస్తాందే అలవాటు. పస్తయినా ఉంటాంగాని పరాయి కులమోల్ల ఇండ్లల్లో నీళ్ళు గూడా తాగము. నేను బతికుండంగా అంతే ఇంగ."

"ఏమోబ్బా మీ ఇష్టం... తినేటిగా ఉంటే లక్షణంగాచేసి పెట్టమంటా. తినరులే. ఇంతకు ముందు తినలేదుగదా. సందేళ బత్తెం తీసుకొని పొదురులే. మీ కొడుకేమి గమ్మున కుచ్చోనుండాడే. వంట్లో బాగలేదా? ఏం పేరు నీ పేరు?" అన్నాడు సురేంద్ర నుద్దేశించి.

"సురేంద్ర" అన్నాడు ముక్తసరిగా.

"సరే సరే. ఆచారి మీరు పనిచేయండి. నాకు బస్సు తప్పోతాది. పోయొస్తా" అంటూ పెద్ద రెడ్డెప్ప అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

"లెయ్ సురేంద్రా. సందేళకు కోసేసి పోదాం. మళ్ళా రేపు యాడ వచ్చేది."

"ఈ పని చెయ్యకుంటేనేమి?"

"అట్లనుకొంటె ఎట్లా... ఒగోసారి పెద్ద పననుకొనిపోతే చిన్న పనుంటాది. ఇంగోసారి చిన్న పననుకొని పోతే పెద్ద పనుంటాది. అదంతా మన టైము. లేసి ఇంట్లో అడిగి దబర, గ్లాసు, ప్లేటు తీసుకొని బోరింగుకాడికి పొయ్యి, బాగా కడుక్కొని నీళ్ళు పట్టుకొని రాపో" అన్నాడు కొడుకుతో ఆచారి.

సురేంద్ర అయిష్టంగానే అక్కడి నుంచి లేచి వెళ్ళాడు. అతను వచ్చే లోపల ఆచారి, మోకుతాడు తీసుకొని గొడ్లకొట్టంలో రెండు కూసాలకు, రెండు మోరలెత్తులో అడ్డంగా ఒక కొయ్యను కట్టాడు. బొగ్గులు కొన్ని తీసుకొనొచ్చినాడు. పాతకుండది అడుగుపెంకులో నీళ్ళు కొన్ని పోసి బొగ్గులను సాదినాడు. మరికొంతసేపటికి సురేంద్ర వచ్చినాడు.

"యాడికిపోతే అన్నేనా? బాడిశ ఎత్తుకో... తుండ్లు చెక్కు. దారం తడదాము" అన్నాడు ఆచారి కొడుకుతో.

"నీరసంగా ఉండాది నాయనా. బోరింగు కొట్టేదానికి నానింటికాలా. నువ్వే చెక్కు" అన్నాడు కుచ్చొంటు.

కొడుకు పనిలోకి వచ్చిన సంవత్సరం తరువాత నుంచి ఆచారి పెద్ద బాడిశ పట్టడం మానేసినాడు. సురేంద్ర పెద్ద బాడిశ పనిలో మంచి పనోడు. చెక్కినాడంటే తోపడ తోసినంత శుద్ధంగా ఉంటాది. ఐదడుగుల పొడవు కట్టి బాడిశను పైకి లేపి ఇడిసినాడంటే ఎక్కడ పడాల్నో అక్కడే పడుతుంది. ఆచారి తాత బాడిశ పనిలో పెద్ద పనిమంతుడు. అతడు ఆ రోజుల్లో 'అణా' ను ఒక పక్క ఎడంకాలి బొటనవేలితో తొక్కొని రెండు భాగాలయ్యేటిగా చెక్కేవాడట. ఆ మాదిర్తో చెక్కేవాళ్ళు ఎక్కడా లేరని అందరూ చెప్పకొంటా ఉంటారు. తన కొడుకు కూడా ఐదుపైసలను బొటనవేలితో తొక్కిపట్టుకొని, బాడిశను అలాగ్గా పైకెత్తి వేసేవాడు. సురేంద్ర బాడిశతో చెక్కుతా ఉంటే ఆచారి తదేకంగా చూసేవాడు. ఆచారి రోజుకు ఐదు లేక ఆరు మడకలేస్తాడంతే. అదే సురేంద్ర రోజుకు పది మడకలు ఏస్తాడు. తనకు గొప్ప పనిమంతుడయిన కొడుకు పుట్టినాడని సురేంద్రను చూస్తే ఆచారికి చాలా సంతోషం. ప్రస్తుతం అక్కడ పనిచెయ్యడం సురేంద్రకు ఇష్టం లేదు. అందుకే కళ్ళు తిరగతాండాయి అంటాండాడు అనుకొని తనే బాడిశ చేతికి తీసుకొన్నాడు.

ఎడమచేతిని కట్టి చివర పట్టుకొని, కుడిచేతిని మధ్యలో పట్టుకొని బాడిశను పైకి లేపి వేసినాడు. ఆచారికి బలం చాలడంలేదు. వృద్ధాప్యం, సరైన తిండి లేకపోవడంతో చేతులు



వణకసాగాయి. కొంతసేపు తండ్రి అవస్థను చూస్తూ కూర్చొన్నాడు. ఎక్కడ కాలుమింద వేసు కొంటాడోనని తండ్రిని కుచ్చోమని తను చెక్కడం ప్రారంభించాడు. చెక్కడం పూర్తవుతూనే దారాన్ని పెంకులోని బొగ్గునీళ్ళలో తడిపి కొయ్యలపైన గీతలు వేసినారు.

"ఈడ కోసేది వద్దు నాయనా. కంపుగదా. ఇంటెనకాల చింత చెట్టుండాది గదా. ఆడ రెండు గుంజలు నాటి కోద్దాం" అంటూ తండ్రి సమాధానం కోసం ఎదురు చూడకుండా చకచకా వెళ్ళి గడ్డపార తీసుకొని రెండు గుంతలు తవ్వి గుంజలు నాటినాడు. అడ్డంగా మరో కొయ్య కట్టినాడు. ఆ కొయ్యకు కొయ్యాల్సిన తుండును ఆనించినాడు.

"ఆకలిగా ఉండాది. తినేసి కోద్దాం" అన్నాడు ఆచారి.

ఇంట్లో అడిగి రెండు విస్తరాకులు తెచ్చినాడు సురేంద్ర. ఆచారి టవలు తీసి కింద పరిచి నాడు. అన్నం మూటను ఎడంచేత్తో పట్టుకొని, కుడిచేత్తో నీళ్ళు తీసుకొని అన్నం ఉన్నంతమేరా గుడ్డను తడిపినాడు. తరువాత దాన్ని టవలు మీద ఉంచి ముడి విప్పినాడు. తడి చేయడం వలన గుడ్డకు అంటుకోనుండే అన్నం అంతా కూడా ఊడివచ్చింది. ఇద్దరూ అన్నం తినడం పూర్తవుతూనే సురేంద్ర అన్నంగుడ్డను నీళ్ళలో పులిమి, పిండి, పక్కనే ఉండే కంచెపైన ఆరేసినాడు. ఆలస్యం చేస్తే పనయిపోదని వెంటనే పనిలోకి దిగేసినారు. తండ్రి ఒకవైపు, కొడుకు మరొకవైపు ఉండి రంపంతో కొయ్యలను కోయసాగినారు. సాయంకాలం ఆరుగంటలకంతా పనయిపోయింది. అప్పటికి పెద్ద రెడ్డెప్ప కూడా పింఛాకు పొయ్యి వచ్చేసినాడు.

"ఎంతయిందో చెప్పు ఆచారి" అన్నాడతను.

"ఒగోటి ఆరడుగులుండాది. నాలుగు తీర్లు. అంటే ఇరవై నాలుగడుగులు. అడుక్కు నాలుగు రూపాయిలీ" అన్నాడు.

"అడుక్కు నాలుగా. ఎందుకంత. రెండు రూపాయలిస్తా తీసుకో."

"రెండు రూపాయలా... పదేండ్లకు ముందుమాట గదప్పా అది."

"అందుకనే రెండు రూపాయలిస్తాండా. మిషన్లో ఎంతనో తెలుసా. అడుక్కు అర్ధరూపాయి. మీవాడికి ఒకటిన్నర రూపాయి ఎక్కువే ఇస్తాండా కదా."

"ఇద్దరం మనుషులం వచ్చినాం. సందేళదాంకా పనిచేసినాం. కూలికి పొయ్యినా రోజుకు ఇద్దరికి ఎనభై రూపాయలొస్తాది. నువ్వేంది. ఇంత అధ్వాన్నంగా చెప్తావే. దానికన్నా దుడ్డే వద్దులే" అన్నాడు ఆచారి నిష్ఠూరంగా.

"అంత కోపమయితే ఎట్ల ఆచారి. కూలికి పోవాలన్నే పనులేడ ఉండాయి. ఉన్నే మీరు కూలికి పోతారా? కరువు కాలంలో మీకు పని ఇచ్చిందే గొప్ప" అన్నాడు పెద్ద రెడ్డెప్ప.

"ఇట్లా పని చేసేదానికన్నా గమ్మునుండేది మేలుగదా" అన్నాడు ఆచారి. ఎందుకు ఈ పని చేసినామా అనుకొంటున్నాడు. కొడుకు మాటవిని కొయ్యకుండా వెళ్ళిపోయిన్నే బాగుండునే అనుకొంటా ఉండాడు.

"వయసెక్కువయ్యాలకు కోపం కూడా ఎక్కువవుతాండాదే ఆచారి. అంతగా కోపగిచ్చు కుంటే ఎట్ల. మూడు రూపాయల్లెక్కన ఇస్తాలే. తీసుకో. ఇంగేం మాట్లాడద్దు. ఇందా ఈ యాభై పెట్టుకో... మిగతా చిల్లర సంతనాడు కనిపించు ఇస్తా" అన్నాడు పెద్ద రెడ్డెప్ప.

"దీంట్లో మల్లా కొదవా? సంతనాడు నువ్వేడ ఉంటావో? ఇచ్చెయ్యప్పా మొత్తం. మేం పనిచేసి రెండు నెలలయితాండాది. ఇంట్లో చానా కష్టంగా ఉండాది" అన్నాడు ఆచారి యాభై తీసుకొని జేబులో పెట్టుకొంటూ.

"లేదు ఆచారి. పింఛాకు పొయ్యింది దుడ్డు కోసరమే. ఆడ రావాల. ఆ మనిషి రేపారం వాయిదా ఏసె. ఆడ ఇచ్చింటే ఇంగా యాభై కావాలన్నే ఇచ్చిండు. దుడ్డొచ్చినాంక కనపడు. నూర్రూపాయలు ఇస్తా. ఏదన్నా పనిచేసి చెల్లబెడుదువులే" అన్నాడతను.

ఆచారి ఇంకేం మాట్లాడలేకపోయాడు. అతని జేబులో వందరూపాయల కాగితాలు కనపడుతున్నాయి. నిజంగా డబ్బు లేక లేదనే వాళ్ళను ప్రాధేయపడినా, ఎక్కడో ఒకచోట తీసుకొచ్చి అయినా ఇస్తారు. డబ్బు ఉండీ లేదనే వాళ్ళను ఎంతగా అడిగినా వృధానే అని ఆచారికి తెలుసు. కొడుకు కోసరం అటూ ఇటూ చూశాడు.

"సురేంద్రా..." అంటూ పిలిచాడు.

"ఆ..." అంటూ పలికాడు సురేంద్ర.

"మీ కొడుకు నేను వచ్చినప్పటి నుండి అక్కడ ఏందో తారాడతాండాడు" అన్నాడు పెద్ద రెడ్డెప్ప. ఆచారి కొడుకు దగ్గరకు వెళ్ళాడు. పెద్ద రెడ్డెప్ప అతన్ని అనుసరించాడు. సురేంద్ర ముఖం చాలా ఆందోళనగా ఉంది.

"ఏంది తాలాడతాండావే" అడిగాడు ఆచారి.

"అన్నంగుడ్డ నాయనా. ఈన్నే ఆరేసిన్నే... కనపల్లేదు" అన్నాడు సురేంద్ర. అతని మాటల్లో కూడా ఆందోళన ధ్వనిస్తోంది.

ఆచారి కూడా వెతకసాగాడు.

"అన్నంగుడ్డా..." అడిగాడు పెద్ద రెడ్డెప్ప.

"అవున్నా... మద్యాన్నం అన్నం తిని ఈన్నే ఆరేసినాం" అన్నాడు సురేంద్ర.

"అది పాతగుడ్డే కదా! క్యారేజీ కొనుక్కోకూడదా. గుడ్డపోతే పోయిందిలే. మబ్బాయి పోతాండాది. రెండు మైళ్ళ పైన నడద్దా. ఎలబారండి" అన్నాడు పెద్ద రెడ్డెప్ప నవ్వుతూ. పాతగుడ్డ కోసం వెతకడం అతనికి నవ్వులాటగా ఉండాది.

అరగంట ముందు వచ్చిపోయిన చిట్లాగాలిలో గింగిరాలు తిరుగుతూ అన్నంగుడ్డ వెళ్ళి పోవడం వాళ్ళెవరూ చూడలేదు.

ఆ అన్నంగుడ్డే తమ జీవిత సర్వస్వమన్నట్లుగా, అక్కడే ఎక్కడో ఉంటుందని తండ్రీ కొడుకులు, అన్నంగుడ్డ కోసం వెతుకుతూనే ఉన్నారు...!

*ఆదివారం ఆంధ్రజ్యోతి, 27 అక్టోబర్ 2002*



# 8

# రాచపుండు

**వి. ప్రతిమ**





రాజకీయాలను ఇంటి నుండి తరిమేయాలని తనను తాను హరించుకున్న రాజేశ్వరి కథ 'రాచపుండు.' రచయిత్రి వి. ప్రతిమ 27 ఆగష్టు, 1955లో పుట్టారు. మొదటి కథ 'యముడికి హాలీడే' 1989లో **ఆంధ్ర భూమి** లో అచ్చయింది. దాదాపు 50 కథలు రాశారు. ఇటీవల వీరి కథలు వివిధ పోటీల్లో బహుమతులు గెల్చుకున్నాయి.

*చిరునామా : శ్రీ వెంకటేశ్వరా టాకీస్, నాయుడు పేట - 524 126.*

"రాజేశ్వరీ... ...... రా...జేశ్వ...రీ" రెండో పిలుపు విరుపుల్తో కఠినంగా ఉంది. వంటగదిలో సాంబారుకి తాళింపు పెడ్తోన్న రాజేశ్వరి ఆ గర్జనకి గజగజా వణికిపోయింది.

ఒక భూకంపమేదో ఫెళఫెళమంటూ కాళ్ళ కింది నుండి పాక్కుంటూ వెళ్ళింది. ఎన్నో ఏళ్ళ క్రితం మామగారు కట్టించిన ఇంటిగోడలు నెర్రెలు వారినట్టయింది. వంటింట్లోకాక నిప్పుల గుండంలో నిలబడ్డట్టుగా వుంది రాజేశ్వరికి. తాళింపుకని పెట్టిన బాణాలి మాడిపోతోంది. స్టౌ ఆర్పాలన్న ఆలోచన కూడా రాలేదామెకి.

"రాజేశ్వరీ...జేశ్వరీ...ఈశ్వరీ" భర్త పిలుపు వలయాలు వలయాలుగా ఆ హాల్లో రీసౌండ్‌లో విన్పిస్తోంది. పదిహేనేళ్ళ వైవాహిక జీవితంలో భర్త అంత కోపంగా ఉండడం ఎప్పుడూ చూడలేదు రాజేశ్వరి. అంటే చంద్రారెడ్డికి కోపం రాదని కాదు. అతడికి కోపమెక్కువైనపుడు మౌనమనే ఆయుధంతో వేధిస్తాడే తప్ప తీవ్రమైన మాటలతో కాదు. ఇంటా బయటా ఎవరిమీద కోపమొచ్చినా అతడంతే... అటువంటిది?

అయితే ఇటువంటి ఒక పరిస్థితి గురించి గత మూడురోజులుగా సిద్ధపడే ఉందామె. భర్త హైదరాబాదు నుండి ఈ ఉదయం దిగినప్పటి నుండీ మరీ ఎక్కువగా...

"విజయుడు నామినేషనేశాడా?" గర్జించాడు చంద్రారెడ్డి.

నేలకంటుకుపోయిన పాదాల్ని పెకలించి హాల్లో కెళ్దామని రాజేశ్వరి అనుకుంటుండగానే పెద్దపెద్ద అంగలతో వంటగది గుమ్మం వద్ద కొచ్చేశాడతను. భార్య మౌనం మరింత రెచ్చగొట్టినట్లుగా కళ్ళు పెద్దవిచేసి కోపంగా అదే మాటల్ని పునశ్చరణ చేశాడు రెడ్డి. అతడి దవడ నరాలు ఉబ్బి ఉన్నాయి. గొంతులో అంతులేని కాఠిన్యం విన్పించింది...

తెలీదంటే అతడు నమ్మడు. తెలుసునంటే అన్నీ నీకు తెలిసే జరగతుండాయన్నమాట అంటాడు... గమ్మునుంటే ఊరా పేరా? పంచాయితీ ఎలక్షన్లొచ్చాయి. రాకపోతే పార్టీలకీ, వాటిని నమ్ముకున్న నాయకులకీ జరుగుబాటయ్యేదెట్లా? ఖర్మ... ఈ ఎలక్షన్లు తన చావుకొచ్చినట్టుండాయి అనుకుంది రాజేశ్వరి.

అయితే రాజేశ్వరి అదృష్టమో, దురదృష్టమో తెలీదుకాని, ఆమె సమాధానం కోసం ఎదురు చూడకుండా వచ్చినంత పెద్ద అంగలతోనూ హాల్లోకి వెళ్ళాడతడు... ఎదురుచూసిన ఉత్పాతమేదో ఎవరో అరచేయి పెట్టి ఆపినట్లుగా పెద్దగా ఊపిరి తీసుకుంది రాజేశ్వరి. అయితే అతడలా మౌనంగా తిరిగి వెళుతూంటే ఆమె గుండెలు దిగులుతోనూ, బాధతోనూ వేగంగా కొట్టుకున్నాయి. మాడిపోయిన బాణలి నుండి కమురువాసన ఆమె శ్వాసకోశాల్లో చేరి పొడిదగ్గుతో ఇబ్బంది పెట్టింది.



చంద్రారెడ్డి హాల్లోకి రావడంచూసి, అక్కడ కూర్చున్న హరిబాబు, రామిరెడ్డి, బుజ్జిశెట్టి లేచి నిల్చున్నారు. రామిరెడ్డి చనువుగా అతని వెనుకనే పడగ్గది వరకు నడిచాడు.

గుమ్మం వద్ద క్షణకాలం ఆగి, భావం లేకుండా రామిరెడ్డికేసి చూశాడు చంద్రారెడ్డి.

"నన్ను... నన్ను కాసేపు ఒంటరిగా ఉండనివ్వండి" ఈ మాటలు అనడానికి సర్వశక్తులూ కూడదీసుకున్నట్లుగా ఉన్నాడతడు. ఆ తర్వాత తన ముఖంలో భావాలని రామిరెడ్డి గమనించకుండా లోపలికెళ్ళి తలుపేసుకున్నాడు.

"ఇన్నేళ్ళనుండీ తెలుసు మనకు. అన్ననీ మాదిరిగా ఎప్పుడూ చూడలేదు" దిగులుగా అన్నాడు హరిబాబు.

"అయితే చిన్న విషయమా? ఎక్కడో పల్లెటూర్లో ఉన్నోడిని టౌన్‌కు పిలిపించి, క్యాసెట్ల అంగడి పెట్టించాడు అన్న... వాడు ముందు మ్యూజికల్స్ అన్నాడు వెనక కాంట్రాక్టులన్నాడు... ఆ తర్వాత రొయ్యలగుంటలు పెట్టినాడు"

'సర్లే... రే... దేనికైనా ఉండాలండీ... సారాయి అంగట్లో మాత్రం తక్కువ సంపాయిచ్చినాడా? దేంట్లో చెప్పు వాడికి కలిసిరాంది? రూపాయి పెడితే పది రూపాయలుగా తిరిగి వచ్చేస్తుండే... అన్ని యాపారాల్లోనూ పార్టనర్సే మళ్ళీ..." రెట్టించాడు బుజ్జిశెట్టి.

"అందుకే కదా... ఆ బటువు చూసుకునే అన్నమీదనే నామినేషన్ ఏసేసినాడు..." ఒక్కొక్క మాటా విరిచి విరిచి కసిగా అన్నాడు రామిరెడ్డి. ఇంద్రారెడ్డి తండ్రి రాఘవరెడ్డి హయాం నుండి కూడా ఈ కుటుంబాన్నే కనిపెట్టుకుని మంచి, చెడుల్లో భాగమైనవాడు రామిరెడ్డి. అందుకే చంద్రారెడ్డిని వదల్లేక వెళ్ళి సోఫాలో కూలబడ్డాడు.

చంద్రారెడ్డి లోపలికెళ్ళి తలుపు మూసుకున్నాడే కానీ మనసు తలుపులు వేయలేకపోయాడు.

తను నీళ్ళు పోసి, ఎరువేసి పెంచిన మొక్క మహావృక్షమై తన మీదకే పెళపెళా విరుచుకుపడ్డట్టుగా ఉంది. తను పాలుపోసి పెంచిన కుక్క తన మీదకే మోరెత్తి మొరుగుతున్నట్లుగా ఉంది. రాజకీయాల్లో నీతి, అవినీతి, మంచి చెడ్డా అన్నా తమ్ముడూ, ముందు వెనుకా ఏమీ లేవని ఎంత సరిపెట్టుకో చూసినా అతడివల్ల కావడంలేదు.

కలగాపులగమైన ఆలోచనలతో నిండిపోయిన మెదడు వత్తిడికి తట్టుకోలేక పేలడానికి సిద్ధంగా ఉంది. ఎప్పటెప్పటివో సంగతులు దృశ్యాలు దృశ్యాలుగా ముందుకూ వెనక్కూ కదులుతున్నాయి. ఏదీ నిలకడగా ఉండడం లేదు. మనసులో అల్పపీడనమేదో ఏర్పడ్డట్టుగా ఉంది.

అయితే ఇవన్నీ కూడా ఓ అయిదు పది నిమిషాలు మాత్రమే. వెంటనే తనకు తాను నచ్చజెప్పుకుని సెట్‌రైట్ అయిపోయాడు రెడ్డి... మనసులోపల మహానదులు పొటెత్తుతున్నా పైకి తొణక్కుండా ఉండడాన్ని రాజకీయాల్లోకి వచ్చాకే నేర్చుకున్నాడతను. లోపలి భావాలేవీ ప్రతిబింబించనీకుండా మొహం కడుక్కుని చిరునవ్వుతో బయటికొచ్చాడతడు చివరికి.

హాల్లోనూ, వరండాలోనూ, కాంపౌండ్‌లో మల్లగుల్లాలు పడుతున్న జనాలంతా అన్న రాకతో మౌనం వహించారు... అసలేమీ జరగనట్లుగానే వచ్చి సోఫాలో కూర్చొని మాటలుకలిపాడు రెడ్డి... అందరికీ భోజనాలు ఏర్పాటు చేయమని రాజేశ్వరికి పురమాయించాడు.

"అన్నా మధ్యాహ్నం మూడుగంటలా ముప్పై అయిదు నిమిషాలకు బాగుండాదంటన్నా నామినేషనేయడానికి. పద్మయ్య స్వామి చెప్పంపిచ్చాడు" చెప్పాడు హరిబాబు.

అప్పటికి రెండోసారి వంట ప్రయత్నాలు కొనసాగిస్తున్న రాజేశ్వరి గుండె వేగంగా కొట్టుకుంది భర్త నిర్ణయం కోసం.

క్షణకాలపు మౌనం తర్వాత

"అలాగే వేద్దాం" తలూపాడు చంద్రారెడ్డి హుందాగా.

బావమరిది విజయకుమార్ రెడ్డి చెప్పాచెయ్యకుండా నామినేషనేయడంతో చంద్రారెడ్డి నిలబడతాడో, లేదోనని మధన పడుతోన్న చంద్రారెడ్డి మనుషులంతా హర్షాతిరేకంతో కేరింతలు కొట్టారు.

"అయినా ఈ బజారులో నా కొడుకులంతా కలిసి ఎక్కబెట్టేశారులేన్నా. లేకుంటే విజయన్న అంత ధైర్యం చెయ్యడు" విజయకుమార్‌రెడ్డిని సమర్థిస్తూ చంద్రారెడ్డిని ఓదార్చడానికి ప్రయత్నించాడు సిద్దయ్య.

"ఆ... అవును పాపం నోట్లో ఏలుపెడితే కొరకలేడు. కుర్రనాకొడుకులు చెబితే మాత్రం ముందూ, ఎనకా చూడాల్నా పళ్ళేదా? పది రూపాలు సంపాయిచ్చుకుని ప్రశాంతంగా బతకతుండాడు గదా అనుకుంటే రాజకీయాల్లోకి లాగి పారేసినారు. ఈ కాలం ఎక్కడబట్టినా ఇదే దరువు. నాలుగురాళ్ళు ఎనకేస్తే చాలు. రాజకీయాల్లోకి దిగాలనుకుంటుండారు."

చంద్రారెడ్డికి ఒక్కక్షణం పిల్లకాకితో పోటీపడ్డం ఇబ్బందిగా అనిపించినా, ఉండేలు దెబ్బని రుచి చూపించాలనుకున్నాడు.

ఇన్నేళ్ళుగా తననీ, తన రాజకీయాన్నీ నమ్ముకుని ఈ ఇంటినే అంటి పెట్టుకుని జీవిస్తున్న తన మనుషులంతా దిక్కులేని పక్షుల్లా కకావికలైపోవడాన్ని అతడు ఊహించలేకపోతున్నాడు. అందుకే ఈ నిర్ణయం. బుజ్జిశెట్టి చెప్పినట్లు ఏనుగు బతికినా చచ్చినా వెయ్యి రూపాయలే.

చంద్రారెడ్డి నిర్ణయంతో

"చంద్రారెడ్డికీ జై... చంద్రన్నకీ జై" అన్న కేకలతో ఆ కాంపౌండ్ అంతా మార్మోగిపోయింది. ప్రమేయం లేకుండానే చంద్రారెడ్డి గుండెలుప్పొంగాయి... ఆనందమూ, దిగులూ కలగలిపిన భావమేదో రాజేశ్వరి మనసుని కదిలించింది.

*



"అన్నా! విజయుడు మరీ దూకుడు మీదుండాడన్నా, నామినేషన్ రోజే యాభైవేలు ఖర్చు పెట్టేశాడు. అది జనం కాదనుకో. రోడ్లు పట్టలేదు" చెప్పాడు హరిబాబు.

అవునవును. మనిషికో సారాయి ప్యాకెట్టు, సాయంత్రానికో వందనోటు... రాక చస్తారా జనం..." ఎద్దేవా చేశాడు నారాయణ.

"అసలు భలే స్పీడుమీదుండాడులే నారాయణా. డబ్బు చిల్లపెంకుల మాదిరి చల్లి పారేస్తుండాడు. అప్పుడే కాలనీలన్నీ చుట్టేసొచ్చినాడు. చాకలి కాలనీలో గుడి కట్టిస్తానని ప్రమాణం చేసినాడు. మాలాయకోటలో మసీదుకి రాళ్ళు తోలించేసినాడు. బీడీ కాలనీలో ఖబరస్తాన్‌కి డబ్బులిచ్చేసినాడంట. రాజీవ్‌గాంధీ కాలనీలో రామమందిరం కట్టిస్తానన్నాడంట.

"ఆ కాలనీల్లో విజయుడంటే ఎవరికీ తెలవదు కాబట్టి చుట్టేసొచ్చినాడు. చంద్రన్న పదిహేనేళ్ళ నుండీ తిరగతానే వుండాడు కదా కాలనీల్లో... కాలనీ జనాలకి చంద్రన్నేమైనా కొత్తా."

బొయ్‌మంటూ వరస కార్ల శబ్దంతో ఎం.ఎల్.ఏ వచ్చినట్లు అర్థమైందందరికీ. తాగుతోన్న కాఫీగ్లాసు పక్కనబెట్టి మెల్లగా లేచి గుమ్మంవైపుగా రెండడుగులు వేశాడు చంద్రారెడ్డి.

మంత్రిపదవి పోయినా సెక్యూరిటీని వదలకపోవడంతో బూట్ల శబ్దాలు ధనధనమంటూ ఎం.ఎల్.ఏ. కంటే ముందే లోపలికొచ్చేశాయి. గంజిపెట్టిన ఖద్దరు బట్టలతోపాటుగా మణెయ్యలోపలి కడుగుపెట్టాడు.

అప్పటికే కాఫీలు తాగుతూ చంద్రారెడ్డితో మంతనాలాడుతుండిన రామిరెడ్డి, బుజ్జిశెట్టి వగైరాలంతా మర్యాదపూర్వకంగా లేచి నిల్చుని మళ్ళీ ఎం.ఎల్.ఏ.తో పాటుగా కూర్చున్నారు.

చంద్రారెడ్డితో ఏకాంతంగా మాట్లాడాలని వచ్చిన ఎం.ఎల్.ఏకి ఆసరికే అక్కడ వీళ్ళంతా ఉండడంతో ఒక నల్లని నీడ అతని ముఖం మీద తారాడి కదిలిపోయింది. అందరికవంక చూసి నవ్వుతూనే చంద్రారెడ్డి భుజం మీద చెయ్యివేసి మెల్లిగా లోపలికి నడిపించాడు ఎం.ఎల్.ఏ...

లోపల డైనింగ్ టేబిల్ మీద అందరికీ టిఫిన్లు రెడీ చేస్తోన్న రాజేశ్వరి మణెయ్యని చూడగానే చేతులు జోడించి చిరునవ్వు నవ్వింది... డావిన్సీ చిత్రించిన చిత్రపునవ్వులా అందులో భావాల్ని పసిగట్టడం కష్టమైంది ఎం.ఎల్.ఏకి. తనూ అర్థంలేని నవ్వొకటి విసురుతూ కుర్చీ లాక్కున్నాడు "బావున్నారా అమ్మా" అంటూ.

ఈ ఎం.ఎల్.ఏ రాజకీయాల్లోకి రాకముందు నుండీ తన భర్తా, మామగారూ పార్టీలో ఉన్నారు. రామారావు తెలుగుదేశం పెట్టినప్పుడే మామగారు పార్టీలో చేరిపోయారు. అప్పటినుండీ ఇప్పటి వరకూ తండ్రీకొడుకులిద్దరూ ఊరి రాజకీయాల్లో భాగమైపోయారు. ఊరి ప్రజలకు తల్లో నాలుకైపోయారు. ఈ ఎం.ఎల్.ఏకి రాజకీయాలు నేర్పించి టిక్కెట్టిప్పించింది మామగారు. నియోజకవర్గంలోని ప్రతి ఊరికీ తిప్పి, కార్యకర్తల్ని పరిచయం చేసి గెలిపించింది మామగారు. తొలిఛాన్సులోనే మంత్రి పదవి రావడానికి కారణం కూడా మామగారేనని అంతా చెప్పుకుంటారు. అటువంటిది

నిన్నగాక మొన్న కాంగ్రెస్‌లో నుండి అధికారపార్టీలోకి ఎగిరి దూకిన మాల్యాద్రినాయుడు ఎక్కువై పోయాడిప్పుడీ ఎం.ఎల్.ఏకి.

అవును మాల్యాద్రి దగ్గరైతే డబ్బులుండాయి కట్టలు కట్టలుగా... మన దగ్గరేముండాది? ఉన్నిందంతా ఊడ్చి ఎలక్షన్లకీ, పోలీస్టేషన్లకీ... మిగిలితే పేదోళ్ళకీ పెట్టనే సరిపోయె... దీర్ఘంగా నిట్టూర్చింది రాజేశ్వరి.

అటు తమ్ముడికీ, ఇటు భర్తకీ జరగబోయే యుద్ధం ఆమెని కుంగదీస్తోంది... నాయకులు యుద్ధం కోరుకుంటే ప్రజలు శాంతి కావాలనుకుంటారు అంటారు కదా! మరేమిటో ఇప్పుడు నాయకులూ, జనాలూ కూడా యుద్ధాన్నే కోరుకుంటున్నారు. ప్చ్... ఇన్నేళ్ళుగా రాజకీయం చేసిన తన భర్త బామ్మర్దికి భయపడి విత్‌డ్రా చేయడమన్నది మింగుడు పడడంలేదామెకి... ఇదిలా ఉంటే పార్టీని రెండుగా చీల్చేసి మాల్యాద్రి నాయుడిని వేదిక మీదికి తెచ్చేశాడీ ఎం.ఎల్.ఏ.

ఛీ... ఛీ... ఈ ఎం.ఎల్.ఏ వచ్చిన తర్వాతనే ఈ ఊరి రాజకీయమంతా ఇట్టయిపోయింది. పార్టీలో ఒకటిగా ఉన్న మనుషులందరినీ విడివిడిగా వేరు చేసేసినాడు. గ్రామాల్లో కార్యకర్తల మధ్య ఉండే మిత్రవైరుధ్యాల్ని శత్రువైరుధ్యాలుగా మార్చేశాడు. ఇంతకు ముందంతా ఎన్నికలు, గెలుపోటములు, మనస్పర్ధలు ఊరికే పరిమితమై ఉండేవి. ఇప్పుడ్కిడ నాయకుల ఆధిపత్యం జిల్లాకు విస్తరించింది. ఇంకా అవసరమైతే రాష్ట్రస్థాయిలో కేంద్రీకృతమౌతుంది.

వంటగదిలోకి, డైనింగ్ టేబిల్ దగ్గరకి షటిల్ ఆడుతోన్న రాజేశ్వరి భర్తకీ, ఎం.ఎల్.ఏకి మధ్య జరుగుతున్న సంభాషణ వింటూనే ఆలోచిస్తోంది.

"నేను చెప్పేది అర్థం చేసుకోండనా... పరిస్థితి బాగులేదు. మీరసలు జిల్లా నాయకులు. పంచాయితీకేందన్నా మీరేసేది... నా మాటినండి" భర్తని ఐస్ చేస్తున్నాడు ఎం.ఎల్.ఏ. "ఖర్చు కూడా అయ్యేట్టుందన్నా. ఇప్పుడు మీరుండే పరిస్థితుల్లో ఇది విత్‌డ్రా చేసుకోడమే మంచిది."

చంద్రారెడ్డి మౌనంగా మణెయ్యకేసి చూస్తున్నాడు సాలోచనగా. ఒకప్పుడు ఎం.ఎల్.ఏ కాకముందు తన తండ్రి ఎదురుగా చేతులు కట్టుకుని నిల్చునుండే మణెయ్య రూపం పదేపదే జ్ఞప్తికొచ్చిందతడికి.

'ఖర్చైతుందంట ఖర్చు' మనసులోనే కసిగా అనుకుంది రాజేశ్వరి. ఇతడి శాసనసభ ఎన్నికల కోసం భర్త, మామగారు ఎంత శ్రమపడిందీ, ఎంత ఖర్చు చేసిందీ అప్పుడే మర్చిపోయా దేమో... అంత అభిమానమున్నవాడైతే ఒక రెండు లక్షలివ్వొచ్చుగదా... మణెయ్య చేతికి కాఫీ అందిస్తూ మథనపడింది రాజేశ్వరి.

"ఖర్చు లేకుండా ఏముండాదిలే మణెయ్యా" అప్పుడే లోపలికొచ్చిన రామిరెడ్డి అందు కున్నాడు. "ఎలక్షన్లలో ప్రజాస్వామ్యమేడుంది? ఇప్పుడు సర్పంచి సీట్లు గూడా ఇంత లెక్కన యాలమేసి అమ్మేస్తుంట్రి. ఈ పక్క అత్తలపాలెం, రోసనూరు పంచాయితీలంతేకదా! లక్షా, లక్షా



యాభైవేలకి బేరం కుదిరిపోయాయి. అంతంత చిన్నూర్లలోనే అట్టుంటే, ఈ మేజర్ పంచాయితీ సంగతి చెప్పాలా? డబ్బులేకుండా ఏది జరగతాది చెప్పు."

రాఘవరెడ్డి, చంద్రారెడ్డిల ప్రాపకంతో ఎం.ఎల్.ఏ అయ్యి కోట్లు సంపాదించుకొని ఇప్పుడు అన్నని నిర్లక్ష్యం చేస్తోన్న మణెయ్య అంటే చంద్రారెడ్డి మనుషులందరికీ ఒళ్ళుమంటే.

"ఒక పంచాయితీ అనేముండాది? మొత్తం రాజకియమే అట్టుండాది. ప్రజల్యాడ ఎన్ను కుంటా వుండారు నాయకుల్ని. డబ్బు కదా ఎన్నుకునేది. ఎన్ని లక్షలు ఖర్చు పెట్టగలిగితే, వాడే కదా నాయకుడు. డబ్బుంటే చాలు బోర విరుచుకుని రాజకీయాల్లోకి దిగొచ్చు. అసలు నాకు తెలవకడగతాను గాన్యా ఎలక్షన్లు దేనికినా?... జనాల కోసమా? పోటీ చేసేవాళ్ళ కోసమా? పేదోళ్ళకి తిండి, గుడ్డ, నీడ కల్పించేదాని కోసమా? లేకపోతే పెద్దోళ్ళు పదవులు పంచుకునేదానికా? అహ... ఎందుకనీ?..." చంద్రారెడ్డి చిన్నాయన కొడుకు మురళీరెడ్డి అడిగినదానికి సమాధానం చెప్పలేక 'అహ...హ్హ' అంటూ నవ్వి తేల్చేశాడు ఎం.ఎల్.ఏ. అందరూ ఇలా తలో పక్కనుండీ తగులు కుంటారని అతను ఊహించలేదు...

బయటున్నవాళ్ళంతా ఒక్కొక్కరే మెల్లిగా లోపలికి చేరుతుండడంతో చప్పున లేచి చంద్రారెడ్డి దగ్గరగా వంగి "అన్నా ట్రయాంగిల్ ఫైట్ కష్టమౌతాదన్నా... ఇటు మీ కుటుంబంలోనూ, అటు పార్టీలోనూ చీలిక... రెండువిధాలుగా దెబ్బే... ఆలోచించుకోండి..." మెల్లిగా చెప్పి "సరే నేను రాత్రికొస్తానన్నా" అంటూ చేయందించి అందరినీ విష్ చేసి సరసరా వెళ్ళిపోయాడు మణెయ్య. అప్పటికి ఖద్దరు బట్టల గరగర కొంత తగ్గింది.

"అవును... పార్టీలో చీలిక... ఎవరివల్ల వచ్చిందిదంతా? వీడివల్లగాదూ... ఏం ఆ మాల్యాద్రి నాయుడికే చెప్పి విత్‌డ్రా చేయించొచ్చుగదా? చంద్రన్న ఎందుకు చేయాలి?" వంటి ఎన్నో ప్రశ్నలు చంద్రారెడ్డి మనుషుల్ని తొలిచేస్తున్నాయి.

చంద్రారెడ్డి పైకి అచేతనంగా ఉన్నట్టున్నాడుగానీ లోపల తన బలాన్నీ, మాల్యాద్రి నాయుడు బలగాన్నీ, ఇటు విజయుడి డబ్బునీ, తులాలకింద బేరీజు వేస్తున్నాడు.

*

"విలేఖరి రాజేంద్ర కూడా విజయుడివైపే తిరుగుతున్నాడంట గదా" భర్తకి మంచినీళ్ళ గ్లాసు అందిస్తూ కదిపింది రాజేశ్వరి. మధ్యాహ్నం వదిన ఫోన్ చేసి ఎగతాళిగా ఈ విషయం చెప్పి నప్పటినుండి కాళ్ళూ చేతులూ ఆడ్డంలేదామెకి. రాజేంద్ర 'అక్కా అక్కా' అంటూ ఇంట్లో మనిషిలా తన వెనుకే తిరుగుతుండేవాడు. వాడి భార్య కిరోసిన్ పోసి తగలబెట్టుకున్నప్పుడు కేసు లేకుండా చేయడం కోసం భర్త యస్.పి. చుట్టూ సొంత ఖర్చులతో తిరగడం ఇంకా గుర్తుంది.

అప్పుడే ప్రచారాన్నుండి వచ్చిన చంద్రారెడ్డి నిర్భావంగా భార్యకేసి చూశాడు. అసలే మే నెల ఎండ బారినపడి వడలిపోయిన మొహం మరింత నల్లబారిపోయింది. నలిగిపోయిన ఖద్దరు చొక్కా అతడి స్థితినీ, అలసటనీ ప్రతిబింబిస్తోంది.

ప్రచారంలో మల్లికార్జునరెడ్డి, గోపాలరెడ్డి కొడుకూ, ఇందిరమ్మ టీచరు భర్త అంతా విజయుడి కోసం ఓట్లడగడం చూసి ఆశ్చర్యపోయాడు. ఇంటికిరాగానే భార్య రాజేంద్ర గురించి చెప్తోంది. వీళ్ళంతా తన నుండి ఎంతెంత సాయం పొందారు. డబ్బునీ, సమయాన్నీ కూడా లెక్క చేయకుండా, వాళ్ళది న్యాయమా కాదా అని కూడా ఆలోచించకుండా వాళ్ళ తరపున ఎంతెంత పోరాడాడు తను. అటువంటిది వాళ్ళంతా ఇప్పుడు విజయుడి చుట్టూ తిరగడానికి కారణమేమిటి? ఛా... ఛా... డబ్బు మరీ ఇంత నీచంగా పనిచేస్తుందా ? అవునవును ఇప్పుడు రాజకీయాల్లో అదే గదా ముఖ్యంగా పనిచేసేది...

ఒక్క పదవితో లక్షలు దోచేయాలనుకుంటారు నాయకులు. ఒక్క ఎలక్షన్‌తో పైకొచ్చే యాలనుకుంటారు కార్యకర్తలు. ఆ ఒకటి, రెండురోజులైనా కడుపునిండా తిండి తినాలను కుంటాడు పేద ఓటరు. అందుకే నాయకులు, ప్రజలు అంతా యుద్ధాన్నే కోరుకుంటున్నారు.

"అన్నా, ఓటుకు వంద రూపాయల్లెక్కన పంచుతుండాడంటన్నా విజయుడు" హడావుడి గా పరుగెత్తుకొచ్చాడు నారాయణ.

వంద రూపాయలా?... అదిరిపడ్డాడు చంద్రారెడ్డి... ఈ పంచాయితీ చరిత్రలో ఇప్పటికి లేదు ఓటుకి వంద రూపాయలివ్వడం. ఏదో ఓటుకి ముప్ఫై, నలభై ఇచ్చేవాళ్ళు. ఎంత బ్రాందీ షాపుంటే మాత్రం సాయంత్రమయ్యేసరికి ప్రతి కాలనీలో కేసులు కేసులుగా దింపేస్తుండాడంట. ఎందుకని విజయుడిట్లా పరుగుమీదుండాడు? అటు మాల్యాద్రి కూడా ఇలాగే మంచినీళ్ళలా ఖర్చుపెడుతున్నాడు. వాళ్ళిద్దరితో పరుగు సాధ్యపడే విషయమేనా? ఇట్లయితే ఇంకా రెండు మూడు లక్షలు చూసుకోవలసి వస్తుంది తను.

కార్యకర్తలు డీలాపడ్డం బాధగా ఉంది చంద్రారెడ్డికి. అనుకున్న డబ్బు చేతి కందకపోవ డంతో పరిస్థితంతా అయోమయంగా ఉంది. ఓట్లకి పంచడానికీ, మందుకీ డబ్బు వెదుక్కోవాలి.

నిజంగానే విజయుడు గెలుస్తాడా? తన దగ్గరుంటూ పరిచయాల్నీ, ప్రాబల్యాన్నీ, తన పలుకుబడితో డబ్బునీ పెంచుకున్న విజయుడు, ఈరోజు ఆ డబ్బుతోనే తన మనుషులందర్నీ ఒక్కొక్కర్నీ కొనేస్తున్నాడు.

ఇప్పుడు రాజకీయాల్లో ఎవరికీ సిద్ధాంతం లేదు. ఆధిపత్య రాజకీయాలూ, డబ్బూ, కులమూ, కక్షసాధింపులూ ఇవే రాజకీయంగా పరిణమించాయి. ముఖ్యంగా ఈ మండలాల ఎన్నికలొచ్చాక ఊరే చాలా మారిపోయింది. ఒక్క మాట మీద కట్టుగా ఉండడమన్న పద్ధతే లేకుండాపోయింది. వీధివీధికీ నాయకులైపోయారు.



ముళ్ళకంచె మీద అతుక్కుపోయిన పాతపంచెలాగా ఉంది చంద్రారెడ్డి మనసు. బలహీన పడుతున్నట్లుగా కూడా ఉంది... ఇన్నేళ్ళుగా తన చేతికింద ఇంతమందిని పెట్టుకుని ఊరినే శాసించినవాడికి ఈ జంకేంది? భయమేంది?... నిత్యం వచ్చిపోయే జనాలతో నిండుగా ఉండే ఇల్లు, ఎన్నో ఏళ్ళుగా మంచికీ చెడుకీ ఆలవాలమైన ఇల్లు మనిషి జాడ లేకుండా పోతుందా? స్మశానం కళ్ళ ముందు నిలిచింది రెడ్డికి...

ఆలోచనలు ఒక కొలిక్కి రావడంలేదు.

అసలు ఓటుకి డబ్బివ్వడమనే ఆచారం ఎప్పుడు ఎక్కడ మొదలైంది. తనకి గుర్తున్నంత వరకూ తన తండ్రి హయాంలో ఏనాడూ ఓటుకి డబ్బిచ్చిన జ్ఞాపకం లేదు. చివరి సమితి ఎలక్ష న్లప్పుడు మాల్యాద్రినాయుడి మేనమామ క్రిష్ణమూర్తి నాయుడు ఓటుకి ఇరవై లెక్కన డబ్బిచ్చి కొన్నాడని అంటారు. పోలింగురోజు ఓటేయడానికొస్తే పనికి పోవడానికుండదనీ, కూలీడబ్బులు రావనీ చాలామంది జనం పోలింగుకి వచ్చేవాళ్ళు కాదు. అందుకని ఆరోజుకి కూలీడబ్బులు మేమిస్తాం, వచ్చి ఓటేయండని వాళ్ళని బతిమాలి, బామాలి పోలింగుకి తీసుకొచ్చేవాళ్ళు అభ్యర్థులు. అలా మొదలైన ఈ సాంప్రదాయం క్రమంగా ఓటుకి డబ్బివ్వడంగా మారిపోయుండొచ్చు. ఇప్పుడీ మొత్తం క్రమమంతా మళ్ళీ వెనక్కిలా తిరిగొస్తుంది ?

"అయినా ఈసారి ఎలక్షన్లు పంచాయితీ ఎలక్షన్ల మాదిరిగా లేవు... ఎం.ఎల్.ఏ ఎలక్షన్ల మాదిరుండాయి..." భర్త చేతినుండి గ్లాసందుకుంటూ తనలో తాను గొణుక్కుంది రాజేశ్వరి. మళ్ళీ పెద్దగా అనడానికామెకి ధైర్యం చాలలేదు. భర్త తననీ, తన పుట్టింటినీ, విజయుడ్నీ అందరినీ తూర్పారపడతాడేమోనని సంకోచించింది.

*

"కాలనీల్లో పండగమాదిరుందన్నా, విజయుడు చీరలు తెచ్చి పంచతుండాడు. మాల్యాద్రి కుర్చీలు చిన్నవి తెచ్చి ఇస్తుండాడు ఇంటింటికీ. ఆయన గుర్తు కుర్చీ కదా అందుకని. ఒక పంచా యితీకి వాళ్ళు ఇంతింత ఖర్చుపెట్టి గెలవాలనుకుంటుండారంటే వాళ్ళు దాంట్లోంచి ఎంత తినెయ్యా లనుకుంటుండారో అర్థం చేసుకోమని కాలనీ జనాలకంతా విడమర్చి చెప్పొచ్చినానన్నా" చెప్పాడు సిద్ధయ్య.

"జనాలకి అంత దూరం ఆలోచనుంటాదా సిద్ధయ్యా... ఈరోజు వచ్చే డబ్బులే కదా వాళ్ళకి. అందులో ఈ నడమ వానల్లేక, పనుల్లేక దాహానికల్లాడిపోతుండారు జనం... వాళ్ళు వద్దన లేనంత డబ్బులొస్తుంటే ఎట్టా కాదనగలరు చెప్పు?".... ఇందులో లేబర్ తప్పేమీ లేదన్నట్టుగా అన్నాడు చంద్రారెడ్డి. కూడుకుపోయిన రొయ్యల డబ్బు, సారాయి డబ్బు ఏదో ఒక మార్గంలో పేద ప్రజలకి చేరడమే న్యాయమన్నట్టుంది అతడి ధోరణి.

ఊళ్ళో ఎక్కడచూసినా ఇవే మాటలూ, ఇవే ఆలోచనలూ, టీలు తాగుతూ బీడీలు, సిగరెట్లు కాలుస్తూ ప్రతి సెంటర్లోనూ ఇవే చర్చలు... ఊరంతా ఎన్నికల వాతావరణంతో గుబగుబలాడిపోతోంది.

కొంతమంది ఆటో వస్తాదంటే, మరి కొంతమంది ఒకటిరెండు ఓట్లతోనైనా క్యారమ్‌బోర్డు గెలుస్తాదని పందేలు కట్టుకుంటుండారు. కుర్చీ మాత్రం మూడోస్థానంలో ఉంది. ఎం.ఎల్.ఏ కూడా కుర్చీలోనే ఊరేగుతుండాడు. అయినా కుర్చీ మూడోస్థానంలో ఉందని అందరూ ఎద్దేవాగా చెప్పుకుంటుండారు.

"త్పూ.... వాడూ ఒక మనిషా?... అన్న పలుకుబడితో, అన్న డబ్బుతో గెలిచి కులకతుండాడు... ఈరోజు అన్న పంచాయితీకి నిలబడితే సపోర్టు చేయాల్సిందిపోయి, మాల్యాద్రి నాయుడితో తిరగతుండాడు... పార్టీని ఇట్టా చీల్చి చితుకులు చేస్తున్నాడని ముఖ్యమంత్రికి రిపోర్టియ్యాల... ఇంటికి పోతాడెదవ" కాల్తో నేలని తన్ని ఆవేశంగా బయటికెళ్ళిపోయాడు సిద్ధయ్య.

సిద్ధయ్యకి టీచరు పోష్టింగిప్పించింది పెద్దాయన రాఘవరెడ్డి... అయితే మొదటినుండీ రాఘవరెడ్డి వద్ద, చంద్రారెడ్డి వద్దా సాయం పొందిన వాళ్ళంతా వచ్చి స్వచ్ఛందంగా ఓట్లేస్తే, ఈరోజు చంద్రారెడ్డి డబ్బుకోసం వెతుక్కోవలసిన అవసరమే ఉండేదికాదు...

పున్నమి చంద్రుని రాకతో హఠాత్తుగా చల్లబడిన ఆ వేసవి సాయంత్రం తగిన అభ్యర్థికి ఓట్లేయమని ఆ ఊరి ప్రజల్ని అడుగుతున్నట్లుగా ఉంది.

*

చాకలి తెచ్చిన చంద్రారెడ్డి బట్టలు బీరువాలో సర్దుతున్న రాజేశ్వరి ఉలికిపడింది... బయటేదో రచ్చ జరుగుతోంది. కొట్లాటలైన చప్పుడు... ఎంతోమంది జనాలు అటూ, ఇటూ దబదబా పరుగెడుతోన్న శబ్దాలు... చేస్తున్న పనినాపి గుమ్మంవైపుగా నడిచిందామె.

అప్పటికే గసపోసుకుంటూ పరుగెత్తుకొచ్చిన శంకరయ్య "అక్కా మన డాక్టర్ని ఆ నాయుడి మనుషులు కొట్టేసినారక్కా. మాంఛి దెబ్బలు... నెల్లూరు ఆసుపత్రికి తీసుకపోతుండారు... మనోళ్ళింకా ఎంతమందికి దెబ్బలు తగిలినాయో తెలియడంలేదు"... భయం భయంగా చెప్పాడు.

"ఎల్లుండి ఎలక్షన్లు జరగనీరంటక్కా... రిగ్గింగ్ చేసైనా గెలుస్తానని వీడూ... శవాలు లేపైనా గెలిచి తీరతానని వాడూ అంటుండారు" అపోజిషన్ అభ్యర్థులిద్దరినీ ఉద్దేశించి బూతులు తిట్టసాగాడు రొప్పుతూనే... ఇదంతా వినీ వినకుండానే అత్త శోకాలు తీస్తూ శపిస్తోంది.

"మూడు దినాలకొకసారి ఈ ఎలక్షన్లు మాకోసమే వస్తా వుండాయి... అయి పుట్ల వడ్లన్నీ అమ్మి అమ్మి దీనికి బెట్టను సరిపోయె... యాపారంలో వచ్చేదంతా చాలకపోయె... ఇంత డబ్బు పెట్టిగూడా ఎప్పుడేమోనే... ఏం జరగతాదోనే అని వణికి సచ్చేట్టుగా ఉండాది. ఆ డాక్టరు ఆ పక్కనెందుకొస్తున్నాడో వంటిగా... ఆ సచ్చినోళ్ళకిదేం పోయేకాలమో... ఎందుక్కొట్టినారంటమ్మా?



"అయ్యో అప్పుడంతా ఎలక్షన్లంటే ఇట్ట్యాదుణ్ణింది తల్లా... ఏందో పొయ్యి దేని మీదెయ్యమంటే దానిమీద గుద్దేసొచ్చేవాళ్ళం... ఇప్పుడు ఓటేయను పోవాలంటే కూడా భయంగా ఉంది... ఇట్టంతా అయితే పెద్దాయనెట్ట చేసుణ్ణు రాజకీయం. ఎంతెంతమందికి ఈ చేతుల్తో వండి పెట్టుంటాను... దినానికి ఎన్ని టీలు, కాఫీలు పెట్టుంటాను... ఈ కంటితో ఎన్ని ఎలక్షన్లు చూసుంటాను, ఇట్టంతా ఎప్పుడూ లేదు తల్లా... ఈయ్యన్నీ చూసేదానికంటే యామైనా మింగి సచ్చేది మేలుగా వుండాది"

అత్త పెడుతోన్న శోకాలు రాజేశ్వరి గుండెల్లోకి దిగుతున్నాయి... దిగులుతోను, భర్తకి ఏ ఆపద రానున్నదోననే భయంతోనూ, జీవితం ఏం కానున్నదోన్న మధనతోనూ ఆమె వణికిపోతోంది.

నిజమే, తన చిన్నప్పుడు ఎన్నికలంటే ఇంత ఆవేశకావేషాలుండేవి కావు... ఎవరి ఓటు వాళ్ళు ప్రశాంతంగా వెళ్ళి వేసొచ్చేవాళ్ళు... దాదాపు సాయంత్రందాకా పోలింగు జరుగుతూనే ఉండేది... అంటే బహుశా తొంభైశాతం పోలింగు కావచ్చు. అయినా ఒక్క దొంగోటు కానీ, రిగ్గింగు కానీ, గొడవలు కానీ జరిగేవి కావు.

ఇప్పుడేమిటో డబ్బు, మందు, దొంగోట్లు, కాదంటే గొడవలూ, వీటితోనే రాజకీయాలు నిండిపోయాయి.

డబ్బు చేతికందక భర్త పడుతోన్న మధన ఆమె గమనిస్తూనే ఉంది... సాయంత్రమైతే అన్ని కాలనీలవాళ్ళూ వచ్చేసి డబ్బుకోసం భర్తని జలగల్లా పీక్కుతినడం చూస్తోంది... విజయుడు డబ్బు మంచినీళ్ళలా ఖర్చుపెట్టడాన్ని గురించి వైనవైనాలుగా వింటోంది. పుట్టింటి తరపువారు ఫోన్లు చేసి ఎగతాళిగా మాట్లాడుతూంటే తట్టుకోలేకపోతోంది... ఎన్నో ఏళ్ళుగా భర్తని కనిపెట్టుకొని ఉన్న పెద్దమనుషులంతా ఒక్కొక్కరుగా జారిపోవడాన్ని తెలుసుకుని బాధపడుతోంది... భర్తని చూస్తుంటే ఆమెకి జాలిగా ఉంది. రాత్రి పగలూ నిద్రలేక, వేళకి తిండిలేక, ఎండనిబడి ఇల్లిల్లూ తిరిగి డీలాపడిపోయాడు. ఆరోగ్యం పాడైపోయింది. ఈ పాడు రాజకీయం కోసం ఆరోగ్యాన్నీ, జీవితాన్నీ కూడా పణంగా పెట్టాడతడు.

మొత్తం జీవితాన్నీ, భర్త పరిస్థితినీ బేరీజు వేసుకుంటూ మధనపడుతూ అతడి కోసం ఎదురుచూస్తోంది రాజేశ్వరి. పెళ్ళైన్నాటి నుండీ కూడా భర్త నుండి ఎనలేని ప్రేమాభిమానాలను పొందలేకపోయినా, అతడ్ని తను నిజాయితీగానే ప్రేమించింది... ఎన్నెన్నో స్పర్శల్ని కోల్పోయి జీవితమంతా ఒక అలవాటుగా బ్రతికేస్తూ వచ్చిన రాజేశ్వరికి ఇప్పుడీ సన్నివేశంలో అనుభవసాంద్రత మరింత తీవ్రంగా ఉంది.

ఇప్పటి భర్త పరిస్థితి ఆమెని మరింత బాధిస్తోంది... ఎప్పుడూ ఓటమిని చవిచూడనివాడు ఈసారి ఎన్నికల్లో ఏదైనా అయితే... అందునా తన బావమరిది చేతుల్లో ఓడిపోతే అయన తట్టుకో

ఊళ్ళో ఎక్కడచూసినా ఇవే మాటలూ, ఇవే ఆలోచనలూ, టీలు తాగుతూ బీడీలు, సిగరెట్లు కాలుస్తూ ప్రతి సెంటర్లోనూ ఇవే చర్చలు... ఊరంతా ఎన్నికల వాతావరణంతో గుబగుబలాడిపోతోంది.

కొంతమంది ఆటో వస్తాదంటే, మరి కొంతమంది ఒకటిరెండు ఓట్లతోనైనా క్యారమ్‌బోర్డు గెలుస్తాదని పందేలు కట్టుకుంటుండారు. కుర్చీ మాత్రం మూడోస్థానంలో ఉంది. ఎం.ఎల్.ఏ కూడా కుర్చీలోనే ఊరేగుతుండాడు. అయినా కుర్చీ మూడోస్థానంలో ఉందని అందరూ ఎద్దేవాగా చెప్పుకుంటుండారు.

"త్పూ.... వాడూ ఒక మనిషా?... అన్న పలుకుబడితో, అన్న డబ్బుతో గెలిచి కులకతుండాడు... ఈరోజు అన్న పంచాయితీకి నిలబడితే సపోర్టు చేయాల్సిందిపోయి, మాల్యాద్రి నాయుడితో తిరగతుండాడు... పార్టీని ఇట్టా చీల్చి చితుకులు చేస్తున్నాడని ముఖ్యమంత్రికి రిపోర్టియ్యాల... ఇంటికి పోతాడెదవ" కాల్తో నేలని తన్ని ఆవేశంగా బయటికెళ్ళిపోయాడు సిద్ధయ్య.

సిద్ధయ్యకి టీచరు పోష్టింగిప్పించింది పెద్దాయన రాఘవరెడ్డి... అయితే మొదటినుండీ రాఘవరెడ్డి వద్ద, చంద్రారెడ్డి వద్దా సాయం పొందిన వాళ్ళంతా వచ్చి స్వచ్ఛందంగా ఓట్లేస్తే, ఈరోజు చంద్రారెడ్డి డబ్బుకోసం వెతుక్కోవలసిన అవసరమే ఉండేదికాదు...

పున్నమి చంద్రుని రాకతో హఠాత్తుగా చల్లబడిన ఆ వేసవి సాయంత్రం తగిన అభ్యర్థికి ఓట్లేయమని ఆ ఊరి ప్రజల్ని అడుగుతున్నట్లుగా ఉంది.

*

చాకలి తెచ్చిన చంద్రారెడ్డి బట్టలు బీరువాలో సర్దుతున్న రాజేశ్వరి ఉలికిపడింది... బయటేదో రచ్చ జరుగుతోంది. కొట్లాటలైన చప్పుడు... ఎంతోమంది జనాలు అటూ, ఇటూ దబదబా పరుగెడుతోన్న శబ్దాలు... చేస్తున్న పనినాపి గుమ్మంవైపుగా నడిచిందామె.

అప్పటికే గసపోసుకుంటూ పరుగెత్తుకొచ్చిన శంకరయ్య "అక్కా మన డాక్టర్ని ఆ నాయుడి మనుషులు కొట్టేసినారక్కా. మాంచి దెబ్బలు... నెల్లూరు ఆసుపత్రికి తీసుకపోతుండారు... మనోళ్ళింకా ఎంతమందికి దెబ్బలు తగిలినాయో తెలియడంలేదు"... భయం భయంగా చెప్పాడు.

"ఎల్లుండి ఎలక్షన్లు జరగనీరంటక్కా... రిగ్గింగ్ చేసైనా గెలుస్తానని వీడూ... శవాలు పైనా గెలిచి తీరతానని వాడూ అంటుండారు" అపొజిషన్ అభ్యర్థులిద్దరినీ ఉద్దేశించి బూతులు తిట్టసాగాడు రొప్పుతూనే... ఇదంతా వినీ వినకుండానే అత్త శోకాలు తీస్తూ శపిస్తోంది.

"మూడు దినాలకొకసారి ఈ ఎలక్షన్లు మాకోసమే వస్తా వుండాయి... అయి పుట్ల వడ్లన్నీ అమ్మి అమ్మి దీనికి బెట్టను సరిపోయె... యాపారంలో వచ్చేదంతా చాలకపోయె... ఇంత డబ్బు పెట్టిగూడా ఎప్పుడేమోనే... ఏం జరగతాదోనే అని వణికి సచ్చేట్టుగా ఉండాది. ఆ డాక్టరు ఆ పక్కనెందుకొస్తున్నాడో వంటిగా... ఆ సచ్చినోళ్ళకిదేం పోయేకాలమో... ఎందుక్కొట్టినారంటమ్మా?



"అయ్యో అప్పుడంతా ఎలక్షన్లంటే ఇట్ట్యాడుణ్ణింది తల్లా... ఏందో పొయ్యి దేని మీదెయ్యమంటే దానిమీద గుద్దేసొచ్చేవాళ్ళం... ఇప్పుడు ఓటేయను పోవాలంటే కూడా భయంగా ఉంది... ఇట్టంతా అయితే పెద్దాయనెట్ట చేసుణ్ణు రాజకీయం. ఎంతెంతమందికి ఈ చేతుల్తో వండి పెట్టుంటాను... దినానికి ఎన్ని టీలు, కాఫీలు పెట్టుంటాను... ఈ కంటితో ఎన్ని ఎలక్షన్లు చూసుంటాను, ఇట్టంతా ఎప్పుడూ లేదు తల్లా... ఈయ్యన్నీ చూసేదానికంటే యామైనా మింగి సచ్చేది మేలుగా వుండాది"

అత్త పెడుతోన్న శోకాలు రాజేశ్వరి గుండెల్లోకి దిగుతున్నాయి... దిగులుతోను, భర్తకి ఏ ఆపద రానున్నదోననే భయంతోనూ, జీవితం ఏం కానున్నదోన్న మధనతోనూ ఆమె వణికిపోతోంది.

నిజమే, తన చిన్నప్పుడు ఎన్నికలంటే ఇంత ఆవేశకావేషాలుండేవి కావు... ఎవరి ఓటు వాళ్ళు ప్రశాంతంగా వెళ్ళి వేసొచ్చేవాళ్ళు... దాదాపు సాయంత్రందాకా పోలింగు జరుగుతూనే ఉండేది... అంటే బహుశా తొంభైశాతం పోలింగు కావచ్చు. అయినా ఒక్క దొంగోటు కానీ, రిగ్గింగు కానీ, గొడవలు కానీ జరిగేవి కావు.

ఇప్పుడేమిటో డబ్బు, మందు, దొంగోట్లు, కాదంటే గొడవలూ, వీటితోనే రాజకీయాలు నిండిపోయాయి.

డబ్బు చేతికందక భర్త పడుతోన్న మధన ఆమె గమనిస్తూనే ఉంది... సాయంత్రమైతే అన్ని కాలనీలవాళ్ళూ వచ్చేసి డబ్బుకోసం భర్తని జలగల్లా పీక్కుతినడం చూస్తోంది... విజయుడు డబ్బు మంచినీళ్ళలా ఖర్చుపెట్టడాన్ని గురించి వైనవైనాలుగా వింటోంది. పుట్టింటి తరపువారు ఫోన్లు చేసి ఎగతాళిగా మాట్లాడుతూంటే తట్టుకోలేకపోతోంది... ఎన్నో ఏళ్ళుగా భర్తని కనిపెట్టుకొని ఉన్న పెద్దమనుషులంతా ఒక్కొక్కరుగా జారిపోవడాన్ని తెలుసుకుని బాధపడుతోంది... భర్తని చూస్తుంటే ఆమెకి జాలిగా ఉంది. రాత్రి పగలూ నిద్రలేక, వేళకి తిండిలేక, ఎండనిబడి ఇల్లిల్లూ తిరిగి డీలాపడిపోయాడు. ఆరోగ్యం పాడైపోయింది. ఈ పాడు రాజకీయం కోసం ఆరోగ్యాన్నీ, జీవితాన్నీ కూడా పణంగా పెట్టాడతడు.

మొత్తం జీవితాన్నీ, భర్త పరిస్థితినీ బేరీజు వేసుకుంటూ మధనపడుతూ అతడి కోసం ఎదురుచూస్తోంది రాజేశ్వరి. పెళ్ళైన్నాటి నుండీ కూడా భర్త నుండి ఎనలేని ప్రేమాభిమానాలను పొందలేకపోయినా, అతడ్ని తను నిజాయితీగానే ప్రేమించింది... ఎన్నెన్నో స్పర్శల్ని కోల్పోయి జీవితమంతా ఒక అలవాటుగా బ్రతికేస్తూ వచ్చిన రాజేశ్వరికి ఇప్పుడీ సన్నివేశంలో అనుభవసాంద్రత మరింత తీవ్రంగా ఉంది.

ఇప్పటి భర్త పరిస్థితి ఆమెని మరింత బాధిస్తోంది... ఎప్పుడూ ఓటమిని చవిచూడనివాడు ఈసారి ఎన్నికల్లో ఏదైనా అయితే... అందునా తన బావమరిది చేతుల్లో ఓడిపోతే ఆయన తట్టుకో

గలడా? పుట్టింటివైపు జనాలంతా తమని చిన్నచూపు చూస్తారా? నిజంగా ఇటువంటి ఒక పరిస్థితిని తను భరించగలదా?

డబ్బు పంపకం, ఎడతెగని మందు సరఫరా, ఆడవాళ్ళకి చీరల పంపిణీ... ఇటువంటి అపమార్గాలతో అవతలి ఇద్దరు అభ్యర్థులూ పరుగులు తీస్తుంటిరి... ఈ పరుగు తన భర్త అందుకో గలడా? అందుకోకపోతే ఏమౌతుంది? ఈ రాత్రికి రాత్రి ఏ అద్భుతం జరుగుతుంది?

భర్త పరువుకోసం, కుటుంబగౌరవం కోసం ఇలా ఆలోచిస్తోంది కానీ నిజానికి రాజేశ్వరికి రాజకీయాల పట్ల ఎనలేని ఏవగింపు.

తన భర్త ఏరోజూ కుటుంబ విషయాలు పట్టించుకున్నోడు కాదు... అయినా సంతోషంగా అవన్నీ తన బాధ్యతలుగా స్వీకరించింది... తను ఆరోగ్యం బాగలేక పడుకుంటే 'ఏమైందని' అడగడు... అయినా సర్దుకుంది... నెలల తరబడి భార్యగా కూడా దగ్గరికి తీసుకోడు... అయినా ఓర్చుకుంది. పిల్లలెక్కడో దూరంగా నెల్లూరు హాస్టల్లో ఉంచాడు... సర్లెమ్మనుకుంది... వ్యాపారం సరిగా పట్టించు కోక గుమాస్తాల పాలవుతోంది... నానాటికీ కుటుంబం దిగజారిపోతోంది.

ఎప్పుడూ జనం...జనం...జనం... వాళ్ళ అవసరాలూ, వాళ్ళ ఇబ్బందులూ, వాళ్ళ మంచి చెడ్డలూ... ఇదే జీవితం. మంచిదే నిస్వార్థంగా జనాలకోసం పాటుపడడం, కాదని ఎవరంటారు? అయితే ఇటువంటివాళ్ళకి సంసారాలూ, భవబంధాలూ ఉండకూడదు... ఇటువంటివాళ్ళు మాంచి నాయకులైతే అయి ఉండొచ్చుగానీ, మంచి భర్తలు కాలేరు... మంచి తండ్రులు కాలేరు...

పరస్పర విరుద్ధమైన ముళ్ళేవో ఒకదాన్నొకటి ఎదుర్కొంటున్నట్లుగా ఉన్నాయి... ద్వైదీ భావంతో ఆమె మనసు కొట్టుమిట్టాడుతోంది.

*

పోలింగ్‌కి అన్ని ఏర్పాట్లు జరిగిపోయాయి. ఊరంతా ఊపిరాడనంత ఉత్కంఠతతో ఉంది... ఆ రాత్రి కుర్చీవాళ్ళూ, ఆటోవాళ్ళూ ఇద్దరూ కూడా అనుమానంతోనూ, గెల్చి తీరాలన్న ఆసక్తితోనూ రెండో విడత నోట్లు పంచారు ఓట్లకి... ఊరంతా మూలమూల కాలనీల్లో డబ్బు విలయతాండవం చేస్తోంది. చంద్రారెడ్డి మనుషులు కూడా కొంత డబ్బూ, మందూ పంచినా అవతలి వాళ్ళతో పోలిస్తే అది చాలా తక్కువ.

ఆ రాత్రి గడిచి పోలింగ్ రోజు వచ్చింది.

చంద్రుడెందుకో వెళ్ళలేక వెళ్ళలేక దిగులుగా మబ్బులచాటుకెళుతున్నాడు. పొద్దు పొడవడానికి కిష్టంలేనట్టుగా గునుస్తోంది... ఆ తెల్లవారుఝామున చంద్రారెడ్డి ఇంట్లో పెద్దపెట్టున ఏడుపులు ఊరంతటినీ నిద్రలేపాయి.



"అయ్యో నా తల్లా! ఎంత పని చేశావే... నేను మీవాళ్ళకంతా ఏం చెప్పేదే అమ్మా..." అంటూ అత్త శోకాలు పెడుతోంది. "ఈ పాడుబడ్డ రాజకీయాల కోసం ఎవురైనా ఇట్టా చేసు కుంటారా?" అంటూ ఎన్నెన్నో గత విషయాల్ని, కోడలి మంచినీ, ఓర్పునీ చెప్పి రాగాలు తీస్తూ ఏడుస్తోందామె.

'కష్టంలో, సుఖంలో నన్నింటిపెట్టుకొని, నా నిర్లక్ష్యాన్ని భరించి, నా బాధ్యతలన్నీ నెత్తి నేసుకుని, ఈ ఇంటికి జీవంలా ఉన్న నువ్వు, ఇంత హఠాత్తుగా వదిలి వెళ్ళిపోతే నేనెట్లా ఉండ గలననుకున్నావు? నా రాజకీయాల గొడవలో, ప్రజాసేవనే కీర్తి కండూతితో, నేను నిన్ను పట్టించు కోలేకపోయినా, నిజానికి నువ్వే నా ప్రాణవాయువ్వి. ఈ తుచ్ఛ రాజకీయం కోసం, ఈ బురద గుంటలో నుండి నన్ను బయటికి లాగడంకోసం, నీ ప్రాణాలర్పించావా రాజేశ్వరీ... ఇక తరతరాలకీ ఈ ఇంట్లో రాజకీయపు గొడవొద్దని కోరావు... వాగ్దానం చేస్తున్నాను. నువ్వు కోరినట్లే జరుగుతుంది' చంద్రారెడ్డి రోదిస్తున్నాడు లోపలా బయటా కూడా.

ఇంక మనకెన్నటికీ రాజకీయం వద్దని కోరుకుంటూ దీనంగా రాజేశ్వరి వ్రాసిపెట్టిన చివరి ఉత్తరం రెపరెపలాడుతూ చంద్రారెడ్డిని దహిస్తోంది. హాస్టల్నుండి పిలిపించబడ్డ కొడుకులిద్దరూ తండ్రిని నేరస్తుడిలా చూస్తూ తల్లి మీదపడి రోదిస్తున్నారు. ఆ రోదన రాతిగుండెల్ని కూడా కరిగించే ట్లుగా ఉంది.

ఆరోజు చంద్రారెడ్డి కుటుంబం నుండి ఎవరూ ఓటేయడానికి వెళ్ళలేదు.

చితిలో రాజేశ్వరి కాల్తుంటేచింతతో చంద్రారెడ్డి కాలుతున్నాడు. ఎప్పటెప్పటివో సంఘటనలు ఒకదాని తర్వాత మరోటి జ్ఞప్తికొచ్చి అతడ్ని దహిస్తున్నాయి. గత మూడురోజులుగా నిద్రలేని కళ్ళు దుఃఖంతో మండుతున్నాయి.

కంటిమీదికి కునుకురావడంలేదు. అంత్యక్రియలు జరిగిన తర్వాత కూడా చంద్రారెడ్డిని వదిలి వెళ్ళలేక ఆత్మీయులు ఒకరిద్దరు కనిపెట్టుకుని ఉన్నారు.

అప్పటికి రాత్రి ఒంటిగంటయ్యింది. ఒంటరితనాన్ని కలిగించే విచిత్రమైన నిశ్శబ్దమేదో చంద్రారెడ్డి చుట్టూ అలుముకుంది.

ఉన్నట్టుండి ఆ నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ ఎక్కడినుండో, కలగాపులగమైన కేకలు, మహోత్సాహం, జేజేలు క్రమక్రమంగా కాంపౌండ్‌లోనికి ప్రవేశించి చంద్రారెడ్డిని ముంచెత్తాయి.

"చంద్రారెడ్డి సింహపురి సింహం"

"చంద్రన్నకీ జై"

ఇంటిచుట్టూ ఊళ్ళో మూలమూలలా ఔట్లు పేలుతున్నాయి.

స్వీట్లూ, మాలలూ, హర్షాతిరేకంతో పేలుతున్న ఓట్లూ, అడ్డుకోలేనంత వేగంగా ఉంది జన ప్రవాహం... అందులో గోపాల్ రెడ్డీ, మల్లికార్జున రెడ్డి, హరిబాబు, వీరినాయుడు అంతా ఉన్నారు మళ్ళీ...

ఆరోజు ఆ ఇంట్లో శవంలేచిన జాడలేమీ లేవు.

అశోకుడెపుడు బౌద్ధం స్వీకరించాడు?

వందల, వేల మరణాల మీదుగా 'బుద్ధం శరణం గచ్ఛామి'

ఇరుకైన సందుదారి గుండా రాజేశ్వరి బయటికెళ్ళిపోయిందేగానీ, రాజకీయం మాత్రం ఆ ఇంట్లో నుండి బయటికెళ్ళలేదు.

*అమెరికా భారతి, సెప్టెంబరు-డిసెంబరు 2002*



# 9

# ఒక చల్లని మేఘం

డా॥ యం. హరికిషన్





బందిఖానా చదువులను నిరసిస్తూ ఓ చిన్నారి చేసిన ఆక్రందన 'ఒక చల్లని మేఘం.' రచయిత డా॥ యం. హరికిషన్ 19 మే 1972లో పుట్టారు. 1998లో **ఆంధ్రజ్యోతి** ఆదివారం అనుబంధంలో వీరి మొదటి కథ 'పడగనీడ' అచ్చయింది. 'మా యమ్మ రాచ్చసి', 'నయా ఫత్వా' కథల సంపుటాలు, 'పిల్లలు చెప్పిన కథలు' అనే బాలల జానపద కథల సంపుటినీ ప్రచురించారు. కర్నూలు కథా సమయం మిత్రుల్లో ఒకరు.

*చిరునామా : 45-205/1, టీచర్స్ కాలనీ, కర్నూలు.*

మురళి బ్యాట్ పట్టుకుని రెడీగా నిలబడ్డాడు. లత తడబడుకుంటూ నాలుగడుగులు ముందుకేసి బలంగా బంతి విసిరింది. అది నేల మీద నాలుగు పిల్లిమొగ్గలేసి బ్యాట్తో కొట్టక ముందే ఆగిపోయింది. మురళి చెల్లెలి వంక కోపంగా చూస్తూ "ఏయ్... పిచ్చిపిల్లా... సరిగ్గా వెయ్యలేవా" అన్నాడు.

లత పెదాలు సున్నాలా చుట్టి "నేనేం పిచ్చిపిల్లనుకాను. మన్చిపిల్లను" ముద్దుముద్దుగా అంది. మురళి నవ్వుతూ చెల్లిని మరింత ఉడికించడానికి "నువ్వేం మన్చిపిల్లవుకాదు. పిచ్చి కుక్కవి" అన్నాడు. లత ఉక్రోషంగా తలెత్తి "నేనేం పిచ్చికుక్కను కాను. నువ్వే పిచ్చికుక్కవి. నేను మన్చికుక్కను" అంది. మురళి పగలబడి కిలకిలమని నవ్వసాగాడు. అన్నయ్యెందుకు నవ్వుతున్నాడో అర్థంగాక "నీతో అన్ను ఫో... కచ్చి" అంటూ లత అన్నించి వెళ్ళిపోయింది.

మురళి నవ్వుకుంటూ బ్యాట్ భుజంపై పెట్టుకొని బైటికి పోడానికి కదిలాడు. అంతలో వాళ్ళ నాన్న సంచీతో లోపలి కడుగుపెట్టాడు. కొడుకు చేతిలో బ్యాట్ చూసి

"రేయ్... ఏందిరా... ఎప్పుడూ వెధవాటలూ నువ్వూనూ. వచ్చినప్పన్నించి చూస్తున్నా... ఎప్పుడన్నా పుస్తకం తెర్చి పట్టుమని పది నిముషాలన్నా కూర్చున్నావా. సందు దొరుకితే చాలు బైట కురుక్తావ్. ఐపాయలే. ఇదే ఆఖర్రోజు. ఇంతకీ అన్నీ సర్దుకున్నావా... లేదా... ఇదిగో స్కూల్ డ్రస్. సూట్కేస్లో పెట్కో. రేప్పొద్దున్నే బైల్దేరాల" అంటూ సంచీ అందించాడు.

మురళి కొక్కసారిగా నీరసమావరించింది. బట్టల్తీస్కొని కాళ్ళీడుస్తూ రూంలోకి చేరు కున్నాడు. స్కూలు గుర్తుకు రాగానే కళ్ళనిండా నీళ్ళు కమ్ముకొన్నాయి. మంచమ్మీద వాలిపోయాడు. అంతలో లతొచ్చి చేయి పట్టుకొని లాగుతూ "అనా... దానా... ఆకుందాం. నువ్వు బాలెయ్యి. నేను కొడ్తా" అంది. మురళి విసుగ్గా "యేయ్... పోతావా లేదా ఈన్నించి" కసురుకుంటూ విసురుగా దొబ్బాడు. లత గోడకు కొట్టుకొని కిందపడి ఏడుస్తూ బైటికి పోయింది.

మురళి ఒంటరిగా పండుకున్నాడు. పదేపదే స్కూలు, వార్డెను, టీచర్లు, బెత్తాలు గుర్తుకు రాసాగాయి. రాత్రి అన్నం సయించలేదు. నిద్ర రాలేదు. పొద్దున్నే తండ్రి వెంట సూట్కేస్తో మౌనంగా బైల్దేరాడు. లత చిరునవ్వుతో టాటా చెప్పసాగింది. మురళికి పోవాలన్పించడంలేదు. దుఃఖం తన్నుకొస్తా వుంది. మొదట్లో పోడానికి నానా గందరగోళం చేసేవాడు. ఏడ్చేవాడు. కిందా మీదా పడి పొర్లేవాడు. దొరక్కుండా పారిపోయేవాడు. ఎలాగోలా పట్టుకొనేవారు. కొట్టి, తిట్టి, బలవంతంగా ఈడ్చుకుపోయేవారు. ఏమ్చేసినా లాభంలేదని తర్వాత్తర్వాత గ్రహించాడు. అప్పన్నించీ మౌనంగా వెళ్ళడం నేర్చుకున్నాడు.

బస్సు బైల్దేరింది. ఊరు దూరం కాసాగింది. దిగులుగా కిటికీలోంచి అలాగే చూడసాగాడు. కాసేపటికి కళ్ళు మూతలుపడ్డాయి. నాన్న లేపుతూంటే మెలకువొచ్చింది. బస్సు కర్నూల్ బస్టాండ్లో



ఆగి వుంది. ఆటో మాట్లాడుకొని వూరి బైటున్న స్కూలుకి చేరారు. తండ్రి ఆఫీస్ రూమ్లో ఫీజులు కట్టాడు. వాళ్ళ సంరక్షణలో మురళిని వొదిలి వెళ్ళిపోతూ...

"బాగా బుద్ధిగా చదువుకో. ఇప్పున్నువ్ సెవెన్త్ క్లాస్. పబ్లిక్. మార్క్సు అదిరిపోవాలి. అందరి ముందు నేను తలెత్తుకొని గర్వంగా తిర్గాలి. నీకోసం యెంత ఖర్చు పెడ్తున్నానో చూస్తున్నావు గదా. జాగ్రత్త. అల్లరిచిల్లరిగా తిరగొద్దు. ఏదైనా కంప్లయింటొచ్చిందనుకో... నా గురించి తెల్సుగదా... కాళ్ళూ చేతులిరగ్గొట్టి రైలుకింద పన్నబెడ్తా. ఈసారి క్లాస్ ఫస్ట్ రావాలి. గుర్తుంచుకో" అంటూ వెళ్ళి పోయాడు. మురళికి టాటా గూడా చెప్పాలనిపించలేదు. బ్యాగు సంకకు తగిలించుకొని కాళ్ళీడ్చు కుంటూ హాస్టల్ వైపు అడుగులేయసాగాడు.

"హలో!" వెనుక నుంచి భుజమ్మీద చెయ్ పడింది. తలతిప్పాడు. తన రూమ్మేట్. "ఏయ్! హరీ! బాగున్నావా... ఎప్పుడొచ్చావ్" ఆనందంగా చెయ్యి కలుపుతూ ప్రశ్నించాడు.

"నెలైందిలే... మనం లెక్కల్లో డల్ గదా. ఈ నాకొడుకులు డబ్బుల్కోసం సమ్మర్లో ఇంప్రూవ్ మెంట్ కోచింగ్ పెట్నారు. మా ఇంట్లో నన్ను భరించలేక ఈన్నే పడేసిపోయినారు. దొంగ నాకొడుకులు" గట్టిగా నవ్వేశాడు.

"అరెరే... ఐతే సెలవులంతా ఈన్నే వున్నావా" మురళి సానుభూతిగా అన్నాడు. హరి తలూప్తూ "ఐనా ఇంకెన్ని రోజుల్లే. చూస్తుండు. ఈసారి ప్లాన్ కరెక్టుగా వేస్తున్నా. చచ్చినా దొరకను" అన్నాడు.

మురళికి అంతకుముందు సంవత్సరం జరిగింది గుర్తుకొచ్చింది. ఒళ్ళు భయంతో వణికింది. ఓరోజు పొద్దున్నే హరి కడుపునొప్పంటూ పడిపోయాడు. గిలగిలా కొట్టుకోసాగాడు. ఏవేవో మందులు తెప్పించారు. తగ్గలేదు. కర్నూలుకి వార్డెన్ని తోడిచ్చి పంపారు. వార్డెన్ డాక్టర్తో మాట్లాడ్తున్నప్పుడు హరి నెమ్మదిగా జారుకున్నాడు. గంటలో విషయం స్కూలు సిబ్బందికి తెల్సి పోయింది. వెంటనే ఎలర్టయ్యారు. వేట మొదలెట్టారు. సాయంత్రం రైలెక్కబోతూ స్టేషన్లో దొరికి పోయాడు.

తర్వాత రోజు ప్రేయర్లో అందరిముందూ విపరీతంగా కొట్టారు. రెండు చేతులూ విరిచికట్టి గ్రౌండ్లో అందరికీ కనబడేటట్లు సాయంత్రం వరకు ఉంచారు. వారంరోజులు రూంలో ఒక్కన్నే బందీ చేశారు. యెంత చేసినా హరి చెక్కుచెదర్లేదు. ఏడ్వలేదు. కొడ్తుంటే వాళ్ళవంక సూటిగా చూస్తుండేవాడు. ఆ కళ్ళలో కోపం, అసహ్యం, కసి, నిర్లక్ష్యం ఉట్టిపడేవి.

క్లాసులో విపరీతంగా అల్లరి చేసేవాడు. గోడల మీద ఏవేవో రాసేవాడు. టీచర్లను లెక్క జేసేవాడు కాదు. తోటిపిల్లలతో ఎప్పుడూ గొడవలు పెట్టుకొనేవాడు. అందరూ వాన్ని తిట్టేవారు. మొద్దబ్బాయని ఎగతాళి చేసేవారు. కానీ మురళికి వాడు ఓ హీరోలా కన్పించేవాడు. ఇద్దరూ ప్రాణ స్నేహితులయ్యారు. కలిసి తిరిగేవారు. ఆడుకునేవారు. మనసు విప్పి మాట్లాడుకొనేవారు.

"యేందిరా ఆలోచిస్తున్నావ్" హరి ప్రశ్నతో మురళి ఈ లోకంలోకొచ్చాడు. ఇద్దరూ మాట్లాడుకొంటూ రూం చేరుకున్నారు. తరువాత రోజు నుండి యాంత్రిక జీవితం ప్రారంభమైంది.

*

ఓరోజు మధ్యాన్నం భోజనం ముగించి ఇద్దరూ రూంకి చేరుకున్నారు. మురళి అలసటగా మంచమ్మీద వాలిపోయాడు. హరి వానిపక్కన కూర్చొని "రేయ్! నిన్న రాత్రి మన్చి బొమ్మేసాను తెల్సా" అన్నాడు. మురళి లేచి కూర్చుంటూ "యేదీ... చూపియ్... చూపియ్" ఆసక్తిగా అడిగాడు.

హరి తలుపులు మూసి గడేశాడు. బుక్కుల కింద జాగ్రత్తగా దాచిన బొమ్మన్దీస్కొచ్చి మంచమ్మీద పరిచాడు. మురళి ఆత్రంగా దానొంక చూశాడు. అందులో ఒకడు నేలమీద వెల్లకిలా పడున్నాడు. దాదాపు నలభైయేళ్ళుంటాయి. వాని గుండెల మీద చిన్న పిల్లవాడు కూర్చొని గొంతు పిసుకుతున్నాడు.

బొమ్మను పరిశీలనగా చూస్తున్న మురళితో "ఆ కిందున్నోడెవడో కనుక్కో చూద్దాం" అన్నాడు హరి.

"మన హెడ్మాష్టర్" మురళి ఠక్కున సమాధానమిచ్చాడు. కాదన్నట్టు హరి తలడ్డంగా ఊపాడు. మురళి ఒక్క క్షణమాలోచించి "మన వార్డెన్. కరెక్టేనా" అన్నాడు. హరి పెదవి విరిచాడు. మురళి దీర్ఘంగా ఆలోచించసాగాడు. ఎవరో అర్థంకాక "నువ్వే చెప్పురా" అన్నాడు. హరి అదిగూడా తెలీదా అన్నట్లుగా చూసి "మా నాన్న" అన్నాడు ఫక్కున నవ్వుతూ. మురళి నవ్వుతున్న హరి వంక అలాగే చూశాడు. కళ్ళూ కళ్ళూ కలిశాయి. కాసేపటికి మురళి పెదాల మీద కూడా చిరునవ్వు చేరింది. హరి భుజమ్మీద చేయేసి "మీ నాన్నేగాదు. మా నాన్నగూడా" అన్నాడు. నవ్వులతో రూము మార్మోగింది.

*

హరి ప్రతిరోజూ ఏవేవో పక్షుల ఈకలు తెచ్చి రూంలో దాచిపెట్టసాగాడు. గూళ్ళలో, పుస్తకాలలో, మంచం కింద... ఎక్కడ చూసినా ఈకలు నిండిపోసాగాయి. మురళికేమీ అర్థంకాలేదు. "ఎందుకురా ఇవన్నీ" చాలాసార్లడిగాడు. "చెబ్తాలేరా... ఇప్పుడుగాదు" హరి ప్రతిసారి దాటవేయ సాగాడు.

ఓరోజు అర్ధరాత్రి తడుతుంటే మురళికి మెలకువొచ్చింది. ఎదురుగా హరి. "ష్" అంటూ చేయి పట్టుకొని "నాతోరా" అన్నాడు. నిశ్శబ్దంగా తలుపు తెరిచాడు. కారిడార్లో ఎవరూ లేరు. మురళి చేయి పట్టుకొని అడుగులో అడుగు వేసుకుంటూ మెట్లవద్దకు చేరుకున్నాడు. ఒక్కొక్క అంతస్తూ ఎక్కుతూ డాబా మీదకు చేరుకున్నారు. అమావాస్య. చీకటిగా ఉంది. దూరం నుండి బాగ్లైట్ వెలుగు మసకమసకగా ప్రసరిస్తోంది. మురళికి అంతా అయోమయంగా ఉంది.

"ఒక్క నిముషం" అంటూ ఓ పెద్దబండ చాటు నుంచి ఏవో తీసుకొచ్చాడు. ధగధగా మెరిసిపోతున్నాయి. పరిశీలనగా చూశాడు. ఆశ్చర్యంతో కళ్ళు పెద్దగయ్యాయి. రెక్కలు... అందమైన రంగు రంగుల ఈకలు... మనోహరమైన రెక్కలు. "ఎందుకివి" మురళి ఆత్రంగా ప్రశ్నించాడు.

హరి మిలమిలలాడే కళ్ళతో, వాటిని ఆప్యాయంగా నిమురుతూ "ఎగిరిపోడానికి" అన్నాడు.

"ఎగిరిపోవచ్చా" మురళి కళ్ళలో ఆశ్చర్యం. హరి ఔనన్నట్లుగా తలూప్తూ,



"ఈ రెక్కల గురించి నీకింతవరకు చెప్పలేదుగదూ... నాక్కూడా మొన్న వేసవి సెలవుల్లోనే తెలిసింది. మా ముందింట్లో ఇమ్మానియేలని ఒకడున్నాడ్లే. వాడు నేర్పాడు వీటినెలా చేయాలో. ఇక్కడ మంచి ఈకలు దొరకలేదుగానీ... ఇంటి దగ్గర యెంత అద్భుతంగా తయార్చేశానో తెల్సా. రంగురంగుల చిన్నిచిన్ని పక్షుల ఈకలతో... మధ్యన కాంతులీనే మనోహరమైన నెమలిపింఛాలతో... అబ్బ... చెప్పలేను. చూచి తీరాల్సిందే. రెండు భుజాలకూ కట్టుకొన్నాను. ఒక్కమాటున గాలిపటంలా రివ్వున పైకెగిరా... అలా అలా గాలిలో తేలిపోతూ... పైకి పైపైకి... నల్లని మబ్బుల్లోకి... చెట్లు, బిల్డింగులు, రైళ్ళు... చిన్నగా... మరింత చిన్నగా... ఆటబొమ్మల్లా...

"దూరంగా... తెల్లని మంచుపర్వతం. చల్లనిగాలి. సువాసనలు వెదజల్లుతున్న రంగు రంగుల పూలు. విశాలమైన పచ్చనిచెట్లు. మనోహరమైన పక్షులు. కొండలమీంచి జలజలా దూకుతున్న సెలయేళ్ళు... వాటి మధ్య... ఎక్కడ చూసినా... యెటు చూసినా... పిల్లలు... చిన్నచిన్న పిల్లలు. మనీడు పిల్లలు. చిన్నిచిన్న రెక్కలతో... నవ్వుతూ, తుళ్ళుతూ, ఎగురుతూ... నన్ను చూసి చిరునవ్వులు చిందించారు. కేరింతలు కొట్టారు. తమలోకి ఆహ్వానం పలికారు.

"అక్కడ నాన్నల్లేరు. అమ్మల్లేరు. టీచర్లు లేరు... భోజనం గంటల్లేవు. ప్రార్థన పిలుపుల్లేవు. బలవంతపు చదువుల్లేవు... బూట్లు లేవు. టక్కుల్లేవు. టైలు లేవు... అరుపులు, తిట్లు, తన్నులు అస్సల్లేవు. మనకోసం, మనలాంటి బాలల కోసం దేవుడెంతో శ్రమించీ, శ్రమించీ సృష్టించిన అద్భుతలోకమది.

"మేము నీళ్ళలో చేపలమయ్యాం. చెట్లలో కోతులమయ్యాం. ఆకాశంలో పక్షులమయ్యాం. కోయిలలమయ్యాం. లేగదూడలమయ్యాం. కుక్కపిల్లలమయ్యాం... మాకోసం చెట్లు పండ్లిచ్చాయి. పూలు తేనిచ్చాయి. చెరువులు నీళ్ళిచ్చాయి. ఎండ వెన్నెలైంది. ముళ్ళు పూలయ్యాయి. రాళ్ళు రబ్బరు ముక్కలయ్యాయి... చినిగిన అంగీలతో, రేగిన జుట్టుతో, మట్టి కొట్టుకున్న ఒంటితో... ఎగిరాం, ఎగిరి దుంకాం. కిందపడ్డాం. లేచాం. కొట్టుకున్నాం. దొబ్బుకున్నాం. మమ్మల్ని చూసి చెట్లు నవ్వాలి. పువ్వులు నవ్వాయి. కొండలు నవ్వాయి.

"చీకటి ఎప్పుడౌతాదో తెలీదు. చందమామ ఎప్పుడొస్తాడో తెలీదు. గంటలు క్షణాలయ్యేవి. కళ్ళు మూసి తెరచినట్టుగా ఉండేది. కలలాగా ఉండేది. టాటాలు చెప్పుకుంటూ, రేపటి గురించి కలలు కంటూ, వీడ్కోలు తీసుకునేవాళ్ళం. సూర్యోదయం కోసం ఆతృతగా ఎదురుచూసేవాన్ని. మళ్ళా పొద్దున్నే... రెట్టించిన ఉత్సాహంతో... అమ్మానాన్నా బైటికిపోగానే... ఎగురుతూ, వురుకుతూ వాళ్ళలో కలిసిపోయేవాన్ని. కానీ..." హరి చెప్పడమాపేశాడు. కళ్ళు వర్షించే మేఘాలయ్యాయి. గొంతు వణికింది.

"ఏమైంది... తర్వాతేమైంది" మురళి కుదుపుతూ ప్రశ్నించాడు. కన్నీళ్ళు తుడుచుకుంటూ హరి కొనసాగించాడు.

"ఎలా తెలిసిందో అమ్మానాన్నలకు. తిట్టలేదు. కొట్టలేదు. ప్రశ్నించలేదు. ఎప్పట్లాగే ఓరోజు ఇద్దరూ ఉద్యోగానికెళ్ళగానే పరుగు పరుగున గదిలోకి చేరుకున్నా. మంచం కింద రెక్కలు కనబల్లేదు.

వెతికాను. ఇల్లంతా... అణువణువునా. ఏడుస్తూ... కిందా మీదా బడుతూ... ఎక్కడా... ఎక్కడా కనబల్లేదు. ఆఖరికి వంటగదిలో... పొయ్యిలో... కాలిబూడిదైపోయి...

"పిచ్చివానిలా కేకలు పెట్టాను. పొర్లిపొర్లి ఏడ్చాను. తాళం వేసి వున్న తలుపుకు తల బాదుకున్నాను. శాపనార్థాలు పెట్టాను. బూతులు తిట్టాను. ఆ తరువాతరోజే తీస్కొచ్చి నన్నిక్కడ పడేశారు.

"అప్పన్నించి కన్నుమూస్తే అదే కల. చేతులు చాచి ఆహ్వానిస్తున్న స్నేహితులు. ఎలాగైనా వాళ్ళను చేరుకోవాలనుకున్నా. కాంపౌండంతా గాలించా. ఒక్కొక్క ఈకనే ఏరి దాచిపెట్టసాగా. ఇన్నాళ్ళకు రెక్కలకు సరిపడా ఈకలు దొరికాయి. నాలుగురోజులుగా రాత్రుళ్ళు మిద్దెపై కూర్చొని దీన్ని తయారుచేశా. బాగున్నాయి కదూ" రెక్కలను గాల్లో ఆడించాడు.

హరి మొహం చందమామలా వెలిగిపోతా వుంది. చిరునవ్వు పెదాల మీది నుండి జలపాతంలా దూకుతా ఉంది.

మురళి వంక చూస్తూ "వస్తావా" అన్నాడు. మురళికి వెళ్ళాలనిపించింది. ఆ కొత్తలోకాన్ని చూడాలని మనస్సు వువ్విళ్ళూరింది. కానీ ఏదో భయం... తటపటాయింపు... విషాదవదనంతో "ఈసారి వస్తాలే" అన్నాడు.

హరి చిరునవ్వుతూ అంచు మీదికెక్కాడు. అమావాస్య. నల్లని చీకటి. స్కూలు చుట్టూ ఎత్తైన ప్రహరీగోడ మసకమసకగా కనబడుతోంది. మురళివంక చూశాడు. ఆప్యాయంగా చేతిని నొక్కివదుల్తూ "వస్తాను" అంటూ చేయూపాడు. మురళి కన్నీళ్ళతో, నిరాశతో వీడ్కోలు చెబ్తూ చేయెత్తాడు.

హరి శక్తినంతా కూడగట్టుకొని, డాబా అంచు మీది నుండి ఒక్కుదుటున గాల్లో కెగిరాడు. అంతే... సర్రున నేలమీదకు జారిపోసాగాడు. రెక్కలు గాల్లో వేగంగా టపటపా కొట్టుకుంటున్నాయి. మురళి అదిరిపడి 'హరీ' అంటూ బిగ్గరగా అరుస్తూ, డాబా చివరకొచ్చి కిందికి తొంగిచూశాడు. చీకటిలో ఏమీ కనబల్లేదు. ఆకాశం ఎర్రగా భీతిగొల్పుతూ వుంది.

*అరుణతార, అక్టోబర్-నవంబర్ 2002*



# 10

# పీడ

**పెద్దింటి అశోక్‌కుమార్**





గ్రామీణ జీవనాన్ని చిన్నాభిన్నం చేస్తున్న వివిధ పథకాల వికృతరూపపు మరో కోణం 'పీడ' కథ. రచయిత పెద్దింటి అశోక్‌కుమార్ 19 ఏప్రిల్ 1966లో పుట్టారు. వీరి మొదటి కథ 'ఆశ-నిరాశ-ఆశ' 1999లో ఆంధ్రప్రభలో అచ్చయింది. 2002లో 'ఊటబాయి' కథాసంపుటిని ప్రచురించారు. మారుతున్న ఆర్థిక సంబంధాలు వివిధ జీవన వృత్తులను సర్వనాశనం చేస్తున్న తీరును వీరి కథలు వివరిస్తాయి.

*చిరునామా : మల్లరెడ్డిపేట, గంభీరావుపేట మండలం,కరీంనగర్ జిల్లా-505304*

కైలాబ్‌కు ఆగమాగంగా ఉంది. చేసింది కరెక్టేనా అనుకుంటున్నాడు. అలా చేయాల్సింది కాదేమో అనుకుంటున్నాడు. చేయక ఇంకేం చేయాలి అని కూడా అనుకుంటున్నాడు. అనుకుంటూనే జీబును పీరీల మసీదు దగ్గరికి తెచ్చి ఆపాడు. రోజూ ఇంటి ముందు కనిపించేదే అయినా ఈరోజు ఎందుకో కొత్తగా కనిపిస్తోంది జీబు. పామున్న పుట్టలా ముట్టుకుంటేనే బుగులైతోంది. రోజుకు రెండువందల కిరాయి కట్టాలెగదా మరి!

"ఏంరా... కైలాబూ... నువ్వచ్చినవు. మీ అయ్య లేడారా!..." సత్తయ్యసేటు జీబులో కూసుంటూ అడిగాడు. వెంట రెండు జోర సంచులున్నాయి. సామాన్లు తేవడానికి గొల్లపెల్లికి పోతున్నాడు.

"ఇగ యాడికస్తడు. జీబు ఇప్పుడు కైలాబుగానిదే... వీడో రెండేండ్లు నడుపుతడు" యాదగిరి అన్నాడు జీబెక్కుతూ.

"అగో... అయ్యదో మావులా కొడుకుదో మావులానా... ఏంది బిడ్డా లగ్గం అయి కాకతలిగెనే ఏరువడ్డవా...?" ఎత్తిపొడుతున్నట్టు అంటూ ఎక్కి కూసుంది తిరుమలవ్వ.

"ఏరుపడ్డవా... మన్నా... అదో కథ. రెండేండ్ల వాయిద నిండింది. బుచ్చిరెడ్డి సంగతి తెలుసుగదా... ములిక్కాయకు ముండ్లెన్ని అంటే కాకరకాయకు కండ్లెన్ని అంటడు. నెలకింత కిరాయి పెంచిండు. అయ్య సాలిచ్చుకుంటే కొడుకు గుత్త వట్టుకున్నడు" యాదగిరి అన్నాడు ముందుకు జరుగుతూ.

ఈ మాటలేవీ వినడంలేదు కైలాబ్. జీబును ఆనుకుని నిలబడి "గొల్లపల్లి... సిరిసిల్ల... గొల్లపల్లి... సిరిసిల్ల..." అంటున్నాడు. అలవాటులేని అరుపు. కొత్తగా ఉంది. కొద్దిగా బిడియంగా కూడా అనిపించింది. అందరూ తననే పట్టిపట్టి చూపిస్తున్నట్టుగా అనిపించింది. ఒకసారి మెలితెమ్మైతే బిడియం ఉండదని వరుసగా అంటున్నాడు. గొంతు బొంగురుగా ఉంది.

కైలాబ్ అసలు పేరు స్కైలాబ్. అందరూ కైలాబ్ అనే పిలుస్తారు. సరిగ్గా స్కైలాబ్ పడిన్నాడే పుట్టాడని ఆ పేరు పెట్టారు. కొత్తవాళ్ళ ముందు పేరు చెప్పడానికి కొద్దిగా సిగ్గనిపించి తన పేరు మార్చుకోవాలనుకున్నాడు కైలాబ్. కాని అప్పటికే అతడి పేరు శిలాశాసనమైంది.

ఇద్దరు కాలేజి పిల్లలు కూడా ఎక్కి కూచున్నారు. ఒకలతో ఒకలు ముచ్చటలో మునిగిపోయారు. కైలాబ్ 'గొల్లపల్లి... సిరిసిల్ల' అంటూ అరుస్తనే ఉన్నాడు.

"ఒరేయ్... ఐదుగురు నిండింండ్రు. జీబు పోనీ..." సత్తయ్యసేటు గదమాయింపుగా అన్నాడు.

"ఏం బోతది సేటూ... ఒక్కలన్నా సిరిసిల్ల ప్యాసింజరు గాదు. నడుమల దిగుతరు. డీజిల్ ఖర్చుగాదూ... ఆ... సిరిసిల్ల... సిరిసిల్లా" అన్నాడు కైలాబ్.



"ఆటో వచ్చిందనుకో ఈ ఐదుగురు గూడా దొరుకరు. నీ బుద్ధి" యాదగిరి అందుకున్నాడు.

"వీళ్ళ నాయిన ఇట్లగాదు. ఇద్దరెక్కినా దంచుకపోతుండె" తిరుమలవ్వ అన్నది.

"మా కాలేజీకి టయిమయింది. నడువని" కాలేజీ పిల్లలు అన్నారు. మొత్తం మీద అందరూ అన్నిరకాల ఒత్తిడిని చేస్తున్నారు. కైలాబ్ మాత్రం వారిచ్చే ఛార్జీలు లెక్కగట్టుకుని ఇంకో నలుగురు ఎక్కితేగానీ కదలకూడదని నిర్ణయం చేసుకున్నాడు.

కైలాబ్‌కిది కొత్తగా ఉంది. అతడెన్నడూ తండ్రి వెంట పోలేదు. లారీ మీదనే ఉన్నాడు. అక్కడ ఈ గొడవలుండయి. బొబ్బలుండయి. ఇప్పుడు ఇదేం పీకులాటరా అనుకుని కొద్దిసేపు బానెట్ ఎత్తి ఇంజన్ సదిరినట్టు చేశాడు. మరికొంతసేపు నీళ్ళు పోశాడు. ఇవన్నీ చేస్తూనే ఒక కంట ఎవరైనా ఎక్కుతున్నారా అని చూస్తున్నాడు. పురుగు లేదు. అతడు కావాలనే సదురుతున్నాడని గమనించారు కూర్చున్నవారు.

ఇద్దరు సేట్లు సామాన్ల లిస్టులిచ్చిపోయారు. పోయేప్పుడు గొల్లపల్లి పెద్ద దుకాణంలో ఇస్తే వచ్చేప్పుడు ముల్లెగట్టి జీబులో వేస్తారు. లిస్టును జేబులో వేసుకుంటూ "సిరిసిల్ల... సిరిసిల్లా" అన్నాడు కైలాబ్.

"ఇప్పడొక ఆటో వచ్చుగద పోరని రోగం కుదురుతుండె. తొవ్వపొంట మత్తు మందెక్కుతరు. పోనియ్యి" తిరుమలవ్వ గదుమాయించింది.

ఆటో పేరు వినగానే వెన్నులోపల జిల మొదలయింది కైలాబ్‌కు. ఆటోకు నలుగురైదుగురు ప్యాసింజర్లయితే చాలు. జీబుకు పది పన్నెండుమందైనా కావాలి. కొద్దిమంది జమకూడగానే ఆటో రావడం జీబు ఖాళీ కావడం... ఈ విషయం రోజూ తండ్రి చెబుతుంటే విన్నాడు. అందుకే భయమేసింది.

"చాట్ల తౌడు పోసింండ్రు. కుక్కలకు ఎగేసింండ్రు... థూ... నీయవ్వ..." అనుకుంటూ జీబు ఎక్కబోతూ ముందుకు చూశాడు కైలాబ్. గుండె ధడేలుమంది.

బయపడ్డంతా అయింది. మూడుగీరల ఆటో వచ్చి ఆగింది. హారన్ మోగింది. అది బయట కాదు. కైలాబ్ గుండెలో మోగింది. జీబులో కూసున్నవారి కళ్ళలోనైతే చెప్పలేని ఆనందం. మనుషులు ఇంత పైశాచికంగా ఆనందిస్తారని అతడికి తెలుసు. వాళ్ళ చూపులను తట్టుకోలేకపోయాడు. అప్పటికి తిరుమలవ్వ అననే అన్నది.

"మంచిగైంది తాతకొడుకా... లేనిదానికి ఆశపడితే ఉన్నది ఊసిపాయె. ఇప్పుడుగూడా నడువలేదనుకో... ఆటో ఎక్కుతం..." ఆమె మాట్లాడ్డం అయిపోనేలేదు కాలేజి పిల్లలు లెవ్వనే లేశారు.

"పోదాం... కూసోండ్రి..." అంటూ స్టార్ట్ చేసి రివర్స్‌లో వెనక్కి తిప్పుతూ "ఇట్లయితే నేను కిరాయి కట్టినట్టే" అన్నాడు. అతడి మాటలు జీబు శబ్దంలో కలిసిపోయాయి.

ఆగమాగాన గేరు మారుస్తుండంగ ఇద్దరు టీచర్లు కనిపించారు. వాళ్ళు ఆటో వైపు వెళ్తున్నారు. "రాంఢ్రిసార్... ప్యాట్లకే గదా బడి ముందు దించుతా" అభ్యర్థనగా చూస్తూ అన్నాడు కైలాబ్.

"మాది క్యాట్ కార్డ్... రూపాయి తక్కువిస్తం. కాదంటే అరగంటలో బస్సుంది. దిగేప్పడు గింతగంతంటవని ముందుగనే చెప్పుతున్న. మొన్నగట్లనే కిర్‌కిరయింది" ఒక టీచర్ అన్నాడు. మరో టీచర్ సమాధానం కొరకు ఆగి చూస్తున్నాడు. ఇద్దరిని ఏ రేటుకైనా సరే ఎక్కించుకుని జీబుకంటే ముందు వెళ్ళాలని ఆటో డ్రైవర్ చూస్తున్నాడు.

తప్పనిసరై కైలాబ్ 'సరే' అన్నాడు వాళ్ళిద్దరూ ఎక్కి కూర్చున్నారు. జీబు కదిలింది.

"ఇగో... కైలాబూ ఇప్పడే చెబుతున్న. వాళ్ళు ఇచ్చినంతనే మేమిస్తం. ఒకలకు ఎక్కువేంది...? ఒకలకు తక్కువేంది? మేం మనుషులమే కదా...? మాయి పైసలే కదా...?" సత్తయ్య సేటు అన్నాడు. అతడు 'మేము' అన్నాడు కాబట్టి మిగిలినవారు 'ఔ... అట్నే తీసుకోవలె' అన్నారు. ఈ విషయం తమది కాదన్నట్టు మౌనంగా కూర్చున్నారు టీచర్లు.

కైలాబ్ మెదడు క్యాలిక్యులేటర్‌లా పనిచేసింది. టీచర్లు ఎక్కక ముందు ఎంత వచ్చేదో అంతే వచ్చింది. గుండె మెలిపెట్టినట్టయింది. తను వేసుకున్న టార్గెట్ వేరు. వచ్చింది వేరు. రోజూ ఇదే కథ జరిగేట్టుంది. మరి ఎట్లా కూడబెట్టేది!

కైలాబ్‌కు తండ్రి గుర్తుకొచ్చాడు. ఉరుకులు పరుగులు చేసే అతడి హడావుడి గుర్తొచ్చింది. ఈమధ్య బెల్లంకొట్టిన రాయిలా మారాడు. చేతిలో జీబు లేకపోవడమే అని తను అనుకున్నాడు. అంతకుమించి అతడి గుండెను మెలితిప్పిన బాధ ఏమిటో ఇప్పుడిప్పుడే బోధపడుతోంది.

గేరు మార్చి జీబు వేగాన్ని పెంచాడు కైలాబ్. ఎట్లయితే అట్లయితది. బండ కింద చెయ్యి జిక్కింది. మెల్లగ ఒదులదీసుకోవాలె అనుకున్నాడు. బటన్ నొక్కితే టేపులో పాట మొదలయింది. "దోస్తర బన్ నేస్తమా... దోస్తు గట్టుకుందమా..." పాట. టీచర్లిద్దరూ చిటికెలేస్తున్నారు. ఉనికిని మరిచి ప్రపంచబ్యాంకు అప్పుల గురించి మాట్లాడుకుంటున్నారు. అది రాష్ట్రాన్ని దత్తత తీసుకుందని రాబోయేకాలంలో బతుకు గోరంగా ఉంటుందని ఒక్క గొంతుతో ఆమోదిస్తున్నారు.

కైలాబ్‌కు నవ్వొచ్చింది. ఎక్కడ మంది కనిపించినా స్లో చేసి 'సిరిసిల్ల... సిరిసిల్ల...' అంటూ ఆశ నిరాశతో ఊగులాడుతూ ఊరు దాటిండు. ఎవరో కేకవేస్తే తన కొరకే అన్నట్టుగా ఆపిండు. కేకవేసిన వ్యక్తి జీబును దాటిపోతుంటే ఉసూరుమని కదిలిండు.

తను జీబును తీసుకోవాల్సింది కాదు. కాగితాలు సంతకాలయ్యాక ఇప్పుడేం చెప్పొస్తది. నిజానికి తను తండ్రి కోసమే తెగాయించి తీసుకున్నాడు. నాలుగురోజులు జీబు దూరమైతే సంటి పిల్లగాని లెక్క ఏడ్చుకుంట కూసుండె. మంచంబట్టి లెవ్వకనేపాయె. ఇట్లనన్న కోలుకుంటడని బరువు ఎత్తుకున్నట్టాయె. ఆయన ఏమనుకున్నడో... లేని పారుక పెట్టుకవచ్చినవని తిట్టని తిట్టు తిట్టె. ఇప్పుడు ఎటూగాని బతుకాయె. బాధగా మూల్గాడు కైలాబ్.



కంకర తేలిన రోడ్డు. జీబు నెమ్మదిగా బోడబండ దాటింది. ఎత్తుగడ్డకు కయ్యలు. గేరు మార్చాడు కైలాబ్. దారి పొడుగునా ఇసుకకుప్పలు, కంకరకుప్పలు.

"వారంలో పని చాలైతదట. డాంబర్ రోడ్డయితే ఈ గోస ఉండది" యాదగిరి అన్నాడు. "గోస ఎప్పుడూ తప్పది. అది ఏదో రూపంలో మనను వెంటాడుతనే ఉంటది. గోరంత సౌఖ్యం కొండంత గోసకు పెట్టుబడిలా పనిచేస్తది" చూపును మరల్చకుండానే అన్నాడు కైలాబ్ లోతుగా.

టీచర్లిద్దరూ ఉలిక్కిపడ్డారు. మాట్లాడుతున్న మాటల్ని కొద్దిగా తగ్గించారు. మిగిలినవారు మాత్రం మామూలుగానే ఉన్నారు. తిరుమలవ్వనైతే కాస్తంత చొరవగా "ఈ రోడ్డు ఎందుకు గావట్టెనని పోరనికి మంటపుడుతుంది. రెండు తీసుకునేకాడ మూడు దొబ్బవడితిరి" అన్నది.

"ఏ... పాపం... ఏం సంపాయించుకున్నరు? పూసాపోగు ఉంటే అమ్ముకున్నరు. గద్ద కింద అద్దెకురం తప్ప యాడేంలేదు. రెండేండ్ల కింద నేనే కాయిదం రాస్తిని. అసలు తప్పు పని చేసింద్రు గనీ అప్పొసప్పొ అప్పుడే చేసి బేంకు మార్జిన్ కడితే ఇప్పుడు జీబు మిగిలిపోతుండె. మూలకున్న బుచ్చిరెడ్డిని తెచ్చి లక్‌పతిని చేసింద్రు" సత్తయ్యసేటు అన్నాడు.

జీబు నర్రెంగల్ల బోరు ఎక్కి దిగుతోంది. 'అయిదు నిమిషాలాగితే కోరుట్లపేట. అక్కడో పదిమంది డైరెక్టు సిరిసిల్ల ఎక్కుదురుగదా ఎంత మంచిగుండు. సిరిసిల్ల చేరంగనే మల్లా ఇరువై మంది దొరుకితే ఇయ్యాల్ల మందులు గోలీల ఖర్చు ఎల్లిపోతుండె. నాయినా ఇంత లాభమచ్చిందని సూపిత్తే జర తుర్తిగ ఉంటుండే...' హారన్ చప్పుడు విని సైడ్ అద్దంలో చూశాడు కైలాబ్.

ఆటో దూసుకొస్తోంది. గుండె దడదడలాడింది. వీడు ముందువడితే ఒక్క ప్యాసింజరును మిగులనియ్యడు. ముందే పోవాలి. ఎక్స్‌లేటర్ నొక్కాడు. వేగం అందుకుంది జీబు.

"ఓ పోరడా... జర మెల్లగపోనీ... కడుపుల పేగులు నోట్లెకత్తున్నయి. ఏం ఎత్తేసుడిది" తిరుమలవ్వ గదమాయించింది. "...వీనయ్య ఇట్లగాదు. పొట్టమోలె నడుపుతడు, గింత అదుల నియ్యడు..." అన్నది తనే మళ్ళీ.

"ఈ జీబు చూస్తే తెలుత్తలేదా... రెండేండ్లు నడిపినా చెక్కు చెదురలేదు. ఒక్కసారి గ్యారేజ్‌కు పోలేదట. పెద్దపెద్ద రిపేర్లయితే బుచ్చిరెడ్డి వంతే... ఒక్క పైస ఖర్చు గాలేదని మురువవట్టె" సత్తయ్యసేటు అన్నాడు.

"ఒక్క బుచ్చిరెడ్డి గాదు. బ్యాంకోల్లు గూడా మురిసింద్రు..." అంటూ టీచర్లవైపు తిరిగి "ప్రపంచబ్యాంకు ఎవలనేం జేసిందోగనీ సారూ... ఈ గ్రామీణబ్యాంకు మన ఊరిని దత్తత తీసుకున్నదంటే మాలాంటోల్లం ఆగమైనం" అన్నాడు కైలాబ్.

"సద్దిదిన్న రేవు తలువాలెనట. ఈ కరువుల బ్యాంకు పున్యమా అని బుక్కెడు తింటున్నం. బోర్లకు పంపులకు లోన్‌లిచ్చె. కరువున్నదంటె మిత్తిని మాఫీ జేసె. ఇంకేం జెయ్యమంటవు" యాదగిరి అన్నాడు కోపంగా.

"దుకాణం పెడుతున్నమంటే ఇరువై వెయిల అప్పు ఇచ్చిండు. తాపకిన్ని కట్టిన" సత్తయ్య సేటు అన్నాడు.

"నీకెందుకు సేటు... వెయ్యిగాళ్ళ జెర్రివి. బ్యాంకుల అప్పు తెచ్చి ఎవలకో మూడు కొత్తల మిత్తికిచ్చినవు. అట్ల లాభమేనాయె" అన్నది తిరుమలవ్వ. "ఇతనొక్కడేగాదు. అప్పు తెచ్చిన అందరూ చేతులమీదనే తింపుకున్నరు. దాని బరవు అప్పు తీసుకోని వాళ్ళ మీద పడ్డది. రద్దిబద్ది రామచిలుక. దొబ్బి బుక్కింది బండారిగాడు అన్నట్టయింది" తనే అన్నది.

కైలాబ్ ఆలోచనలు అక్కడే ఆగిపోయాయి. జీబు ముందుకు కదిలినా ఆలోచనలు కదల్లేదు. ఆరోజున తనూ వెంటే ఉన్నాడు. బ్యాంకు చుట్టూ తిరిగారు. ఫోటోలు దిగారు. రెండేండ్ల కింద–

"లొటపెట పెదవులకు నక్క ఆసపడ్డట్టు మేమూ ఆసపడ్డాము. అది అందలేదు, పొంద లేదు. రేపు రా రేనిగాయిత్త, మాపురా మారెడిగాయిత్తనని ఆసపెట్టి ఇయ్యల్ల ముప్పయివెయిల మార్జిన్ కట్టాలంటారు. ఆ ముప్పయి నా దగ్గరుంటే మీ దగ్గరికి ఎందుకస్త" నాయిన అన్నాడు మేనేజర్‌తో బాధగా.

"బ్యాంక్ రూల్స్ అట్లనే ఉంటయి. ముప్పయి డిపాజిట్ చేస్తే మిగతాయి మేమిస్తం. జీబు గావాలంటవు. పైసలేదంటవు. వట్టిగనే వత్తయా..." బ్యాంక్ మేనేజర్ అన్నాడు.

తండ్రి వెంటే బయటకు వచ్చాడు కైలాబ్. వచ్చాక అనిపించింది కొద్దిగా బతిమాలితే బాగుండేదని. అదే ముచ్చట తండ్రితో అంటే "అందులో మనుషులుగాదురా... రూల్స్... రూల్స్ పని చేస్తయట" అన్నాడు. అనడానికి అన్నాడుగానీ మనసును చంపుకోలేదు. ఎవలో సలా ఇస్తే బుచ్చిరెడ్డి దగ్గరికిపోయాడు. అప్పు ఇయ్యిమని వివరాలన్నీ చెబితే ఇవ్వననలేదుగానీ కొత్తమాట చెప్పాడు బుచ్చిరెడ్డి.

"నెలకు ఆరువెయిలు బేంక్‌లో కట్టాలి. నువ్వు బతకాలి. నా అప్పు తీర్చాలి. ఒక్క జీబు నడిపి ఇవన్నీ ఎట్ల తీరుస్తవురా..." అన్నాడు.

ఏదో మనసు చంపుకోలేక వచ్చాడుగానీ లెక్క చూస్తే నిజమేననిపించింది. పైగా బుచ్చిరెడ్డి అప్పు మూడు కొత్తల మిత్తి. నెలకు వెయ్యి. బ్యాంకు అప్పు తీరడానికి రెండేండ్లయితది. అప్పటి వరకు మిత్తికి మిత్తి ఇవి అరువై వెయిలయి కూసుంటయి అనుకున్నాడు. బుచ్చిరెడ్డి కూడా అదే తొవ్వలో ఆలోచిస్తున్నాడు. అప్పు ఇవ్వడానికి మనసొప్పడంలేదు. అలాగని వదలడానికి కూడా మనసొప్పడం లేదు. అందుకే సముదాయిస్తున్నట్టుగా అన్నాడు మెల్లెగా.

"ఆ తిప్పలేవో నేనే పడతాను. జీబు ఇప్పిస్తాను. నెలనెలా బేంకులో అప్పు కట్టుకో. రెండేండ్ల తరువాత ఆ డొక్కు జీబును నా మొహాన కొట్టేయ్. నా తిప్పలేవో నేనే పడతాను" అన్నాడు. పైగా "పెద్దపెద్ద రిపేరులైతే డబ్బు నేనే పెట్టుకుంటాను" అన్నాడు.



తన చెవుల్ని తానే నమ్మలేకపోయాడు నాయిన. చూసినావురా కైలాబూ బారీగుణం బారీ గుణమే అన్నాడు. అప్పుడు తనక్కూడా నిజమే అనిపించింది. ఏ లాభమూ ఆశించకుండా రెండేండ్లు అప్పు ఆగడం, తర్వాత కూడా డబ్బు కాకుండా వస్తువే తీసుకోవడం విచిత్రమే అనిపించింది. వెంటనే ఒప్పుకున్నారు.

తను ముప్పయి వెయిల అప్పు తీసుకుంటే రెండేండ్ల తర్వాత జీబు మిగిలినా అరవై వెయిల అప్పు కూడా మిగులుతుంది. ఇలాగైతే జీబు మిగలదు. అప్పు మిగలదు. రెండేండ్ల తరువాత జీబు వ్యాల్యూ కూడా అంతే ఉంటుంది. ఇక తనకు నష్టమేంటీ అనుకున్నాడు.

కాయితాలు రాతలు పూర్తయ్యాయి. రోజూ సాయంత్రం పూట జీబును బుచ్చిరెడ్డి ఇంటి ముందుంచాలి. తెల్లారినాక తీసుకెళ్ళాలి. చిన్నచిన్న రిపేర్లు కాదుగానీ గ్యారేజీ రిపేర్లు బుచ్చిరెడ్డే పెట్టుకోవాలి. ఇలా ఒప్పందం కుదిరిందో లేదో కమాండర్ జీబు ఇంటి ముందుకు వచ్చింది. అది పొద్దంతా నాయిన చేతుల్లో రాత్రిపూట బుచ్చిరెడ్డి గ్యారేజ్‌లో నివాసం చేసుకుంది.

రాత్రికి రాత్రి కడుపు నొచ్చినా, పాణం బాగా లేకున్నా, బరువు మనుషులు నొప్పులు పడినా, పెండ్లీలకు, పేరంటాలకు జీబుకు గిరాకీ దొరికేది. రెండేండ్లలో నాయిన నలుగురికి పనిని నేర్పించి విడిచిపెట్టాడు. వారిని దొరకబట్టుకుని ఇలాగే జీబులు, ఆటోలు కొనిచ్చి తన స్కీంలో చేర్చుకున్నాడు బుచ్చిరెడ్డి. నాయిన మంచితనాన్ని పెట్టుబడిలా మార్చుకున్నాక అతడి ఇల్లు గ్యారేజి అయింది. బినామీ పేర్లు, వేరువేరు స్కీంలతో బేంకు అత్తగారి ఇల్లయింది రెడ్డికి.

రోజురోజుకు పోటీ పెరిగింది. ఎవరితోనోకాదు. యజమానితో... తను పనినేర్పిన కుర్రాల్లతో. గ్రామీణ బ్యాంకులోని స్కీములతో! ఆ పరుగులతోనే రెండేండ్లు గడిచాయి. మొదటిరోజుల్లో వెనకేసుకున్న ఐదూ పదీ చివరి రోజుల్లో గిరాకీ సరిగ్గా తగలక బేంకు అప్పుకు కలపవలసి వచ్చింది. కూడబెట్టిన డబ్బు ఎక్కడికి నడవాలో అక్కడికి నడిచింది.

రెండేండ్లు గడిచినాక గానీ అసలు సూత్రం బోధపడలేదు. మరో ఏడాదైతే బుచ్చిరెడ్డి బాకీ కూడా ఖతం. తను చేసిన శ్రమకు లాభంగా జీబు మిగులుతుండెనని. రెండేండ్ల శ్రమ తర్వాత తను మళ్ళీ మొదటికే వచ్చాడని. బుచ్చిరెడ్డి మాత్రం పెట్టిన పెట్టుబడిని మిత్తీతో... మిత్తికి మిత్తీతో వసూలు చేసుకున్నడని.

ఇప్పుడు మరో వెయ్యి ఎక్కువిస్తేనే కిరాయికిస్తానని ఖచ్చితంగా చెప్పాడు బుచ్చిరెడ్డి. జీబు చేతులు మారాలన్నది అసలు విషయం. ఉన్నదే ఎల్లుతలేదు. మరో వెయ్యి ఎక్కడి నుండి తెచ్చేదని నాయిన జారవిడిచాడు.

"ఓ పొడా... జర మెల్లెగ పోనీ... ఊరచ్చింది. ఎవలన్న పిల్లనో తల్లినో గుద్దినవంటే దండుగ రుజుమానకు నీ ఇల్లు సాలది" అదిలించింది తిరుమలవ్వ.

టేపు బందుజేసి స్లో చేశాడు కైలాబ్. అతడికి ఆశగా ఉంది. కనీసం నలుగురైదుగురు ఎక్కకపోతరా అనుకుంటుండగానే పందిపిల్ల ఒకటి పరుగెత్తుకు వచ్చింది. ఎనుక పయ్య కింద పడి గావుకేక పెట్టింది.

"ఎరుకలోల్లు వచ్చిరాంటే ఈపుకు సున్నం బెడుతరు. ఉరుకనీ..." యాదగిరి అన్నాడు. కైలాబ్‌కు భయమే చుట్టుకుంది. వెనుక ఎవరివో అరుపులు వినిపించాయి. తిరిగి చూడకుండా వేగాన్ని పెంచాడు.

"ఆ... నువు ఆర్టీసీల ఇట్లజేస్తే ఇంటికే తోలిత్తరు" ఒక టీచర్ అన్నాడు. "ఆ పని మొన్ననే చేశారు. లైసెన్స్‌లో ఏదో తప్పు దొరికిందట" మరో టీచర్ ఎత్తిపొడిచాడు.

"పాపం... రెండేండ్ల పొద్దు జేసిండు. పని చూడాలినే గనీ కాయిదం మీద ఏముం దయ్యా" సత్తయ్య సానుభూతి.

"ఎన్నేండ్లయితేంది...? సర్కారుకు సాలామూలా!" తిరుమలవ్వ అన్నది. మాటలు వింటూనే దారులు వెదుకుతున్నాడు కైలాబ్. జనం నడుస్తున్నారు. వత్తున్నారు పోతున్నారు. జీబు కొరకు మాత్రం ఎవరూ లేరు. దిగులుగా, భయంగా గంగమ్మవాగు దాటాడు కైలాబ్.

చేతిలో పైసలేక నాయినకు మందులు కొనలేదు. కారణమేమిటో కానీ జరం అందుకుంది. ఇవ్వాల్ల గూడ తేలేదేమో! గంపెడు ఆశను చూపించి వచ్చాడు ఇంటివద్ద. ఇంటికెళ్ళడానికీ మొహం చెల్లదేమో!

పాట మళ్ళీ మొదలయింది. తొవ్వ సాగుతనే ఉంది. సర్వాయిపల్లి, బొప్పారం, గొల్లపల్లి, డాంబర్ రోడ్... ఎక్కడా ఒక్క పురుగు లేదు. ఆశ నిరాశయింది. పెద్ద దుకాండ్ల చిట్టీ ఇచ్చి ముందుకు సాగాడు కైలాబ్.

"ఆగాగు. కాలేజి వచ్చింది" పిల్లలిద్దరూ దిగి చిల్లరపూసలిచ్చి గేటు దాటారు. లెక్కించుకుంటే రూపాయి తక్కువ. నిలబెట్టి అడిగితే మళ్ళీ జీబెక్కరు. అపురూపంగా జేబులో వేసుకుని ముందుకు పోనిచ్చాడు. ప్యాట్లో పూర్తి ఖాళీ అయింది. డిజిల్ మందం రాలేదు. బస్టాండ్‌లో పెడితే లైనులో రావాలన్నారు. ఏడెనిమిది వరకూ అన్నీ ప్యాసింజర్ జీబులే. వాటిని డామినేట్ చేసి దాట వేసేందుకు ఆటోలు. అన్నింటి మీదా బ్యాంకు ఆర్థిక సహాయంతో అన్న ముద్రలు. ఓనర్లు ఎక్కడో ఉన్నారు. కాళ్ళు రెక్కల్ని నమ్ముకున్నాల్లు కండ్లల్లో వత్తులేసుకుని 'సిరిసిల్ల... సిరిసిల్ల' అని అరుస్తుండ్రు. అబ్బ... ఇంట్ల కూసుండి బొమ్మలాట ఆడిత్తండ్రు అనుకున్నాడు.

అక్కడుంటే పొద్దుగూకినా గిరాకీ రాని పరిస్థితి. ఏదో గుర్తొచ్చి మార్కెట్‌వైపు వెళ్ళి ఆపాడు కైలాబ్. ఐదు నిమిషాల్లో జీబు నిండింది. కొందరిని ముందె కూర్చోబెట్టుకున్నాడు. తనకు జానెడు మాత్రమే జాగ నుంచుకున్నాడు. కూరగాయ గంపల్ని కొన్నింటిని టాపుపై వేశాడు. కొందరు వేళాడుతూ నిలబడ్డారు. అందరూ డైరెక్టే. కైలాబ్‌కు పట్టరాని సంతోషమచ్చింది. నాలుగు ట్రిప్పులు ఇట్ల దొరికితే రెండుగాదు పదైనా కట్టచ్చు కిరాయి అనుకున్నాడు.

జీబు రాగెట్లపల్లె మలుపు తిరిగింది. ఎంత వేగంగా ఎక్స్‌లేటర్‌ను నొక్కాడో అంతకంటే వేగంగా బ్రేకు నొక్కాడు. జీబు కిర్రుమంది. లోపల ఉన్నాళ్ళు గుద్దుకున్నారు. నిలబడ్డోళ్ళు తూలిపడబోయి నిలదొక్కుకున్నారు.



"ఓ... బోషిడికే... సంపుతావురా...?" ఎవరో అరిచారు.

"వీని తలపండు వలుగ. వీనినాం నరుక. వీని మొదలార. పుర్రె వలుగుతుండె..." ఎవరినో గానీ ఎవరో తిడుతున్నారు. అడ్డువచ్చిన లారీని తప్పించి ముందుకు కదిలింది జీబు. వెనుక నుండి తరుముకొత్తున్నట్టు లోకల్ సర్వీస్, అది ముందు పడిందంటే తొవ్వపొంట ఒక్కరు దొరుకరు. స్పీడందుకుంది జీబు. మధ్య మధ్య ఎక్కుడూ, దిగుడూ. యాడ ఎక్కిత్తవు, నెత్తిమీద ఎక్కిచ్చుకో అంటూ ప్యాసింజర్ల సూటిపోటి మాటలు... చిల్లర పైసలకాడ గొడవలు... మొత్తం మీద సిరిసిల్లకు చేరింది జీబు.

కొద్దిగా తెరిపి దొరికింది. తేలిగ్గా ఊపిరి పీల్చుకున్నాడు కైలాబ్. జీబు దిగాడో లేదో మళ్ళీ జనం చుట్టుకున్నారు. మలిపి పెట్టగానే నిండా నిండారు. చాయి తాగి ఎక్కి కూర్చున్నాడు. జాగ జానెడు కూడా మిగల్లేదు కూర్చోవడానికి. సదురుకొని కూర్చున్నాడు.

అనుకోకుండా వచ్చిన అవకాశానికి ఆనందంగా ఉంది. అబ్బ! వారానికి మూడురోజులు ఇట్ల నడిచినా మంచిగుంటది అనుకున్నాడు. ఎందుకో కాని తను చేసింది కరక్టేనన్న పూర్తి నమ్మకం ఏర్పడింది. ఇయ్యాల్ల రేపు రెండురోజుల కిరాయి బుచ్చిరెడ్డి మొహాన కొడుత అనుకున్నాడు.

పెద్దూరు మలుపుకాడ జీబుకు సడన్‌బ్రేకులు పడ్డాయి. మళ్ళీ తిట్లు, మూలుగులు. అవేవీ వినిపించడంలేదు కైలాబ్‌కు. ఎదురుగా రోడ్డు పక్కగా నిలబెట్టిన తెల్లకారు మాత్రమే కనిపిస్తోంది. కారులోంచి తనవైపు విలాసంగా చూస్తున్న ఆర్.టి.ఓ మాత్రమే కనిపిస్తున్నాడు.

"ఇగ నీ పని అయినట్టే. ఆఫీసర్ కొత్తగచ్చిండు" ఎవరో అన్నారు.

"అవును. ఎన్నో అవసరాలుంటయి. చెయ్యి తిరుగాలెగదా..." ఎవరో నవ్వారు. పీర్చుకపోయిన మొహంతో ఆర్.సి. బుక్కు, లైసెన్స్‌ను పట్టుకుని జేబును తడుముకుంటూ వెళ్ళాడు కైలాబ్. సింహాసనం మీద కూర్చున్న మహారాజులా కాలు కూడా కదుపలేదు ఆర్.టి.ఓ. సగం తెరిచిన కిటికీలోంచే లావాదేవీలు జరిగాయి. అరగంట బతిమాలినాక గానీ మెత్తబడలేదు ఆఫీసర్. జేబులో ఉన్న నోట్లు చిల్లర అన్ని చదివించుకున్నాక గానీ ఆర్.సి. బుక్ చేతికి రాలేదు.

ఈలోగా ప్యాసింజర్లు వచ్చిన బస్సులో ఎక్కి కూర్చున్నారు. బస్సు ఎల్లిపోయింది. ఆర్‌టిఓ తావు తప్పదీశాడు. ఉత్త చేతులతో ఊపుకుంట ఊపుకుంట జీబు దగ్గరికచ్చాడు కైలాబ్. ఖాళీ జీబు, ఖాళీజేబు. ఏడుపొచ్చింది. 'ఇంక కేసు రాయలేదు. నయమయింది' అనుకుంటూ జీబెక్కాడు. ఎటు వెళ్ళాలో తెలియడంలేదు. కాసేపు ఆలోచించి సిరిసిల్లవైపే మరల్చాడు. ఏదో ఒకటి చెయ్యాలి. పొద్దుపోతోంది అనుకున్నాడు.

అంబటాల్ల దాటింది. ఆకలి మొదలయింది. చాయనీళ్ళకు గూడా పైసల్లేవు. అసలు కథ జీబులో డీజిల్ లేదు. తను ఖాళీ కడుపుతో రెండురోజులైనా ఉండగలడు గానీ ఖాళీ టాంక్‌తో జీబు అడుగు కదలలేదు. రోడ్డుపక్కగా ఆపి "గొల్లపల్లి... వన్‌పల్లి... వన్‌పల్లి..." అన్నాడు. వన్‌పల్లి

జంగల్ ఏరియా. అటు బస్సులు ఉండవు. ప్యాసింజర్లు ఎవరైనా ఉంటారని అన్నాడు. ఈ మాటలు మిగతా జీబుల వాళ్ళకు నవ్వును తెప్పించాయి.

కొంతమంది అతడివైపు నమ్మలేనట్టు చూశారు. మరికొందరు నిజమేనా అని అడిగి తెలుసుకున్నాక గానీ నమ్మలేదు. వాళ్ళు ఎందుకలా అడుగుతున్నారో తెలుసు కైలాబ్‌కు. అటు రోడ్డే సరిగ్గా లేదు. జీబులు తిరుగవు. ఎప్పుడో వచ్చే షటిల్ సర్వీస్. ఆరోజు అంగడి. లంబలోళ్ళు సరుకుల కొరకు ఆనాడే బయటకు వస్తారు.

"వన్‌పల్లి... వన్‌పల్లి..." మరోసారి అన్నాడు కైలాబ్. బస్సులేని తొవ్వ. యాళ్ళగాని యాళ్ళ. రెండు నిమిషాల్లో నిండారు. కైలాబ్‌కు తెలుసు. అలా నిండుతారని. కాశీకి బోతే కాటికేమోగానీ వన్‌పల్లికి బోతే వెన్ను బొక్కలిరుగుతయని జీబు డ్రైవర్లనుకుంటారని గూడా తెలుసు. గతిలేక ఆ రూటుకు పెట్టాడు.

జేబు నిండింది. కదలాలి. కానీ కదలదు. ప్యాసింజర్లు పైసలు ముందుగా ఇయ్యరు. దిగినాకనే! ఇప్పుడు డీజిల్ ఎట్లా...? మహా అయితే రెండుమూడు కిలోమీటర్లు పోతది. ఆలోచిస్తూ స్టార్ట్ చేశాడు. ముందుకు పోనిచ్చి బంక్ ముందు ఆపాడు. రెండువందల డీజిల్ పోయించాడు.

"అన్నా చిల్లర్లెవ్వు. పైసలియ్యండ్రీ" వెనక్కి వచ్చి అన్నాడు. కొందరు గులిగారు. కొందరు పారిపోతున్నమా అన్నారు. లంబడోళ్ళు. ఆడామగా. కాకిరిబీకిరి ఒర్రి ఇయ్యనైతే ఇచ్చారు. డీజిల్‌కు పోంగా రెండు ఐదు రూపాయల బిళ్ళలు మిగిలినాయి. జేబులో వేసుకుని స్టార్ట్ చేశాడు.

దిగేటోళ్ళు దిగుతున్నారు. ఒకరిద్దరు ఎక్కుతున్నారు. తొవ్వపొంట పోతుంటే గుండెలో కలుక్కుమంటోంది. ఏదేదో యాదికస్తుంది. టేపు కూడా పెట్టలేదు. ఆకలితో కడుపూ బాధతో మొహం మాడిపోతున్నాయి.

డాంబర్ రోడ్డు నుంచి మట్టిరోడ్డుకు మలిగేటప్పటికి సిరిసిల్లలో ఎక్కిన వన్‌పెల్లి ప్యాసింజర్లే ఉన్నారు. పదమూడుమంది. చాల్లే ఇదే నయం అనుకున్నాడు. వచ్చేప్పుడు కనీసం ఇరువైమంది ఎక్కుతరు. ఇది మాత్రం ఖాయం. కాకపోతే కంకరరాళ్ళు టైర్లకు కొట్టకుండ కాపాడాలె. అనుకుంటుండగానే జీబుకు బ్రేకులు పడ్డాయి.

మఫ్టీలో ఉన్న నలుగురు కానిస్టేబిల్స్ జీబు దగ్గరికొచ్చారు. వారిని తేలిగ్గానే గుర్తుపట్టి భయం భయంగానే దిగాడు కైలాబ్. ఎందుకు ఆపారో అర్థమయింది.

"పెట్రోలింగ్ బోవాలె. స్టేషన్ దగ్గరుండు. అరగంటల తిరిగొస్తం" చెప్పినట్టుగా కాకుండా ఆర్డర్ వేస్తున్నట్టుగా అని మిగతా వారందరినీ దించారు. కైలాబ్ ఏదో చెప్పబోయాడు. బతిమాలబోయాడు. బుచ్చిరెడ్డికి తనకు కుదిరిన కాంట్రాక్టు గురించి చెప్పబోయాడు. జీబు తనది కాదని వివరించబోయాడు.

వాళ్ళు ఏదీ వినలేదు. దుమ్ము లేపుకుంటూ అడవిలో మాయమైపోయింది జీబు. మా డబ్బు మాకు తిరిగియ్యమని కొట్లాట మొదలయింది. ఎంత సర్ది చెప్పినా వినరు. చేసేదేంలేక



తొవ్వలనే కూలబడిపోయాడు కైలాబ్. మనిషికో తిట్టు. మన్ను దుమ్ము. కండ్లు చెవులు మూసుకున్నాడు కైలాబ్. గులుక్కుంటూ రోడ్డువైపు వెళ్ళిపోయారు జనం.

కాళ్ళీడ్చుకుంటూ స్టేషన్ దగ్గరికచ్చి పొద్దంతా పడిగాపులు గాశాడు కైలాబ్. జీబు జాడలేదు. పత్తలేదు. ఆకలి ఎక్కువయింది. జేబులో చిల్లర ఉన్నాయిగానీ ఖర్చు పెట్టాలనిపించలేదు. జీబులో డీజిల్ ఉంటుందో లేదో తెలియదు. వచ్చినాక అరలీటరు పోసేసైనా ఇల్లు చేరవచ్చుననుకున్నాడు. ఇల్లు చేరినాక బుచ్చిరెడ్డి కిరాయి ఎట్లా అనే ఆలోచన కూడా వచ్చింది. రోజూ రెండువందలు. ఇయ్యకపోతే బొబ్బ. బద్దిలుదునాం. మొదటిరోజే ఎగనామమని చెడ్డపేరు.

తొక్కులాటలనే పొద్దుగూకింది. అప్పటిగ్గాని జీబు రాలేదు. నిండా దుమ్ము. ఎవరినో పట్టుకచ్చారు. అనుమానంగానే జీబు దగ్గరికెళ్ళాడు. చారెడో దోసెడో ఉన్నట్టుంది డిజిల్. ఇంటికైతే చేరచ్చులే అనుకున్నాడు.

జీబు చాల్ చేశాడు కైలాబ్. రెండుమూడుసార్లు మూల్గి చాలయింది. ఇయ్యాల్ల ఒక్కనాటితో ఒడిసేదిగాదు. రేపకల్లా ఇది ఇంతే! యాడాది ముచ్చట. మొదలే మొగురం గాలేదు. కొనదూలమైతదా...? ఇది నా తండ్రిని తొక్కింది. నన్ను తొక్కాలని చూస్తోంది. బ్యాంకులు, పెత్తందార్లు పాముల్ని వదిలినట్టు వీటిని వదిలింద్రు. మేం పాలుపోసి పెంచుతున్నం. రోజురోజు కిరాయి యాడనుంచి కట్టాలె...? కట్టకపోతే కాయిదాలుండే! పంచాదులు, కేసులు. ఎలా...?

కైలాబ్‌కు మనసు ఇరిగింది. జీబు మీదగాదు కానీ దాని వెనుక ఉన్న మనుషులు... వారి వెనుక ఉన్న సంస్థలూ గొట్టాలు బెట్టి రక్తాలు పీల్చే దోమల్లా కనిపించారు. దోమ చిక్కుతుంది. నలిపేస్తాం. ఈ దొర చిక్కడే! మననే నలిపేస్తాడు. ఏదో జ్ఞానబోధ అయితున్నట్టుగా అనిపించింది. ఇంతకింతకూ జీబు మీద కసి పెరుగుతోంది.

జీబును హోటల్ ముందు ఆపి టిఫిన్ చేశాడు. అప్పటికి చీకటి పడింది. ఇంటివైపు మరలుతుంటే ప్యాసింజర్లు ఆపి ఎక్కుతామన్నారు. రాత్రిపూట గాబట్టి ఎక్కువ పైసలిత్తామన్నారు. దాదాపు పదిహేను ఇరువైమంది. వద్దని చెప్పి ముందుకు కదిలాడు. దుబ్బమీది సేటు పొద్దున ఇచ్చిన లిస్టుల తాలూకు సామాన్లు తెచ్చి చేతిలో ఇరవైనోటు పెట్టబోయాడు. వాటిని గూడా జీబులో పెట్టనియ్యలేదు. ఖాళీ జీబుతో నర్రెంగల్ల కచ్చాడు కైలాబ్. పటపట పండ్లు గొరికాడు.

జీబు దిగి ముందుకచ్చి నిలబడ్డాడు కైలాబ్. హెడ్‌లైట్ వెలుతురుకు తోడు చిక్కటి వెన్నెల. "దీనికి స్వామి భక్తి ఎక్కువ. కాలబెట్టినా, గుట్ట మీది నుంచి కిందికి నూకినా ఇన్సూరెన్స్ రూపంలో ఇంటిముందు తేలుతది, పాణమొక్కటి లేదన్నట్టుగానీ పాణాలకు పాణాలు దీత్తది" కోపంగా అంటూ బానెట్ ఎత్తాడు.

యంత్రమర్మం తెలిసినోడు. ఎక్కడేం చేశాడో గానీ అరగంటలో పొగ లేచింది. శవం కాలిన కమురువాసన. ఎందరి రక్తాలనో తాగి చీకట్లో ముడుచుకు పన్న రక్త పెంజెరలా జీబు నడితొవ్వలో.

"ఇది కదలాలంటే వెయిలు గావాలె. ఇది మేజర్ రిపేర్. రెడ్డి ఖాతాలకే పోతుంది. సావని కొడుకు. పాముల్ని ఇడిసి పెడ్తార్రా బచ్చా నా కొడుకుల్లారా... తెలువక పడిగెనీడలకు బోవడితిమి... రెండుమూడు సార్లు గిట్ల జేత్తే రోగం కుదురుతది కొడుకులకు..." వదురుతూ ఇంటివైపు కదిలాడు కైలాబ్.

*ఆదివారం ఆంధ్రజ్యోతి, 10 నవంబర్ 2002*



# 11

# నిశ్శబ్దపు పాట

**శ్రీకాంత్**



ఒక సుందర స్వప్నాన్ని సాకారం చేసుకోవడానికి పడాల్సిన శ్రమను, తపనను వివిధ పార్శ్వాల నుండి ప్రతీకాత్మకంగా చిత్రించిన కథ 'నిశ్శబ్దపు పాట.' రచయిత శ్రీకాంత్ 18 నవంబర్ 1972లో పుట్టారు. మొదటి కథ కోరిక 1994లో ఆంధ్రభూమిలో అచ్చయింది. రెండు కవితా సంపుటాలు 'కొన్ని సమయాలు', 'యితర' ప్రచురించారు. ఉపాధ్యాయ వృత్తిలో ఉన్నారు.

*చిరునామా : బి-61, ఫస్ట్ ఫేజ్, వనస్థలిపురం, హైదరాబాద్ - 070.*

అజ్మత్ ఉదయాన్నే లేచి, ఆరోజు శెలవు దినం కావడంవల్ల పనిముట్లన్నీ ముందు వేసుకొని ఇంటి ఆవరణలోని వేపచెట్టు కింద కూర్చున్నాడు. అప్పటికే లేచి, ముఖాలు కడుక్కుని, టీ తాగి వీధిలో గెంతుతున్న పిల్లలు తండ్రి వేపచెట్టు కింద చేరటం గమనించి, అలవాటైన ఆనందంతో ఆటల్ని ఒదిలి, గేటు తీసుకుని అతడి ముందు చేరారు.

"నాన్నా ఈవేళ పూర్తవుతుందా?"

ఎదురుగా మోకాళ్ళ చుట్టూ చేతులు కట్టుకుని, ఆసక్తి నిండిన కళ్ళతో, పనిముట్లనూ, పక్కగా కుప్పపోసిన కాగితాలనూ నిండుగా తెరుచుకున్న కళ్ళతో, వేపాకుల నీడలు పడి మెరుస్తున్న, నాలుగేళ్ళ కొడుకు ముఖం గమనించి అజ్మత్ చిర్నవ్వాడు.

"ఈవేళ అవుతుంది తప్పకుండా" కొడుకు పక్కగా నిల్చుని, నడుంపై రెండు చేతులూ బిగించి చూస్తున్న ఆరేళ్ళ కూతురు చెప్పింది. వాళ్ళిద్దరినీ పరిపూర్ణమైన శాంతి నిండిన ముఖంతో గమనించి "మీరు అల్లరి చేయకూడదు, నన్ను మధ్యలో విసిగించకూడదు. మరి మీరు లోపలికి వెళ్ళి మీ అమ్మేం చేస్తుందో చూసిరండ"ని వాళ్ళని పురమాయించి తలవంచుకుని, పనిముట్లని తనకు అవసరమైన పద్ధతిలో అమర్చుకోవడంలో నిమగ్నమయ్యాడు.

పిల్లలు లోపలికి పరిగెత్తుకు వెళ్ళి వంటగదిలో స్టవ్ వద్ద ఉదయపు ఫలహారం చేస్తున్న తల్లి వద్దకు చేరారు. కొడుకు తల్లి నడుం చుట్టూ చేతులు వేసి అడిగాడు "అమ్మా నాన్నీపూట తయారుచేస్తాడా?"

"నేను చెప్పానుగా ఈవేళ అయిపోతుందనీ" కూతురు బదులిచ్చింది.

స్టవ్‌పై ఉన్న పాలగిన్నెను పక్కకు దించి, వెనుదిరిగి కొడుకు జుత్తును వేళ్ళతో నిమురుతూ, నవ్వుతూ అయేషా అడిగింది, "ఆడుకోకుండా అప్పుడే వచ్చేశావేం?"

"నాన్న పనికి కూర్చోగానే లోపలికి వచ్చేశాడమ్మా. క్రితంసారిలాగే పాడుచేస్తాడు. అంతా అయిపోతుందనుకున్నప్పుడు తొక్కాడు" కూతురు ఆరోపించింది.

"వాడు చూసుకోలేదులేవే" అని కూతురితో అంది కాని, రెండు వారాల క్రితం పండుగ శెలవునాడు పగలంతా కూర్చుని భర్త తయారుచేస్తున్నది అయిపోతుందనగా, కొడుకు చూడక దానిని తొక్కిన తర్వాత, తీవ్రమైన తన భర్త ముఖం గుర్తుకు వచ్చింది. తనకు తెలుసు భర్తకి అదంటే ఎంత ప్రాణమో. పెళ్ళయిన కొత్తలో, వొకరాత్రి తనకు ఆ విషయం చెప్పినప్పుడు వింతగా అనిపించింది. భర్త సరదాగా మాట్లాడుతున్నాడేమో అనుకుంది. అటు పిమ్మట, అతడు నిజంగానే చెబుతున్నాడని గ్రహించాక, పిచ్చివాడేమోనని భయపడింది. అతడు చెప్పాడు, అతడికి చిన్నప్పటి నుంచీ అది ప్రాణప్రదమైన కోరికని. కానీ అదేం కోరిక? మతివున్న మనిషికెవరికైనా అటువంటి కోరికలు ఉంటాయా? పెళ్లయిన నాలుగోరోజు, అతడు తన ఇంటి వెనుక గదిలో దాచి ఉంచిన సామానునీ, పనిముట్లనీ, కట్టలుగా కట్టి ఉంచిన వేలకొలది కాగితాల్ని చూపించాక భయపడింది.



అతడు ఉద్వేగంగా, చిన్నప్పటి నుంచి దాని నిర్మాణానికై తను వ్రాసుకున్న సమాచారం నిండి ఉన్న ఆ వేలకొలది కాగితాల్ని చూపించాక విస్మయం చెందింది. ఎటువంటి భర్త తనకు లభించాడు! ఇతనితో జీవితాంతం కాపురం చేయాలి! తన తల్లిదండ్రులు ఒక పిచ్చివానికి తనను కట్టబెట్టలేదు కదా!

అయితే ఆ తర్వాత ఆమె గ్రహించింది. అతనిలో ఆ ఒక్క వాంఛ మినహా, పేరు పెట్టాల్సిన నెపమేమీ లేదని. అతడు నెమ్మదస్తుడు. మితభాషి. పైగా తనను అమితంగా ప్రేమిస్తాడన్న విషయం త్వరలోనే గ్రహించింది. ఇంట్లోకి ఏ లోటూ లేదు. అద్దెకు ఉన్న ఇల్లయినా, సౌకర్యవంతంగా ఉంటుంది. అతడు చేసే ఉద్యోగానికి వచ్చే జీతానికి సరిపోయేటట్టుగానే ఉంటుంది. ఎటువంటి ఆరోపణలూ లేవు. ఉంటే ఏవన్నా, అప్పుడప్పుడూ చుట్టుపక్కల వాళ్ళు, అతడు ప్రతి ఆదివారం లేదా శెలవు దినాన సామాన్లన్ని ముందు వేసుకుని ఇంటి ఆవరణలో తయారుచేస్తున్న దేమిటో తెలుసుకుని ఆటపట్టించడం తప్ప. "వాళ్ళ మాటలు నువ్వు పట్టించుకోకూడదు" అతడు అనేవాడు.

"వాళ్ళు మీపై నవ్వుతారు. ఏవంటారో తెలుసా? ప్రపంచంలోని వింత హైదరాబాద్‌లో మీ రూపంలో ఉందని"

"అలాగా. వాళ్ళకి ఇది ఎందుకు ఆశ్చర్యం కలిగిస్తుందో నాకు అర్థంకాదు. కానీ యేషా, మా ఊర్లో దాదాపు ప్రతి ఒక్కరూ దానిని తయారుచేసినవాళ్ళే. వాళ్ళకి అది పెద్ద విద్యేం కాదు. కాకపోతే వర్షంలోనే వెళ్ళాలన్న నియమం వల్ల మరింత దూరం పోలేకపోయేవాళ్ళు. కానీ, చక్కటి నైపుణ్యం ఉన్న వాళ్ళు ఎంత చక్కటి రూపాలతో తయారుచేసేవాళ్ళో తెలుసా?"

"ఏమో నాకు తెలీదు. వాళ్ళలా మాట్లాడుతుంటే నాకు బాధగా ఉంటుంది. అదీగాక, వాళ్ళు వాళ్ళ ఇళ్ళకు వచ్చిన ప్రతీ ఒక్కరికీ చెబుతుంటారు. 'మీకిది తెలుసా, మా ఇంటి పక్కన ఉన్నాడే అజ్మత్. అదే ఆ అబ్బాయే, అతనికి వేపకాయంత వెర్రి ఉంది' అని. నేనేం చేసేది?"

"వాళ్ళ మాటలేం పట్టించుకోకు" అని భర్త చెప్పేవాడు కానీ, తనకే అప్పుడప్పుడు అసంబద్ధంగానూ, అసహనంగానూ అనిపించేది. పెళ్ళయిన కొత్తలో ఏమనుకునేదంటే, త్వరలో దానిని మరచిపోతాడని. కానీ ఇన్నేళ్ళ తర్వాత కూడా అతడు దానిని వదిలిపెట్టకపోవడం గమనించాక, తను వొదిలిపెట్టమని చెప్పడమూ మానివేసింది. మొదట్లో చుట్టుపక్కల వాళ్ళ మాటలు ఇబ్బందిగానూ, అసహనంగానూ అనిపించేవి. ఇప్పుడు ఉంటున్న ఇంటిలో తాము గత మూడేళ్ళుగా అద్దెకు ఉంటున్నారు. ఇంటి చుట్టుపక్కల వాళ్ళు మొదట్లో అతణ్ణి వింతగా చూసినా తర్వాత తర్వాత వాళ్ళకు మామూలైపోయింది. అతణ్ణి వాళ్ళు ఇబ్బందిపెట్టడం మానివేశారు. అది వాళ్ళకు ఎంత క్రమబద్ధమైన చర్యగా మారిందంటే, ఏనాడైనా ఒక శెలవు దినాన అతడు వేరే పనిపై బయటకు వెళ్ళి ఇంటి ఆవరణలో పనిముట్లతో కనిపించకపోతే, అలవాటైన దృశ్యమేదో, చర్యేదో తమ జీవితాల్లోంచి తప్పుకున్నట్టుగా అనిపించేది.

అతడు సాయంత్రం ఇంటికి వచ్చాక, వచ్చి పలుకరించి అడిగేవాళ్ళు "అజ్మత్, ఈ దినం ఏమయ్యావు? పగలంతా కనిపించలేదు. ఎంతవరకు వచ్చింది నీ పని" అని.

అయితే అన్నింటికంటే, అందరికంటే అతడు చేయాలనుకున్న పని గొప్ప ఆనందాన్ని ఇచ్చేది, పిల్లలకి. వాళ్ళు మాత్రమే, అతడు చేసే పనిని ఎటువంటి సందేహాలు లేకుండా, అతడు చాలా సహజమైన దానినేదో చేస్తున్నట్టుగా, పూర్తి సమ్మతితో, ప్రతి శెలవు దినాన అతడి పక్కన చేరి, నవ్వులతో, తమ సందేహాలతో, అతడి పనిలో పూర్తిగా నిమగ్నమయ్యేవారు.

"నాన్నా నువ్వు తయారుచేసిన తర్వాత అదెలా తయారుచేయాలో నువ్వు నాకు నేర్పాలి" కూతురు అడిగేది. ఆ వరండాలో, శీతాకాలపు ఎండ వేపకొమ్మల్లోంచి గోరువెచ్చగా శరీరాన్ని చుట్టుకుంటుండగా, తదేకంగా భర్త చేతులవైపూ, ముఖంవైపూ, పక్కగా కూర్చుని శ్రద్ధగా చూస్తున్న కూతురి ముఖంవైపూ చూస్తూ అప్పుడప్పుడూ విస్మయం చెందేది. 'పొరపాటున దీనికి తండ్రి అలవాట్లు రావుగదా!'

"ఎలా పనిచేస్తున్నానో చూడు. దానంతట అదే నీకు వస్తుంది" అతడు సమాధానమిచ్చేవాడు.

అయితే, తను గర్భంతో ఉండగా ఒక రాత్రి, అతడు చెప్పాడు. "ఒకవేళ నేను పూర్తి చేయలేకపోతే, ఇది తప్పక చేయగలుగుతుంది. ఎంత తెలివిగలదో ఎప్పుడైనా గమనించావా?" మరొకరోజు, అతడు దానికి సంబంధించిన చరిత్రనంతా ఆమెకు వివరించేందుకు ప్రయత్నించాడు. ఒకానొక సమయంలో, తమ వంశంలోనే కాక దేశంలో ప్రజలందరూ వాటిని తయారుచేయటమే కాక, గ్రామాల్నుంచి గ్రామాలకు ప్రయాణం కూడా చేసేవాళ్ళట. ఆ తర్వాత గొప్ప కరువు తర్వాత, రోగాలవల్లా, దొరకని తిండివల్లా, నాయకులవల్లా నేల విడిపోగా, వాటిని గొప్ప నైపుణ్యంతో తయారుచేసే ప్రజలు చెట్టుకొకళ్ళూ, పుట్టకొకళ్ళూ విడిపోయాక, కాలంతోపాటు రానురానూ వాటిని తయారుచేయటం తగ్గిపోయిందట. అతడి తండ్రి సమయానికి వచ్చేసరికి ప్రపంచం మొత్తంమీద, వాటిని తయారుచేసి ప్రయాణం చేయగలిగే వాళ్ళు అతి కొద్దిమంది మాత్రమే మిగిలారట.

"నువ్వు నమ్మవుగానీ, నాకు ఆరేళ్ళు ఉన్నప్పుడు, మా నాన్న ఎంత చక్కటిదానిని తయారు చేశాడంటే, ఎంత పటిష్టంగా ఉండేదంటే, వర్షపు పండుగనాడు నన్ను ఎక్కించుకుని పందెంలో పాల్గొని గెలిచాడు. అది గొప్ప ఘనకార్యం. ఎందుకంటే అప్పట్లో ఒక్కరు మాత్రమే పట్టి ప్రయాణం చేయగలదానిని తయారుచేయటం గొప్ప. నేను నాన్న తయారుచేసిన లాంటి దానిని తయారు చేయలేనేమో కానీ, ఒక్కరు వెళ్ళేదానిని తయారు చేయగలనేమో"నని అతడు చెప్పేవాడు. అది నమ్మాలా, వద్దా అనే సందిగ్ధంతో తను అడిగింది. "మీరు కాక ఇప్పుడు వాటిని తయారుచేస్తున్న వాళ్ళెవరైనా ఉన్నారా?"

"తెలీదు. ఉండి ఉండవచ్చు. యేషా, నా బాల్యంలో ఊర్లో చాలామంది ఉండేవాళ్ళు. అయితే వాళ్ళంతా వయసు మళ్ళినవారు. ఆ తర్వాత తరంలో ఎవరికైనా జ్ఞాపకం ఉందో లేదో తెలియదు. ఎందుకంటే చాలామంది పట్నాలకు వచ్చేశాం కదా" అతడు చెప్పేవాడు.



అయితే, తను భర్తకు ఎప్పుడూ అడ్డు చెప్పలేదుగానీ, ఒక సందేహం మాత్రం ఎప్పుడూ ఉండేది. ఇప్పుడు కూడా ఉంది కానీ మునుపటంతటి తీవ్రతతో కాదు. అంతెందుకు. తనకు తన బాల్యపురోజులు జ్ఞాపకం. వర్షాకాలం, బయట వీధులలో ఆడుకునేందుకు కుదరదు కనుక, స్కూళ్ళ నుంచి వచ్చాక, మబ్బు పట్టిన ఆకాశం కింద రాబోయే వర్షంలో రెండురకాల ఆటలు మాత్రమే సాధ్యం అయ్యేవి. ఒకటి, వర్షాన్ని పట్టించుకోక వర్షంలో తనలాగే ఇళ్ళలోంచి తప్పించుకు వచ్చిన పిల్లలతో గెంతడం లేదా అది సాధ్యం కానప్పుడు, మబ్బులు చిక్కగా అలుముకోగానే కాగితాలు చించి రకరకాల పడవలు తయారుచేసి కురవబోయే వర్షం కోసం ఎదురుచూడడం. అటు పిమ్మట, గుమ్మం ముందు తడవకుండా ఉండేందుకు అవస్థలు పడుతూ, పారుతున్న వర్షపునీటిలో కాగితపు పడవలను వొదిలి అవి కానరాకుండా పోయేదాకా గమనించడం. కానీ అటువంటి సమయాలలో తనకు వూహ మాత్రమైనా తట్టలేదు, తను మరికొంతకాలం తర్వాత, ఒక కాగితపు పడవను తయారుచేసి, దానిలో వర్షపునీటిలో ప్రయాణించాలనుకునే మనిషితో జీవిస్తుందని. ఎటువంటి కోరిక! అది సాధ్యమేనా? అతడు సాధ్యమేనంటాడు. అంతేకాక, తను తన తండ్రితో అటువంటి కాగితపు పడవలో పందెంలో పాల్గొని గెలిచానని చెబుతాడు. ఎటువంటి మాటలు! లేకపోతే, మనిషి పట్టేంత కాగితపు పడవను తయారుచేసి దానిలో ప్రయాణించాలనుకోవడం ఏమిటి? తను ఎవరికీ చెప్పలేదుగానీ, రాత్రుళ్ళలో అతడు గంటలకొలదీ తన కోరికలను వివరించేవాడు. అతడు ఒక కాగితపు పడవను తయారుచేసి, దానిలో సముద్రాలపై ప్రపంచాన్ని చుట్టి రావాలనుకుంటాడు. కానీ, అది ఎలా సాధ్యం? ఒకరాత్రి, తను సరదాగా అతడ్ని ఆట పట్టించేందుకు అడిగింది. "ఇంకా వేటితో పడవల్ని తయారుచేసి ప్రయాణించాలని మీ కోరిక? పోనీ మేఘాలతో చేస్తే?" తను సరదాగా అడిగినదాన్ని, అతడు మహాగాంభీర్యంతో యోచించాడు. "నిజమే. ఎంత అద్భుతమైన ఆలోచన" అతడు అన్నాడు. ఆ తర్వాత, వారంరోజులు, అతడు నిజంగానే మేఘాలతో తయారుచేసే పడవల గురించి తీక్షణంగానూ, దీర్ఘంగానూ ఆలోచించాడు.

"బరువు వొక్కటే సమస్య మబ్బులతో... వాటిని భూమిపైకి ఎలాగో అలాగ తీసుకు రావచ్చు కానీ నీకు తెలుసుకదా, ఒక పడవని అది ప్రయాణించబోయే నీటి సాంద్రతను బట్టి తయారుచేయాలని." ఆమె నవ్వింది. కానీ, మూడేళ్ళ క్రితం కొత్తగా ఈ ఇంటికి వచ్చిన తర్వాత, అతడు మొదట చేసిన పని, ఇంటి ముందున్న వీధి వెడల్పూ, సగటు వర్షం పడితే ఎంత నీరు ప్రవహిస్తుందో, దాని సాంద్రత ఏమిటో కనుక్కునే ప్రయత్నం చేయటం.

"ఏం చేస్తున్నావు నాన్నా?" అని కూతురు అడిగేది. గర్వం నిండిన స్వరంతో, మెరుస్తున్న కళ్ళతో అతడు చెప్పేవాడు. "పడవ తయారుచేసేందుకు కొలతలు తీసుకుంటున్నాను."

ఎటువంటి సమాధానం. తనైతే ఎవరికీ చెప్పలేదు, కానీ పిల్లలు తమ తోటి స్నేహితుల తోనూ, ఆఖరుకు స్కూల్లో టీచర్‌కూ చెప్పారు. ఒకరోజు స్కూలులో పిల్లలందరినీ ఆదివారం పూట ఇంటివద్ద ఏం చేశారని అడిగారట. అందుకు కూతురు తను, నాన్న కాగితం పడవ తయారు చేస్తుంటే సహాయపడ్డానని చెప్పిందిట. ఆ సమాధానపు అసలు అర్థం అర్థంకాని మాష్టారు దీనిని,

"నీవు ఆడుకునేందుకా?" అని అడిగితే, "ఊహూ, మా నాన్న దానిలో వెళ్ళాలి. వర్షం నీటిలో" అని చెప్పిందిట. ఆ తర్వాతి ఆదివారం, తన క్లాసులోని పిల్లలు సగంమంది ఇంటికి వచ్చారు. కాగితపు పడవని చూసేందుకు మాష్టారుతో సహా! ఆ మాష్టారు అన్నాడు కదా,

"అజ్మత్. గొప్ప అలోచన. నా బాల్యంలో మా తాతగారు చెప్పేవారు. ఒకప్పుడు కాగితపు పడవలతో నదులు దాటే మనుషులుండేవారని. అటువంటి వాళ్ళని మొదటిసారిగా చూడటం. మీ ప్రయత్నం ఫలించాలని ప్రార్థిస్తున్నాను."

ఇతడ్ని చూసి స్కూల్లో మరుసటి రోజు నుంచి పిల్లలు పడవలు తయారుచేసేందుకు ప్రయత్నించడం మొదలుపెట్టారనీ, ఇంటివద్ద చదవటం లేదనీ, పడవలు తయారుచేయటం చదువుకి ఆటంకం కలిగిస్తుందనీ, చాలామంది తల్లిదండ్రులు ప్రిన్సిపాల్‌కు ఫిర్యాదు చేశారట. "చాలా మంచి పరిణామం. వాళ్ళని తయారుచేయనివ్వండి. ఎందుకంటే ఒకరోజు ఈ ప్రపంచం మొత్తం కాగితపు పడవలు తయారుచేసి వాటిలో ప్రయాణించగలిగే వాళ్ళతో నిండిపోతుంది" అజ్మత్ అన్నాడు. కానీ, తనకీ అప్పుడప్పుడూ కొద్దిగా అసహనం, చికాకు. వారంలో దొరికే ఒక్క శెలవు దినాన కూడా అతడు తనతో గడపకుండా, పనిముట్లన్నీ ముందేసుకుని కాగితపు పడవను తయారుచేస్తున్నానని కూర్చోవడం.

"అమ్మా నువ్వు బయటకు రావా. నాన్నను చూద్దాం. ఈవేళ తప్పక పూర్తవుతుంది. సాయంత్రం వర్షం పడితే నాన్న దాంట్లో వెళ్ళడం చూడొచ్చు" కూతురు అంది. పొట్టలో దాచుకున్న కొడుకు ముఖం లేపుతూ, "మీరు వెళ్ళి కూర్చోండి. నేను వంట చేయొద్దూ. మీకు ఆకలిగా లేదూ?" అని అడిగింది. పిల్లలిద్దరూ తల అడ్డంగా ఊపారు. ఆమె నవ్వి "నాకు ఆకలిగా ఉంది, మీరు వెళ్ళి నాన్న వద్ద కూర్చోండి. చికాకు పెట్టకండి" అంది. పిల్లలు తలలు ఊపి ఇంటి ఆవరణలో చేరేసరికి అజ్మత్ కాగితాలను జాగ్రత్తగా, మందంగా ఉండేటట్టు అంటించడం పూర్తిచేసి, వాటి అంచుల చుట్టూ మేకులు కొడుతున్నాడు. అతడికి రెండడుగుల దూరంలో, పిల్లలిద్దరూ మొక్కలకు పక్కగా ఉన్న రాళ్ళపై కూర్చుని పనిచేస్తున్న తండ్రిని గమనించసాగారు.

అజ్మత్ ముందుగా అంటించిన కాగితాలన్నిటికీ జాగ్రత్తగా మేకులు కొట్టి, వివిధ గణితా కారాలలో ఉన్న ఆ కాగితాలన్నిటినీ పక్కకు పెట్టాడు. అతడు సంవత్సరాల తరబడి, తను ప్రయాణించగలిగే కాగితపు పడవను తయారుచేసే క్రమంలో గమనించినది ఏమిటంటే, పడవ పొడవూ, దాని బరువూ మధ్య తులనాత్మకమైన నిష్పత్తి ఉండాలనేది. రెండోది, ఒక కాగితపు పడవలో ప్రయాణించాలంటే తన బరువుకన్నా పడవ బరువు రెండింతలు ఎక్కువగా ఉండాలి. మూడోది ఏమిటంటే, తన ప్రాథమిక లక్ష్యం ఏటవాలుగా ప్రవహించే వర్షపునీటిలో ప్రయాణించటం కాబట్టి, పడవ ముందుకు సాగేందుకు శక్తి నీటి ప్రవాహం ఇస్తుంది కాబట్టి, ఆ వేగాన్ని నియంత్రించేందుకు ఏర్పాటుచేసే పడవ కింది రెక్కలు పటిష్టంగా ఉండాలి. (ఇంతకు మునుపోసారి పడవను తయారు చేసి, దాంట్లోకి ఎక్కి విజయవంతంగా పది అడుగులు ముందుకు పోగానే, రెక్కలు పటిష్టంగా లేకపోవటం వల్ల, పడవపై నియంత్రణ లేక, ఎదురుగా ఉన్న రాయిని ఢీకొని పడవ మొత్తం



ధ్వంసం అయింది.) నాలుగోదీ, ముఖ్యమైందీ ఏమిటంటే, నీరు కాగితపు పడవలోకి అడుగుభాగం నుంచి ఇంకకుండా చూసుకోవడం.

చాలా ప్రయత్నాల తర్వాత, చాలా పడవలు విఫలమైన తర్వాత అతడు దానికొక మార్గం కనుగొన్నాడు. పడవ అడుగుభాగంలో ఏర్పరిచే కాగితపు పొరల మధ్య పల్చటి ఇసుకతెరను అమర్చటం ద్వారా, పడవలోకి నీరు ఇంకడాన్ని చాలామటుకు అరికట్టవచ్చునని. ప్రాథమిక పనులన్నీ అయిన తర్వాత, కాగితాలతో పడవలో ఉండవలసిన భాగాలన్నిటినీ తయారుచేశాడు. గాలి దిశ మారినప్పుడల్లా పడవను అదుపు చేసేందుకు కాగితపు తెరచాప, తను కూర్చునేందుకు దృఢమైన కాగితపు కుర్చీ, చిన్నచిన్న కదలికలకు అవసరమైన చిన్న చక్రం, ఒకదాని తర్వాత మరొకటి పూర్తి చేశాడు.

"అయిపోయిందా నాన్నా?" పిల్లలు అడిగారు.

"ఇంకా కొద్ది పని మిగిలి ఉంది" నెత్తిన చుట్టుకున్న తువ్వాలును విప్పి ముఖం తుడుచుకుని, "అమ్మేం చేస్తుంది?" అని అడిగాడు. "లోపల ఉంది నాన్నా" అని బదులిచ్చిన కూతురితో "కొద్దిగా టీ పెట్టమను" అని చెప్పి కొడుకు వైపు తిరిగి "ఒరేయ్. నువ్వు నా గదిలోకి వెళ్ళి పెన్నూ, పుస్తకం పట్టుకురా" అని పురమాయించాడు. ఆ తర్వాత కొడుకు తెచ్చి ఇచ్చిన పుస్తకంలో తయారుచేసిన భాగాలన్నిటి కొలతలనూ, వాటి బరువునూ జాగ్రత్తగా పుస్తకంలోకి ఎక్కించాడు.

"ఈ కొలతలన్నిటినీ ప్రతిసారీ వ్రాసుకోవలసిందేనా?" అయేషా ఒకసారి అడిగింది. అతడు తలూపాడు. ఆమెకు ఒక గదినిండా పేరుకుని ఉన్న కొలతలున్న పుస్తకాల కట్టలు జ్ఞాపకం వచ్చాయి. "ఈ కొలతలు చాలా ముఖ్యం. ఒకవేళ ఈ ప్రయత్నం విఫలమైతే, ఎక్కడ తప్పు జరిగిందో తెలుసుకునేందుకు ఉపయోగపడతాయి" అతడు చెప్పాడు. ఆమెకు తెలుసు, అది చాలా కష్టమైన పనని. వీధికి తగ్గట్టు, దానిలో ప్రవహించే నీటిధారకు తగ్గట్టు పడవను తయారు చేయాలి కాబట్టి, గత తొమ్మిది సంవత్సరాలలో ఇల్లు మారినప్పుడల్లా కొలతలు మారేవి. ఇల్లు మారినప్పుడల్లా పడవ నిర్మాణమూ మారేది. అతడు గతంలో చాలాసార్లు అని ఉన్నాడు, "ఎక్కడైనా కొంతకాలం కదలకుండా ఉండే ఇల్లు దొరికితే బావుండు. నేను త్వరగా పడవను తయారుచేయ గలుగుతాను." అతడు ఇంతకు మునుపుకంటే, ఈ మూడు సంవత్సరాలూ మరింత సంతోషంగా ఉన్నాడు, తన పని తను చేసుకోగలుగుతున్నందుకూ, ఇల్లు త్వరగా మార్చే పరిస్థితి రానందుకూ.

అయితే ఆమె ఒకరోజు తన భర్తను అడిగింది "మీ నాన్నగారు ఇటువంటి కాగితపు పడవలను తయారుచేసేవారని చెప్పేవారు కదా..." "ఒక్కరుకాదు, ఇద్దరు ఎక్కి ప్రయాణంచేయగల కాగితపు పడవలు" అజ్మత్ సరిదిద్దాడు.

"అదే, మరి మీ నాన్నగారు మీకు వాటిని తయారుచేయటం నేర్పించలేదా?" తను అడిగింది.

"ఊహూ. అదేమిటంటే, పిల్లలకు వాటిని తయారుచేయడం నేర్పించడం నిషిద్ధం. పిల్లలే స్వంతంగా నేర్చుకోవాలని నాన్న చెప్పేవాడు. నీకు చెప్పడం మరిచిపోయాను. ఈ పడవలు తయారు

చేయడం అంటూ జరిగితే భార్యలే నేర్పించాలి. అంటే నాన్నకు, అమ్మ నేర్పించింది. అది ఆచారం... భార్యలు భర్తలకు నేర్పిస్తారు. ఆ తర్వాత ఆ కుటుంబంలో అమ్మాయిలు పుడితే వాళ్ళు స్వంతంగా నేర్చుకుని, వివాహమైన తర్వాత భర్తలకు నేర్పిస్తారు. కొన్ని సంవత్సరాల నుంచి ఇదే పద్ధతిని నాన్న నాకు చెప్పాడు. మీవైపు ఊళ్ళలో ఈ సాంప్రదాయం లేదు కానీ నాకు తెలిసినంతవరకూ మావైపు ఇలాగే ఎప్పట్నుంచో కొనసాగుతూ వస్తుంది" అతడు చెప్పాడు.

అయేషా పిల్లలకు అన్నం పెట్టి, వాళ్ళు ముందు గదిలో అన్నం తింటుండగా, భర్తకు ఒక టీ కప్పు ఇచ్చి, తను మరో టీ కప్పుతో వరండాలో కూర్చుంది. భర్త ఆ పని పూర్తయ్యేదాకా భోజనం కూడా చేయడని తెలుసు. శీతాకాలం త్వరలో మరింత గాఢంగా మారబోతుందన్న సూచనగా గాలి మధ్యాహ్నం పూట చల్లగా ఉంది. అప్పటిదాకా ఉన్న ఎండ నెమ్మదిగా కనుమరుగవ్వసాగింది. టీ తాగడం పూర్తిచేసి, తిరిగి పనిలో నిమగ్నమైన అతడు, తలయెత్తి కొమ్మల మధ్య నుంచి ఆకాశాన్ని గమనించాడు. నల్లటి మేఘాలు నెమ్మదిగా ఆకాశాన్ని ఎటువంటి తొందరపాటూ లేకుండా అలుము కుంటున్నాయి. 'ఇది సరైన దినం' అతడు అనుకున్నాడు. 'మరో అరగంటలో వర్షం పడుతుండవచ్చు. ఈ లోపల తను పడవను పూర్తి చేయడం అయిపోతే, ఈ పూటే ఈ కాగితపు పడవ విజయవంతమయిందో లేదో తెలుసుకోవచ్చు. మళ్ళా వర్షంపడే రోజుదాకా ఆగనవసరంలేదు.'

అతడు మరింత వేగంతో పనిచేయడం ప్రారంభించాడు. పక్కన పెట్టిన విడి కాగితపు భాగాలను, అనేక సంవత్సరాలుగా అలవాటైన నైపుణ్యంతో బిగించనారంభించాడు. ఈలోగా భోజనం ముగించి పిల్లలు తల్లిపక్కగా చేరారు. ముగ్గురూ, తదేకంగా మేకులు కొడుతున్న తండ్రినీ, అప్పటిదాకా ఒక పక్కగా అట్టల్లా పడివున్న మందపాటి కాగితాలు ఒక ఆకారాన్ని సంతరించుకోవడం గమనించసాగారు. తను గత తొమ్మిది సంవత్సరాలుగా గమనిస్తోంది, మేకులు కొట్టే అతడి చేతుల్ని, ముడిచిన కనుబొమ్మల్నీ, ముఖం కొద్దిగా అదురుతుండగా, ఒచ్చే కాగితాలపై మెత్తగా దిగబడే మేకుల శబ్దాల్నీ.

భార్యాపిల్లలు కూర్చుని చూస్తుండగా, ఆకాశం పూర్తిగా మబ్బులతో కమ్ముకుంటుండగా, అతడు నలభైఐదు నిమిషాలలో పడవను అమర్చడం పూర్తిచేశాడు. "నేను చెప్పాను కదా! ఈవేళ పూర్తవుతుందని" కూతురు తన తమ్ముడితో అంది. అతడు, పూర్తిచేసిన కాగితపుపడవను మరెక్కడైనా తప్పులున్నాయేమోనని సరిచేసుకుంటుండగా సన్నగా వర్షం మొదలయ్యింది.

మొదలవుతున్న వర్షాన్ని చూడగానే అతని ముఖం వికసించింది. తల్లితోపాటు పిల్లల ముఖాలూ విచ్చుకున్నాయి. వర్షపునీరు పడవపై పడకుండా, ప్లాస్టిక్ సంచులతో తయారు చేసిన పొడుగాటి దుప్పటిలాంటి దానిని దానిపై కప్పి, వరండాలోకి వచ్చి, భార్యపక్కగా కూర్చుని పెద్దగా మారుతున్న వర్షంవైపూ, ఆకుల మధ్య నుంచి తప్పించుకుని రాలుతున్న వర్షంవైపూ చూస్తుండగా, అతడి కూతురు అడిగింది "నాన్నా ఇప్పుడు వెళ్ళవచ్చా"



"ఇప్పుడే కాదు. వర్షం ఇంకా పెద్దది కావాలి. పడవ వెళ్ళేందుకు కావాల్సినన్ని నీళ్ళు వచ్చేదాకా ఆగాలి."

"నాన్నా...! నేను కూడా వస్తాను" కొడుకు తండ్రి పక్కగా చేరి అతణ్ణి అనుకుంటూ అడిగాడు. అతడు మాట్లాడలేదు. ధారగా కురుస్తున్న వర్షం వైపు చూస్తుండగా అతడి గుండె వేగం పెరిగింది. ఈ...సారన్నా తన ప్రయత్నం ఫలిస్తుందా? ఫలించాలి. ఎందుకంటే, ఎటువంటి తప్పులూ లేకుండా, మునుపు తన ప్రయత్నాలలో జరిగిన తప్పులు ఎక్కడా పునరావృతం కాకుండా జాగ్రత్తపడ్డాడు. అయినా? ఏం జరుగుతుందో ఎవరికి తెలుసు? కానీ, ఇన్నేళ్ళుగా వచ్చిన అనుభవంతో పటిష్టంగా నిర్మించాడు. ఈసారి విఫలం కాకపోవచ్చు. తప్పక తను ప్రయాణిస్తుండవచ్చు. ఈ వర్షం ఇంకా పెద్దది కావాలి. అప్పుడే వీధిలో ప్రయాణానికి కావాల్సిన తగినంత నీరూ, నీటి ధారా లభిస్తాయి. అందుకు వేచి చూడటం తప్ప చేయగలిగిందేమీ లేదు.

ఒక అరగంట తర్వాత ఇంటిముందు ప్రవహిస్తున్న వర్షపునీరు మందంగా మారింది. పది నిమిషాల క్రితం పెద్ద చినుకులతో, చెట్లన్నీ ఊగిపోయే గాలులతో కురిసిన వర్షం కొద్దిగా నెమ్మదించింది. అతడు నెత్తిపై గుడ్డ వేసుకుని, గేటు తీసుకుని బయటకు వెళ్ళి, ప్రవహిస్తున్న నీటిలో పాదాన్ని మోపాడు. దాదాపు మోకాళ్ళ వరకూ వచ్చాయి. ఈ ఉధృతి సరిపోతుందా? సరిపోతుండవచ్చు. ఇంకా కొద్దిసేపు పెద్దగా వర్షం పడుంటే, మోకాళ్ళ ఎత్తు నీళ్ళు ప్రవహించేవి. తన ప్రయాణానికి సరిగ్గా సరిపోయేవి. అతడు వెనుదిరిగి వచ్చి, వరండాలోంచి ఆకాశంలోకి చూశాడు. మరికొంతసేపు వర్షం పడుతుండవచ్చు కానీ, ఎంతసేపనేది ఖచ్చితంగా తెలిసేటట్టు లేదు. మేఘాలు దట్టంగానే ఉన్నాయి. కానీ, గాలి ఉధృతి తగ్గింది. తను మరికొద్దిసేపు ఎదురుచూడాలా లేక ప్రయాణం మొదలుపెట్టాలా? అతడికి ఏం చేయాలో తోచలేదు. ఈలోపల, ఎదురింటి మొదటి అంతస్తులో నిలబడ్డ నలభై ఐదేళ్ళ చంద్రం కేకేశాడు. "అజ్మత్! ఈ వేళన్నా నీ పడవ పూర్తయ్యిందా? పెద్ద వర్షం పడుతోంది. నీళ్ళూ నిండుగా ప్రవహిస్తున్నాయి. ఈవేళ ప్రయత్నం చేస్తావా లేదా?"

"మా పడవ పూర్తయింది" అతడికి బదులుగా, పెద్దగా అజ్మత్ కూతురు కేక వేసింది. ఆ సంభాషణ వినబడ్డ పక్కింటిలో అద్దెకు ఉంటున్న ముగ్గురు కుర్రాళ్ళు, వరండాలోంచి కొద్దిగా తలలు బయటకుపెట్టి "శుభాకాంక్షలు. అయితే మీ ప్రయాణాన్ని ఈపూట చూడవచ్చునన్న మాట" అని అన్నారు. అతడేం సమాధానం చెబుతాడోనని ఆయేషా తదేకంగా చూస్తోంది. అప్పటిదాకా ప్రయాణం చేయాలా వద్దా అనే సందిగ్ధంలో ఉన్న అజ్మత్ తల విదిల్చి, కొంతసేపు ఆలోచించి, ఆపై ముఖంపై పెద్ద నవ్వుతో, ఒక నిర్ణయానికి వచ్చినట్టు బదులిచ్చాడు.

"ఇప్పుడే మొదలుపెట్టబోతున్నాను. ఆ దేవుడి దయవల్ల అంతా సవ్యంగా జరగాలని కోరుకుంటున్నాను."

వాళ్ళకు బదులిచ్చాక, మరేమాత్రం ఆలస్యంచేయక, గేటు బార్లా తెరిచి, గేటు గుమ్మంవద్ద నుంచి వీధిలో ప్రవహించే నీళ్ళలోకి వెడల్పాటి చెక్కను అమర్చాడు. భార్యాపిల్లల సహాయంతో,

ప్లాస్టిక్ సంచులను తొలగించి పడవను చెక్కపైకి చేర్చి, అతి నెమ్మదిగా దానిలోకి అడుగుపెట్టి, కూర్చుని, భార్యతో పిల్లలతో చెప్పాడు "నెమ్మదిగా ముందుకు తోయండి."

ఎదురింటిలోని చంద్రం అతడ్ని గమనిస్తూ తన పక్కింటివాళ్ళకు కేకవేసి ఆ విషయం చెప్పాడు. మరికొద్దిసేపట్లో అజ్మత్ కాగితపు పడవ ప్రయాణాన్ని మొదలుపెడుతున్నాడన్న విషయం వీధంతా పాకిపోగా, ఆ ఇరుకైన వీధిలో ఇరువైపులా ఉన్న ఇళ్ళలోని జనం వరండాలలోకి వచ్చి ఎదురు చూడసాగారు. ఉత్సుకత, కంగారూ, ఆనందం ఆగలేని పిల్లలు మాత్రం తల్లిదండ్రులు అరుస్తున్నా వినిపించుకోక, వర్షంలో తడుస్తూ పరిగెత్తుకు వెళ్ళి అజ్మత్ ఇంటి ముందు నిలబడి విస్మయం నిండిన కళ్ళతో అతడినీ, నాలుగు అడుగుల ఎత్తున్న కాగితపు పడవనూ గమనించ సాగారు.

అతడు ఉద్విగ్నమైన హృదయంతో పడవలో కూర్చుని ఉండగా, అతడి భార్యాపిల్లలు నెమ్మదిగా పడవను ముందుకు తోశారు. పడవ ముందు భాగం ప్రవహిస్తున్న నీటిని తాకగానే కుదుపునిచ్చి, ఆపై నెమ్మదిగా పడవ మొత్తం నీటిపైకి వచ్చింది. ఒక్కక్షణం కదలక అలాగే ఆగింది. తన బరువుని తీసుకోగలుగుతుందనే నమ్మకం కలగగానే, అతడు బిగించి పట్టిన పడవ కింది రెక్కల్ని ఒదులు చేశాడు. ఒక చిన్న కదలికతో పడవ ముందుకు కదిలింది. ఉత్కంఠతతో చూస్తున్న పక్కింటి కుర్రాళ్ళు, పడవ ప్రవాహంలో తమ ఇల్లు దాటగానే హర్షంతో చప్పట్లు చరిచారు. అయితే ఆ చప్పట్లు కానీ, మాటలుకానీ, వర్షపు చినుకుల శబ్దంకానీ అతడికి వినిపించటంలేదు. అతడి ధ్యాసంతా సన్నటి కుదుపులతో కదులుతున్న పడవపై ఉంది. ఏటవాలు వీధి కావడంవల్ల, నీరు వేగంగా ప్రవహిస్తుండటంవల్ల, పడవ అతడు ఊహించనంత తొందరలోనే వేగం పుంజుకుంది. అప్పటిదాకా, మనస్సులో కదలాడుతున్న సందేహాలు కనుమరుగవుతుండగా, అతడి ముఖంపై చిర్నవ్వు పరుచుకుంది. కదులుతోంది. ఎటువంటి ఆటంకమూ లేకుండా ముందుకు వెడుతోంది. తన లెక్కలన్నీ సరిగ్గానే ఉన్నాయి. చివరకు, తను వర్షపునీటిలో ప్రయాణించగలిగే కాగితపు పడవను తయారుచేయగలిగాడు.

పడవ ముందుకు సాగుతుండగా, దాని వెనుకగా కొంతమంది పిల్లలూ, దానిపక్కగా మరికొంతమంది పిల్లలూ కేకలతోనూ, యికిలింతలతోనూ పరిగెత్తసాగారు. వీధిలో ఇళ్ళముందు నిలబడి ఉన్న ప్రజలు అతడికి శుభాకాంక్షలు తెలియజేయసాగారు. వీధిలో ఉన్న కరెంటు స్తంభాలను తాకకుండా పడవను జాగ్రత్తగా కదుపుతూ, అతడు దృష్టినంతా తన ముందుగా పారుతున్న నీటిపై కేంద్రీకరించాడు. అతడి మనస్సు నిశ్శబ్దంగా మారింది. అప్పటిదాకా నిటారుగా కూర్చున్న అతడు, కొద్దిగా వెనక్కు వాలి విరామంగా కూర్చునేందుకు ప్రయత్నిస్తూ, ముఖంపై కురుస్తున్న వర్షాన్ని ఎడమ అరచేతితో తుడుచుకుని, రెండిళ్ళ కావలగా ఇంటి ముందు గొడుగు కింద నిలబడి, పడవవైపు నవ్వుతూ చూస్తున్న పిల్లలకు చేయి ఊపుతుండగా జరిగిందది. కానీ, మరుక్షణం అతడి దేహమంతా నీటితో నిండిపోయింది. క్షణం క్రితం వరకూ దృఢంగా ఉన్న కాగితపు పడవ ముందుభాగం, ఎడమవైపు భాగమూ ఒరిగిపోయి, అతడు అర్థం చేసుకునే లోపలే, రెండోవైపూ



నీటిలో కుంగి, అతడు నీటిలో పడ్డాడు. తన దేహాన్ని ముందుకు తోస్తున్న ఉధృతిని తట్టుకుంటూ, వేగంగా జారిపోతున్న పడవ భాగాలను కంగారుతో అందిపుచ్చుకునేందుకు ప్రయత్నించి, విఫలమై, అర్థంకాని ముఖంతో, కొట్టుకుపోతున్న కాగితపు భాగాలవైపు చూస్తూ లేచి నిలబడేందుకు ప్రయత్నించాడు. ఏం జరిగింది? తప్పు ఎక్కడ జరిగింది? అతడు నిలదొక్కుకుని లేచి, కాగితపు భాగాలన్నీ కనుమరుగయ్యేదాకా వర్షంలో తడుస్తూ అలాగే నిలబడ్డాడు.

వీధంతా నిశ్శబ్దం అలుముకుంది. "నాకు తెలుసు ఇది సాధ్యం కాదని. ఇంతకుమునుపే చెప్పాను ఆ ప్రయత్నాన్ని వొదులుకోమని. కానీ అతడు వినలేదు. అయినా, కాగితపు పడవలో ప్రయాణించడం ఎలా సాధ్యం?" ఎవరో అంటున్న మాటలు అతడు విన్నాడు. వెనుదిరిగి, నీటిలో పాదాలతో బలవంతంగా ఎదురీడుస్తుండగా, అప్పుడే ఇంటిలోంచి బయటకు వచ్చిన మరో వ్యక్తి, వర్షపు శబ్దంలో తన మాటలు వినిపించవేమోనని పెద్దగా అరిచాడు "కంగారుపడకు అజ్మత్. వచ్చేసారి సరిగ్గా పనిచేస్తుందిలే."

ఎవరికీ ఒక మాటతోనైనా జవాబివ్వకుండా, నెమ్మదిగా నడుస్తూ ఇంటికి వచ్చి, గేటు వద్ద నిలబడ్డ భార్యాపిల్లల్ని దాటుకుంటూ లోపలికి వెళ్ళాడు. అతడి భార్య లోపలికి వెళ్ళి తువ్వాలు తెచ్చి ఇచ్చింది. దానితో తలను తుడుచుకుంటుండగా, కూతురు అడిగింది. "ఏమయ్యింది నాన్నా? పడవ ఎందుకు మునిగిపోయింది?" బలవంతంగా ముఖంపై నవ్వును తెచ్చుకుంటూ తువ్వాలు లోంచి కూతురువైపు చూస్తూ తెలీదన్నట్టు తల అడ్డంగా ఊపాడు. ఆ తర్వాత, రాత్రి పిల్లలు త్వరగా భోజనాలు ముగించి పడుకునేదాకా, అతడు మౌనంగా కుర్చీలో కూర్చుండిపోయాడు. అప్పటికి అతడికి అరగంట క్రితం నుంచి తుమ్ములు ప్రారంభమయ్యాయి. అమృతాంజన్‌ను ఛాతిపై రుద్దుకుంటూ అడిగాడు "యేషా, జలుబు చేసినట్టుంది. అయినా పడవెందుకు వర్షపునీటి ధాటికి ఎక్కువసేపు నిలబడలేకపోయింది?" అయేషా సమాధానం ఇవ్వకుండా అతడి ఎదురుగా కూర్చుంది. అతడు లేచి, తను వ్రాసుకున్న కొలతల పుస్తకాలన్నిటినీ ముందు వేసుకుని కూర్చున్నాడు. రెండుగంటలు తిరగవేసిన తర్వాత కూడా అతడికి లోపం ఎక్కడుందో అర్థంకాలేదు.

అప్పటిదాకా గమనించని, గొంతులోని వేడిమీ, మండుతున్న దేహం స్ఫురించాయి. జ్వరం వచ్చినట్టుంది. చిన్నగా తలనొప్పి. లేచి మందుల డబ్బాలోంచి మాత్ర వేసుకుని, తిరిగి పుస్తకాల్నీ, కాగితాల్నీ వరసలో పెట్టి, వాటి స్థానాలలో భద్రపరచి వెళ్ళి మంచంపై పడుకున్నాడు. అతడి పక్కగా పడుకున్న ఆమెకు రాత్రంతా కాలిపోతున్న అతడి శరీరం తెలుస్తూనే ఉంది. పెళ్ళయిన ఇన్ని సంవత్సరాలకు ఆమె పెళ్ళయిన మొదట్లో కంగారూ, ఆందోళనా చెందిన క్షణాలను మళ్ళా అనుభూతి చెందింది. ఎంతమంది చెప్పారు అతనికి. అది సాధ్యంకాదు వొదిలివేయమని. అతనికి ఎందుకంత మొండి పట్టుదల? దానివల్ల అతనికి ఏం వస్తుంది? దానివల్ల ప్రయోజనం ఏమిటి? ఆరోగ్యాన్ని కూడా పట్టించుకోకుండా అతడు చేసే ప్రయత్నాలని ఏమనాలి?

ఆమెకు మరిక, రాత్రంతా ఒక అరగంట తప్ప నిదురపట్టలేదు. ఆ అరగంట మగత నిద్రలో, కలలాంటిదానిలో, ఆమె తన భర్త అటువంటి పడవలో, వర్షపునీటిలో జాడ లేకుండా

కొట్టుకుపోవడం కాంచింది. ఆమె ఉలికిపాటుతో, దేహమంతా చెమటలు పట్టగా లేచి, జ్వరంతో కంపిస్తున్న భర్త నుదుటిపై తడిగుడ్డను వేసి రాత్రంతా మేలుకొని ఉంది. తెలవారుతుండగా అతడికి జ్వరం కొద్దిగాఉపశమించింది. ఆరోజు కూడా శెలవు దినం కావడంతో, భర్తకానీ, పిల్లలు కానీ ఎక్కడికీ వెళ్ళే హడావిడి లేకపోవడం వల్ల, ఆమె తీరికగా ఫలహారం చేస్తుండగా, కొద్దిగా తేరుకున్న భర్త ముందుగదిలో పిల్లలతో మాట్లాడుతూ ఉండటం వినిపించింది. ఆ సంభాషణ ఎటు మళ్ళుతుందో ఆమె ఊహించి, తల విదిల్చి నిట్టూర్పు విడిచింది.

అజ్మత్ పిల్లలతో అంటున్నాడు "నిన్న వర్షం పడిన ఛాయలు కూడా లేవు. చూడండి దినం ఎంత కాంతివంతంగా ఉందో. పని చేయాల్సిన సరైన సమయం ఇదే. నా గదిలో వ్రాసుకునే పుస్తకాలు తీసుకురండి. అలాగే పనిముట్లను వేపచెట్టు కిందకు చేర్చండి. ఈలోపల నేను బయటకు వెళ్ళి మేకులూ, గమ్మూ కొనుక్కువస్తాను. అయేషా, వేపచెట్టు కింద కొద్దిగా తడిగా ఉంది. శుభ్రంగా పూడ్చి పట్టా వేయి. నేను బజారు నుంచి రాగానే పని మొదలుపెట్టాలి."

ఆరోజు సాయంత్రం అయ్యేసరికి, వరండాలో వెచ్చగా పరుచుకున్న శీతాకాలపు తొలి ఎండలో భార్యాపిల్లలు కుర్చీలలో కూర్చుని తదేకంగా చూస్తుండగా, అజ్మత్ ఉదయం నుంచి, మళ్ళా కొత్త లెక్కలతో పూర్తయిన కాగితం పడవకు చివరి మెరుగులు దిద్దుతూ, ఆ వీధివెంట వెళ్ళే ప్రజలు అలవాటైన కళ్ళతో చూస్తుండగా, సన్నగా, తనలో తాను, వేసుకున్న లెక్కలను గొణుక్కుంటూ, నిశ్శబ్దపు పాటను నిశ్శబ్దంలో పాడుతున్నవాడిలాగా కనిపించాడు.

*ఆదివారం ఆంధ్రజ్యోతి, 17 నవంబర్ 2002*



# 12

# ఆవర్జా

**చంద్రలత**





స్త్రీల పై కొనసాగుతున్న వివక్షను మరో కొత్తకోణం నుండి దర్శించిన కథ 'ఆవర్జా.' రచయిత్రి చంద్రలత 10 ఫిబ్రవరి 1969లో పుట్టారు. వీరి మొదటికథ 'మనోతేజ' **వనిత** మాస పత్రికలో 1993లో ప్రచురితమయింది. 1997లో 'తానా' బహుమతిని గెల్చుకున్న వీరి నవల 'రేగడి విత్తులు' ఇంకా చర్చించ బడుతూనే ఉంది. 'నేనూ నాన్ననవుతా' కథల సంపుటి 1996లో ప్రచురించారు. 50 కథలు, రెండు నవలలు రాశారు. వృత్తిరీత్యా హాస్పిటల్ ఎడ్మినిస్ట్రేటర్.

*చిరునామా : సిమ్స్ సెంటర్ ఫర్ చైల్డ్ హెల్త్, పొగతోట, నెల్లూరు - 524001*

బ్యాలన్స్‌షీట్ ఎంతకీ ట్యాలీ కావడంలేదు.
ఎక్కడో ఏదో ఎంట్రీ తప్పిపోయింది.
జమలోనో, ఖర్చులోనో.
తీసివేతలోనో, కూడికలోనో.
లెక్క తప్పిపోయింది.
ప్చ్!
విధీశ చికాకుగా ఫైలును మూసేసి టేబుల్‌పై పడేసింది.
ఇవ్వాళంతా ఇంతే.
ఏది కదిలిద్దామన్నా జారిపడిన ఊలుబంతిలా చిక్కుపడిపోతున్నది.
విధీశ చేతిలోని ఆడిట్ పెన్సిల్‌ను వేళ్ళ మధ్య ఆడించింది.
ఓ పక్క ఎరుపు, మరోపక్క నీలం.
ఇదీ విచిత్రమే.
అటు రౌద్రం, ఇటు శాంతం.
అటు నిప్పు, ఇటు నీరు.
ఏమిటీ తలాతోకాలేని ఆలోచనలు!
అవునవును...
అటు తల, ఇటు తోక!
విధీశ చేతిలోని పెన్సిల్‌ను టేబుల్‌పై పడేసి చేతివేళ్ళు విరుచుకుంది.
ఇలా ఆలోచించడం మొదలుపెడితే ఇక ఈ పూట పని అయినట్టే!
ఈమధ్య తరుచూ ఇలాగే ఉంటోంది.
ఒకరోజుకు మరోరోజటికి ఎంతో తేడా.
ఈరోజు అత్యవసరమైనదనిపించింది మర్నాడు పనికిరానిదనిపిస్తోంది.
ఈపూట తేలిగ్గా తీసిపారేసింది మరోపూట ముఖ్యమైనదనిపిస్తోంది.
బాధ్యతాయుతమైన పనిలో నిమగ్నమై ఉన్న తనకే ఇలాంటి చంచలత్వం వస్తే ఎలా?
చంచలత్వం!
అవునవును... చిన్నపుడు ఎపుడో ఎక్కడో విన్నట్లే గుర్తు.
స్త్రీకి స్థిరత్వమే ఉండదని!
చంచల స్వభావమే ఆమె నైజమని!
ట్రాష్...!!
అదేమాట వేరెవరన్నా తనతో అంటేనా...!



ఏమిటా వంకర తీర్మానాలు...?

"ఛ! సదరు చంచలత్వాన్ని అసహ్యించుకొనే ముందు నీ శరీరాన్ని నీవు అర్థం చేసుకోవాలోయ్..." అంది నవ్య ఓసారి.

"అదేంటి?"

"బయోలాజికల్లీ స్పీకింగ్... నీలోని రసాయనాలే నీ శరీరాన్ని నీ మనసును నీ ప్రవర్తనను నీ మూడ్స్‌ని అదుపులో పెట్టి... తోచినట్లు ఆడిస్తుంటాయి... తోలుబొమ్మలాటలో కనిపించని దారాల్లా..."

"నాకర్థం కావట్లేదు..."

"సింపుల్. నీలో ఉండే హార్మోన్స్... ఋతుచక్రం పొడవునా గీసే అప్ అండ్ డౌన్ గ్రాఫ్... అదీ నీ ఒక్కోరోజు ఒక్కోలాగా ఉండటానికి బయోలాజికల్ రీజన్!"

అర్థం చేసుకోవాలి.

ఎవరర్థం చేసుకోవాలి ?

నేనా?

నువ్వా?

పుట్టింటివారా?

అత్తింటివారా?

తోబుట్టువులా?

తోడికోడళ్ళా?

"అందరూ!" నవ్య టక్కున అంది.

ఆ అందర్లో ప్రద్యుమ్న లేడూ?

"ఎందుకు లేడు? ఉన్నాడు. మొదట నిన్ను నీవు అర్థం చేసుకో... తరువాత మీ ఆయన సంగతి!"

"పోవోయ్... మొదట అతనే అర్థం చేసుకోవాలి!" పట్టుబట్టింది తను.

"ముందు అతనికి చెప్పు" ఖరాఖండిగా చెప్పేసింది.

"సరే తల్లీ! అలాగే చెప్తా" నవ్య నవ్వేసింది.

రాజు కన్నా మొండివాడు బలవంతుడని ఊరికే అన్నారా?

అంతటి బిజీ గైనకాలజిస్ట్ నవ్య తన పట్టుదలకి తలొగ్గింది. ప్రద్యుమ్నని ఇవ్వాళ మాట్లాడడానికి పిలిచింది, తన బిజీ షెడ్యూల్‌ను కాస్తంత సవరించి.

పట్టువిడుపులు లేకపోతే ఎలా?

ఉండాలి!

ప్రద్యుమ్న ఏ విషయమూ పట్టించుకోవడం లేదనే తన పట్టు అంతా!

"నువ్వెప్పుడూ అంతే - మొండితనం మానవుకదా!" అమ్మ ఎప్పుడూ అంటుంది.

మొండితనమో మొరటుతనమో కానీ వద్దన్న పని చేయాలంటే మహా ఉత్సాహం తనకి.

అమ్మ అన్నట్లు కడుపులో చల్ల కదలకుండా తిని కూర్చోవచ్చు కదా తను.

ఊహూ... అలా ఎలా?

వీలుకాదు.

కానేకాదు.

"కొందరి రాతలంతే. అదృష్టం అందలమెక్కిస్తే బుద్ధి బురదలోకి లాగుతుందనీ..." ఆ ధోరణిలోనే మరో ఆమడవెళ్ళి అమ్మ ఓ దీర్ఘం తీసింది.

"నువ్వైనా చెప్పరాదూ బాబూ..." అమ్మానాన్నలు కూడబలుక్కుని ప్రద్యుమ్నని అడిగారు.

"నలుగురిలోకి వెళితేనే కదండీ... లోకంపోకడ తెలిసేది. ఆమె ఇష్టప్రకారమే కానివ్వడం అందరికీ మంచిది" ప్రద్యుమ్న తనకే వత్తాసు పలికాడు.

జరగాల్సింది జరిగింది.

చకచక.

పల్లె పట్నమూ కాని ఈ ఊళ్ళో మొట్టమొదటి మహిళా ఆడిటర్‌గా రంగప్రవేశం చేసింది.

అట్టహాసంగా.

మిగిలిన ఆడిటర్లంతా ఆరోజు తమ రంగంలో స్త్రీల అభ్యుదయ అవకాశాల గురించి వివరంగా చక్కగా ప్రసంగించారు. తననెంతో ప్రశంసించారు.

ప్రద్యుమ్న ఆశించిందే జరిగింది.

ఏడాది తిరిగేసరికి దిమ్మ తిరిగి వచ్చింది.

ప్రద్యుమ్న అంత నింపాదిగా ఎందుకు వత్తాసు పలికాడో చక్కగా తెలిసివచ్చింది.

విధీశకు చికాకు మాయమై నవ్వొచ్చింది.

ఎంతయినా ప్రద్యుమ్నకు ముందుచూపెక్కువ. నెగ్గలేక తనకైతను వెనక్కు తిరిగి వస్తానని అతని నమ్మకం కాబోలు.

తనేమైనా తక్కువ తినిందా?

అంతకు అంత!

విధీశను లోకంలోకి పడేస్తూ ఫోన్ మోగింది.

కృష్ణమూర్తిగారు.

పెన్నా బిల్డర్స్, యం.డి.

"ఏమ్మా... ఆడిటరమ్మా... మీరేదో పన్ను తప్పించే ఉపాయాలు చెప్తారనుకుంటే ఇంత పన్ను కట్టాలని పంపారు..." ఆయన నిష్ఠూరపడ్డాడు.

అయితే తన అసిస్టెంట్ యామిని అక్కడికి చేరిందన్నమాట!

"మా యామిని మీ దగ్గరకు వచ్చింది కదా... మీ పుస్తకాలన్నీ ఆమెచేత పంపించండి. మరోమారు చూస్తాను."

అలాగే అంటూ ఫోన్ పెట్టేశాడు.

ఆయన కంఠంలో దాగి ఉన్న అసంతృప్తిని విధీశ గ్రహించగలిగింది.



ఎందుకు తను వీళ్ళలో నమ్మకం కలిగించలేకపోతోంది?

మొదటినుంచీ అంతే.

నాన్న అమ్మను ఎప్పుడూ అనేవాడు.

'జమాఖర్చుల వ్యవహారం ఆడవాళ్ళు మీకేం తెలుస్తుంది' అంటూ.

నాన్నేమో సిటీలో పేరుమోసిన ఆడిటర్. అమ్మకు అకౌంట్స్ అర్థం అయ్యే అవకాశమే లేదని ఆయన ప్రగాఢ విశ్వాసం.

చివరికి తనకి మంచిమార్కులు వస్తుంటే డాక్టర్ కమ్మని ప్రోత్సహించాడు కానీ ఆడిటర్ని అవుతానంటే అయిష్టత చూపాడు.

"విధీ... నువ్వు చిన్నపిల్లవు. ఈలోకం సంగతి తెలియదు. ముఖ్యంగా నీలాంటి సున్నిత మనస్తత్వం ఉన్న అమ్మాయి ఆడిటర్‌గా ప్రాక్టీస్ చేయాలన్నా... నలుగురిలో నిలదొక్కుకోవాలన్నా ఎంతో కష్టంరా. లెక్కలంటే నీకంతగా ఇష్టమైతే ఇంజనీరింగ్ చెయ్యి..."

అసలు విషయం ఏమిటంటే... నాన్న కన్నా అమ్మే మా ఇంటి బడ్జెట్‌ను చక్కగా ప్లాన్ చేసేది. ఎంత ఖర్చుపెట్టాలో ఎంత పొదుపు చేయాలో ఆమెకే బాగా తెలుసు. జమాఖర్చులన్నీ చక్కగా ఓ నోట్‌బుక్‌లో రాసి పెడుతుంది ఈనాటికీ.

మల్లెపూల దగ్గర నుంచి మైక్రోవేవ్ దాకా... పాలపాకెట్టు నుంచి పార్టీల ఖర్చుల దాకా... అన్నీ రసీదులతో సహా పద్దు రాయడం ఆమెకు అలవాటు. నాన్న డైరీ రాసినట్లుగా!

"నాన్నేమన్నా లెక్కలు అడుగుతారా ఏమిటి?" అని అంటే "మీ నాన్న అడుగుతారని కాదమ్మా... దేనికి ఎంత ఖర్చు పెడుతున్నామో... అది అవసరమో అనవసరమో... నాకు తెలియ డానికి."

చివరకు తనకు తమ్ముడికి పాకెట్‌మనీ ఇస్తూ కూడా చెరో పాకెట్‌బుక్ చేతిలో పెట్టేది. మొదట ఇచ్చినదానికి లెక్క తేలితేనే మళ్ళీ ఇచ్చేది!

ఆమె ఓ సమర్థవంతమైన ఆడిటర్ అనీ... ఓ ఫైనాన్షియల్ మేనేజర్ అనీ... అమ్మకే తెలియదు.

ఇక అత్తమ్మ సంగతి సరేసరి. ఆమె బ్యాంక్‌లో అకౌంట్స్ ఆఫీసర్.

తను ఆడిటర్‌గా ప్రైవేట్ ప్రాక్టీస్ చేస్తానన్నపుడు మొదటి ప్రోత్సాహం అత్తమ్మదే మామగారేమో ఓ మంచి అనుభవాన్ని విప్పి చెప్పేసారు.

"అమ్మా... నేనప్పుడు లీడ్ బ్యాంక్ మేనేజర్‌ని. మా గ్రామీణ బ్యాంక్ మేనేజర్ మీద బోలెడన్ని పిటీషన్లు వచ్చిపడ్డాయి. ఆ అమ్మాయి నాకు ముందు నుంచీ బాగా తెలుసు. చురుకైనది, పని అంటే ప్రాణం. అలాంటి పిటీషన్ల నిండా ఆమె దారితప్పిన చెడు ప్రవర్తన గురించిన రాతలే. ఎంక్వైరీకి వెళ్ళాం. ఆరా తీస్తే ఆమె చేసిన చెడ్డ పనేమిటో తెలుసా? సైకిలెక్కి చుడీదార్ వేసుకొని రికవరీకి పల్లెల్లో తిరగడం! మారుమూల పల్లెల్లో అప్పులు ఇవ్వకా తప్పదు. అవీ ఎలాంటివి? గేదెను కొనుక్కోవడానికో... పంటకో... పొలానికో... అప్పులు రికవరీ చేయకపోతే పై నుంచి మొట్టి కాయలు. చేయను పోతే ఇదీ అవమానం. ఆ పల్లెల్లో రవాణా సౌకర్యం లేదు. ఆమె అనువుకి ఓ

సైకిల్ కొనుక్కుంది. చీర వేసుకొని తొక్కలేదు కనుక చుడిదార్ వేసుకుంది. 'ఏవిటి సార్ నా చెడు ప్రవర్తన' అని మమ్మల్ని అడిగితే మాట్లాడలేకపోయాం. ఎందుకంటే ఆ బ్రాంచిలో జిల్లా మొత్తంలో రికవరీ బావుంది. ఆమె మనసు విరిగి ట్రాన్స్‌ఫర్ కావాలని సిటీకి వచ్చేసింది!" మామగారు ఆయాసం తీర్చుకొని మళ్ళీ అన్నారు, "ఇదమ్మా ఆడవారికి మనమిచ్చే గౌరవం! మనమిచ్చే స్వతంత్రం!"

ఇక నాన్న మొదలెట్టాడు.

"నగరంలో అదో తీరు. ప్రద్యుమ్న, నువ్వు ఉండబోయేది పల్లె పట్నమూ కాని ఊరు. నా మాట విని ఎవరైనా సీనియర్ ఆడిటర్ దగ్గర అసిస్టెంట్‌గా చేరు."

"చదువుతూ ఉన్నంతకాలం సాయంకాలాలు నీకు అసిస్ట్ చేస్తూనే ఉన్నా కదా నాన్నా... ఇంకా కొత్తగా నేర్చుకోవాల్సింది ఏముంది ? నేను స్వంతంగా స్వతంత్రంగా ప్రాక్టీస్ చేస్తా నాన్నా..." తన గొంతులో విశ్వాసం గుసగుసలాడడం తనకే తెలుస్తోంది.

"అంతెందుకురా... విధీ! మన సిటీ ఛాంబర్ ఆఫ్ కామర్స్‌లో ప్రైవేట్ ప్రాక్టీస్ చేసే లేడీ చార్టెర్డ్ అకౌంటెంట్స్ ఎందరున్నారు? ఇద్దరో ముగ్గురో. వారూ తమ అసిస్టెంట్స్ ద్వారా అసెస్‌మెంట్స్ ఫైల్ చేయిస్తారే కానీ స్వయాన ఆఫీసులలోకి రాగా నేను చూడలేదు..."

"సీనియర్ ఆడిటర్ అయిన మీరూ వెళ్ళరుగా నాన్నా..."

"కాని నేను వెళ్ళాలనుకుంటే వెళ్ళాల్సి వస్తే ఏ అడ్డంకి లేదు. విధీ... ఆడవాళ్ళ చుట్టూ కనిపించని గాజుగోడలు ఉన్నాయమ్మా... పైకి ఎదగనీయకుండా గాజుకప్పు పొరలు పొరలుగా కదలనీయవు. కదలలేవు. నీవే గ్రహిస్తావు. నీకు తెలియకుండానే నీ చుట్టూ అలుముకొని ఉన్న ఆ వాతావరణం నిన్ను ఎలా ఉక్కిరిబిక్కిరి చేయగలదో..."

"ఆ గాజుపొరల్ని, ఆ గాజుకప్పుని బద్దలు చేయగల విశ్వాసం నాకుంది నాన్నా..."

"మంచిదే తల్లీ... కానీ ఆ ప్రయత్నంలో నీకు గాయం కానీయకు..."

ఠాక్!

నాన్న మాటల్ని కొట్టిపారేసింది తను.

ఇప్పుడిప్పుడు తెలిసి వస్తోంది.

తన రెక్కలను తుంచివేయను ఎలా కనిపించని కత్తెరలను చాచి ఉంచుతుందో ఈ లోకం.

అంతదాకా ఎందుకూ? తన అసిస్టెంట్స్... అకౌంటెంట్స్... యామిని, సుమ, రమణ... ఎంత బేధం ఈ ముగ్గురిలో.

అందులోనూ యామినికి సుమకూ ఎంత తేడా...

వాళ్ళల్లో తమ చదువు పట్ల, తమ శక్తియుక్తుల పట్ల నమ్మకం లేదెందుకని?

వాళ్ళిద్దరూ వేరేవేరు కాలేజీల్లోంచి వచ్చినా ఇద్దరూ డెంబైశాతం పైన మార్కుల్తో డిగ్రీ పుచ్చుకున్నారు కదా?



ఎందుకంత భయం భయంగా ఉంటారు?

ఎందుచేత ఆ పిరికితనం?

వారి చదువు వారి ఉద్యోగం ఎందుకని ధైర్యాన్ని ఇవ్వడంలేదు?

అదే రమణ?

నిలువెత్తు విశ్వాసం.

చకచక మాట్లాడతాడు. చాకచక్యంగా పని చక్కబెడతాడు.

వీళ్ళిద్దరి కన్నా వయసులో చిన్నవాడు, చదువులో తగ్గవాడు.

మాటల్లో పెట్టి వీళ్ళతోనే పని పూర్తిచేయించి తన మెప్పు పొందాలని చూస్తుంటాడు. క్లయింట్స్‌తోనూ కలివిడిగా హుషారుగా ఉంటాడు. వీళ్ళిద్దరూ ఒదిగొదిగి ఉంటారు!

ముఖ్యంగా సుమ...

డిగ్రీ పరీక్షలు రాసి తిన్నగా తన దగ్గరికి వచ్చింది, మూడేళ్ళ క్రితం.

"ఏమేం తెలుసు?" నన్నాను

"చిట్టాపద్దులు వేస్తానండి. లాభనష్టాల ఖాతా, వర్తకపు ఖాతా, చిల్లరనగదు పట్టీ, అంకణా, ఆస్తి అప్పుల పట్టీ, ఆవర్జ ఖాతా... అన్నీ తెలుసండీ..." భయంభయంగా గుక్క తిప్పుకోకుండా అంది సుమ.

పక్కనే ఉన్న యామిని ఫక్కున నవ్వింది.

సుమ బిత్తరపోయింది.

వాళ్ళిద్దరి ముఖాల్లో ఆ క్షణాల్లో కదిలిన భావాలు ఇంకా కళ్ళ ముందు కదులుతున్నాయి.

యామిని అప్పటికే రెండేళ్ళ నుంచీ తన దగ్గర పనిచేస్తోంది. పై నుంచి ఇంగ్లీష్ మీడియం. యామినిని సైగచేసి గది బయటికి పంపించాను.

అప్పటికే సుమ కళ్ళల్లో నీళ్ళసుళ్ళు.

'ఈమాత్రానికే ఏడుపా? మంచినీళ్ళు కావాలా?" తను అనునయంగా అంది.

సుమ తల అడ్డంగా ఊపింది.

లంగావోణీ... రెండు జడలు... పంజరం లోలాకులు.

"సరే... నిన్నిక్కడికి ఎవరు పంపారు?"

"ఎవరూ పంపలేదండీ... నేనే వచ్చాను. కాలేజీకి వెళ్తూ రోజూ మీ బోర్డు చూసేదాన్ని. కాలేజీలో మా కామర్స్ అయ్యవారు కూడా మీ గురించి చెప్పేవారు... రోజూ..." గబగబ అంది.

'కాలేజీల్లో ప్రస్తావించేంత ఘనత వహించిందన్నమాట మన ఘనకార్యం!

మళ్ళీ అడిగింది, "ముందిది చెప్పు... అకౌంటెంట్‌కు ఉండవలసిన ముఖ్యలక్షణం ఏమిటి?"

"ఎక్కడి లెక్క అక్కడే మరిచిపోవాలండి", ఒక్క క్షణం ఆగి మళ్ళీ తనే అంది, "ఈ మాట కూడా మా అయ్యవారే చెప్పారండి. ఎవరు ఇంటర్వ్యూకి వచ్చినా మీరు ఈ ప్రశ్న తప్పక అడుగుతారంట కదా..."

ఫక్కున నవ్వేసింది తను కూడా.

ఆ నిర్మలత్వమే సుమను అకౌంటెంట్‌ను చేసింది. రెండేళ్ళలో యామినిని మించి పోయింది.

ఇంతకీ ఆమె ఏమి చేస్తుందో - సాయి మెడికల్స్ వాళ్ళ సేల్స్‌టాక్స్ రిటర్న్స్ తయారుచేయాలని పురమాయించాను కదా... ఏమైందో...

తన గదికీ వాళ్ళ గదికీ నడుమ కార్డ్‌బోర్డ్ పార్టీషన్. మధ్యలో గ్లాస్ పీస్. దాన్ని కప్పుతూ కర్టెన్.

విధీశ పరదాలు పక్కకు తీసింది.

సుమ తలవంచుకొని రాసుకొంటోంది.

తమ ఇద్దరికీ నడుమ ఉన్న గాజుపలక మీద మునివేళ్ళతో తట్టింది విధీశ.

సుమ తలెత్తి చూసింది.

విధీశ రమ్మన్నట్లు సైగ చేసింది.

సుమ వచ్చింది.

"ఈ బ్యాలెన్స్‌షీట్‌లో లెక్క తప్పుతోంది. ఏదైనా ఎంట్రీ మిస్ అయివుండొచ్చు. నీవు బుక్స్ తీసుకురా. వోచర్స్ తీసుకురా. మరోసారి పూర్తిగా చెక్ చేద్దాం. నేనీలోగా టోటల్స్ మళ్ళీ ట్యాలీ చేస్తాను..."

సుమ మౌనంగా వెళ్ళింది.

ఔననలేదు, కాదనలేదు.

ముఖాన ఏ భావమూ లేదు.

స్ట్రేంజ్!

సుమ తిరిగి వచ్చింది.

నాలుగైదు బాక్స్ ఫైల్స్‌ను తెచ్చి టేబుల్ మీద పెట్టింది.

మళ్ళీ వెళ్ళింది. మళ్ళీ వచ్చింది. మరికొన్ని ఫైల్స్ తెచ్చింది.

"చాలా ఉన్నాయే..." విధీశ కనుబొమలు విరిచింది. 'ఇది అసిస్టెంట్స్ చేయాల్సిన పని. తను కూడికలు చూడడం ఏమిటీ? ఛ...ఛ... తప్పదు. అన్ని పనులు చూసుకోక తప్పదు. అదే కదా ప్రైవేట్ ప్రాక్టీస్! ఎక్కడా లెక్క తప్పకూడదు. ఎవరు లెక్క చూసారన్నది కాదు ముఖ్యం.'

"సాయి మెడికల్స్ వాళ్ళ ఎ1 రిటర్న్స్ రెడీ చేసారామ్మా" విధీశ సుమను అడిగింది.

సుమ ఏమీ మాట్లాడలేదు.

శూన్యదృక్కులను ముఖానికి అతికించుకుంది.

"సుమా... నిన్నే అడిగేది ఎ1 రిటర్న్స్ రెడీ అయ్యాయా?"

సుమ ముఖంలో ఏ మార్పు లేదు.

విగ్రహంలాగా నిశ్చలంగా నిల్చుని ఉంది.



విధీశకు అసహనం పెరిగిపోయింది.

"సుమా... ఆ ఫైల్ తీసుకురా - నేనే చేసి చూపిస్తాను..." విధీశ పెదవులు బిగబెట్టింది.

సుమ ఫైల్ తెచ్చి విధీశ ముందు పెట్టింది.

విధీశ ఫైల్ తీసి తిరగవేసింది.

అసలు ఈ ఏడాది పొడవునా ప్రతినెలా క్రమం తప్పక వేసిన సేల్స్‌టాక్స్ రిటర్న్స్ కాపీలు ఫైల్‌లో లేనేలేవు. ఆ పన్నెండు నెలలూ కూడితేనేగా ఏడాది లెక్క తేలేది!

"దీంట్లో మంత్లీ రిటర్న్స్ లేవు కదమ్మా..."

సుమ ముఖం చెక్కలా బిగుసుకుపోయింది.

"అవి లేకుండా ఇప్పుడెలా లెక్క వేస్తావ్...?"

సుమ నుంచి మాటామంతీ లేదు.

విధీశకు కోపం ముంచుకొస్తోంది.

"ఏవీ ఆ కాగితాలన్నీ...? మన దగ్గర ఓ కాపీ ఉండాలి కదా..."

సుమ తల దించుకుంది.

"లేవా?"

సుమ తల అడ్డంగా ఆడించింది.

"ఎక్కడైనా వేరే ఫైల్స్‌లో పెట్టేసారా? కాగితాల్లో కలిసిపోయాయా? యామినికి తెలుసా?" గబగబ అడిగింది విధీశ.

సుమ తెలీదన్నట్లు తలూపింది. అన్నింటికీ ఒకే సమాధానంగా.

విధీశకు లోలో నుంచి మండుకొస్తోంది.

ఇది చాలా చిన్న విషయం. ప్రతి అసిస్టెంట్‌కూ తను నేర్పే మొదటి పాఠం. ఏ కాగితమైనా ఓ కాపీ ఆఫీస్ ఫైల్‌లో పడేయమని!

మరి ఏమయింది?

"సుమా... అసలు ఆఫీసు కాపీ తీసిపెట్టనే లేదా?"

సుమ తల వాల్చేసింది.

"ఇప్పుడెలా? ఎలా రాద్దామని...?" విధీశ అసహనంగా నుదుటిని వేళ్ళతో వత్తుకుంది. 'అసలే తనకున్న క్లయింట్స్ తక్కువ. ఉన్న కొద్ది పార్టీల వ్యవహారాలు ఇలా చతికిలబడితే - ఇక తను నిలదొక్కుకున్నట్లే -! తన మెతకదనమే వీళ్ళందరికీ మరీ అలుసుగా ఉన్నట్లుంది' విధీశ తల విదిలించుకుంది.

"సరే సుమా... మళ్ళీ నెలవారీగా స్టేట్‌మెంట్స్ తయారుచెయ్యి" ఖచ్చితంగా చెప్పేసింది. అయినా కష్టమే. ఇంతకుమునుపే సేల్స్‌టాక్స్ ఆఫీస్‌లో సబ్మిట్ చేసిన వాటికి ఇప్పుడు సుమ తయారుచేసేవాటికి ఏమాత్రం తేడా రాకూడదు. ఏ ఒక్క బిల్లు ఎంట్రీ మిస్సయినా - ! అందులోనూ మందులషాపంటే కొనుగోళ్ళు అమ్మకాలు - ఏడాదిపాటు యం.ఆర్.పిలు, సేల్ ప్రైస్‌లు, పర్చేజ్ బిల్లులు... ఎలా రాద్దామనీ...?!? విధీశ తల విదిల్చింది.

సుమ తల వాల్చుకొనే ఆ ఫైల్ తీసుకొని గదిలోంచి బయటికి వెళ్ళిపోయింది.

"ఏమిటిది? ఓ చిన్నపని ఆఫీస్ కాపీ తీసిపెట్టడం అన్నది...." విధీశ అసంతృప్తిగా అటూ ఇటూ కదిలింది.

పెన్నా బిల్డర్స్ వారి దగ్గరకు వెళ్ళిన యామిని ఇంకా రాలేదు.

ఐటీ ఆఫీస్ దగ్గరకు వెళ్ళిన రమణ ఇంకా రాలేదు.

ఇద్దరిలో ఎవరొచ్చినా సేల్స్‌టాక్స్ ఆఫీస్‌కు పంపించి ఆ ఎ2 రిటర్న్స్ కాపీ తెప్పించాలి.

ఇలా ఏ చిన్న అవసరాన్ని ఆశించి ఆ ఆఫీస్‌లలో అడుగుపెట్టే అవసరం రానేకూడదు. అందుకు తనెంత శ్రద్ధ తీసుకున్నా ఎక్కడో ఏ చిన్న పొరపాటో జరగకుండా ఎలా ఉంటుంది? మనపాటి మనం పనులు చేస్తాం. ఇన్ని డిపార్ట్‌మెంట్స్‌లో ఎక్కడో ఓచోట ఓ జి.వోనో ఓ అమెండ్ మెంటో వస్తుంది. వాళ్ళు తెలియజేస్తే సంతోషం. లేదూ సరిజేస్తే మరీ సంతోషం.

కానీ, ఆ పొరపాటును దిద్దుతూ చేసే హేళన, చూసే చులకన చూపు, విరిసే విసుగూ అసహనం, మాటల్లో విరుపూ... ఛఛ... తనకే వళ్ళంతా కారం రాసినట్లుంటుందే... ఇక ఈ అమ్మాయిలకు...?

"ఒద్దికగా ఉన్నంతసేపూ... వినయంగా మాట్లాడుతున్నంతసేపూ బాగానే ఉంటారు మేడం. ఏదైనా కాస్త గట్టిగా చెప్పబోయామా... అంతే సంగతులు!" యామిని ఓరోజు అంది, "మీతో మర్యాదగా ఉంటారు మేడం... మాతో వారి ధోరణి వేరుగా ఉంటుంది.." ఆ అమ్మాయి అర్థాంతరంగా ఆగింది. అర్థయుక్తంగా ఆపింది.

అయితే నేనిప్పుడు ఏం చెయ్యాలి?

ప్రతిసారీ తను వెంటపెట్టుకొని వాళ్ళను తీసుకెళ్ళడానికి కుదరదు కదా? వాళ్ళను ఒంటరిగా ధైర్యంగా పంపగలిగే వాతావరణం ఎలా సృష్టించాలి? తను వీళ్ళకు ఎలాంటి బలాన్నివ్వాలి? ఏమి నేర్పి పంపాలి?

అందులోనూ సుమలాంటి అమ్మాయంటే... బెరుకుబెరుగ్గా... అసలే ఆమె పలుకు బంగారం... చిన్నమాటకే ఉలికి ఉలికి పడుతుంది. ఇక ధైర్యంగా చకచక ఎక్కడికంటే అక్కడికి వెళ్ళేదెలా?

నాన్న ఈ మాట ఎన్నడో చెప్పాడు.

"విధీ... నువ్వు ఎవరన్నా సీనియర్ ఆడిటర్ దగ్గర అసిస్టెంట్‌గా అన్నా చేరు... లేదా నీ అసిస్టెంట్స్‌గా మగవాళ్లనన్న పెట్టుకో. ఆడపిల్లలు ఆ ఆఫీసుల చుట్టూ తిరగలేరు-"

అదే ఎందుకు?

ఏ ఆఫీస్‌లో, ఏ బ్యాంక్‌లో చూసినా అకౌంట్స్ డిపార్ట్‌మెంట్స్ అన్నీ ఆడవాళ్ళమయమే. ఆడిటర్ల దగ్గర అసిస్టెంట్లుగా ఎందరు ఆడవాళ్ళు లేరు?

"కానీ అవన్నీ నైన్ టు ఫైవ్ డెస్క్ జాబ్‌లేగా! మార్చి, ఏప్రిల్‌లలో రేయింబవళ్ళు పనుంటుంది కదా... ఒక క్లయింట్ ఆన్యువల్ ఆడిటింగ్‌కు ఒక్క ఓవర్‌నైట్ స్టేకి నీ అసిస్టెంట్‌ని పంపించగలవా? వాళ్ళ అమ్మానాన్నలు పంపిస్తారా? ఆ అమ్మాయి వస్తుందా?" నాన్న ఘాటుగా అడిగాడు.



వస్తుంది. కానీ... వచ్చే వాతావరణం ఏదీ?

సమాజం... కుటుంబం... వ్యక్తి...!?!

నాన్న మౌలికమైన ప్రశ్న వేసాడు. తన సమయపాలన తన చేతుల్లోనే ఉందా? వృత్తి ప్రయాణాలు చేయగలిగిన స్వేచ్ఛ ఉందా?

తన ప్రతిభకూ, తన స్త్రీత్వానికి సంబంధం ఏమిటి? తను బ్యాలన్స్‌షీట్ తయారుచేసి ఎవరి ఎదురుగా అన్నా పెడితే అది స్త్రీ తయారుచేసిందో, పురుషుడు తయారుచేసిందో ఎవరైనా చెప్పగలరా?

"లేదురా విధీ... కానీ ఒక స్త్రీలాగా నువ్వు పదింతలు శ్రమ చేస్తున్నావ్... ఎక్కువ ఘర్షణ... ఎక్కువ వత్తిడి... ఎక్కువ ఆందోళన...! విధీ... అదేరా నా బాధంతా!" నాన్న గొంతు గాద్గదికమవడం తను మర్చిపోగలదా?

"మేడం..."

విధీశ ఉలిక్కిపడింది.

రమణ వచ్చాడు. మళ్ళీ సేల్స్‌టాక్స్ ఆఫీస్‌కి పంపింది. రమణ వెళ్ళాడు.

ఒక సుమ... ఒక యామిని... ఒక విధీశ... ఇంత సహజంగా ఏ సంకోచం లేకుండా... చకచక వెళ్ళేరోజు ఎన్నటికి వస్తుందో...?

ఇదంతా... ప్చ్...!

తనకు తెలుస్తూనే ఉంది.

తన క్లయింట్స్ ఒక్కొక్కరే నెమ్మదిగా తప్పుకుంటున్నారు.

వాళ్ళకు తనెలా నమ్మకం కుదర్చాలి? ఎలా వాళ్ళకు తన సామర్థ్యం మీద విశ్వాసం కలిగించాలి?

తనకు వచ్చిన ప్రశంసాపత్రాలు... గోల్డ్‌మెడల్స్... ఎందుకూ పనికిరావుగా? తనెంత చక్కగా ఆడిట్ చేయగలదో... తనెంత బాగా ఫైనాన్షియల్ రిపోర్ట్ తయారుచేయగలదో... ఎంత చురుకుగా కేస్‌ని డీల్ చేయగలదో... ఇవన్నీ ఎవరికీ అవసరంలేదు.

ఆ పెన్నా బిల్డర్స్ యం.డి. కృష్ణమూర్తిగారు అన్నట్లుగా ఎంత పన్ను తగ్గించగలను? నంబర్‌టు ఖాతాలు ఎలా మెయింటెయిన్ చేయించగలను? బ్లాక్‌ను ఎలా మ్యానేజ్ చేసుకోవాలో చెప్పగలను? - ఇవీ... ఇవే కావాలి.

ఒక ఆడిటర్‌ని అంటే ఇలాంటి దళారినా? తనొక ఆర్థిక సలహాదారు. తనొక ఆర్థిక ప్రమాణం. ప్రభుత్వానికి ప్రజలకు నడుమ ఆర్థిక మధ్యవర్తి. తన క్లయింట్స్ చేత పన్నులు సక్రమంగా కట్టించేట్లు చూడడం తన బాధ్యత కాదూ? విద్యార్థులుగా మేం నేర్చిన పాఠాలన్నీ పన్నులు కట్టించడానికా? ఎగ్గొట్టించడానికా?

"నువ్విలా అంటావు కాబట్టే...! ఇక నీ ప్రాక్టీసు ఎలా పెరుగుతుంది?" ప్రద్యుమ్న దాపరికం లేకుండా అనేశాడు.

"ప్రద్యూ... గౌరవంగా హుందాగా సంపాదనను కూడబెట్టుకోవడానికి బోలెడు చట్టబద్ధమైన మార్గాలున్నాయి. అయినా పన్నులు కట్టకపోతే ఎలా చెప్పు? నీవు నడిచే రోడ్డెలా వస్తుంది? నీ వీధి దీపం ఎలా వెలుగుతుంది? నీ కొళాయిలోకి నీళ్ళెలా వస్తాయి? బస్సులు, రైళ్ళు ఎలా వస్తాయి? ఆసుపత్రులు, స్కూళ్ళు ఎలా నడుస్తాయి?" కయ్‌మంది తనారోజు.

ప్రద్యుమ్న చెప్పింది నిజం! అది జనవాణి. లోకంపోకడ. ఆడిటర్ అంటే ప్రస్తుతం సామాన్యుడిచ్చే అర్థం అదే! శ్రీమంతుడిచ్చే పరమార్థం అదే!

వ్యక్తి విలువలు లేని వృత్తిధర్మం... వృత్తి ఆశయాలు లేని సమాజధోరణి.

సమన్వయం కుదరటంలేదు. సమతూకం సాధ్యం కావడంలేదు.

తనకు చేతకావడంలేదు. తనవారిలో తను వెనుకబడిపోతోంది. ఎందుకలా?

తనలో ఆలోచన లేదా? తనలో ప్రతిభ లేదా?

విధీశ తల పట్టుకుంది. శూలాలతో పొడిచినట్టు తలనొప్పి! లోలోనుంచి!!

నేనంటే... నా ఆలోచనా?

కాదు!

నేనంటే... నా ప్రతిభా?

కానేకాదు!!

నేనంటే...???

నా లౌక్యం...!!!

ఇదీ ఈరోజటి సత్యం.

నొప్పించక తానొవ్వక తప్పించుకు తిరుగువాడు ధన్యుడు!

ఈ ఆలోచనల నుంచీ తప్పించుకోవాలి.

ఈ తలనొప్పి నుంచీ తప్పించుకోవాలి.

"నీ ఆరోగ్యం మీద ఇదంతా ప్రభావం చూపుతోంది. తిండి తినవు. నిద్రపోవు. ఎందుకంత వత్తిడి? ప్రద్యుమ్న కూడా బాధపడుతున్నాడు తెలుసా? చేసే పని సావధానంగా చేసుకోవడానికి ప్రయత్నించు" నవ్య కూడా అంది.

"మరే... నలుగురితోపాటు నారాయణ అనుకుంటే ఏ తిప్పలూ లేవు. ఇదుగో ఇలా ఉలిపికట్టెలా ఊరి మీద పడితే కోరి మెడకు ఉరి బిగించుకున్నట్లే..." అమ్మ కాస్త కోపంగానే అంది. "వళ్ళు గుల్ల చేసుకొని ఎందుకొచ్చిన సంపాదన? పిల్లలకెంత ఇబ్బంది?"

"సంపాదనా? తన క్లయింట్స్ తనకు తగ్గవారే. అకౌంటెంట్లను కూడా పెట్టుకోరు. తన అసిస్టెంట్లే వెళ్ళి వాళ్ళందరి జమాఖర్చులు రాసి రావాలి. వోచర్లు రాయించడం దగ్గర నుంచి బ్యాలెన్స్ షీట్ వేయడం వరకూ చేయించాలి. అన్ని టాక్స్‌ల ఫాంలు ఫిలప్ చేసి ఇస్తే సంతకాలు పెడతారు. ఇక ఆడిటర్ ఫీజు కలెక్ట్ చేయాలంటే అదో అష్టావధానం. ఫలాన ఆడిటర్ అయితే ఇంకా ఎంత పన్ను తగ్గేదో... ఫలాన ఆడిటర్ అయితే ఎంత చక్కగా ఐటీవాళ్ళను మానేజ్ చేస్తాడో... ఫలాన ఆడిటర్ ఎంత బాగా నెంబర్ 2 రాయిస్తాడో... ఇవన్నీ... మరిన్నీ... సోదాహరణంగా ప్రాక్కుచ్చి...



తనను న్యూనతలో ముంచి... వచ్చే ఏడాదికి తన సేవలను కొనసాగిస్తామో లేదో అని ఓ అనుమానబాణం గ్రుచ్చి... ఎంతో కొంత చెల్లిస్తారు.

తమ దయ మా ప్రాప్తం... ఎందుకంటే 'పార్టీ' మరుసటి ఆర్థిక సంవత్సరానికి కొనసాగడం ముఖ్యం కాదూ?

ఛ... ఛ...!

ఇంత చదువు చదివీ... ఇన్ని విద్యలు నేర్చి...!

అబ్బబ్బా...!

ఫోన్.

ప్రద్యుమ్న.

"నవ్య మాట్లాడింది."

విధీశ మాట్లాడలేదు.

"ఇదంతా బ్యాటిల్ ఆఫ్ హార్మోన్స్ అనీ!"

విధీశ నవ్వింది సనసన్నగా ప్రద్యుమ్న కంఠంలోని నిజాయితీకి. నవ్య చెప్పిన బయాలజీ పాఠాన్ని ఎంత బుద్ధిగా విని ఉంటాడో ఊహించుకొని.

"నీలోని జీవరసాయనాల ప్రక్రియలు నిరంతరం నీలో కలిగించే ఆటుపోట్లను అల్లకల్లోలాలను నేను అర్థం చేసుకోలేకపోయాను." ప్రద్యుమ్న కంఠంలో ఆర్ద్రత, "విధీ... ఐయాం సారీ... తెలిసో తెలియకో ఏదైనా..."

"ఆగండి సార్...! నేనేమైనా క్షమాపణలు అడిగానా?" చటుక్కున అంది విధీశ.

"అదే మరి...!" కినుకపడ్డాడు ప్రద్యుమ్న.

"ప్రద్యూ... నువ్వే అన్నావ్‌గా... బ్యాటిల్ ఆఫ్ హార్మోన్స్ అనీ...!" విధీశ ఫక్కున నవ్వింది, "బ్యాటిల్ ఆఫ్ విట్స్... షుడ్ గో ఆన్... అండ్ ఆన్..."

"క్యారీ ఆన్..." ప్రద్యుమ్న నవ్వేసి ఫోన్ పెట్టేశాడు.

ఆ కంఠంలో ఆపేక్ష. విధీశ భర్తను ప్రేమగా తలుచుకుంది.

"టక్... టక్..." విధీశ తలెత్తి చూసింది. తనకూ తన అసిస్టెంట్స్‌కూ మధ్య ఉన్న గాజు పలక మీద మునివేళ్ళ చప్పుడు. కర్టెన్ పక్కకు తీసి చూసింది.

యామిని. తను తిరిగి వచ్చేసానన్నట్లు సైగ చేసింది. రమణ కూడా అక్కడే ఉన్నాడు. ఇంతకీ సుమ ఏమైంది? ముగ్గురూ కూడబలుక్కున్నట్లు తలలు దించుకుని చకచక రాస్తున్నారు. విధీశ కర్టెన్ వేసేసింది.

'ఇందాక కూడికలను సరిచూస్తూ ఓ చోట ఆగిపోయాను కదా... అరరే...' విధీశ తన పని వైపు దృష్టి పెట్టింది. దొరికింది ! పొరపాటు ఎక్కడ జరిగిందో తెలిసింది!

ఒక పేజీలోని విలువలను మరో పేజీలోకి రాసేప్పుడు ఓ సున్నాను మింగేశారు! రెండు లక్షలు కాస్తా ఇరవైవేలయి కూర్చుంది. హతోస్మి!

ఎంత చిన్న పొరపాటు! ఇంతసేపు పట్టింది. లెక్క సరిచేయడానికి.

ఒకే ఒక సున్నా!

ఇన్ని లెక్కలు మార్చివేసింది. ఇన్ని తిప్పల్ని పెట్టింది. ఇంత ఇబ్బందిని పెట్టింది.

శూన్యాతిశూన్యమైన తేడా!

నవ్య కూడా ఇలాగే అంది, "జెనెటికల్లీ స్పీకింగ్... స్త్రీ పురుషుల నడుమ ఉన్న తేడా ఎంతో తెలుసా? ఒక్క క్రోమోజోమ్. నలభైయ్యారు సొమాటిక్ క్రోమోజోమ్స్ ఇద్దరిలో సరిసమానమే. మిగిలిన రెండు సెక్సువల్ క్రోమోజోమ్స్‌లో ఒకే ఒక్కటి తేడా. అంటే మొత్తం నలభై ఎనిమిదిలో ఒకటి తేడా. ఇంత చిన్న తేడా ఎన్ని తిప్పల్ని తెచ్చిపెట్టిందో చూసావా?"

ఒకే ఒక్క క్రోమోజోమ్!

సూక్ష్మాతిసూక్ష్మమైన తేడా !

తప్పిపోయిన ఆ సూక్ష్మ పరమాణువు చుట్టూ వెల్లివిరిసిన ఈ మానవసృష్టిలోని సమస్త బ్రహ్మాండం!

విధీశ నిట్టూర్చింది.

ఆలోచనలను కట్టిపెట్టి... తప్పిన లెక్క పనిబట్టింది.

యామిని వచ్చింది. సాయి మెడికల్స్ వాళ్ళ రిటర్న్స్ తయారయ్యాయి. టోటల్ సరిచూసి టాక్స్ ఎంతో చెప్పేసింది విధీశ. యామినితో అనింది, "ఆ మెడికల్స్ వాళ్ళకి చెప్పమ్మా..."

యామిని వెళ్ళబోయింది.

"సుమని ఇక్కడికి రమ్మను."

యామిని వెళ్ళిపోయింది.

అరగంట, గంట, గంటన్నర.

సుమ రాలేదు.

బ్యాలెన్స్ షీట్ తయారయింది. విధీశ ఫైల్ మూసేసింది.

సుమ ఇంకా రాలేదు.

'అదేమిటి? ఇవ్వాళ ఆ అమ్మాయి అలా ప్రవర్తిస్తోంది? పిలిచినా రాకుండా...! తన పని పూర్తయింది. రేపు చేయవలసిన పనులెన్నో ఉన్నాయి. ఇక ఈ ముగ్గురు ముత్యాల గురుగులు అంత దీక్షగా ఏమి రాస్తున్నారో...!'

విధీశ గాజుపలక మీద టకటక లాడించబోయి విరమించుకుంది. తనే వారి దగ్గరకు వెళ్ళింది.

"చెబితే మేడంకి కోపం వస్తుంది. కానీ వాళ్ళు ఏమంటున్నారంటే - మీరు ఎంతో చక్కగా రూల్స్ పాటిస్తారు. బుక్స్ రాస్తారు. ట్యాక్స్ కట్టిస్తారు. కానీ ఫార్మాలిటీస్ ఫాలో కారు. అదే మీతో చిక్కు..." రమణ హుషారుగా చెబుతున్నాడు. ఎవరో పలికిన పలుకులను చిలుకలా వల్లిస్తూ.

అమ్మాయిలు ఇద్దరూ తల ఎత్తకుండానే చెవులు అప్పగించారు.



"చాలా కేసులలో ఆడిటర్లకూ ఆఫీసర్లకూ మధ్య ఓ అవగాహన కుదిరేది ఎక్కడో తెలుసా - ఉదయంపూట వాకింగ్‌లోనో... సాయంత్రం టెన్నిస్‌క్లబ్‌లోనో... రాత్రి పార్టీలలోనో! మన మేడంని అలా... ఛ...ఛ..."

అప్పటికే అమ్మాయిలు విధీశను చూసేసారు. వాళ్ళ ముఖాల్లో ఓ రకమైన తడబాటు. రమణ చూడలేదు. విధీశ పెదవులపై వేలుంచి అమ్మాయిలిద్దరినీ మౌనంగా ఉండమని సైగ చేసింది.

"అసలు ఆడిటర్లకు తెలియకుండా ఏ పనీ జరగదు. రైడ్స్ దగ్గర నుంచి స్క్రూటినీ వరకూ. అంత అండర్‌స్టాండింగ్ వాళ్ళ మధ్యన. మొన్న మన క్లయింట్ 'స్వర్ణా హోటల్స్' మీద జరిగిన రైడ్ ఎలాగ జరిగిందనుకుంటున్నారు? మన మీద అపనమ్మకం కలిగించి వాళ్ళవైపు తిప్పుకోవడానికి... ఆ ప్రసాద్ కన్సల్టన్సీ వాళ్ళు చేసినపని! ఓ ఆఫీసర్ అంటాడు... మీ మేడంని ఫార్మాలిటీస్ అడగడమే కష్టమనీ...!"

"ఎందుకు అడగలేరట?"

విధీశ గొంతు విని ఎగిరిపడినంత పనిచేసాడు రమణ.

"అదీ..." రమణ నసిగాడు.

"మాకు ముందే చెప్పేసాడు-" యామిని హుషారుగా చెప్పింది, "ఆడవాళ్ళని ఎలా అడగాలని?"

"అంతేనా...?" విధీశ ఆరాగా అడిగింది.

"రమణా నువ్వు రావచ్చు కదా... ఆ అమ్మాయిలను ఎందుకు పంపుతారు? వాళ్ళతో ఏం మాట్లాడాలన్నా ఇబ్బంది అని కూడా అంటారట" యామిని గడగడ వప్పజెప్పింది.

విధీశ ఇక ఏమీ మాట్లాడలేదు.

"వాళ్ళు మాట్లాడదలచుకుంది ఏమిటి? వాళ్ళ ఫార్మాలిటీస్ ఏమిటి? ఎవరికి తెలియదు? ఈ కాలంలో సర్వంసహా వర్ధిల్లే అతిసామాన్య విషయం. కట్టాల్సిన టాక్స్ కన్నా ముందు... ఆడిట్ ఫీజ్ కన్నా ముందు - అనఫీషియల్ ఆఫీస్ ఫీజు చెల్లించుకోవాలి! పువ్వుల్లో పెట్టి. ఆడవారిని అడగడానికి అభిమానం అడ్డొస్తే మరీ మంచిది! ఆ రకంగా.. ఎక్కువమంది ఆడవాళ్ళు ఆడిటర్లుగా వచ్చి... ఎక్కువ సొమ్ము ఖజానాకు చేరొచ్చుగాక! తథాస్తు!!" విధీశ ముఖాన సన్నని నవ్వు కదలాడింది.

"అది అనుకున్నంత సులభమా? తమ బంగారుపుట్టలో వేలుపెడితే ఎవరూరుకుంటారు? రమణ అన్నదాంట్లో వాస్తవం లేకపోలేదు. అది ఆఫీసర్లకూ ఆడిటర్లకూ మధ్య రాసి ఉంచిన ఓ అదృశ్య మెమొరాండం ఆఫ్ అండర్‌స్టాండింగ్...!" విధీశ నిట్టూర్చింది. తెప్పరిల్లి రమణ వంక చూసింది.

విధీశ ఏమీ చెప్పబోతోందో అని బిక్కముఖం వేసుకొని చూస్తున్నాడు.

"సరే... రమణా ఇక నువ్వు ఇంటికి వెళ్ళు. రేపు చాలా పనులు ఉన్నాయి. పొద్దున్నే రావాలి" విధీశ నవ్వు ముఖంతో చెప్పింది.

రమణ కుదుటపడ్డాడు. విధీశ తన గదిలోకి వెళ్ళి కూర్చుంది. తను ప్రాక్టీస్ ప్రారంభించిన రోజున ఊళ్ళోని ఆడిటర్లందరూ వచ్చి... చక్కగా ఇచ్చిన ఉపన్యాసాలూ... కురిపించిన ప్రోత్సాహం... జ్ఞాపకం వచ్చాయి. నవ్వొచ్చింది. అప్పుడూ వీరే! ఇప్పుడూ వీరే!

రమణ వెళ్ళిపోయాడు. యామిని విధీశ దగ్గరకు వచ్చింది. సుమ గురించి చెప్పింది. విన్న విధీశ మెదడు మొద్దుబారిపోయింది. తేరుకుని చకచక డా॥ నవ్యకు ఫోన్ చేసి అంబులెన్స్ పంపమంది. యామినిని వెంటనే ఓ కొత్త డ్రెస్ తెమ్మని డబ్బిచ్చి పంపింది. తన డెస్క్‌లో ఉన్న శానిటరీ న్యాప్‌కిన్స్ తీసుకొని సుమ దగ్గరికి పరిగెత్తింది.

'సుమా... షి ఈజ్ బ్లీడింగ్ లైక్ హెల్! విపరీతమైన రక్తస్రావం!' విధీశ ముఖాన నెత్తురు చుక్క లేనంతగా పాలిపోయింది. 'తనకూ వారికీ మధ్య ఓ గాజుపలక! అయ్యో... సుమ స్పృహ తప్పేట్లుగా ఉంది...'

ఇంతలో యామిని డ్రస్ పట్టుకొచ్చింది. సుమ యామిని సాయంతో డ్రస్ మార్చుకుంది. అంబులెన్స్ వచ్చింది. నవ్య నిమిషాల్లో అడ్మిట్ చేసి, ఇంజక్షన్లు ఇచ్చి, సెలైన్ పెట్టేసింది. యామిని సుమ వాళ్ళింటికి ఫోన్ చేసి వచ్చింది.

నవ్య విధీశను తన రూంలోకి తీసుకెళ్ళింది.

విధీశ తల పట్టుకు కూచుంది.

"విధీ... ఆ అమ్మాయి స్పృహ తప్పకుండా ఎలా మేనేజ్ చేసిందో తెలియడంలేదు. సివియర్ బ్లీడింగ్, ఇంకా తగ్గకపోతే రక్తం ఎక్కించాల్సి వస్తుంది. కంట్రోల్ అవుతుందనే..." నవ్య ఏకబిగిన అంది. "విధీ విద్యార్థినుల్లో పరీక్షల ముందు ఇది మామూలే. ఇప్పుడు ఉద్యోగినుల్లోనూ... డియుబి - డిస్‌ఫంక్షనల్ యుటిరైన్ బ్లీడింగ్... నా ట్రీట్‌మెంట్ మాత్రమే సరిపోదు. ఆమెకు సైకలాజికల్ సపోర్ట్ ఇవ్వాలి. నువ్వూ... నేనూ... అందరం...!"

"సారీ నవ్యా... సుమ పొద్దుణ్ణించి ఆఫీసులోనే ఉంది. ఇలాంటి సమస్య ఆమెకు ఉందని నాకు తెలియదు. ఎందుకో మూడీగా ఉందనుకున్నానుగానీ. సారీ... నేను ఊహించలేకపోయాను. సుమ కూడా మాటమాత్రం చెప్పలేదు..." విధీశ పశ్చాత్తాపం నిండిన గొంతుతో అంది.

"చెప్పరు. నాతోనే చెప్పరు. నేను వంద ప్రశ్నలడిగితే ఓ సమాధానం వస్తుంది. ఆ చెప్పలేక పోవడానికి సవాలక్ష సంకెళ్ళున్నాయి. ఆడవాళ్ళంతా నీలాగా నాలాగా మాట్లాడగలరనుకుంటు న్నావా? వాళ్ళు మాట్లాడలేని మాటలెన్నో ఉన్నాయి!" నవ్య ఉద్వేగంగా అంది.

"ఎప్పుణ్ణించీ...?" విధీశ కంఠం పీలగా పలికింది. "సుమ... అలా... ఎప్పుణ్ణించీ...?"

"సుమారు రెండుగంటల నుంచీ ఏకధారగా."

'అవును. అప్పుడే రమణ వచ్చాడు. అమ్మాయిల ఎదురుగా కూర్చున్నాడు.' విధీశకు ఇక విషయం తేటతెల్లమైపోయింది. 'సుమ కూర్చున్నచోటి నుంచి లేవలేదు. లేస్తే అతని కంటబడు తుంది. ఆ అబ్బాయి కదల్లేదు. అతనికి పాపం ఏ ఇబ్బందీ తెలియదు. పైనుంచి ఆ అమ్మాయికే సాయం చేస్తూ - ఆమె చేయవలసిన పనికి చేదోడుగా కూర్చున్నాడు.'



విధీశకు తనా గదిలోకి వెళ్ళినపుడు సుమ ముఖం జ్ఞాపకం వచ్చింది.

'ముఖం పాలిపోయి... పళ్ళ బిగువున... కదలకుండా... తలదించుకొని... అయ్యయ్యో...!' విధీశ ముఖంలో అపరాధభావం కొట్టొచ్చినట్లు కనిపిస్తోంది. గుండె డొల్ల అయిపోయింది.

"నాలోని హార్మోన్ల ఆటుపోట్ల గురించి ప్రద్యుమ్న అర్థం చేసుకోవట్లేదని అలక పూనానే! నా పక్కనే ఉన్న నా అసిస్టెంట్‌కు ఎలాంటి ఇబ్బంది ఉండొచ్చో నేను ఏమాత్రం అర్థం చేసుకోక పోయాను" విధీశ బాధపడింది.

"రిలాక్స్... విధీ... మరోలా ఆలోచించు. నీ ప్లేస్‌లో ఓ పురుషుడు ఉంటే...? కొలీగ్స్ అంతా మగవారే అయితే...? ఆ అమ్మాయి ఆ ఎంబ్రాస్‌మెంట్‌కే...!" నవ్య అర్థాంతరంగా ఆగింది.

విధీశ తల గిర్రుమంది. యామిని ఆటపట్టిస్తేనే కళ్ళల్లో నీళ్ళు సుళ్ళు తిరిగే సుమ...! సిగ్గుతో చితికి... అవమానంతో కుళ్ళి... బిడియంతో కుమిలి... వద్దొద్దు... ఇకపై ఆలోచించొద్దు.

"ఏకవస్త్రను నేను గడపదాటి రాలేనని వదినమ్మ ఎంతగా ప్రాధేయపడినా... వినక ఆమె జుట్టుపట్టి నిండుసభకు ఈడ్చుకువెళ్ళి వివస్త్రను చేసిన పరంపర కాదూ మనది" నవ్య గొంతు గద్గదమైంది. "విధీ... నీ ఆఫీస్‌లో కనీసం బాత్‌రూం ఉంది. చెప్పుకోవడానికి సుమ పక్కన యామిని ఉంది. నీవు శానిటరీ న్యాప్‌కిన్స్ ఇచ్చావు. ఎన్నిచోట్ల ఎన్ని సందర్భాల్లో ఇలా వీలవుతుంది? ఆ అమ్మాయి సిగ్గుతో బిడియంతో అవమానంతో అలాగే ఇంకాసేపు ఉండి ఉంటే..."

విధీశ ఆ ఊహకే తెల్లబోయింది.

"అదే... మన పిల్లలకు నేర్పాల్సింది. మన ఆడవాళ్ళకి నేర్పాల్సింది. మన మగవాళ్ళకి నేర్పాల్సింది. ఇది ఒక సహజ శరీరధర్మం. ఇందులో అవమానమూ లేదు. అసహ్యమూ లేదు. సిగ్గుపడాల్సిందీ లేదు. చితికిపోవాల్సిందీ లేదు. ఋతుచక్రం ఆడవారిని అనుక్షణం శాసిస్తూనే ఉంటుంది. రసాయన ప్రక్రియలు అదృశ్యరూపంలో ఆడిస్తూనే ఉంటాయి. నిత్యజీవితంలో నిరంతరం చెలరేగే ఈ సంఘర్షణ ఈ వత్తిడి ఈ ఆందోళన - ఆ జీవ రసాయన ప్రక్రియను ప్రభావితం చేస్తూనే ఉంటాయి. విధీ... వి నీడ్ బ్యాలెన్స్!" నవ్య దిగాలుగా అంది, "కాస్తంత సమతుల్యం కావాలి విధీ...!"

'అవును. నవ్య చెప్పింది నిజమే.

బ్యాలన్స్ సీట్ ట్యాలీ కావడం లేదు.'

ఎందుకోగాని విధీశ కళ్ళ ముందు మామగారు ప్రస్తావించిన ఆ గ్రామీణ బ్యాంక్ ఉద్యోగిని కదలాడింది.

ఆమె... అమ్మ... అత్తమ్మ... సుమ... యామిని... నవ్య... తను... ఎవరైతేనేం?

అందరినీ ఆడించే దారం ఒక్కటే.

ఆ దారం చిక్కుపడిపోయింది.

విప్పలేనంతగా.

విధీశతో అత్తమ్మ ఆ గ్రామీణ ఉద్యోగిని గురించి అన్నమాటలు జ్ఞప్తికి వచ్చాయి.

"ఆ గ్రామీణ బ్యాంక్ ఉద్యోగినిని గురించి బరితెగించిందనీ, బజారున పడిందనీ గుస గుసలు పోయిన పట్టణ బ్యాంకు ఉద్యోగుల్లో మేమూ ఉన్నామమ్మా... కానీ అది ఆ అమ్మాయికి పనిపట్ల ఉన్న శ్రద్ధ అనీ, వ్యక్తిగా ఆమె నిజాయితీ అనీ... వృత్తిపట్ల ఆమె నిబద్ధత అనీ... మేం అనుకోలేకపోయాం. మాకు చేరిన పిటిషన్ల కళ్ళతో మేం చూసాం.

"నేనా పని చేయగలనా? ఎందుకు చేయలేను? ఆ అమ్మాయి ఎలా చేయగలిగింది? వీటన్నింటికీ మావద్ద సమాధానాల్లేవు. ఒక నిజాయితీ గల ఉద్యోగినిని నిలువునా కుళ్ళబొడిచిన సందర్భమది. మాకూ తెలియనితనం, నలుగురితోపాటు మేమూ ఓ రాయి వేసామే కానీ - ఆ వేస్తున్న రాయి ఆమెతో పాటు మేము నడిచే దారిలో మేట పడుతుందని ఊహించలేకపోయామమ్మా... మీ మామగారు ఎంక్వైరీ పూర్తిచేసి వచ్చి విషయం చెప్తున్నపుడు సిగ్గుతో చచ్చిపోయినంత పనైంది.

"ఆమె కంటూ ఓ వ్యక్తిత్వం ఉంది. జీవితం ఉంది. ఓ కుటుంబం ఉంది. లోకం ఉంది. అన్నింటిపై ఈ సంఘటన ఎలాంటి ప్రభావాన్ని చూపి ఉంటుంది? ఎంతటి క్షోభ... హింస...!

"విధీ... నువ్వు ఓ లెక్చరర్‌కి ఉదాహరణ. ఓ స్టూడెంట్‌కి ఆదర్శం. నీ బాధ్యత పెరిగిందమ్మా... ఎన్ని వత్తిళ్ళున్నా నీ మనసు విరగనీయకు. నీవు విచ్చిపోకు. నీవు చతికిలబడిపోకు. నీవు వేసే అడుగు ఎంత చిన్నదైనా...!"

అత్తమ్మ గొంతులోని ఆర్ద్రత గుర్తుకు వచ్చి విధీశ కళ్ళు తడికట్టాయి.

గట్టిగా కళ్ళు మూసుకుంది. ఉవ్వెత్తుతున్న ఆలోచనల్ని అదిమిపెడుతున్నా... ఎంతకీ తేలని లెక్కల్లా చిక్కుబడిపోతున్నాయి.

అవును.

బ్యాలెన్స్ షీట్ ట్యాలీ కావడంలేదు.

శరీరధర్మాలకు... కుటుంబ జీవనానికి...

వ్యక్తి స్వతంత్రానికి... సంఘ వైఖరికి...

వృత్తి గౌరవానికి... సమాజ ధోరణికి...

అస్తిత్వ సాధనకు... అనంత వేదనకు...

మానవ విలువలకు... సృష్టి వైచిత్రికి...

నడుమ -

బ్యాలెన్స్ షీట్ ట్యాలీ కావడంలేదు.

ఎక్కడో ఏదో ఎంట్రీ తప్పిపోయింది.

కూడికలోనో. తీసివేతలోనో.

అంకణాలోనో. ఆవర్జాలోనో.

*ఇండియా టుడే, 10 డిసెంబర్ 2002*



# 13

# ఆవు-పులి మరికొన్ని కథలు

డా॥ వి. చంద్రశేఖర రావు





గ్లోబలైజేషన్ దుష్ఫలితాలను ప్రతీకాత్మకంగా వివరించిన కథ 'ఆవు-పులి మరికొన్ని కథలు.' రచయిత డా॥ వి. చంద్రశేఖరరావు 13 ఏప్రిల్ 1959లో పుట్టారు. వీరి మొదటి కథ 'నైట్‌డ్యూటీ' **ఆంధ్రజ్యోతి**లో అచ్చయింది. 'జీవని', 'లెనిన్ ప్లేస్' కథా సంపుటాలు వెలువరించారు. మూడోది 'మాయ లాంతరు' సెప్టెంబర్‌లో విడుదలవుతోంది. వీరి నవల 'ఐదు హంసలు' ఆటా బహుమతిని గెల్చుకుంది. రైల్వేలో ఫైనాన్సు విభాగంలో ఉద్యోగం.

*చిరునామా: చైతన్యపురి, 3వ లైను, కొరిటిపాడు, గుంటూరు-500 007.*

ఈ మార్పులు మొదలై చాలాకాలం అయుంటుంది. నా ఎరుకలోకి వచ్చింది ఈమధ్యనే. గాలిలో, నేలలో, వాతావరణంలో ముందుగా మార్పులు వచ్చాయి. రోడ్డుపై నడుస్తుంటే మన పైకి వేడిగాలులు వదులుతున్నట్లుగా ఉంటుంది. పేవ్‌మెంట్లు, సిమెంట్ గోడలు పగుళ్ళు వారటం, చెట్లపై ఆకులు అదృశ్యం కావటం, మనుషుల చుట్టూ తెల్లని పొర ఏదో కమ్మినట్లు, గాలిలోని ఇసుక రేణువులో, ఫ్యాక్టరీల కాలుష్యమో, వాహనాల పొగో స్పష్టంగా తెలియదు కానీ, రోడ్డుపై వెళుతుంటే తెరల్ని చీల్చుకొని ప్రయాణిస్తున్నట్లుగా ఉంటుంది.

జనమంతా వాతావరణంలోని మార్పుల గురించి భయపడుతుంటే, నేను అదృశ్యమవుతున్న పచ్చదనం గురించి, జంతువుల గురించి భయపడుతున్నాను. ఎటు చూసినా మనిషి వాసనలు, మనిషి రూపాలు. ఎంత గాఢంగా పులిమినా ఈ మనిషి రంగు, భూమిపైని వేడిని, మార్పుల్ని ఆపగలదా?

సాయంకాలం ఆరు కాగానే సగం సగం పెయింట్ చేసిన స్కెచ్‌లు, రంగులు, బ్రష్‌లూ హ్యాండ్‌బ్యాగ్‌లో కుక్కుకొని బయటపడ్డాను. తెల్ల మారుతీ కారు, వినయంగా నిలబడ్డ డ్రైవరూ వద్దని చెప్పి రోడ్డు పక్కనే నడవటం మొదలుపెట్టాను. ఫ్లై ఓవర్ కింద కొత్తగా వేసిన మినీ గార్డెన్ దగ్గర ఆగాను. స్కూల్ కుర్రాడొకడు పూలమొక్కల పైకి వంగి, దాని వాసనని గాఢంగా పీల్చటం మొదలుపెట్టాడు. పచ్చని గడ్డిపైన కూలబడ్డ వృద్ధుల జంట పచ్చికను ఆప్యాయంగా తడుముతున్నారు. ఇనుప కంచెలోంచి మూతిని లోపలికి పెట్టి ఒక ఆవు గాఢంగా శ్వాసిస్తోంది. తినడానికి వీలులేకుండా ఇనుప కంచె. అందుకే అది ఆ పచ్చికలోని తీపినో, వాసననో గాఢంగా పీల్చుతోంది. ముక్కుపుటాలు తెరచి 'హిస్'మంటూ శబ్దం చేస్తోంది. వాసనలు ఆఘ్రాణించే శక్తి నాలోనూ అనూహ్యంగా పెరగటం తెలుస్తోంది. పూలచెట్లు కనిపిస్తూనే నా ముక్కుపుటాల్లో సంచలనం కలుగుతోంది. పరిమళం ఉప్పెనలా నన్ను చుట్టుముడుతోంది. వసంతాల నుంచి, వందలాది ఎకరాల పూలతోటల నుంచి పరిమళమంతా ఎగసి వచ్చినట్లుగా, రోడ్డు పక్కన ఏ మొక్క కనిపించినా అది పరిమళ రంధ్రాలన్నీ తెరచుకొని నా కోసం ఎదురుచూస్తున్నట్లుగా అనిపించటం, ఇవి కూడా నాలో కొత్తగా తోసుకొస్తున్న మార్పుల్లో భాగమే.

ఇంటి దగ్గర ఈ సమయానికి ఒక పార్టీ జరుగుతూ ఉంటుంది. వారం రోజులుగా మనోహర్ చాలా ఉత్సాహంగా ఉన్నాడు. 'వ్యవసాయ కార్మికులు-గ్లోబలైజేషన్ ప్రభావం' అనే విషయంపై ఒక జాతీయ సెమినార్ నిర్వహించడానికి అనుమతి వచ్చింది. విదేశాల నుంచి అవసరమైన ఫండ్స్ కూడా అందాయి. నిర్ణయాత్మకమైన సెమినార్‌గా దీన్ని తీర్చిదిద్దాలని మనోహర్



ఆరాటం. చట్టసభల నుంచి ఎం.పిలను, సివిల్ సర్వీసుల నుంచి ఐ.ఏ.ఎస్‌లను కూడా ఆహ్వానించాలని, అవసరమైతే అసెంబ్లీకి ఊరేగింపు తీయాలని తన ప్రయత్నం.

ఇంటి ముందున్న లాన్‌లో కమ్మని సంగీతం, తీయని రుచులు, మృదువైన సంభాషణలు. హడావిడి అంతా తెలుస్తోంది. రచయితలు, కవులు, సోషల్ సర్వీస్ సంస్థలవాళ్ళు. కొత్తగా వస్తున్న మార్పుల్లో ఈ పార్టీలు కూడా ఒక భాగమే. ఇప్పుడు ఉద్యమాలు, ప్రజా జీవితాలను ప్రభావితం చేసే నిర్ణయాలు ఇట్లాంటి పార్టీల మధ్యే నిర్మాణం అవుతున్నాయి. ఇంట్లోకి వస్తుంటే కనీసం పాతిక పైగా చేతులు హలోలు చెప్పాయి. వాళ్ళ నిర్ణయాత్మకమైన ఏకాంతాన్ని భంగం చెయ్యటం ఇష్టంలేక చిరునవ్వులు విసిరి లోపలికి వచ్చాను. లోపలికి నడుస్తుంటే, "మువ్వకు జ్వరం. నీకోసం అడుగుతోంది" అన్నాడు మనోహర్.

పై గదిలోకి వెళుతుంటే మెట్ల పక్కన పొడవాటి అద్దంలో వింత రూపం కనబడి ఉలిక్కిపడ్డాను. చేతులపై, మెడపై పొలుసులు పొలుసులుగా జంతుచర్మం ఏదో మొలుచుకొస్తున్నట్లుగా తోచి కంగారుపడ్డాను. దగ్గరకు వెళ్ళి మళ్ళీ చూసుకొన్నాను. ఏదో భ్రమ. నిజం అనిపించేంత భ్రమ.

గదిలో మంచంపై ముడుక్కొని పడుకొంది మువ్వ. నావైపు చూసి నీరసంగా నవ్వింది. కళ్ళలో ఎర్రజీరలు. ముఖం ఉబ్బి ఉంది. కళ్ళను నావైపు తిప్పి, "నువ్వు వచ్చినట్లు ఇప్పుడే కల వచ్చింది" అంది నవ్వుతూ. ఇంకా నిద్రలోనే ఉన్నట్లుంది. శరీరం చుట్టూ వెచ్చని ఆవిర్లు, జ్వరం వాసన. పక్కకు తిరిగి ఒత్తిగిలి, "కథ ఒకటి చెప్పు" అంది. మువ్వకు మృగాల గురించి, జంతు ప్రపంచం గురించిన కథలంటే ఇష్టం. తన కోసం కొత్త జంతువుల్ని, కొత్త కొత్త కథల్ని సృష్టిస్తుంటాను. మందు వేసినాక సగం మనిషి, సగం ఖడ్గమృగంగా మారిన రాజకుమారుడి కథ చెబుతుండగా నిద్రలోకి జారుకొంది.

రాత్రి పదిగంటలకు మనోహర్ పైకి వచ్చాడు. చాలా ఉత్సాహంగా ఉన్నాడు. ఎవరెవరిని ఆహ్వానిస్తున్నదీ, ఎంతమంది వస్తున్నదీ అన్ని విశేషాలు చెబుతూనే ఉన్నాడు. అన్నం తింటున్నప్పుడు, టీవీలో వార్తలు చూస్తున్నప్పుడు, చివరకు పక్కమీద ఏకాంతపు దగ్గరితనంలో కూడా ఆ విశేషాలే. "పత్రికలలో యాడ్‌లు, పోస్టర్‌ల ప్రింటింగ్, కరపత్రాలు, బుక్‌లెట్స్ ప్రింట్ చెయ్యటం అన్నీ మన యాడ్ ఏజెన్సీకే ఇస్తున్నాం. రిచ్‌గా ఉండాలి. మీటింగ్ స్థలం రవీంద్రభారతి దగ్గర నలభై అడుగుల హోర్డింగ్ కూడా ప్లాన్ చేస్తున్నాం" అన్నాడు. తన రెండు చేతులూ నా భుజాల మీదుగా వెనక్కు జారి శరీరం మొత్తాన్ని అదుముకొంటున్నాయి. పొడవాటి అతని జుట్టు చెల్లాచెదరై, అందులోంచి షాంపూ వాసన, స్ప్రే వాసన మత్తుతెరలా ఎగసి వస్తున్నాయి. "బెంగాలీ డైరెక్టర్ రితూ ఒక డాక్యుమెంటరీని చేస్తానంటోంది. గ్లోబలైజేషన్ నేపథ్యంలో గ్రామాలలో వచ్చిన కరవు,

ఆకలి చావులపై చిత్రం అది. స్క్రిప్ట్ అంతా నేనే..." మెల్లగా ముందుకు జరిగి పెదాలతో అతని పెదాలపై వత్తాను, అతను తన ధోరణిని ఆపాలని. అతను క్షణంపాటు ఉక్కిరిబిక్కిరి అయి, రెండు చేతుల్తో నన్ను పక్కకు తోసి, "నీలో ఏదో మార్పు. నీ పెదాలు బండగా జంతువుల పెదాల్లా, శరీరం కూడా అడవి జంతువుల చర్మంలా - మొత్తంగా నీలో ఏదో మార్పు వస్తోంది. కాఫ్కా కథల్లోలాగా నువ్వే జంతువుగా మెటామార్ఫసిస్ అవుతున్నావేమో అనిపిస్తోంది" అన్నాడు సీరియస్‌గా. అంతలోనే దగ్గరకు లాక్కొని, "ఇట్లా జంతువులాగా మొరటుగా ఉండటం కూడా నాకు ఇష్టంగా ఉంది. హింసలాంటి ప్రక్రియ జరిగితే గానీ హాయి రగలటం లేదు. మృదువైన శృంగారాల కాలం కాదిది" అన్నాడు గాఢమైన శృంగార క్రీడకు నాంది పలుకుతూ.

గది బయట అలికిడి అయింది. మువ్వ. ఇంకా నిద్రలోనే ఉన్నట్లుంది. కలలోంచే మాట్లాడుతున్నట్లుగా 'మమ్మీ రా, రెక్కల గుర్రాలు, సీతాకోక చిలుకలు' అంటూ నిద్రలోనే కలవరిస్తోంది. "నువ్వెళ్ళు. పాపని నిద్రపుచ్చి రా" అంటూ ముందుకు తోశాడు మనోహర్.

*

చిన్నచిన్న పల్లెటూర్లు నా కలలు. పల్లెల స్పర్శలే నా రంగులు, చిత్ర రచనలు. పల్లె నుంచి తెంచుకొచ్చిన పేగుముక్కనే అందమైన బొమ్మలుగా మారుస్తున్నాను. బొమ్మల్ని మోసుకొని ఇల్లిల్లూ తిరిగే రోజుల్లో మనోహర్ వాటిని పరిశ్రమగా చేశాడు. ఎగ్జిబిషన్స్ ఏర్పాటు చేసి, హిందూలో రివ్యూలు రాయించి, హఠాత్తుగా నెలల వ్యవధిలోనే ప్రముఖ చిత్రకారిణిని చేశాడు. ఆ దశలోనూ పల్లెల కలలే నావి. యాడ్ ఏజన్సీ మొదలుపెట్టినాక క్రమంగా కాంక్రీటు భవనాలు, ఇనుపదిమ్మెలు, ఖాళీస్థలాలు నా కలల్లోకి రావటం మొదలు పెట్టాయి. ఇప్పుడు పల్లెల దృశ్యాలు నా చేతిలో ఇమడటం లేదు. ఫ్రెంచ్ సెంటు, అమెరికన్ బ్రా, సెల్‌ఫోన్ ఇవే నా బొమ్మలకు ముడిపదార్థాలు.

ఉదయాన్నే నా టేబుల్ చుట్టూ వందలాది ఐడియాలు, భావజాలాలు, కుప్పబోశాడు మనోహర్. కరువు కథలు, ఆకలి చావులు, వందలకొద్దీ ఫోటోలు, వార్తా కథనాలు. వాటిని ముట్టుకొంటే మరణపు వాసన, దుఃఖపు వాసన. వీటన్నిటినీ పోస్టర్లుగా, హోర్డింగ్స్‌గా, కరపత్రాలుగా అనువదించాలి. ముట్టుకోవడానికి భయం వేసింది. ఇవేం పట్టించుకోవటం లేదు మనోహర్. ఆజ్ఞలు జారీ చేస్తున్నాడు. "రవీంద్రభారతి దగ్గర హోర్డింగ్ నువ్వే వెయ్యాలి. పగలయితే గొడవ గొడవగా ఉంటుంది. రాత్రిపూట ఫ్లడ్‌లైట్లు ఏర్పాటు చేయిస్తాను. అద్భుతమైన బొమ్మని సృష్టించాలి. మొత్తం మీడియా అంతా వస్తున్నారు. బి.బి.సి కూడా". మనోహర్ రెండు మనోహర్‌లుగా, కాదు చాలామంది మనోహర్‌లుగా, ఏ మనోహర్‌లో తన స్పర్శను దాచి ఉంచాడో, ఎట్లా తెలుసుకోవాలో అర్థం కాలేదు.



మువ్వ వచ్చింది పాలు తాగుతూ. జ్వరం, బద్ధకంతో అపురూపమైన పక్షిలా నడచుకొంటూ వచ్చింది. రెండు చేతుల్ని మెడచుట్టూ వేసి, నుదుటిపై ముద్దుపెట్టుకొంది. నాలో ఉప్పెనలా ఉద్వేగం. "రాత్రి హిప్పోలా మారిన రాజకుమారుడి గురించి సగమే చెప్పేవు. అతనికేమయింది. పులి రూపంలో ఉన్న మాంత్రికుణ్ణి చంపాడా" అంది చెవిలో గుసగుసగా. "రాత్రికి చెబుతా" నంటూ దుర్భరమైన కరువులోకి ప్రవేశించాను. లఘుచిత్రాలుగా, యాడ్‌లుగా వాటిని అనువదించడానికి.

*

రాత్రి నగరమంతా తెల్లని గాజుపొరల్లో చుట్టినట్లు మంచో, దుమ్మో, కాలుష్యమో తెలియటం లేదు. గాలి, వేడి అలలాగా దూసుకొచ్చి కాసేపటికి మరణిస్తోంది. ఆ వేడికి శరీరం ఉడికిపోతోంది. ఎక్కడి నుంచైనా కాస్త చల్లని స్పర్శ తగిలితే బాగుండుననిపిస్తోంది. గాలిలో ఎగిరే ఆ కాసిని పక్షులూ గాలికి అంటుకొని అటూ ఇటూ ఊగుతున్నట్లుగా ఉన్నాయి.

రవీంద్రభారతి చుట్టుపక్కల ఎంతో హడావిడిగా ఉంది. తలల చుట్టూ గుడ్డలు చుట్టుకొని వేడిగాలులు చెవికి తగలకుండా జాగ్రత్తపడుతూ వందకు పైగా కూలీలు కటౌట్లు కట్టడానికి, గుంతలు తవ్వడానికి, బ్యానర్లు కడుతూ, లారీల్లో పూలకుండీలు తెచ్చి ఆవరణలో తాత్కాలిక వనాల్ని సృష్టిస్తూ, ఎక్క డెక్కడి నుంచో సేకరించిన పూలగుట్టలతో వేదికను అలంకరిస్తూ ఎర్రని కార్పెట్లు పరుస్తూ సభకు అవసరమైన ఉద్వేగాన్ని సమకూర్చే వనరులన్నీ సృజిస్తున్నారు. బ్రహ్మాండమైన హోర్డింగ్. నలభై అడుగుల ఎత్తు. చుట్టూ బొంగులతో పరంజాలను కట్టుకొని ఇరవైమంది వేస్తున్న చిత్రం. వారంరోజులకు ఒక రూపానికి వచ్చింది. తెగిపడిన నాలుకలు, నడుస్తున్న నాలుకలు, పాలనురగలాంటి నాలుకలు, తగలబడుతున్న అడవుల్లాంటి నాలుకలు, రక్తం కారుతున్న నాలుకలు, మరణముద్రలాంటి నాలుకలు - హోర్డింగ్ పొడవునా నాలుకలే. అద్భుతమైన రంగుల్లో, ఆక్రోశిస్తున్నట్లు, రోదిస్తున్నట్లు - వాటి మధ్య ఒక గ్రామీణ స్త్రీ పోరాట సూచికలా ముందుకు నడుస్తున్నట్లు.

రాత్రి రెండు దాటిన తరువాత కూలీలందరూ పనులు ముగించుకొని ఒక్కొక్కళ్ళే వెళ్ళిపోవటం మొదలుపెట్టారు. హోర్డింగ్ కూడా ఒక రూపానికి వచ్చింది. రంగులు వేసే కుర్రవాళ్ళు వెళ్ళిపోతున్నారు. రాత్రి మళ్ళీ నిశ్శబ్దంగా, ఒంటరిగా అయింది. హోర్డింగ్ పైనున్న నాలుకలకు జీవం వచ్చి, కోరస్‌లాంటి చప్పుడు చేస్తున్నట్లు తోచి ఉలిక్కిపడ్డాను. చప్పుడు గేటు దగ్గర. మూడు లారీల్లో వందలాదిగా వ్యవసాయ కూలీలు బిలబిలమంటూ ఆవరణలో మూగారు. వాచ్‌మెన్ వాళ్ళతో గొడవలు పడుతున్నాడు. రేపటి మీటింగ్‌కి వచ్చిన వాళ్ళమని వాళ్ళు వివరిస్తున్నారు. పై

నుంచి నేనూ అరిచాను. వాళ్ళను లోపలికి పంపమని. ఆర్డర్స్ లేవని, ఏర్పాట్లు పాడు చేస్తారని వాళ్ళను లోపలకు రానివ్వటం కుదరదంటున్నాడు. వాళ్ళు కాసేపు వాదించి, విసుక్కొని రోడ్డుపై నున్న పొడవాటి పేవ్‌మెంట్ పైకి చేరారు. అంతట్నీ మరిచిపోయి కబుర్లు, కేకలు, పాటలు, చప్పుడూ చేస్తూ మెల్లగా నిద్రగా మారిపోయారు.

మళ్ళీ నిశ్శబ్దం, చీకటి. హోర్డింగ్ పని ఇంకా మిగిలి ఉంది. సెమినార్ సారాంశాన్నీ ఒక్క వాక్యంలో రాయాలి. "జీవితం నిత్యమూ, నిరంతరమూ" అంటూ పెద్ద అక్షరాలలో రాయటం మొదలుపెట్టాను. రాత్రి గడిచేకొద్దీ శరీరం బరువుగా, లోపల వింత రసాయనిక చర్యలేవో జరుగు తున్నట్లు అనిపించసాగింది. శరీరం బరువుకు పరంజా ఊగిపోతోంది. కిందనున్న ఇద్దరు కుర్రాళ్ళు "మేడమ్! జాగ్రత్త" అని అరుస్తున్నారు. ఫరవాలేదంటూ వాళ్ళవైపు సైగ చేశాను.

కానీ, శరీర మార్పులు తెలుస్తూనే ఉన్నాయి. చర్మంపై పొలుసులు పొలుసులుగా, జంతువు చర్మమేదో లోపలి నుంచి పుట్టుకొస్తున్నట్లుగా చేతులకు వింత శక్తి, అద్భుతమైన ఒడుపు. టార్జాన్‌లా ఎగరగలిగే శక్తి. పక్కనున్న చెట్లవైపు ఎగిరి, అటు నుంచి అసెంబ్లీ భవనం వైపు ఎగిరి, పక్కనున్న గార్డెన్స్‌లోకి దూకి, అక్కడ నీటితడిని, మొక్కల పరిమళాన్ని ఆస్వాదించి, కొత్తగా ఉంది ఈ అనుభవం. తెల్లవారుజాము నాలుగు గంటలకు మళ్ళీ రవీంద్రభారతి దగ్గరకు చేరాను. అక్కడ మళ్ళీ సందడి మొదలైంది. పూలతొట్లు, కార్పెట్లు సర్దుతూ, ఆ హడావిడిలో మనోహర్ కూడా వచ్చాడు. హోర్డింగ్‌ని చూసి అబ్బురపడ్డాడు. దగ్గరకు వెళ్ళి నా శరీరంలో వచ్చిన మార్పుల గురించి చెప్పాలని ప్రయత్నించాను. "చేతులపై అదేమిటి పొలుసుల్లా, ఏ స్కిన్ స్పెషలిస్టుకైనా చూపించుకోవచ్చు కదా! వడలిపోయిన ముసలి ఆవు చర్మంలా, రేపు మీటింగ్‌లో ఎట్లా" అని విసుక్కొన్నాడు. "పొడవాటి జాకెట్టు వేసుకొని, నిండా షాల్ కప్పుకొని" సలహాలిస్తూ లోపలకు వెళ్ళాడు. బయట నిద్రిస్తున్న పల్లె జనం గురించి చెప్పాను. "ఇప్పుడు అదేమైనా అంత ముఖ్యమైన విషయమా?" నొసలు చిట్లించాడు. బయట నగరం నిద్రలేచి తనదైన హింసాత్మక శబ్దాలను వినిపించసాగింది.

*

అట్టహాసంగా మొదలైంది సెమినార్. సుదీర్ఘమైన ఎజెండా. ఆడిటోరియం ఉద్వేగభరితం గా ఉంది. ఎక్కడ చూసినా మనోహర్. నల్లని సూటు, నీలంరంగు టై, పెదాలపై సన్నని చిరునవ్వు (నవ్వినప్పుడు తళుక్కున మెరిసే విరిగిన పన్ను), అతని దృష్టంతా విదేశీ డెలిగేట్లపైనే ఉంది. సుదీర్ఘమైన చర్చల మధ్య నుంచి లేచి బయటకు వచ్చాను. మువ్వ కూడా నన్ను అనుసరించింది. బయట రవీంద్రభారతి మెట్లపై కూలబడ్డాను.



సిటీకి ఈ సెమినార్ గురించిన స్పృహ ఏమీ ఉన్నట్లు లేదు. వాహనాలు, మనుషులూ తమదైన వేగంతో, హడావిడితో పరిగెడుతూనే ఉన్నారు. పల్లెల నుంచి వచ్చిన జనం లోపలి విషయాలేమీ అర్థంకాక బయటకు వచ్చి కూర్చున్నారు. వాళ్ళలోంచి కొంతమంది ఆడవాళ్ళు కమ్మటి పాటలాగా మారారు. మువ్వ వాళ్ళవైపు ఆసక్తిగా చూస్తోంది. హఠాత్తుగా మువ్వ నావైపు తిరిగి "కథ చెప్పు మమ్మీ" అంది. "విసుగ్గా ఉంది. బోరుగా ఉంది" అంది గోముగా. చాలాసేపు ఆలోచించి, "తెలిసిన కథే. మళ్ళీ చెబుతాను. ఆవు-పులి కథ" అన్నాను. ఇష్టంగా నావైపు తిరిగి కూర్చుంది మువ్వ. పల్లె స్త్రీల పాట నేపథ్యంగా కథను చెప్పటం మొదలుపెట్టాను.

*

గొడ్లచావిడి అందమైన ప్రదేశం. అక్కడ ఆవుల పాలు పితుకుతారు. గొడ్లచావిడికి తలుపులూ, గోడలూ లేవు. నాలుగైదు బొంగులు, ఎండిన రెల్లుగడ్డి, అమ్మ పొద్దున్నే లేచి పాలు పితికి, పితికిన వెచ్చని పాలను కుండ ల్లోంచి, గిన్నెల్లోంచి తెల్లటి పాల క్యాన్‌లోకి నింపుతుంది. తెల్లగా మిసమిసలాడే పాలు. బయట హారన్ మోగుతుంటుంది. సొసైటీవాళ్ళ వ్యాను వీధి మొదట్లో పాల రాక్షసుడిలా నిలబడి ఉంటుంది. వెచ్చటి పాలకు వింతైన వాసన. శరీరం వాసన. అమ్మ ఒళ్ళో కూర్చున్నప్పుడు వచ్చే వాసన. గొడ్ల చావిడికి కాస్త దూరంలో పదహారో, ఇరవయ్యో తాటాకులతో కప్పిన కొట్టం. దానికి గోడలుంటాయి గానీ, కిటికీలుండవు. కొట్టం అమ్మలాగే అందమైన ప్రదేశం. కొట్టాలకవతల పొలాలు. పొలాలకు తూర్పుదిక్కున కొండ. కొండ పాదవునా పచ్చగా మిలమిలలాడే గడ్డి. కొండ కిందే విశాలమైన చెరువు. రోజూ సాయంకాలం ఆవుల్ని చెరువువైపుకు తోలుకెళ్తుంది అమ్మ. స్నానం చేయించడానికి. తలకు గుడ్డ చుట్టుకొని, కర్రతో ఆవుల్ని అదిలిస్తూ నేనూ వెళతాను అమ్మతో కలిసి. "ఎహేయ్! హేయ్" అంటూ వాటిని అదిలిస్తూ. గమ్మత్తుగా ఉంటాయి ఆ అరుపులు. "నీ తల్లి సిగ్గొయ్యా" అంటుంది అమ్మ. అర్థంకాని తిట్టు (తల్లి సిగే ఎందుకు కొయ్యాలి అని నా సందేహం). నోళ్ళలోంచి సొంగ కారుతుండగా ఎర్రటి నాలుకల్ని బయటకు పెట్టి, మోకాళ్ళపై కూర్చుని నీళ్ళలోకి జారి, చల్లని శీతాకాలపు నీళ్ళలోని సుఖాన్ని పొందేటప్పుడు ఆవుల్ని చూడటం గొప్ప అనుభవం. పక్క పొలాల నుంచి కూడా ఆవులు వచ్చి చేరతాయి. తెల్లటివి, ఎర్ర డాలువి, నల్ల పొడలవి. అమ్మ గుడిలా ఎత్తయిన జెర్సీ ఆవులు అన్నీ నీళ్ళలో నానుతూ భగవంతుడు గీసిన లాండ్‌స్కేప్ చిత్రంలా కనిపిస్తాయి. సాయంకాలానికి వాటిని లేపి, అదిలించి, కర్రలతో పొడిచి (నీళ్ళను వదిలి రామని మొరాయిస్తాయి), బద్ధకంగా కదులుతాయి.

చావిడిలో వాటికోసం ఉలవలు, తెలకపిండి, తౌడు కలిసిన పెద్దపెద్ద గిన్నెలు. అవురావురుమంటూ వాటిపైకి ఎగబడతాయి. తింటుండగానే వాటి మెడలకు పలుపుతాళ్ళు బిగుస్తాయి. అవి కోపంతో గింజుకుంటాయి. కొండ, చెరువు, చల్లని నీళ్ళు అంతా మోసం అన్నట్లుగా చూస్తాయి. కాసేపటికి కుడితి కూడా వస్తుంది. కుడితి తాగాక వాటికొక రకమైన మత్తు ఆవహిస్తుంది. బరువైన పొట్టలతో నేలపై అటూ ఇటూ కదులుతూ బద్ధకమో, వ్యాయామమో, అమ్మ వాటి పక్కనే నిలబడి, వాటి శరీరాలకు అంటిన మట్టిని, బురదను కడుగుతుంది.

అమ్మ చెయ్యి గాయాల్ని మాన్పే మంత్రదండంలా మారిపోతుంది. కడగటం అయిపోయినాక అవి నేలపైకి వాలిపోతాయి. నిద్రలాంటి మత్తు అది. ఇప్పుడు అమ్మ గురించి కూడా చెప్తాను. ఆ పది ఆవులకు సేవ చేసే (ఆవుల్ని సాకే) కూలీ అమ్మ. ఆవులను చూసుకొంటూ, మేత వేస్తూ, కుడితి పెడుతూ, ఖాళీగా ఉండే ఆ ప్రదేశం అంతా ఊడ్చి, పేడతో అలికి, రోజంతా శ్రమిస్తూనే ఉంటుంది (అయిదు బస్తాల వడ్లు, ఏడొందలు రొక్కం ఎడాదికి).

అమ్మ కళ్ళలో అద్భుతమైన శక్తి ఏదో ఉందని నా నమ్మకం. అప్పుడప్పుడు వెన్నెల రాత్రుల్లో అమ్మ ఆవులా మారిపోయి, నాజూగ్గా నడుచుకొంటూ చావిడిలోకి వెళుతుంది. మళ్ళీ రహస్యంగా ఇంటిలోకి వచ్చి ఎప్పటిలాగా అమ్మలాగా మారిపోతుంది. అప్పుడప్పుడు అమ్మ శరీరంపై గాయాలు, రక్తం. ఆ దెబ్బలెట్లా వచ్చాయో అర్థం కాదు. ఆ గాయాల్ని అలా ముట్టుకొని, అమ్మ గుండెలకు హత్తుకొని పెద్దగా ఏడుస్తాను. నాయన పొలానికి పోయి ఏ రాత్రివేళో వస్తాడు.

ఒకరోజు చావిడిలోని బొల్లి ఆవు కనబడకుండా పోయింది. అమ్మ ఊరంతా వెతికింది. పొలాలు, దొడ్లు, బందెల దొడ్లు, కొండ, చెరువు అన్నీ వెతికింది. రాత్రయినా బొల్లి ఆవు ఇంటికి రాలేదు. అమ్మ ఆ రాత్రి అన్నం తినలేదు. రెండోరోజు కూడా ఆవు ఇంటికి రాలేదు. రాత్రంతా అమ్మ బయటే నిలబడి ఉంది ఎక్కడ నుంచైనా మువ్వల శబ్దం, గిట్టల చప్పుడు విన్పిస్తాయేమోనని. మూడోరోజు కూడా ఆవు కనబడలేదు.

మూడోరోజు సాయంత్రం ఆసామి (ఆవుల యజమాని) అమ్మకు కబురు చేశాడు. (ఆశ్చర్యం! ఆవు కనబడనందుకు ఆయన ముఖంలో దిగులు కనబడలేదు). ఆవుకింతని లెక్క కదా అని చెప్పి, ఒక ఆవు పోయినందుకు జీతంలోంచి పదోవంతు తగ్గించాడు. వెళ్ళేటప్పుడు వెనక్కు పిలిచి, కొండల దగ్గర పులి ఒకటి చేరిందట, కాస్త పదిలం, అని జాగ్రత్త కూడ చెప్పాడు.

నెల తిరిగిందో లేదో రెండో ఆవు కూడా మాయమైంది. ఈసారి కర్రావు మాయమైంది. ఆసామి మళ్ళీ అమ్మని పిలిచి జీతంలో కోత పెడుతున్నానని చెప్పాడు. వారం తిరిగేసరికి ఇంకో ఆవు. ఊరంతా పులి గురించి పుకార్లు. మనిషంత ఎత్తు పులని, పంజా విసిరితే ఎంత పెద్ద ఎనుము అయినా దెబ్బతో సఫా అని. నెల చివరన మిగిలిన అయిదు ఆవులు ఒక్కసారి మాయమై



నాయి. ఆసామి అమ్మని పిలిచి, ఆవులే పోయినాక నువ్వెందుకు, నీ మొగుడెందుకు, పనులు మానేసి ఇళ్ళకు పొండి అన్నాడు. కొట్టం కూడా ఖాళీ చెయ్యమన్నాడు.

ఉన్న సామాన్లు సర్దుకొని అమ్మ, నేను, నాయన కొట్టాల్ని ఖాళీ చేశాం. నాయాల్ది పులిని నరికేస్తానని నాయన కొడవలి తీశాడు. "సాల్లే. ఇంత పెద్ద మొగోడు లేడని!" అమ్మ వారించింది. సామాన్లు నెత్తిన పెట్టుకొని పొలాల మధ్య నుండి నడుస్తున్నాం. శరీరం అలసిపోయి, వంగిపోయి ముసిల్దానిలా అయిపోయింది అమ్మ. చెరువు, కొండ ఎప్పటిలాగే చూశాయి పలకరింపుగా. చెరువులోని నీళ్ళు కూడా పలకరించాయి.

దూరంగా కొండ కింద చారలు చారలుగా, ఎత్తుగా "అమ్మో పులే!" అని అరిచాను అటువైపు చూసి. నాయన చాలాసేపు అటువైపు చూసి, గబగబా నెత్తిపైన మూటను దించి, గోతంలోంచి కొడవలి బయటకు లాగి అటువైపు పరిగెత్తాడు. "ఏందయ్యా ఇది. పిచ్చేమన్నా పట్టిందా" అంటూ అమ్మ కూడా నాయన వెనకాలే వేగంగా పరిగెత్తింది.

కొండ మొదట్లో చెట్టు పక్కన నిలబడి తెల్లటి పులి. మనిషి ఎత్తుంది. ఒయ్యారంగా నిలబడింది. దాని పక్కనే ఎముకల గుట్టలు. ఇంకో పక్క ఆవు చర్మాలు (తోళ్ళు).

పులి నాయన్ని చూసి సన్నగా నవ్వింది. "దించు దించు కొడవలి" అంది. నాయనకు నోటమ్మట మాట రాలేదు పులులు మాట్లాడడమేందని. "నేను మీరు చిన్నప్పుడు విన్న కథల్లోని పులిని కాదు. అన్యాయంగా ఆవుల మీద పడి చంపుకు తినేదాన్ని కాదు. న్యాయం, ప్రజాస్వామ్యం తెలిసినదాన్ని. ఆవుకు అయిదు వేలని ఇస్తున్నాను" అంటూ పాదంతో ఒక గోనె సంచిని ముందుకు తోసింది. అందులోంచి నోట్ల కట్టలు.

నాయన భయం భయంగా నోరు తెరిచాడు. "మేం ఆవుల్ని సాకేటోల్లం. కూలీలం. ఆవులు పోయినాక పనులూ పోయినాయి" అన్నాడు.

"ఆవుల్ని తెండి! లేకపోతే గేదెల్ని, లేదంటే మేకల్ని అవి లేకపోతే మనుషుల్నయినా తెండి. దేనికయినా అయిదువేలు!" అని కాస్త క్రూరంగా గర్జించి, "ఇంక పొండి! నేను విశ్రాంతి తీసుకోవాలి" అంది. నాయన, నాయన వెంట అమ్మ, నేను వెనక్కు తిరిగాం. కొండ కింద పులి, దాని పక్కన ఆవు చర్మాలూ తెల్లగా మిలమిలలాడుతున్నాయి.

*

మువ్వ, నేనూ అట్లా కథలు చెప్పుకొంటూనే ఉన్నాం. మువ్వ నాకో చేప కథ చెప్పింది. పొలుసులన్నీ ఊడిపోయి నేలపైకి వచ్చి నడవటం నేర్చుకొన్న చేప. "ఆ చేప ఇప్పుడు నా పొట్టలో ఉంది" అంది మువ్వ సీరియస్‌గా నావైపు చూస్తూ.

బయట ఎప్పటిలాగే వేడిగాలి, జుయ్ జుయ్ అని చప్పుడు చేస్తూ. ఇద్దరం మినీ ఆడిటోరియం దగ్గర పూలచెట్ల వైపు నడిచాం. "ఇక్కడ కూర్చుందాం" అంటూ ముందుకు లాగింది. రవీంద్రభారతి ముందు పల్లెజనం నేలపై కూర్చుని అన్నం పొట్లాలు విప్పి తినడం మొదలుపెట్టారు. "చూడు చూడు. ఆవుల మందల్లా ఎట్లా మెరిసిపోతున్నారో" అని కేక వేసింది మువ్వ. వాళ్ళను చూస్తేనే నా శరీరంపై ఏదో మొలుచుకొస్తున్న స్పర్శ.

హోర్డింగ్ పై నుంచి 'జీవితం నిత్యమూ, నిరంతరమూ' అనే అక్షరాలు మిలమిలా మెరుస్తున్నాయి.

*ఇండియా టుడే, 17 డిసెంబర్, 2002*



# 14

# గోరీమా

**అఫ్సర్**





ఒక కుటుంబం, ఒక కులం, ఒక మతం సమూలంగా శిథిలమవటం వెనుక నున్న సామాజిక అంశాన్ని వివరించిన కథ 'గోరీమా.' రచయిత అఫ్సర్ 22 ఫిబ్రవరి 1964లో పుట్టారు. ప్రధానంగా కవి అయిన అఫ్సర్ మొదటి కథ 'అడివి' 1983లో **ఆంధ్రజ్యోతి** వారపత్రికలో అచ్చయింది. 3 కవితా సంపుటాలు, విమర్శనా వ్యాసాలు ప్రచురించారు. సీనియర్ జర్నలిస్ట్‌గా వివిధ పత్రికల్లో పనిచేసి ప్రస్తుతం అమెరికాలోని విస్కాన్సిన్ విశ్వవిద్యాలయంలో భాషా బోధన, సాహిత్య పరిశోధన చేస్తున్నారు.

చిరునామా : *1236, వాన్‌హైస్ హాల్, 1220 లిండన్ డ్రైవ్, మాడిసన్, విస్కాన్సిన్ - 53704. యు.ఎస్.ఎ.*

ఇంకో అరగంటలో మా ఊళ్ళో ఉండబోతున్నానంటే ఒంటినిండా ఏవేవో ప్రకంపనలు.

నెమ్మదిగా వెళుతున్న పాసింజరు కిటికీలోంచి బయటికి చూపు సారిస్తే అప్పుడప్పుడే చురుకెక్కుతున్న ఎండ సూటిగా పైకి చూడనివ్వడంలేదు.

దూరంగా చెట్టునిండా ఎర్రెర్రని పూలతో దిరిసెన చెట్టు ఆకుపచ్చని నది మధ్యలో ఎగరేసిన ఎర్రజెండాలా వుంది. చూపులు ఇంకాస్త క్రిందికి వెళ్తే కంకరరాళ్ళ ఆవల పసుపుపచ్చని తంగేడుపూల గుంపులు.

నేను నా కృత్రిమమైన నగర జీవనం తళుకుబెళుకులన్నీ వదిలించుకుని కాసేపు ఆ దృశ్యంలో కరిగిపోయాను.

చిన్నచిన్న ప్లాట్‌ఫారాలు దాటుకుంటూ వాటికంటే వేగంగా చెట్లనీ, పొలాల్నీ, చెరువుల్నీ దాటేస్తూ నా చిన్నతనంలోకి నన్ను పరిగెత్తిస్తోంది రైలు.

నాన్న చిటికెనవేలు పట్టుకుని ఈ ప్లాట్‌ఫారమ్మీద నడిచిన సాయంత్రాలు. ఒకరకంగా మధ్యతరగతి సంచార బతుకులు మావి. ఏ ఊళ్ళోనూ మూడేళ్ళకు మించి గడపలేదు. కాని ఇప్పుడు ఈ ఊరునైనా మా ఊరు ఎందుకంటున్నానంటే ఇక్కడ మేం కాస్త ఎక్కువ కాలమే గడిపాం. ముప్ఫయ్యారేళ్ళ బతుకులో ఆ కొద్దికాలం బతుకు పెద్దదేమీ కాకపోవచ్చు. కాని ఆ 'కొద్దికాలం' అంటే నాకు చాలా ప్రేమ. ఇంట్లో మాత్రమే చదువుకున్న ఖాయ్‌దాతో ఈ ఊళ్ళోకి అడుగుపెట్టాను. ముందు నన్ను ఒకటో తరగతిలో చేరనివ్వలేదు. వీధిబడిలో వేశారు. పంతులు గారు నన్ను "ఒరే, అలీఫ్‌బే..." అని పిలిచేవాళ్ళు. తర్వాత అదే నా పేరుగా స్థిరపడింది. అందరూ అదే పేరుతో పిలిచి 'అలీఫ్‌బే... ఏం బే!' అన్నప్పుడల్లా నేను పరుగుపరుగున అమ్మ దగ్గిరకు వెళ్ళి ఏడ్చేవాణ్ని. గోల చేసేవాణ్ణి. 'ఈ బే నాకు వద్దు... అఆలు చెప్పు' అనేవాణ్ని. నిజానికి అమ్మకు అఆలు రావని నాకు తెలియదు. అప్పుడు నాన్నగారు పలక తీసుకుని నాచేత ముందు అఆలు దిద్దించారు. కానీ అమ్మకు నేను ఉర్దూ చదువుకోవాలని కోరిక. పనికట్టుకుని నాచేత ఖాయ్‌దా చదివించేది. నాకు అయిదేళ్ళ వయసు వచ్చేదాకా నాది ఏ భాషో నాకే తెలియదు. అందరూ ఒకటో తరగతి వాచకం చదువుతుంటే నాకు నామోషిగా ఉండేది. నాకు యాభైఆరు అక్షరాలే సరిగ్గా రావాయె. నా దినచర్య ఫజర్ సమాజ్‌తో మొదలయ్యేది. పొద్దున్నే నిద్రలేవడం ఎవరూ చెప్పకుండానే అలవాటైంది నాకు. వజూ చేసి టోపీ పెట్టుకుని అమ్మతోపాటు ఫజర్ నమాజ్‌కి తయారయ్యేవాణ్ని. చెప్పొద్దూ, నమాజ్ చదవడం అంటే నాకు చాలా ఇష్టం. అది దైవకార్యం అనో ఇంకోటనో నాకు తెలియదు. అమ్మ అంటే నాకు చాలా ఇష్టం కాబట్టి అంతే! అమ్మ చేసే పనులన్నీ చాలా ఇష్టంగా చేస్తాను. అమ్మతో కలిసి కసువూడుస్తాను. అమ్మతో కలిసి వంటిల్లు శుభ్రం చేస్తాను. అమ్మతో కలిసి బట్టలుతుకుతాను. ఉతికిన బట్టల్ని సాపుచేసి చెక్క బీరువాలో పెడతాను. బడికి వెళ్ళడం అనే పని అమ్మకు లేదు కాబట్టే ఆమె పనులన్నీ నాకు మహా ఇష్టం. ఆ



పనుల్లో మునిగిపోయి బడిని మరిచిపోతాను. పంతులుగారు రోజూ నాకోసం పిల్లల్ని పంపేంత వరకూ అలా మరిచిపోయినట్టు నటించేస్తాను.

"ఏరా అలీఫ్‌బే, నువ్వేమన్నా నవాబువా? నీకోసం రోజూ భటులు రావాలా?" అని పంతులు గారు చింతబరికెతో ఒకటిచ్చుకునేవాడు. అలా చింతబరికె నా వీపుమీద మోగుతున్న సమయాన ఓరోజున "ఏమయ్యా, పంతులూ చిన్నపిల్లాడని కూడా చూడకుండా ఏమిటదీ?" అన్న గొంతు వినిపించింది.

ఎవరా అని చూస్తే నిర్ఘుంగా దేవతే దిగివచ్చిందా అన్నట్టుగా ఒకావిడ. పంతులుగారి వైపు తీక్షణంగా చూస్తూ మాట్లాడుతోంది. పంతులుగారు ఏమీ తొణక్కుండా

"వీడు చిన్నపిల్లాడా?" అని మరోసారి బెత్తం దెబ్బ ఇచ్చుకున్నాడు. అంతే, ఆమె మెరుపులా దూసుకొచ్చి పంతులుగారి చేతిలో బెత్తం లాక్కుని విరిచేసింది. అలా విరిచేసేసరికి పంతులుగారు స్థాణువైపోయాడు. పిల్లలంతా ఒక్కపెట్టున గోల చేసేశారు. కొత్త బెత్తం ఇప్పట్లో రాదుకదా మరి! పంతులుగారు భద్రంగాణ్ణి పిలవాలి. వాడెళ్ళి చెట్టెక్కాలి. అప్పటిదాకా బెత్తం దెబ్బలు తప్పినట్టే! ఈ పంతులు అనే ఫరిస్తా నుంచి నాకు విముక్తి ప్రసాదించిన ఆవిడవైపు చూసి నేను పరుగుపరుగున వెళ్ళి ఆమె తెల్లచీర మడతల్లో దాక్కుండిపోయాను.

ఆరోజు సాయంత్రం గోరీమా మా ఇంటికి వచ్చి అమ్మానాన్నల్ని తిట్టిన తిట్టు తిట్టకుండా చెరిగి పడేసింది. "మోతీజైసా బచ్చా. లే జాకేవో షైతాన్‌కె పాలేమె డాల్నే హాత్‌కైసా ఆయె" (ముత్యం లాంటి పిల్లాడు. తీసుకువెళ్ళి ఆ షైతాన్ పాలు చేయడానికి చేతులెలా వచ్చాయి?) అని ఖరాఖండిగా అడిగేసరికి 'ఇన్ చిలాచింతర్. ఇస్కు ఘర్‌మే రఖ్‌లియెతో ఘర్ గిరాకో మండ్వా దాల్తా. తుమారేకు నైమాలుమ్ గోరీమా" (వీడు పెద్ద కోతి. ఇంట్లో ఉంచితే ఇల్లు పీకి పందిరేస్తాడు) అని అమ్మ నవ్వుతూ అనేసింది.

అప్పుడు తెలిసింది ఆమె పేరు గోరీమా అని!

అమ్మ అన్నమాటకు నాకు కాస్త కోపం వచ్చినా గోరీమా అన్న మాటతో అది కాస్తా ఎగిరిపోయి నేను గోరీమా తెల్లకొంగు పట్టుకుని ఆడుకుంటూ ఉండిపోయాను. నన్ను కష్టాల్లోంచి కాపాడే శక్తిలాగా, నా మాటన్నా ఆటన్నా పాటన్నా కళ్ళకి అద్దుకునే గొప్ప దోస్తులాగా గోరీమా నాకు కనిపించింది. నా వ్యక్తిత్వాన్ని బలంగా నిర్మించిన ఆమె చేతుల్ని ఇప్పటికీ ఎప్పటికీ నేను గుర్తుంచుకుంటాను.

వెళ్తూ వెళ్తూ గోరీమా

"అరే బచ్చే, తు రోజ్‌మేరే పాస్ ఆ... మై ఉర్దూ అరబ్బీ పడాతిం" అనేసి వెళ్ళిపోయింది.

నా దిక్కుమాలిన వీధి బడి నుంచి నాకు విముక్తి ప్రసాదించి, నా ఆకాశంలోకి నన్ను ఎగరేసే స్వేచ్ఛాగీతం ఏదో ఆ పలుకుల్లో వినిపించింది నాకు. అంతే, గోరీమా ప్రవేశంతో నా జీవితం మారిపోయింది. కానీ తెల్లగా మల్లెపూవులా ఎప్పుడూ చెరగని నవ్వులా ఉండే గోరీమా అనే సెలయేరు ఎన్ని బండరాళ్ళ మీంచి ప్రవహిస్తుందో తెలియడానికి నాకింకా అప్పటికి ఊహ లేదు.

ఏదో ప్లాట్‌ఫారం వచ్చినట్లుంది. అందరూ దిగుతున్నారు. నేను ఆలోచనల్లోంచి దిగలేక పోయాను. బయటికి చూస్తే... ఇదే నేను దిగాల్సిన మా ఊరు. గబగబా బ్యాగ్ తీసుకుని కిందకి దిగాను.

"సార్, కా జాతె"

దిగబోతుంటే ఎవరో ఎదురొచ్చారు.

తలెత్తి చూస్తే ఓ మనిషి... మా ఊళ్ళో రిక్షాలు కూడానా?

"రిక్షా? వద్దులే."

"రిక్షా కాదు. బండి. ఊళ్ళోకి దూరం నడవాల" అన్నాడు.

ఏదో ఆలోచనలోకి వెళ్ళబోతున్నట్టు "వద్దులే" అంటూ ముందుకు నడుచుకుంటూ వచ్చాను.

నా పాత ఆనవాళ్ళు ఇక్కడేమైనా దొరుకుతాయా అని వెతుక్కుంటున్నాను. స్టేషన్ పెద్దగా ఏమీ మారలేదు. జనం పెద్దగా లేరు. ఎంత పరీక్షగా చూసినా ఒక్క మొహమూ నాకు తెలియడంలేదు. పోనీ నావైపు ఎవరైనా పరీక్షగా చూస్తున్నారా అంటే అదీ లేదు. ఈ ఊరు నన్ను ఎప్పుడో మరచిపోయి ఉంటుంది అనుకుంటూ స్టేషన్ బయటికి వెళ్ళేదారి దాకా వచ్చాను. అక్కణ్నించి మళ్ళీ ముందూ వెనుకా చూశాను. వెనుక నిశ్శబ్దం. కనీసం రైలు వచ్చివెళ్ళిపోయిన సందడైనా లేదు. ముందు రెండడుగులు వేస్తే స్టేషన్ బయటికి దారి.

బయటికి అడుగుపెట్టగానే అడుక్కుతినేవాళ్ళు ఇద్దరో ముగ్గురో! పోనీ వీళ్ళెవరైనా నన్ను గుర్తు పడతారా అని పరీక్షగా చూశాను. నాలుగూ నాలుగు పిచ్చిమొహల్లా ఉన్నాయి. ఒకావిడ ఒంటినిండా కప్పుకుని శరీరాన్ని కుప్పలా దగ్గరకు లాక్కుని కూర్చుని వుంది. అడుక్కుతినడానికి సిగ్గు కాబోలు. అడుక్కుతినేటప్పుడూ నా జాతికి బురఖా ఉండాలి. మిగిలిన ముగ్గురిలో ఇద్దరు కుంటివాళ్లు. ఒకడు గుడ్డివాడు ఏదో పాడుతున్నట్టుగా పాడి చివర్న 'బాబూ ధర్మం' అని వాడి సొంతబాణీ కలిపి కొట్టేస్తున్నాడు. చాలా యాంత్రికంగా నేను ఒంటినిండా ముసుగు కప్పుకున్న స్త్రీ ముందు ఓ రూపాయి పడేసి ముందుకు అడుగేశాను.

రెండడుగులు ముందుకు వేశానో లేదో వెనుక ఓ యుద్ధకాండ చూడాల్సి వచ్చింది. మిగిలిన ముగ్గురూ ఆ ముసిల్దాని మీద ఎగబడి కొట్టీ ఆ రూపాయి లాక్కుంటున్నారు. ఒంటి మీదున్న ముసుగుని ఇంకా దగ్గిరకు లాక్కుంటూ రూపాయిని కాపాడుకునే ప్రయత్నంలో ముసిలమ్మ ఓడిపోతోంది. నాకు చిరాకేసింది. వెనక్కి వెళ్ళి ఆ ముగ్గుర్నీ కేకలేసి వాళ్ళ మొహాల మీద తలా అద్దురూపాయి వేసి ముందుకు నడిచాను.

ముసిలావిడ వేపు పరీక్షగా చూడాలన్పించింది కానీ చూడలేకపోయాను. ఆమె ముసిలావిడే అయినా ఒక స్త్రీ వేపు అంత పరీక్షగా చూడడానికి నా సంస్కారం ఒప్పుకోలేదు.

స్టేషన్నుంచి ఊళ్ళోకి వెళ్ళాలంటే కొంత దూరం నడవాలి. ఈ దూరం నాకు చాలా ఇష్టం. చిన్నప్పుడు నాన్నగారితో కలిసి ఈ దూరం నడిచేవాణ్ణి. ఆయన మాటలు వింటూ, ఆయనేమీ మాట్లాడకపోతే నేనే ప్రశ్నలు వేసి మాట్లాడిస్తూ నడవడం ఎంత బాగుండేదో! ఆయనతో పాటు



ఒక్కోసారి ఉస్మాన్ వచ్చేవాడు. స్టేషన్‌కీ, మా ఊరికీ మధ్య ఉండే నిశ్శబ్దాన్ని అతను భరించలేకపోయే వాడు. రోడ్డుకి ఇరుపక్కలా చెట్లు, దుమ్మూధూళితో వీచేగాలీ, అస్సలు జన సంచారం లేకపోవడం, ఎక్కడో కాని ఓ ఇల్లు కనిపించకపోవడం... భరించలేక పాటెత్తుకునేవాడు. ఎంత అందంగా పాడే వాడో చెప్పలేను. పాడుతున్నంతసేపూ నేను అతని గొంతువైపు, ఊగే పిల్లి గడ్డం వేపూ చూస్తూ ఉండేవాణ్ని. పాటలో భావం ఏమిటా అని ఎప్పుడూ అడిగిందీ లేదు, అతను చెప్పిందీ లేదు.

"ఎవరు నేర్పారీ పాట?" అని అడిగానోసారి.

"గోరీమా..."

అప్పటికి నాకు గోరీమాలో ఉన్న గాయని సంగతి తెలియదు. తర్వాత ఓసారి మొహర్రం నెలలో తెలిసింది గోరీమా చాలా బాగా పాడుతుందని! ఆమె పాట సంగతి ఊరంతా తెలుసని! మొహర్రం నెలలో ఓరోజు సాయంత్రం అమ్మ చాలా హడావుడి చేసేస్తోంది ఇంట్లో. వంటపని వేగంగా ముగించేసింది.

"మీరూ త్వరగా భోంచేసేయండి" అని నాన్ననీ, నన్నూ తొందరపెట్టి భోజనానికి కూర్చో బెట్టింది.

"ఏమిటా తొందర?" అని నాన్న అడిగారు.

"ఇవాళ మాతంలో గోరీమా పాడుతుంది..."

త్వరగా భోజనాలు ముగించుకుని మేం మాతం దగ్గిరకు వెళ్ళాం. నాకు అప్పటిదాకా పీర్లచావిడిలో హడావుడి ఒక్కటే తెలుసు. అక్కడికి వెళ్ళాక ఆడవాళ్ళు మొహర్రం ఇంకా సందడిగా ఇంకా ఉద్వేగంగా జరుపుకుంటారని తెలిసింది. మధ్యలో నిలబడి గోరీమా ఊగిపోతూ పాడు తూంటే చుట్టూ ఆడవాళ్ళు తిరుగుతూ ఎంత ఉద్వేగంగా ఆడుతున్నారో! వాళ్ళ స్వరాలు అంత పూరాగా విచ్చుకుని పాడడం అదే మొదటిసారి విన్నాను నేను. ఇంక గోరీమా పాట సంగతి చెప్పనే అక్కర్లేదు. ఆ చీకట్లో నా కుతూహలం నిండిన కళ్ళని చూస్తే గోరీమా ఎంత సంబరపడి పోయేదో! ఆమె పల్లవి ఎత్తుకుంటున్న ప్రతిసారి నేను గంతులేస్తున్నాను. నా గంతులు చూసి గోరీమా ఆడవాళ్ళ వ్యూహాన్ని చీల్చుకుని పాట పాడుతూనే బయటికి వచ్చి నన్ను తనతోపాటు తీసుకువెళ్ళి పక్కన నిలబెట్టుకుంది. ఇక గోరీమా పాడడం, మిగిలిన ఆడవాళ్ళతో కలిసి నేనూ ఆడడం! ఇండ్లల్లో ఏనాడూ కనీసం గొంతు విప్పనివాళ్లు, స్వేచ్ఛగా కాళ్ళు కదపనివాళ్ళు అక్కడ బాగా అలవాటైనట్లుగా గొంతు విప్పి పాడడం, కాళ్ళూ చేతులూ ఎగరేస్తూ ఆడడం నాకు భలే సంబరాన్నిచ్చింది.

కాని ఈ సంబరం నాకు ఎంతో కాలం నిలబడలేదు.

ఆ మరుసటి ఏడాది మళ్ళీ మొహర్రం వచ్చింది. కాని ఈసారి గోరీమా పాట లేదు...

కచ్చితంగా ఇంకో రెండుమూడు రోజులకు చావిడిలో పీర్లు పెడతారనంగా ఓ సాయంత్రం గోరీమా ఆవేశంగా అమ్మ దగ్గిరకు వచ్చింది. అప్పటికే ఆమె జుట్టు బాగా రేగిపోయి ఉంది. మల్లె పూవు లాంటి ఆమె తెల్లచీర మాసిపోయి ఉంది. ఎప్పుడూ ప్రశాంతంగా వెలుగుతుండే ఆమె కళ్ళు ఎర్రగా చింతనిప్పులు కురుస్తున్నాయి. గోరీమా చాలా ఆవేశంగా, కోపంగా మాట్లాడుతోంది.

ఆమె మాటల్లోంచి నేనేమీ గ్రహించలేకపోయాను. ఆమె చాలా కష్టంలో ఉందన్నదొక్కటే నాకు అర్థమైంది. చాలాసేపు గోరీమా మాట్లాడి వెళ్ళిపోయింది. వెళ్ళాక అమ్మనడిగాను.

"నీకు అర్థం కాదులేరా!" అని ఎంతకీ ఏమీ చెప్పలేదు అమ్మ.

నాన్నగారు భోజనానికి వచ్చినప్పుడు మాత్రం తనే చెప్పడం మొదలుపెట్టింది. కాని నాకేమీ అర్థం కాలేదు. అది గోరీమా ఇంటి గొడవ అని మాత్రం తెలిసింది.

ఆ రాత్రి నాకు చాలాసేపు నిద్రపట్టలేదు. తెల్లారే లేచి గోరీమా ఇంటికి వెళ్ళాను.

అక్కడ చాలా సందడిగా ఉంది. చుట్టూ జనం. కేకలు. పళ్ళాల నిండా కొబ్బరికాయలూ, పూలూ పెట్టుకుని తండోపతండాలుగా వస్తున్నారు. ఇంకా ఇంకా వస్తూనే ఉన్నారు. నేను ఆ జనాన్నంతా తోసుకొని గోరీమా ఇంట్లోకి అడుగుపెట్టాను.

గోరీమా అంటే ఎంత ఇష్టమో ఆ ఇల్లన్నా అంతే ఇష్టం నాకు. ఓ పెద్ద మిద్దె. మిద్దె చివర పెద్ద వేపచెట్టు. చెట్టుపైన ఆకుపచ్చ, ఎర్రజెండాలు. లోపలికి అడుగుపెట్టగానే పూలచెట్ల పలకరింతలూ, చుట్టుముట్టే పరిమళాలు. అన్నిటికీ మించి తెల్లలాల్చీ, పైజామాలో ఎప్పుడూ కడిగిన ముత్యంలా కనిపించే అన్వర్‌భాయి. ఎప్పుడూ నవ్వుతూ ఎదురొచ్చే అన్వర్‌భాయ్ ఆరోజు కనిపించలేదు. మూడునాలుగు గదుల ఆ ఇంట్లో చివరి గది భాయిది. నేను ముందూ వెనుకా చూడకుండా లోపలికి వెళ్ళిపోయాను. గదిలో నేల మీద పడుకుని కప్పుకేసి చూస్తూ దీక్షగా ఆలోచిస్తున్నాడు అన్వర్‌భాయి.

నేను చాలా మెల్లిగా "భాయి..." అని పిలిచాను.

'రా' అన్నట్టుగా తల ఊపి మళ్ళీ ఆలోచనల్లో కూరుకుపోయాడు.

నేను దగ్గిరగా వెళ్ళి కూర్చున్నాను.

"భాయి..." అని మళ్ళీ అన్నాను.

ఏమి మాట్లాడాలో తెలియడంలేదు. ఆ వాతావరణం నాకు కొత్తగా ఉంది. అంత నిశ్శబ్దాన్ని ఆ ఇంట్లో నేను చూడలేదు. నిజానికి ఆ సమయానికి అరబ్బీ పాఠం కోసం వచ్చే పిల్లల కేకలతో సందడిగా ఉండాలి. బెత్తం పట్టుకుని గోరీమా పాఠం చెబుతూ ఉండాలి. బయట మిద్దె మీద కూర్చొని అన్వర్‌భాయి ఏదైనా చదువుకుంటూ ఉండాలి లేదా పూలమొక్కలకు నీళ్ళు పోస్తూ ఉండాలి. అవేమీ లేని ఆ ఉదయం నాకు భయమేసింది. బయటేమో ఆ సందడి... ఇంట్లో ఇంత నిశ్శబ్దం! అన్వర్‌భాయ్ ఏమీ మాట్లాడకపోయేసరికి నేను మళ్ళీ వరండాలోకి వచ్చాను. అప్పుడే గోరీమా అక్కడికి వచ్చినట్టుంది. తస్బీ లెక్కిస్తూ కూర్చొని ఉంది. నేను ఎదురుంగా వెళ్ళి కూర్చునేసరికి

"కబ్ ఆయెబా?" అనింది.

నేనేమీ మాట్లాడకుండా "క్యాహువా గోరీమా?" అని అడిగాను. అలా అడిగేసరికి ఒక్కసారిగా గోరీమా ఏడిచేసింది. నన్ను ఒళ్ళోకి లాక్కుంది.

"మేరా ఘర్ షైతాన్‌కా పాలె హువా బా" అంటూ ఏడుస్తోంది.

"బాహర్ క్యావో..." (బయట ఏమిటి?) అని అడిగాను.



"షైతానా, కాఫిరా జమే. కోన్కీ అమ్మ ఆయికతే..."

అంటూ ఏడుస్తోంది తప్ప నాకేమీ అర్థం కావడంలేదు. చెప్పినా నాకు అర్థమయ్యే పరిస్థితి కాదు అది. బయట హడావుడి కొద్దికొద్దిగా తగ్గుతున్నట్టుగా ఉంది. జనం కేకలు తగ్గిపోయాయి. కాసేపు ఉండి గోరీమా మళ్ళీ నమాజ్‌లోకి వెళ్ళిపోయింది. నేను బయటికి వచ్చాను.

బయట గోరీమా ఇంటిగోడకి ఆనుకుని ఓ పెద్ద బండరాయి. దానికి ఎర్రెర్రని బొట్లూ, కుంకుమలు పూశారు. పూలు తొడిగారు. తోరణాలు కట్టారు. అలాంటి దృశ్యం నేను ఓసారి చెరువు దగ్గర చూశాను. ఇప్పుడు ఇక్కడ... పరీక్షగా చూస్తే ఆ రాతి మీద ఓ స్త్రీ ఆకారం ఉంది. అది చాలా వికృతంగా అనిపించింది నాకు. ఎక్కువసేపు చూడలేక నా అయిష్టాన్ని వ్యక్తం చేయ డానికి ఓ చిన్న రాయిని విసిరి కోపంగా వచ్చేశాను. అప్పట్నించీ ఆ రాతిరూపం నన్ను వెంటాడుతూనే ఉంది. అమ్మని అడగాలి. అమ్మకీ తెలియకపోతే నాన్నని అడగాలి.

*

నేను ఇంటికి వెళ్ళేటప్పటికి అమ్మానాన్న ముందు వరండాలో కూర్చుని వున్నారు. నాన్నగారు పేపర్లు దిద్దుకుంటున్నారు. అమ్మ బియ్యంలో రాళ్ళు ఏరుతోంది. "గోరీమా పరేషాన్‌లో పడి పోయింది పాపం" అంటోంది అమ్మ.

"ఏం చేస్తుంది ఆడది? మనవాళ్ళా, ఒకళ్ళకొకళ్ళు తోడు రారు" అంటున్నారు నాన్న.

"నిజంగా అక్కడ ఆ దేవత వెలిసిందా ?"

"దేవతలు వెలవడం ఏమిటి? ఇల్లు బాగుంది కదా! ఎవడో కన్నేశాడు. ఓ రాయి విసిరి వెళ్ళిపోయాడు, అంతే. మనకు రాళ్ళంటే పిచ్చికదా, దానికి కాస్త కుంకుమా, బొట్టూ ఉన్నాయంటే ఇంక పూనకాలొచ్చేస్తాయి."

నేను వాళ్ళ మాటలు వింటూ ఓ పక్కన కూర్చోబోయాను.

నాన్నగారు "బాబూ, ఎక్కడికి వెళ్ళావురా?" అంటూ దగ్గరకు పిలిచారు. నేను దగ్గరకు వెళ్ళి ఆయన పక్కనే కూర్చున్నాను.

అమ్మ మళ్ళీ అడిగింది.

"ప్రెసిడెంటు మీరు చెప్పినట్టు వింటాడు కదా, ఓ మాట చెప్పొచ్చుగా"

"వాళ్ళకు కావల్సిన మాటలు వింటారు. ఈ విషయం అడిగితే ఎందుకులేవయ్యా, ఇందులో కులం గొడవుంది. నీకు తెలుసుగా ఆ కులపోళ్ళు ఊళ్ళో ఎక్కువున్నారు అనేశాడు"

అమ్మ ఇంకేమీ మాట్లాడలేదు.

"నిజమే, మనోళ్ళు తక్కువ ఉండడమే మనకు అన్యాయం. ఆ తక్కువలో కూడా మళ్ళీ ఒకళ్ళకొకళ్ళకి తేడాలు... మనం బాగుపడంలెండి" అంటూ చాట తీసుకుని నిలబడింది.

"నా బాధల్లా గోరీమా గురించి. దిగులుతో మంచం పట్టింది. ఆ పెద్దకొడుకు పట్నం వెళ్ళి కూర్చున్నాడు. తల్లి గురించి పట్టించుకోడు. ఇంక మగదిక్కు ఏది? బతుకంతా పెద్దకొడుకు మీద ఆశలు పెట్టుకుని ఈడ్చుకుంది. భర్త పోయాక రెండో పెళ్ళి చేసుకోమని అందరూ అన్నారు.

ఎంతసేపూ పిల్లలు పిల్లలు అంటూ ఇవాళ ఒంటరిదైపోయింది. ఆ అన్వర్‌కి ఇంకా చిన్న వయసు."

అని స్వగతంగా అనుకుంటున్నట్టుగా వంటగదిలోకి వెళ్ళిపోయింది.

నాన్నగారు మౌనంగా పేపర్లు దిద్దుకుంటూ ఉండిపోయారు. నాకేమో అయోమయంగా ఉంది. గోరీమాని కాపాడుకోవాలి... ఎలా? ఎలా?

*

గోరీమాని నేను కాపాడుకోలేకపోయాను.

కాని ఆ తర్వాత ఊరు తీరే మారిపోయింది. అమ్మానాన్న కూడా ఊరి విషయాలు పెద్దగా చర్చించుకోవడం లేదిప్పుడు. నాన్నగారి దినచర్య మామూలుగా సాగిపోతూనే ఉంది. అమ్మ ఎప్పుడైనా మధ్యాహ్నం గోరీమా దగ్గరకు వెళ్ళివచ్చేది. కాని ఇంట్లో ఏమీ చెప్పేదికాదు. నాకు ఏమీ అర్థంకావడంలేదు. గోరీమా చిక్కి శల్యమైపోవడంనా కళ్ళారా చూస్తున్నాను. అన్వర్ గది నాలుగ్గోడల మధ్య ఖైదీలా పడి ఉండడమూ చూస్తున్నాను. అన్నట్టు ఇప్పుడు గోరీమా పెద్ద గదుల ఇల్లు వదిలేసి వెనక చిన్న పాకలాంటి ఇంట్లోకి మారింది. ఆ మార్పు కూడా అప్పటికి నాకు తెలియదు. బయట దేవత ప్రతిష్ఠ రోజురోజుకీ పెరుగుతోంది. ఇదివరకు ఏ శనివారంనాడో జనాలు వచ్చేవారు. ఇప్పుడు రోజూ వస్తున్నారు. అక్కడ ఎంత హింస జరుగుతుందో చెప్పలేను. మేం ఆడుకునే జెండాచెట్టు కింద సాయంత్రమయ్యేసరికి కోళ్ళబొచ్చు గుట్టలుగా పడి ఉంటుంది. క్రమంగా ఆ ప్రదేశమ్మీద నా ఆకర్షణ తరిగిపోయింది. గోరీమా కళ్ళల్లో ఇదివరకటి ప్రేమకు బదులు ద్వేషం పుట్టుకురావడం నా లేత కళ్ళకు తెలుస్తోంది. కాని ఇప్పుడెవరూ ఏమీ చేయలేని స్థితి... సాహెబ్ మామయ్య వస్తాడని, అంతా కుదురుకుంటుందనీ గోరీమా మొదట్లో అమ్మతో చెప్పేది. కాని సాహెబ్ మామయ్యని నేను మళ్ళీ చూడలేదు, పట్నంలో తప్ప!

నాన్నగారు నాకు చొక్కా కొనిపెట్టాక చెప్పులు కావాలని గొడవ చేశాను.

"ఇంట్లో ఓ జత వున్నాయి కదరా..."

"కాదు. ఇంకోటి కావాలి"

కాసేపు మారాం చేస్తే నాన్నగారు చెప్పుల షాపులోకి తీసుకువెళ్ళారు. అక్కడ ఓ వ్యక్తి నాన్నగారికి చిరునవ్వుతూ సలాం కొట్టాడు.

"క్యా సాహెబ్, ఖైరియత్?" అని అడిగారు నాన్న. 'ఓహో, సాహెబ్ మామయ్య ఇతనేనా?' అనుకుని పరీక్షగా చూశాను. పొడుగ్గా, అందంగా ఉన్నాడు సాహెబ్. గోరీమా కొడుకే ఇతను అంటే ఎవరైనా వెంటనే అవునవును కదా అనేట్టున్నాడు.

"క్యా ఖైరియత్ సాబ్..." అంటూనే ఒక బాధతో కూడిన నవ్వుతో మాట్లాడుతున్నాడు. అతనేదో మాట్లాడుతున్నాడు. గోరీమా ప్రసక్తి వస్తుందేమోనని నేను ఆసక్తిగా వింటున్నాను. కాని అతను ఒక్కమాట కూడా పొరపాట్న గోరీమా గురించి ఎత్తలేదు.

చివరికి నాన్నగారే అడిగారు.



"ఏక్‌బార్ ఆవో... అమ్మ ఒంటరిదైపోయింది. గొడవలుగా ఉంది"

"అమ్మీ పిచ్చిది. ఇక్కడికి రమ్మంటే రాదు. వాళ్ళు, అమ్మని వెళ్ళగొట్టేంతవరకూ ఊరుకోరు. ఆ కులపోళ్ళు చాలా గట్టివాళ్ళు, మొండి ముండాకొడుకులు. మనం నిలబడగలమా? అమ్మేమో ఏవో బీరాలు పలుకుతోంది. ఎట్లయినా ఇల్లు దక్కించుకోవాలంటుంది. మనకు ముందూ వెనుకా ఎవరూ లేరు. ఆ స్థలానికా కాగితాలు లేవు. మనం ఏమీ మాట్లాడలేం."

"నువ్వు వచ్చి ఇంకోసారి కోషిష్ చెయ్యి"

"నాకు నమ్మకంలేదు సాబ్. వాళ్ళు ఎంత క్రూరులో మీకు తెలుసు. ఎలాగైనా ఆ ఇల్లు ఆక్రమించి అక్కడో పెద్ద గుడి కట్టేద్దామనుకుంటున్నారు. వేరే ఊళ్ళ జనాలు కూడా ఇప్పుడు తోడయ్యారు. మొన్నటికి మొన్న కూడా వచ్చి బెదిరించి వెళ్ళారు. ఇల్లు ఖాళీ చేయకపోతే వేసేస్తామని. నా పిల్లలు పెరుగుతున్నారు. నేను ప్రాణాన్ని పణంగా పెట్టలేను..." నిస్సహాయతని ప్రకటిస్తున్నాడు సాహెబ్.

నాన్నగారు కూడా ఇంకేమీ అనలేకపోతున్నారు.

"ఇస్కా సైజ్ ఏక్ జోడా నికాలో" (వీడి సైజుకి ఓ చెప్పుల జత తీయండి) అన్నారు. సాహెబ్ నా కాళ్ళు దగ్గరకు తీసుకుని సైజు చూశాడు.

"యా క్యా దేతె"

"ప్రస్తుతానికి గడుస్తుంది. పిల్లలు పెరిగితే గడవడం కష్టం" అన్నాడు.

"ఎంత పెద్ద కుటుంబం ఎలా అయిపోయింది? ఆరోజుల్లో గోరేభాయ్ అంటే ఊళ్ళో ఎంత ఇజ్జత్!"

"అదంతా ఆయనతోనే పోయింది. ఇప్పుడు కులం తప్ప మనుషులు కనిపించడం లేదు" సాహెబ్ కళ్ళలో తడి మెరిసింది.

"ఇంటికి రండి... ఈ పూట ఉండి వెల్దురుగాని" అన్నాడు ప్రేమగా సాహెబ్. అలా అన్నప్పుడు అతను అచ్చంగా గోరీమాలానే ఉన్నాడు.

"ఏ బార్ జరూర్ ఆతే..."

"బాభీకు లేకె ఆవో" (వదినమ్మని తీసుకురండి) అంటూ షాపు బయటిదాకా వచ్చి మమ్మల్ని సాగనంపాడు సాహెబ్.

తిరుగు ప్రయాణంలో నేను నాన్నగార్ని ఎంత విసిగించానో చెప్పలేను. గోరేభాయ్ ఎవరు? సాహెబ్ మామయ్య తల్లికి దూరంగా ఈ టౌన్లో ఎందుకున్నాడు? అంటూ.

"గోరేభాయ్ మలేరియాతో చనిపోయాడు. ఆరోజుల్లో మలేరియా వస్తే అంతే! ఊళ్ళో కుటుంబం గడువక, భార్యాపిల్లలతో పట్నం వచ్చేశాడు సాహెబ్. గోరీమా సొంత వూరూ, సొంత ఇల్లూ అంటూ అన్వర్‌తో సహా అక్కడే ఉండిపోయింది" అన్నారు ఒక్కమాటలో.

అయినా నేను వినలేదు.

"ఇప్పుడు గోరీమాని ఎవరు చూస్తారు?"

"అన్వర్ పెద్దయ్యేదాకా అంతే!" అని ఆయన తన ఆలోచనల్లో తను మునిగిపోయారు.

ఇది జరిగిన కొన్నాళ్ళకు మా ఇంటికి మోతీ పిన్ని వచ్చింది. మోతీ గోరీమాకు మంచి స్నేహితురాలు.

"నువ్వేం చెప్పు ఆపా! గోరీమా పెద్ద యుద్ధం చేస్తోంది. ఈ యుద్ధంలో గెలిస్తే ఇల్లు దక్కుతుంది. ఇల్లు కంటే ముందు పరువూ ప్రతిష్టా నిలుస్తుంది."

"ఏం లాభం. మనిషి శవమైపోతోంది. ఆ కులపోళ్ళతో గొడవెందుకు, పోతేపోనీ పాడు ఇల్లు అనిపిస్తోంది నాకయితే" అంది అమ్మ.

"ఎలా వదిలిపెడుతుంది చెప్పు. గోరెభాయ్ గోరీమా ఎలా ఉండేవాళ్ళో నీకు తెలుసుగా. ఆరోజుల్లో ఊళ్ళో అందరికీ తలలో నాలుకలాగా... ఆయన జ్ఞాపకం ఈ ఇల్లొక్కటే, అదొక్కటీ తనకు ఒదిలిపెట్టమంటోంది. ఉన్న పొలం సాహెబ్ అమ్ముకుని పట్నం వెళ్ళి కూర్చున్నాడు" అంటోంది మోతి.

"నిజమే, కాని ఇల్లుతోపాటు గోరీమా కూడా మనకు దక్కేట్టు లేదు" అంది నిరాశగా అమ్మ.

"అల్లా క్యా లిఖేతో వో హోతా, ఆపా, కోన్ క్యా కర్తే" (అల్లా ఏది రాసిపెట్టాడో అదే జరుగుతుంది. ఎవరేం చెయ్యగలరు?) అని వెళ్ళిపోయింది మోతి.

*

ఆ తర్వాత కాలమెలా గడిచిపోయిందో గడిచిపోయింది. గోరీమా మాత్రం ఊరుకోలేదు. తన పద్ధతిలో తను పోరాడుతూనే ఉంది. మెల్లమెల్లగా ఆమె ఇల్లు గుడికింద మారిపోతోంది. దాన్ని ఆపే శక్తి ఎవరికీ లేకుండాపోయింది. అందరి నిశ్శబ్దాన్నీ ప్రశ్నిస్తూ గోరీమా తిరగబడుతూనే ఉంది. అలా చెప్పీ చెప్పీ, పోట్లాడీ పోట్లాడీ గోరీమా ఏమైపోతుందా అని కొన్నిరోజులు దిగులు పెట్టుకున్నాను. అమ్మకి చెప్పాను, నాన్నకి చెప్పాను. కాని ఎవరూ గోరీమా గురించి పట్టించుకోలేదు. అన్వర్ బయటికి రావడమే మానేశాడు. క్రమంగా మామధ్య దూరం పెరిగింది.

ఈలోగా చాలా మార్పులు జరిగిపోయాయి. మా కుటుంబం టౌనుకి మారింది. ఊళ్ళో ఉన్న కాసింత చెక్కా బాబాయ్‌కి అప్పజెప్పారు. బాబాయ్ టౌనుకి వచ్చినప్పుడల్లా ఊరు సంగతులు చెప్పేవాడు. గోరీమా గురించి బాబాయ్ చెప్పగా వినడమే...!

*

జ్ఞాపకాల్లోనే ఊళ్ళోకి వచ్చేశాను. ఊళ్ళోకి ప్రవేశించగానే రోడ్డుకి కుడిపక్కన పోలీస్ స్టేషన్. ఎప్పటిలానే ఉంది. కాని అక్కడ జనం ఎక్కువగా ఉన్నారు. నా చిన్నప్పుడు అక్కడ ఎప్పుడూ ఒకరిద్దరు తప్ప కనిపించేవాళ్ళు కాదు. ఇప్పుడు జనం రద్దీ చూస్తుంటే ఊళ్ళో హింస బాగానే పెరిగిందనిపిస్తుంది. కొద్దిగా డౌన్‌లోకి వస్తే ఎడంవైపున గిర్నీ ఉంది. అది ధనధనా చప్పుళ్ళు చేస్తూనే ఉంది. పెద్ద మార్పేమీ లేదు. ఒక్కో అడుగే అలా గతంలోకీ, వర్తమానంలోకీ వేస్తూ ఊళ్ళోకి వచ్చాను. అటూఇటూ జనం తిరుగుతూనే ఉన్నారు. ఎవరూ నావైపు చూసి నన్ను



గుర్తుపట్టడంలేదు. చిన్నప్పుడు నేను ఈ ఊళ్ళో ఎటువెళ్ళినా 'హిందీ సార్ కొడుకురా' అని నాకు తెలియనివాళ్ళు కూడా గుర్తుపట్టేవాళ్ళు. లేదా ఊళ్ళోకి ఓ కొత్త మనిషి వస్తే ఎగాదిగా చూసేవాళ్ళు. ఇప్పుడు అలాంటిదీ లేదు. ఆ ఊళ్ళో నేనొక అనామకుణ్ని అనిపించింది. కొత్త కొత్త ముఖాల్లో పాత పోలికలేమన్నా కనిపిస్తాయా అని వెతుక్కుంటూ చావిడిదాకా వచ్చాను. చావిడికి నాలుగైదు అడుగుల దూరంలో బాబాయ్ ఇల్లు. ఎత్తయిన అరుగులు, పాతకాలపు నిర్మాణంలా ఉండే చావిడీ. చావిడి తలుపులు ఎప్పుడూ తీసే ఉంటాయి. ఒక్క మొహర్రం నెలలో తప్ప మామూలప్పుడు దాన్ని ఎవ్వరూ పట్టించుకోరు. ఆ నెలలో మాత్రం కాసింత సున్నాలు కొట్టి, అక్కడక్కడా ఎర్ర రంగుతో నక్షత్రాలు గీస్తారు. మొహర్రం నెలలో ఈ చావిడీ ఎంత హడావుడిగా ఉంటుందో! పెద్ద ఆలమ్ పట్టుకుని సాహెబ్ మామయ్య ఊగిపోతుండడం, అలావా తొక్కడం, పూనకం వచ్చినట్టు ఏదేదో మాట్లాడడం... ఒక భయంతో కూడిన ఆనందం నాకు! చావిడీకి ఎదురుగా పెద్ద ఖాళీస్థలం. ఆ ఖాళీస్థలంలో శ్రీరామనవమి పందిరి వేసేవాళ్ళు. కోలాటాల సందడి.

"గణగణమూర్తివి గణనాథా
నువ్వు శివుడీ కుమారుడివి గణనాథా"

అని కోలాటం ఆడుతుంటే మా పసి కాళ్ళూ చేతులూ ఆగేవి కావు. పీరు ఊగినట్టు ఊగిపోయేవాళ్ళం. సాయంత్రం కాగానే ఎవరో ఒకరు పెద్ద పాత్రలో పులిహోర తెచ్చేవాళ్లు. పీర్ల చావిడి అరుగు ఎక్కి అందరికీ పంచేవాళ్ళు. ఆ దృశ్యాలన్నీ నా జ్ఞాపకాల్లోంచి కళ్ళ ముందు సజీవంగా తిరుగుతున్నట్టే అనిపించింది. పీర్లచావిడిలో మాతం పాడుతున్నప్పుడు సాహెబ్ మామయ్యా, అన్వర్ అన్నయ్యా నిజంగా ఏడిచేవాళ్ళు. వాళ్ళతో కలిసి పాడే అందరూ పెద్దగా ఏడిచేవాళ్లు. ఆ ఏడిచేవాళ్ళలో ఎవరికీ కులమతాల పట్టింపులుండేవి కావు.

"ఓ... మేరే హుసేన్..." అనగానే ఆలమ్‌పైన కప్పిన ఎర్రగుడ్డల్ని కళ్ళకి అదుముకుని నిల్చున్నవాళ్ళు నిల్చున్నట్టే ఒక్కసారిగా తట్టుకోలేక కింద పడిపోతారా అన్న ఉద్వేగంతో పాడేవాళ్ళు. ఆ సన్నివేశంలో ఎంత బండరాయికైనా భళ్ళున ఏడుపు పొంగుకొచ్చేది.

నేను జ్ఞాపకాల్లో ఉండగానే

"బాబూ..." అన్న కేక వినిపించింది.

చూస్తే... ఉస్మాన్.

ఉస్మాన్‌ని చూడగానే నాకు ఏడుపొచ్చేసింది. గట్టిగా కావలించుకున్నాను. 'ఉస్మాన్ మామా' అన్నమాట నాకు తెలియకుండానే గొంతులోంచి వచ్చేసింది.

ఆయనా అంతే ప్రేమగా నన్ను కావలించుకున్నాడు.

"ఎన్ని రోజుల్ తర్వాత వచ్చావు...' అంటూ కళ్ళనీళ్ళు తుడుచుకున్నాడు.

ఈ ఉస్మాన్‌కు ఓ ఇల్లూవాకిలీ లేదు. ఈ చావిడీ పట్టుకుని లేదంటే ఆ ప్లాట్‌ఫారమ్ పట్టుకుని బతికేసేవాడు. "యే ఉస్మాన్ యేక్ దీవానా. నా ఘర్‌కా నా ఘాట్‌కా" అని గోరీమా ఎంత కోప్పడేదో! ఎప్పుడూ ఓ బీడీతుంట వేళ్ళమధ్య సరిచేసుకుంటూ తిరిగేవాడు. "అరే బచ్చే...' అంటూ పిలకాయల్ని వెంటేసుకుని... వాళ్ళని ఆడించేవాడు. నిజానికి పిల్లకాయలే వాడితో ఆడుకునే వాళ్ళు.

"బాబూ... మేరే ఘర్ జాయెంగే"

"నీకో ఇల్లా?"

"ఏం? నాకు ఇల్లుండకూడదా?"

నిజమే. నా ప్రశ్న నాకే అర్థరహితంగా అనిపించింది.

"కాదు, ముందు బాబాయ్‌నీ, పిన్నినీ పలకరించి వస్తా"

"బడా నిక్‌లాలే... చాలాకాలం తర్వాత బేటా వస్తున్నాడు కదా, స్టేషన్‌కి వెళ్దాం అన్న ధ్యాస అయినా లేదు ఆ బేవకూఫ్‌కి!"

ఉస్మాన్ అల్లాగే నిర్మొహమాటంగా మాట్లాడతాడు.

"లేదు, బాబాయ్‌కి తెలియదు నేను వస్తానని"

"సరే, ముందు ఈ గరీబ్ గుడిసె చూసి అప్పుడు వెళ్దుగాని..."

అయినా నేను ఒప్పుకోలేదు. ముందు బాబాయ్‌కి సలామ్ చేయాలి. పిన్నితో మాట్లాడాలి. ముకరమ్ ఎలా ఉందో చూడాలి. దానికి ఆరోగ్యం బాగాలేదని విన్నాను. జాఫర్ ఎలా ఉన్నాడో! నా ఆలోచనలన్నీ వాళ్ళ చుట్టూ తిరుగుతున్నాయి.

ఉస్మాన్‌కి నా పరిస్థితి అర్థమైనట్లుంది.

"సరే, అసర్ తర్వాత వస్తాలే" అన్నాడు.

బాబాయ్ ఇంటిదాకా దిగబెట్టాడు. "నువ్వెళ్ళు..." అనేసి వెళ్ళిపోయాడు. ఎందువల్లనో అతను లోపలికి రాలేదు. చిన్నప్పుడైతే ఉస్మాన్ అసర్ నమాజ్ తర్వాత ఎప్పుడూ బాబాయ్ ఇంటి చూరే పట్టుకుని ఉండేవాడు. ఏదో తేడాగా అనిపించింది నాకు.

నేను వెళ్ళేసరికి బాబాయ్ ఇంట్లో లేడు. బయట చిన్నవరండా... దూరంగా పశువుల కొట్టం... నా అలికిడి విని లోపల్నుంచి ఎవరో వచ్చారు. ముకరమ్...! ముకరమ్‌ని చూడగానే నాకు కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. ముకరమ్ శవంలాగా ఉంది. ఎప్పుడూ నవ్వుకుంటూ తుళ్ళు కుంటూ కెరటంలా ఎగసిపడే ఆ ఉత్సాహమూ, ఆనందమూ... అసలు అలాంటివి ఆ అమ్మాయికి జీవితంలో ఎప్పుడన్నా తెలుసా? అన్నట్టుంది.

"అమ్మీ, బాబు భాయి..." అంటూ పరుగుపరుగున లోపలికి వెళ్ళింది. లోపల్నుంచి పిన్ని వచ్చింది.

"ఎన్నిరోజుల తర్వాత వచ్చావు బాబూ, ఇక్కడ ఊళ్ళో మేం బతికి ఉన్నామో? ఎన్ని బాధలు పడుతున్నామో మీ అమ్మకీ గుర్తుండదు, మీకూ గుర్తుండదు" పిన్ని కొంచెం వెటకారంగానే అన్నట్టుంది. దగ్గిరకు వెళ్తున్నవాడ్నల్లా నేను ఆ మాటలకు ఎక్కడివాణ్ని అక్కడే ఉండిపోయాను. ఈమె ఏమీ మారలేదు అనిపించింది. ఈలోపున ముకరమ్ లోపలికి వెళ్ళి నాకు ఓ గ్లాసు మంచినీళ్ళు తెచ్చింది. తాగబోతుండగానే పిన్ని –

"మా కష్టాలు మీరెప్పుడైనా తలుచుకుంటారా, బాబు" అని మొదలెట్టింది. తాగబోతున్న గ్లాస్ పక్కనపెట్టి ముకరమ్‌వేపు చూశాను నేను. ఆమె అంతేలే... అన్నట్టుగా నావైపు కాస్త ప్రేమగా చూసింది ముకరమ్.



"వచ్చీ రాంగానే ఎందుకు? బాబుభాయ్... స్నానానికి నీళ్ళు పెడతాను. మంచి ఎండలో వచ్చావు. అలిసిపోయుంటావు" అంది ముకరమ్. ఆ మాటలు చాలా ఊరటనిచ్చాయి. ఆ తర్వాత పిన్ని ఏదో గొణుక్కుంటూనే ఉంది.

"జాఫర్ ఏడీ?" అని ముకరమ్‌ని అడిగాను.

"కామ్‌నై... ధామ్‌నై... కా జాతా" అంటూ మళ్ళీ కల్పించుకుంది పిన్ని. ఆమె మాట తీరు లోనే తేడాని నేను అర్థం చేసుకోగలను. మా సంబంధాలు ఇదివరకటంత స్వచ్ఛంగా లేవని నాకు తెలుసు. అమ్మ ఎప్పుడూ పిన్నిని తిడ్తూనే ఉంటుంది. "షాదీమే జ్వానే మే బీ నైసకా కరీ దుష్మన్" (పెళ్ళీ పేరంటాల్లో కూడా మమ్మల్ని రాకుండా చేసింది... పగబట్టిన ముండ) అని తిట్టేది అమ్మ. పిన్ని గుర్తొస్తే అమ్మకి ఎక్కడలేని ఆవేశం. నాన్న కోప్పడ్డంతో "అ... భాయికే ఊపర్ మఖ్ఖీ భీనై ఫిర్నా" (అన్న మీద ఈగ కూడా వాలకూడదు) అనేసి తన పనిలో తను వెళ్ళిపోయేది. నాన్నకి మొదట్నుంచీ బాబాయ్ అంటే సానుభూతి. "వాడా చదువుకోలేదు. మనకు చిన్నదో చితకదో గవర్నమెంటు ఉద్యోగం ఉంది" అనేవారు. ఊళ్ళో ఉన్న భూమి గురించి ఆయన ఏనాడూ పెద్దగా పట్టించుకోలేదు. బాబాయ్ ఎప్పుడైనా వచ్చేవాడు. వచ్చేటప్పుడు ఏవో గింజలూ, కూర గాయలూ తెచ్చేవాడు. ఒకటి రెండురోజులు ఉండి వెళ్ళిపోయేవాడు. క్రమంగా ఆ రాకపోకలు కూడా తగ్గిపోయాయి. ఈలోగా నాన్నగారి ఆరోగ్యం దెబ్బతింది. ఇంట్లో ఖర్చులు పెరిగిపోయాయి. ఎంత డబ్బూ ఆస్పత్రికే ధారపోయాల్సి వచ్చేది. ఊరెళ్ళి ఆ భూమి వ్యవహారమన్నా తేల్చుకురమ్మని అమ్మ పోరేది. కాని నాన్నగారు ఎప్పుడూ పట్టించుకున్నది లేదు. అలా ఆయన అనారోగ్యంతో తీసుకుంటూ తీసుకుంటూ కన్నుమూశారు. కుటుంబం అప్పుల పాలయింది.

"పెద్దకొడుకువి. కనీసం నువ్వయినా ఆ భూమి గురించి పట్టించుకో" అని అమ్మ ఎన్నిసార్లు తిట్టిపోసిందో తెలియదు. కాని ఊరెళ్ళినా నేను బాబాయ్‌ని ఆ భూమి గురించి అడగ్గలనా? ఏమో... నాకు నమ్మకం లేదు. ఆయన ముందు మాట్లాడే ధైర్యం లేదు. నిజానికి ఆయన కుటుంబ పరిస్థితీ నాకు బాగానే తెలుసు. అయినా అమ్మ మాట తీసిపారేయలేక వచ్చాను. ఇక్కడ పిన్ని సూటిపోటు మాటలు నేనూహించినవే. కాని... ముకరమ్‌కీ, జాఫర్‌కీ నేనంటే చిన్నప్పట్నించీ ప్రేమ. బాబాయ్‌కి నేనంటే పెద్ద ప్రేమా లేదు, అంత కోపమూ లేదు. ఆయన దృష్టిలో నేనెప్పుడూ 'బచ్చా'ని. "భాయ్, పానీ నికాలిం" (అన్నా, నీళ్ళు తోడాను) అన్న ముకరమ్ మాటలతో నేను ఆలోచనల్లోంచి బయటపడ్డాను.

నేను స్నానం చేసి వచ్చేలోగా బాబాయ్ వచ్చాడు.

"కబ్ ఆయారే?" అని పలకరించాడు ఆయన మొహంలో ఎలాంటి భావమూ లేకుండా. ఆయన ఎప్పుడూ అంతే!

"ఇప్పుడే..."

అంతే, ఆయనతో సంభాషణ. ఆ తర్వాత నేను బట్టలు మార్చుకుని వచ్చా. ముకరమ్ అన్నం వడ్డించింది.

"ఏక్ వక్త్ ఖానేకో కిత్తే తకలీఫా పడ్తే హైకి అల్లా జానే" (ఒక్కపూట అన్నం మెతుకుల కోసం ఎన్ని కష్టాలు పడుతున్నామో దేవుడికెరుక) అంటూ పిన్ని మళ్ళీ మొదలుపెట్టింది. అన్నం వడ్డిస్తున్న ముకరమ్ తల్లివైపు కాస్త కోపంగా మిటుకూ మిటుకూ చూసింది. అదీ తల్లికి తెలియకుండా.

మంచి ఆకలిమీదున్నా నేను సరిగ్గా భోంచేయకుండానే ముగించాను. మంచి ఎండలో వచ్చానేమో, మంచం మీద వాలేసరికి నిద్ర కమ్ముకొచ్చింది. అప్పటికీ జాఫర్ రాలేదు. అసర్ దాకా ఓ కునుకు తీశాను. నేను మంచం మీద పడుకుని ఉండగానే బయట వరండాలో పిన్ని మాటలు వినిపిస్తున్నాయి.

"బాబు ఊరికే ఎందుకొస్తాడు? పొలం సంగతి కనుక్కుందామని వచ్చి ఉంటాడు. నీళ్ళు నమలకుండా చెప్పండి. వాళ్ళ నాన్న వైద్యం ఖర్చుల కింద తీసుకున్న డబ్బుకీ పొలానికీ చెల్లయి పోయిందని. అప్పుడే చెప్పాను మీకు, అన్నిటికీ కాయితాలూ పత్రాలూ ఉండాలని..." అంటోంది. ఆ మాటలు నాకు ఆశ్చర్యాన్ని కలిగించాయి. నాన్న డబ్బు తీసుకున్నారా? ఈ పొలం మీది డబ్బు ఆయన మాకు తెలియకుండా వాడుకున్నారా? మరి టౌన్‌లో చేసిన అప్పులు...? అదలా ఉంచితే పిన్ని ఇంత కర్కశంగా మాట్లాడడం ఏమిటి? నేను మంచంలో కాస్త ఇబ్బందిగా కదులుతున్నాను. ఈలోగా ముకరమ్ వచ్చింది.

"బాబుభాయ్, నువ్వేమీ అనుకోకు. నువ్వు రావడం మాకు ఎంత ఆనందం కలిగించిందో..." అంటూ కళ్ళనీళ్ళు తుడుచుకుంది. అంతకంటే ఇంకేమీ అనలేక అవతలికి వెళ్ళి పోయింది. ఎందుకో నా ఆలోచనల్లోకి మళ్ళీ గోరీమా వచ్చింది.

"దేఖో, ఓ ఘర్‌కే వాస్తే గోరీమా కిత్తే జంగ్ కరీకి..." (చూసి నేర్చుకోండి. ఆ ఇంటికోసం గోరీమా ఎంత యుద్ధం చేసిందో?) అంటుంది అమ్మ ఎప్పుడూ. కాని ఆ యుద్ధంలో గోరీమా ఏమైందో మాకు తెలీదు. ఇప్పుడైనా తెలుసుకోవాలి. కాని నా యుద్ధం మాటేమిటి? గోరీమా ఒక కులపోళ్ళతో పోరాడింది, నేను కనీసం 'ఇంట' గెలవగలనా? పోనీ, బాబాయ్‌ని నిలదీసి అడగ్గలనా? ఏమో... నమ్మకం లేదు!

*

కచ్చితంగా అసర్ వేళకి ఉస్మాన్ వచ్చాడు.

"నమాజ్‌కు ఆవో..." అంటూ బలవంతం చేశాడు. కాస్త రిలీఫ్‌గా ఉంటుందని నేనూ వజూ చేసి అతని వెంట వెళ్ళాను. దారి పొడవునా నేను ఉస్మాన్‌తో ఒక్క మాట కూడా మాట్లాడలేకపోయాను. లోలోపల గుడిసుళ్ళు పడుతున్నాను. ఈ ఊరితో నాకు ఉన్న అనుబంధం నాన్నగారి ఆ భూమి...! అది కాస్తా తెగిపోతుందా? ఇంక ఇప్పుడు మాట్లాడకపోతే ఇంకెప్పుడూ మాట్లాడే అవకాశం రాదు, కనీసం ఈ ఊరు వచ్చే వీలు కూడా ఉండదేమో! పిన్ని ఎంత వీలైతే అంత అడ్డు పడుతుంది. బాబాయ్‌ని పడనివ్వదు. ముకరమ్ విషాదవదనం... తాడూబొంగరం లేని జాఫర్! నా అసమర్థతని గుచ్చిగుచ్చి ప్రశ్నిస్తున్న అమ్మ... నేను ఎంతో కొంత తెచ్చి ఈ అప్పుల విషవలయం



లోంచి బయటపడేస్తానని ఎదురుచూస్తున్న తమ్ముళ్ళు... జోడే కా రకమ్ కోసం ఇంకా వేధిస్తున్న బావ...! యాహ్, అల్లాహ్!

'పర్వర్ దిగారే ఆలమ్' అందుకున్నాడు ఉస్మాన్. నా విషాదయోగం తెలిసిందా ఉస్మాన్‌కి?

*

అవన్నీ నెమరేసుకుంటుండగానే మస్జిద్ మెట్లు ఎక్కి లోపలికి అడుగుపెట్టాను. ఆ వాతావరణంలోకి అడుగుపెట్టగానే ఒక్కసారిగా మనసంతా ప్రశాంతంగా మారిపోయింది. హజ్రత్ సాబ్ నావేపు చూశారు, నేను సలామ్ చేసి ఒంగి ఆయన కడుపులో తలదాచుకున్నాను. ఆయన ప్రేమగా నన్ను దగ్గిరకు తీసుకున్నారు. ముసలి కళ్ళు చికిలిస్తూ "కోన్ బేటా?" అని అడిగారు.

"హమారే మున్వర్ ఆపాకే బేటా, భూల్‌గయే" అన్నాడు ఉస్మాన్. ఊళ్ళో మా వాళ్ళందరికీ నేను మున్వర్ ఆపాకే బేటాగానే తెలుసు. ఆయన గుర్తుకు తెచ్చుకునే ప్రయత్నంలో పడ్డాడు. నమాజ్ అయిం తర్వాత నేను దువా చేసుకున్నాను. బాబాయ్ కుటుంబంతో మా సంబంధాలు గట్టిపడాలనీ, ముకరమ్ కాపురం ఓ కొలిక్కి రావాలనీ అల్లాకి దువా చేశాను. కాసేపు మసీదులో మౌనంగా కూర్చున్నాను. భూమి విషయంలో బాబాయ్‌తో తగూ అనవసరం అనుకున్నాను. అమ్మ ఏమనుకున్నా సరే, ఏదో ఓ రకంగా అక్కడే అప్పోసప్పో చేసి ఇంటి ఆర్థిక వ్యవహారాలు ఓ కొలిక్కి తేవాలని అనుకున్నాను. ఇప్పుడు చాలా ప్రశాంతంగా అనిపించింది.

బయటికి రాగానే ఉస్మాన్ తన ఇంటికి వెళ్దామని పట్టుబట్టాడు. సరే అని బయలు దేరాను. నడుస్తున్నాం. ఉన్నట్టుండి ఉస్మాన్ అన్నాడు –

"జమీన్ ఛోడో నక్కో... అబ్బాకి యాద్ ఓ యేకీచ్‌నా?" (భూమిని వదులుకోవద్దు, నాన్నగారి జ్ఞాపకం అదొక్కటేగా).

ఉస్మాన్ మాట నా లోపలి ప్రశాంత వలయాల్ని మళ్ళీ కుదిపింది. అవును, నాన్నగారి జ్ఞాపకం...? ఉస్మాన్‌కే అంత పట్టింపుగా ఉంటే అమ్మకెలా ఉండాలి? నేను మళ్ళీ తీవ్రమైన ఆలోచనల్లో పడిపోయాను. ఆ పొలంలోని పచ్చని పైరు మీద వీచే చల్లనిగాలిలా నాన్నగారి చిరునవ్వులా కనిపించింది. ఎన్ని దుఃఖాల్ని కప్పేసిందో ఆ చిరునవ్వు...? నేను లోపల్లోపల గుక్కపెట్టి ఏడుస్తున్నానేమో... బయటికి ఒక్కమాటా అనలేకపోతున్నాను. ఆ జమీన్ నాన్నగారి జ్ఞాపకం... నిజమే! దాన్ని వదులుకోకూడదు. ఒళ్ళంతా పిడికిలిలా బిగుసుకుంది.

"మీ చాచా ముఖం చూసి అంతా వదిలేద్దామనుకోకు. నన్నడిగితే వాడంత కాఫిర్... షైతాన్ లేడు"

"గోరీమా కనబడలేదే నాకు?" అన్నాను నేను.

అప్పుడు ఉస్మాన్ చెప్పిన విషయాలు విని నేను కళ్ళనీళ్ళ పర్యంతమయ్యాను. ఆలోచనల్లో మునిగిపోయాను. ఉస్మాన్ మళ్ళీ రైలు వేళకి వస్తానని వెళ్ళిపోయాడు.

*

ఉస్మాన్ వచ్చేసరికి నేను బ్యాగ్ సర్దుకుని రెడీగా ఉన్నాను. అందరికీ 'ఖుదా హాఫీజ్' చెప్పి బయలుదేరాను.

ఉస్మాన్ తనే ప్రస్తావించాడు.

"జమీన్ విషయం ఏం తేల్చారు?" అని.

నేనేమీ మాట్లాడలేదు. ఉస్మాన్ మళ్ళీ అడగనూ లేదు.

ఇంతలోనే స్టేషన్ చేరుకున్నాం. అక్కడి దృశ్యం మామూలే. ఆ ముసలావిడ బురఖాతో మళ్ళీ ఎదురైంది.

ఉస్మాన్‌ని చూడగానే ఆమె పలకరించింది.

అప్పుడే ఆమెని కాస్త పరీక్షగా చూశాను. గోరీమా...

ఆ మాట పైకే అనేశాను. గోరీమా నా కళ్ళల్లోకి చూసింది.

"అక్బర్..."

ఆమెకు లేచి నిలబడే ఓపిక లేదు. నేల మీద కూర్చునే నన్ను ఆపాదమస్తకం ప్రేమగా నిమిరింది. నా చేతులు అందించాను. ఆమె నా చేతుల్ని దగ్గరకు తీసుకుంది.

ఆమె కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"చివరికి ఇలా మిగిలిపోయాను. ఇప్పుడింక ఏమీలేదు బాబూ... అంతా మునిగి పోయాను."

"ఏమైంది? ఎందుకిలా?"

ఆమె ఏమీ మాట్లాడలేకపోతోంది. ఉస్మాన్ తనే కల్పించుకుని చెప్పడం మొదలెట్టాడు. అంతా విన్న తర్వాత నాకు గోరీమా నా ముందు ఆకాశమంత ఎత్తులో కనిపించింది. ఆమె పాదాలకు నమస్కరించాలనిపించింది. నా కళ్ళల్లో నీళ్ళు నింపుకున్నాను. ఆమె తెగింపు, సొంత నేల కోసం ఆమె పోరాటం... ఆమె ముందు నేను మరీ మరుగుజ్జులా కనిపించాను నాకు నేనే!

ఈలోగా ప్లాట్‌ఫారమ్మీద రైలు కేక... నా ఆలోచనల్ని తెంపేసింది. ఉస్మాన్ ముందు పరిగెత్తి సీటు ఆపాడు. నేను గోరీమా వైపే చూస్తూ నా సీటులో కూలబడ్డాను.

"గోరీమా, ఈ దేశం రాయలేని చరిత్రలో నువ్వొక చరిత్రవి. నువ్వొక తిరుగుబాటువి. నా తరానికి అంతుపట్టని భూపోరాటానివి. సొంత నేలకోసం సంఘాన్నంతా ఎదురొడ్డి నిలిచావు. ఓడినా సరే, నువ్వే గెలిచావు. నీ నేల మీద నువ్వున్నావు. నేను ఈ నేలకి దూరంగా... పిరికిగా పారి పోతున్నాను..."

కిటికీలోంచి బయటికి చూస్తే మబ్బుల గుంపులు పరుగు తీస్తున్నాయి. గోరీమా హృదయంలో పరుగెత్తుతున్న యుద్ధాశ్వాల్లా.

*ఆదివారం వార్త, 29 డిసెంబర్ 2002*



# తెలంగాణ కథాచరిత్ర - కొన్ని సమస్యలు

కె. శ్రీనివాస్

తెలంగాణా సాహిత్యచరిత్ర రచన ఇప్పుడిప్పుడే ప్రారంభమైంది. రాజకీయ రంగంలో బలపడుతున్న తెలంగాణా ఆత్మగౌరవ ఉద్యమమే సాహిత్యరంగాన్ని కూడా కుదిపివేస్తున్నది, కొత్త విలువలను ప్రతిపాదిస్తున్నది, కొత్త చరిత్రను కోరుతున్నది.

విశాలాంధ్ర మాటున కొన్ని ప్రాంతాలే లాభపడినట్టు, తెలుగువారి రాజకీయ, సాంస్కృతిక, సామాజిక ఉమ్మడి చరిత్రలు కూడా కొన్ని ప్రాంతాల చరిత్రల్నే పేర్కొన్నాయని వర్తమానంలో అభివృద్ధి వివక్షకు లోనవుతున్న ప్రాంతాలు, చరిత్ర రచనలో విస్మరణను కూడా ఎదుర్కొంటు న్నాయని గుర్తించారు. అటువంటి గుర్తింపు మరే రంగంలో కన్నా సాహిత్యరంగంలో ఎక్కువ కనిపిస్తున్నది. తెలంగాణ చరిత్ర గురించి, సాహిత్య చరిత్ర గురించి ఈమధ్య పెరిగిన పరిశోధన గతంలోని అనేక విస్మృతాంశాలను రంగం మీదికి తీసుకొచ్చింది. తెలంగాణ సంస్కృతీ సాహిత్యాల మీద సాటి తెలుగువారి వివక్ష, తిరస్కారభావం కొత్తవి కావని, వాటికి కూడా సుదీర్ఘ చరిత్ర ఉన్నదని నిర్ధారణ జరిగింది. తెలుగు సాహిత్యానికి అంతటికీ ప్రాతినిధ్యం వహిస్తున్నట్టు చెప్పుకునే పుస్తకాలలో ప్రాంతీయ ప్రాధాన్యాన్ని లెక్కవేయడం ఇప్పటి విమర్శలో ఒక ముఖ్యాంశమైంది. గత మూడు నాలుగు సంవత్సరాలలో వచ్చిన అనేక కథాసంకలనాలు ఇటువంటి నిశిత పరిశీలనకు లోనయ్యాయి. ఈ కథా సంకలనాలు తాము మొత్తం తెలుగు సాహిత్యానికి ప్రాతినిధ్యం వహిస్తు న్నట్లు చెప్పుకున్నాయి. ఆ సంకలనాలలో కథల ఎంపికకు సంపాదకులు చెప్పుకున్న ప్రాతిపదికలు ఏమైనప్పటికీ ఫలితం మాత్రం ఒకటే. అది తెలంగాణేతర ప్రాంతాల కథలనే తెలుగు కథలుగా నిర్ధారించటం.

తెలంగాణ గురించి ఏమీ తెలియకుండానే, తెలుసుకోకుండానే 20వ శతాబ్దం ప్రథమా ర్థంలో (మరికొందరైతే 1980ల దాకా) చెప్పుకోదగ్గ కథాసాహిత్యమేదీ లేదని నిర్ధారించడం - కేవలం తెలంగాణ కథను విస్మరించడం మాత్రమే కాదు. తెలంగాణ చరిత్రను, తెలంగాణ కథ ప్రతిబిం బించిన విభిన్నమైన రాజకీయార్థిక వాస్తవికతని, సాంస్కృతిక ప్రత్యేకతని నిరాకరించడమే. వర్తమానంలో న్యాయం కోరుతున్న సమూహం ఏదయినా, తనను చరిత్రహీనులుగా చిత్రించడాన్ని సహించలేదు. అసత్యాల చరిత్రను ఆపాదించడాన్ని వ్యతిరేకిస్తుంది. తన ఘనతను ప్రకటించే చరిత్రను నిర్మించుకుంటుంది.

తెలంగాణకు ఏ చరిత్ర లేదని చెప్పడం పరమ అహంకారం. సందేహం లేదు. అయితే, తెలంగాణ చరిత్ర గురించిన అవాస్తవికమైన, భ్రమాత్మకమైన దృష్టి వుండడం పొరపాటు. తెలంగాణ అన్నిటా సమాన ప్రాధాన్యం పొందిందని, సమాన అవకాశాలతో సమాన ప్రతిభ కనబరిచిందని, వివక్ష, విస్మరణ తప్ప సామర్థ్యపు లోటేమీ లేదని చెప్పడం అభిజాత్యం కాదు కానీ,

అవగాహనారాహిత్యం. చారిత్రక ఘనత, ఔన్నత్యాలతో పాటు వర్తమానంలోని, సమీప గతంలోని దుస్థితి గురించి కూడా వాస్తవికమైన అంచనాలు ఉండాలి. సమాజంలో అన్ని రంగాలలో ఎక్కువ అవకాశాలను అందిపుచ్చుకున్నవారు, చారిత్రకంగా పైచేయి అయినవారు ప్రతిభా సామర్థ్యాలను అధికంగా సమకూర్చుకోవడం సహజం. ఆ ఫలితం కోసం కాకపోతే, వారు ఇతరులను అణగద్రొక్క వలసిన పనేముంది? ప్రతికూల పరిస్థితులలో మగ్గినవారికి, కనీస సదుపాయాలు మౌలిక వసతులు లేనివారికి కొన్ని నైపుణ్యాలు అలవడకపోవడం కూడా అంతే సహజం. చరిత్ర రచనలో ఉండి తీరవలసిన గుర్తింపు ఇది. తెలుగు కథానికా వాంగ్మయంలో బ్రిటిష్ ఆంధ్ర నుంచి, అందులోనూ కోస్తా ఆంధ్ర నుంచి వచ్చినంత వైవిధ్యపూరితమైన, ప్రతిభావంతమైన కథలు తొలిరోజుల్లో తెలంగాణ నుంచి రాలేదనే ఒప్పుకోవడానికి వెనుకాడనక్కర్లేదు. ఇది వ్యక్తిగత ప్రతిభలకు సంబంధించిన అంశం కాదు. బాహ్య పరిస్థితులకు సంబంధించిన అంశం. నేపథ్యాలకు సంబంధించిన అంశం. అంతేకాదు, చిన్న కథ మంచి చెడ్డలను నిర్ణయిస్తున్న ప్రమాణాలు ఆంగ్లో యూరోపియన్ - కోస్తాంధ్ర ప్రమాణాలైనప్పుడు, బరిలోకి దిగకముందే తెలంగాణ ఓడిపోలేదా? చిన్న కథ 'ఆధునికత' తో ఉండాలని (అందువల్లనే **దిద్దుబాటు** మొదటి తెలుగు కథ అని) విప్లవవాదులే వాదిస్తున్నప్పుడు ఆధునికతకు భిన్నమైన పరిస్థితులలో, ఆధునికతతో పొలిక కుదరని వాతావరణంలో ఉన్న తొలినాటి తెలంగాణ ఎవరి కంటికి ఆనుతుంది?

అయినంత మాత్రాన, తొలితరం తెలంగాణ కథా సాహిత్యానికి ఉన్న ప్రాధాన్యం, విలువ ఏమీ తగ్గిపోవు. తెలంగాణ తొలితరం కథలు ప్రతిబింబించిన వాస్తవికత, సామాజిక సంచలనం వాటంతట అవే విశిష్టమైనవి. తెలంగాణ ప్రత్యేకతల నుంచి రూపొందిన కథాకథన శైలి, భాష కూడా వాటి స్థానికతల రీత్యా గొప్పవి. ఆ విశిష్టతలను, గొప్పదనాన్ని పరిశీలించడానికి, వివరించ డానికి ఇంకా చాలాదూరం పయనించాలి. చాలా పరిశోధన చేయాలి. చాలా కథలు కనిపెట్టాలి. కనిపెట్టిన కథలు చదవాలి. వాటి మీద విమర్శించాలి. పదేపదే మదింపు వేయాలి. కోస్తా ఆంధ్ర కథల మీద వచ్చిన బండ్ల కొద్దీ విమర్శలకు దీటుగా వాంగ్మయం నిర్మాణం కావాలి.

కానీ, తెలంగాణ కథా వాంగ్మయాన్ని తక్కువచేసి చూడడం దాని కథనం, శిల్పం, నిర్మాణం, శైలి వంటి అంశాల ఆధారంగా కాదు. ఆ అంశాల ఆధారంగా తెలంగాణ కథను తక్కువ చేయాలన్నా కూడా తెలంగాణ కథలను చాలా చదవాలి. కానీ, జరుగుతోంది అది కాదు. తెలంగాణ కథా వాంగ్మయానికి ఉన్న చారిత్రకమైన ఉనికినే నిరాకరించడం. లేదని బుకాయించడం. కానీ, తారీఖుల లెక్కలో కూడా తెలంగాణ ఏమాత్రం వెనుకబడి లేదు. తెలుగు కథ అవతరించిన తొలి సంవత్స రాలలోనే తెలంగాణ కథ కూడా రంగం మీద ఉన్నది. మొదటి కథల అవతరణకు ఒక సుదీర్ఘ నేపథ్యం ఉన్నదని అనుకుంటే ఆ నేపథ్యం గురజాడ అప్పారావు **దిద్దుబాటు** కు ఉన్నట్టే, మాడపాటి హనుమంతరావు ***హృదయ శల్యము***కు కూడా ఉంటుంది.

భండారు అచ్చమాంబ ***స్త్రీ విద్య*** అనే కథను 1902లో రాశారు. గురజాడ అప్పారావు **దిద్దుబాటు** 1910 ఫిబ్రవరి ***ఆంధ్రభారతి*** లో అచ్చయింది. ఆ ఇద్దరికీ మధ్యలో ఆచంట సాంఖ్యాయన శర్మ ***లలిత*** ప్రచురితమైంది. 1910లోనే ***ఆంధ్రపత్రిక*** సంవత్సరాది సంచికలో **ఏబదివేల బేరము** పేరుతో క.రామానుజరావు (కొమర్రాజు వెంకటలక్ష్మణరావు మారుపేరు) కథ ప్రచురితమైంది. అదే సంవత్సరం అదే ***ఆంధ్రభారతి*** లో ఏప్రిల్, మే, జూన్ సంచికల్లో గురజాడ మరో కథ ***మీ పేరేమిటి*** అచ్చయింది. 1911 మే మాసంలో కావచ్చు, మాడపాటి హనుమంతరావు కథ ***నవ నాగరికత*** ప్రచురితమైందని **వ్యాససూచి** చెబుతున్నది. (1913 లో వెలువడిన హనుమంత రావు ***మల్లికా గుచ్ఛము*** లో ఆ పేరు గల కథ లేదు.) మరో రెండేళ్ళకు ఆయన స్వతంత్ర కథ



***హృదయ శల్యము ఆంధ్రభారతి*** లోనే వెలువడింది. అక్కిరాజు ఉమాకాన్తమ్ 1913 నుంచి తన ***త్రిలిఙ్గ*** పత్రికలో కథలు, అనువాద కథలు రాయడం ప్రారంభించారు. తెలంగాణ నుంచి వెలువడిన మొదటి స్వతంత్ర పత్రిక **హితబోధిని** లో 1913 అక్టోబర్ సంచికలో **మృత్యువు దాని జ్ఞాపకము** అన్న పేరుతో మ్యూజింగ్స్ వంటి కథనం ఒకటి ప్రచురితమైంది.

కారల్ మార్క్సనే కాదు, చిన్నకథను కూడా కాలం కడుపుతో ఉండి కనవలసిందే. పై తారీఖులను చూసినప్పుడు, మొదటి కథ గురించి తర్జనభర్జన అర్థరహితంగా కనిపిస్తుంది. ఆధునిక కథ, సమగ్ర కథ, సంపూర్ణ కథ అని ఎన్ని క్లాజులు విధించినా ఏ ఒక్కదానికో మొట్టమొదటిదిగా పెద్దపీట వేయడం పొరపాటని అనిపిస్తుంది. 1900 నుంచి 1915 మధ్యలో ఒక రూపు తీసుకుంటున్న తెలుగుకథలో ఆధునికతో మరో లక్షణమో ఒకే తీరుగా లేవనుకుంటే, ఆ వైవిధ్యం ఆయా కథకుల నేపథ్యాల మీద ఆధారపడి ఉంటుంది.

గురజాడ **దిద్దుబాటు** ను మొదటి కథగా ప్రచారం చేయడంలో పెద్ద వింత ఏమీలేదు. తెలంగాణాలో కాదు, తెలుగులోనే మొట్టమొదటి కథకుడిగా మాడపాటి హనుమంతరావును పేర్కొన్న వ్యాసాలనేకం ఆనాటి తెలంగాణ పత్రికల్లో కనిపిస్తాయి. అయితేనేం, గురజాడ ప్రచారకులే తెలుగు సాహిత్యరంగంలో అధికారంలోకి వచ్చారు కాబట్టి, వారి ప్రచారమే అధికారిక వాస్తవం అయింది. కేవలం గురజాడ వల్ల పెద్ద నష్టం లేదు (పైగా లాభం కూడా ఉంది) కానీ, గురజాడను శిఖరాగ్రం మీద నిలబెట్టిన తరువాత, ఆయన శీర్షంగా కలిగిన ఒక సాహిత్య వంశ పరంపర అంతా తెలుగు సాహిత్యానికి ఏకైక చరిత్రగా పరిణమించడం తెలంగాణకు జరిగిన పెద్ద అన్యాయం.

వచన రూపంలో ఉన్న, చదువుకునే చిన్న కథ ఆధునిక సమాజానికి సంబంధించిన ప్రక్రియ. పాశ్చాత్య దేశాలలో, ముఖ్యంగా పారిశ్రామిక విప్లవం జరిగిన దేశాలలో అభివృద్ధి చెందిన పత్రికా పఠనం నుంచి, కొత్త సాహిత్య అవసరాల నుంచి చిన్న కథ అభివృద్ధి చెందింది. పందొమ్మిది శతాబ్దం చివరి మూడు, నాలుగు దశాబ్దాలలో రంగం మీదికి వచ్చిన అనేక ఇంగ్లీషు పత్రికలు పాశ్చాత్య పత్రికల నుంచి చిన్నకథలను ప్రచురిస్తూ వచ్చాయి. ఆ కథలను చదివి ఆకళింపు చేసుకునే భాషాజ్ఞానం, సాహిత్యశిక్షణ కలిగిన ఒక శిష్టవర్గం భారతదేశంలో స్వల్పంగా ఉండింది, పెరుగుతూ వస్తోంది. పత్రికల ప్రచురణ, పుస్తకాల ప్రచురణ, కొత్తరకం సృజనాత్మక రచనలను స్వీకరించగలిగిన పాఠకవర్గం - ఇవన్నీ వచనరచనలకు, చిన్న కథలకు కావలసిన కనీస సదు పాయాలు. భండారు అచ్చమాంబ తొలికథ రాసేనాటికి కోస్తా ఆంధ్ర ప్రాంతం నుంచి మహిళలే సంపాదకులుగా స్త్రీల పత్రికలు అవతరించడం, గురజాడ **దిద్దుబాటు** రాసేనాటికి పదుల సంఖ్యలో సాహిత్య పత్రికలు రంగం మీద ఉండడం ఒక వాస్తవం. తెలంగాణలో తొలి స్వతంత్ర పత్రిక **హితబోధిని** 1913లో మాత్రమే ప్రారంభం కావడం మరొక కఠోర వాస్తవం. (తెలంగాణ నుంచి వచ్చిన మొదటి తెలుగు పత్రిక **శేద్యచంద్రిక**, 1885 ప్రాంతాలలో వచ్చిన ఈ పత్రిక స్థానిక వ్యావహారిక వచనంలో ఉన్నప్పటికీ, ***ఫునూన్*** అన్న ఉర్దూ వ్యవసాయ పత్రికకు అనువాదం కావడం వల్ల దీనిని స్వతంత్ర పత్రికగా పరిగణించడంలేదు.)

తెలుగువారి సమాజాలు పాత స్థితి నుంచి 'ఆధునిక సమాజం'లోకి చేసిన ప్రయాణం, ఆ ప్రయాణం సృష్టించిన వివిధ ఘర్షణలు, విడుదల చేసిన సృజనశక్తులూ - ఇవే ఆధునిక తెలుగు సాహిత్యానికి కారకాలు అనుకుంటే గనుక అటువంటి సాహిత్యం తెలంగాణలో పుట్టక పోవడమే న్యాయం. ఎందుకంటే తెలంగాణాది పూర్తిగా భిన్నమైన అనుభవం. బ్రిటిష్‌వారి పాలనలో ఉన్న ఆంధ్ర ప్రాంతంలో ఏ రాజకీయార్థిక, సామాజిక, సాంస్కృతిక శక్తులు, చారిత్రక పరిణామాలు

అక్కడి 'వికాసాని'కి కారణం అయ్యాయో అవేవీ తెలంగాణా ప్రాంతంలో లేవు. అయితే, బ్రిటిష్ ఆంధ్రలో జరిగినది మాత్రమే 'వికాసమ'నీ, అటువంటిది లేకపోవడం వెనుకబాటుతనమనీ తెలంగాణావాదం కానీ, స్థానికతావాదం కానీ అంగీకరించలేదు. తెలంగాణాలో జరిగినది విభిన్నమైన వికాసం.

బ్రిటిష్ భారతదేశంలో వికాసం లేదా 'పునరుజ్జీవనం' వలసవాదంతో ముడిపడి ఉన్నది. వలసవాద ప్రయోజనాల కోసం తీర్చిదిద్దిన విద్యావిధానం, పరిపాలనం కొత్త భారతీయ శిష్ట తరగతిని సృష్టించాయి. తరువాతి చరిత్రలో వీరే ముఖ్య పాత్రధారులు. ఈ నిర్వహణకు అనేక ఆధునిక సదుపాయాలు అవసరమయ్యాయి. వాటిని వలసవాద ప్రభుత్వమే కల్పించింది. భారతీయులకూ బ్రిటిష్‌వారికీ నడుమ సంధానకర్తలుగా ఉండడానికి తగిన ఉద్యోగవర్గానికి ఆహ్వానం, వారి నిర్మాణానికి ఉద్యోగ సౌకర్యాలు, వాటి కోసం పాఠ్యపుస్తకాలు, వాటి కోసం ముద్రణా సదుపాయాలు, పెరిగిన అక్షరాస్యుల కోసం పత్రికలు - ఇదంతా ఒక గొలుసుకట్టు పరిణామం. ఇంగ్లీషువారి విద్యను, తద్వారా ఏర్పడే ఉద్యోగావకాశాలను, పరిపాలనలో వారు కల్పించబోతున్న కొద్దిపాటి భాగస్వామ్యాన్ని అందుకోవడానికి, వలసవాదులతో క్రియాశీలంగా మెలగడానికి కావలసిన ప్రేరణను, చొరవను కొత్తగా ఏర్పడిన సాగునీటి వ్యవస్థలు అందించాయి. తక్కిన పనిని విద్యావిధానం పూర్తిచేసింది. వలసవాద పాలనా యంత్రాంగంలో కీలకమైన పనిముట్లుగా ఉపయోగపడడానికి సాంప్రదాయ అగ్రవర్ణం ఉబలాటపడగా, ఉత్పత్తి, భూ వినియోగాలలో వచ్చిన మార్పులు సరికొత్త మధ్యంతర శూద్ర అగ్రవర్ణాలను రంగం మీదికి తెచ్చాయి. మొత్తం మీద సమాజం అంతా ఎంతో కొంత 'మెరుగైన పురోగతి'లో ప్రయాణిస్తున్న అనుభూతికి లోనైంది. మెకాలే ఒక ప్రయోజనం కోసం ఆధునిక భారతీయ విద్యావంతులను సృష్టించాలనుకుంటే, తమ సొంత అవసరాల రీత్యా అందుకు సహకరించడానికి ఎన్నో భారతీయ శ్రేణులు సిద్ధపడ్డాయి. మున్ముందు అనివార్యంగా ఏర్పడే ప్రజాస్వామిక వ్యవస్థలలో అధికార స్థానాలను ఇప్పటినుంచే పదిలపరచుకోవడానికి వివిధ సామాజిక శ్రేణులు పడిన తపన, చేసిన ప్రయత్నమే పందొమ్మిదో శతాబ్ది రెండవ అర్ధభాగపు బ్రిటిష్ ఆంధ్ర చరిత్ర.

ఇంగ్లీషువారిది పై నుంచీ, కింది నుంచీ కూడా కమ్మేసిన ఉధృత ప్రభావమే అయినప్పటికీ, స్థానికమైన కారణాలనేకం రకరకాల వికాసాలకు కారణమై ఉంటాయి. గురజాడ అప్పారావు కానీ, వీరేశలింగం కానీ, సామినేని ముద్దు నరసింహం కానీ రావడానికి బ్రిటిష్ ఆంధ్రలోని విద్యా ప్రయత్నాలు, అచ్చు యంత్రాలు, పత్రికల వ్యాప్తి కారణమనుకుంటే ఆ ప్రయత్నాలన్నీ కొన్ని స్థానిక సమాజాల క్రియాశీల భాగస్వామ్యంతో జరిగాయన్నది కూడా గుర్తించాలి. నూటాయాభై ఏళ్ళ కిందట గోదావరి జిల్లాలో ప్రాజెక్టుల వల్ల లాభం పొందిన రైతులు తమ పిల్లలకు సొంత పెట్టుబడితో ఆంగ్ల విద్యాలయాలు ఏర్పాటు చేసుకోవడానికి సిద్ధపడ్డారు. ఆంగ్లో-వెర్నాక్యులర్ విద్యావిధానం ఇంగ్లీషు విద్యతో పాటు మాతృభాషకు కూడా చాలా 'స్థలం' కల్పించింది. స్థానిక భాషకు హైదరాబాద్ రాజ్యంలో పెద్ద పీటే దొరికింది కానీ - దురదృష్టవశాత్తూ అది తెలుగు కాదు. నిజాం ప్రభుత్వం మిడిల్ స్కూల్ దాకానైనా తెలుగుకు కల్పించిన కొద్దిపాటి అవకాశాలనైనా వినియోగించుకొని, దొరికిన స్థలాన్ని మరింత విశాలం చేసుకునే ప్రయత్నం చేయగలిగిన లబ్ధిదారుల వర్గం తెలంగాణాలో లేకపోయింది. బెంగాల్‌కీ, ఉత్తరాంధ్రకీ, అటు నుంచి దక్షిణాంధ్రకీ ప్రవహించిన 'ఉదయసంధ్య' తెలంగాణాకు సోకలేదని, ఇక్కడ ఏ గురజాడ అప్పారావూ, వీరేశలింగమూ ఆ ఉదయానికి వైతాళికులు కాలేకపోయారనీ గుర్తించవలసి ఉన్నది.



అయితే, తెలుగు సమాజాలను విజ్ఞానం వైపు నడిపించాలని జరిగిన ఒక ముఖ్య ప్రయత్నంలో తెలంగాణకు కూడా మంచి భాగస్వామ్యముంది. 20వ శతాబ్దపు మొదటి దశాబ్దంలోనే ప్రారంభమైన విజ్ఞాన చంద్రికా గ్రంథమండలిలో తెలంగాణకు చెందిన రావిచెట్టు రంగారావు, ఆదిరాజు వీరభద్రరావు క్రియాశీలంగా ఉన్నారు. ఈ గ్రంథమండలి ద్వారానే వీరేశలింగంతో తెలంగాణకు ఎంతో కొంత సంబంధం ఏర్పడింది. (ఈ విజ్ఞానచంద్రిక నిర్వహించే పరీక్షలకు ఒద్దిరాజు సోదరులు హాజరయ్యారు. ఆ పరీక్షలకు వీరేశలింగమే ఎగ్జామినర్. ఒద్దిరాజు సోదరులు అనేక రంగాలలో ప్రావీణ్యం చూపించిన ప్రతిభావంతులు, మంచి కథకులు కూడా.) ప్రాథమిక విద్యలో వీరేశలింగం రాసిన మాక్మిలన్ పాఠ్యపుస్తకాలనే తాము చదువుకున్నామని మాడపాటి హనుమంత రావు రాసుకున్నారు. అంతేకాదు, వరంగల్‌లో 1904లో రాజరాజనరేంద్రాంధ్ర భాషా నిలయం స్థాపన తరువాత తాము, తమ మిత్రబృందం వీరేశలింగం రచనలను ఎంతో ఆసక్తిగా చదివి చర్చించేవారమని ఆయన రాశారు. అంటే తెలంగాణ మొదటి కథకునికి బ్రిటిష్ ఆంధ్ర సంస్కర్తతో పెద్ద దూరమేం లేదనే అర్థం. అయితే, మాడపాటితో సహా తెలంగాణ పెద్దలందరికీ ఆనాడు వీరేశలింగంతో ఉన్న సాహిత్య పరిచయం గురజాడ అప్పారావుతో లేదన్నది స్పష్టం. అట్లాగే, ఉర్దూ విద్యాభ్యాస ప్రభావం మాడపాటి హనుమంతరావును ప్రేమ్‌చంద్ కథలను అనువదించేట్టు చేసింది తప్ప, ఇంగ్లీషు చిన్నకథలను కాదు. **హితబోధిని** పత్రికలో ఒక చిన్నకథను, అనేక ప్రహసనా లను రచించిన రచయితలకు కోస్తా ఆంధ్రా పరిణామాలతో, సంస్కరణలతో గాఢమైన పరిచయమే ఉన్నట్టు ఆధారాలు కనిపిస్తున్నాయి.

అతి కొద్దిమంది విద్యావంతులు కొత్త భావసంచలనాలను అవగతం చేసుకోగలిగినప్పటికీ వారు వాటిని ఆనాటి తెలంగాణలో ఎంతమందితో పంచుకోగలరు? పంచుకోగలిగిన సమ ఉజ్జీ పాఠకశ్రేణి లేనప్పుడు, భావ వినిమయం సృజనాత్మకంగా, సమర్థంగా ఎట్లా ఉండగలదు? అటువంటి పాఠకశ్రేణి లేకపోవడం ఒక రకంగా వెనుకబాటుతనం ఫలితం అని చెప్పవచ్చు. అయితే, నిజంగా ఆనాటికి తెలంగాణలో విద్యావంతులైన పాఠకశ్రేణి ఏర్పడినప్పటికీ, వారు కొత్త భావాలను కోస్తా ఆంధ్రలో స్వీకరించినట్టు స్వీకరించేవారా? అన్నది వేరే ప్రశ్న.

అన్నటికంటే ముఖ్యమైన అంశం - బ్రిటిష్ ఆంధ్రలో వికసిస్తున్న వచన కాల్పనిక సాహిత్యానికి ఉన్న సామాజిక, రాజకీయ ఎజెండా నాటి హైదరాబాద్ రాజ్యానికి పనికివస్తుందా అన్నది. సంఘసంస్కరణలే ముఖ్యమైన సాహిత్య ఎజెండా అయినప్పుడు, తెలంగాణలోని విద్యావంతులు దాన్ని అనుకరించడానికి ప్రయత్నించారు. బ్రాహ్మణ విధవా పునర్వివాహాన్ని ఒక పెద్ద వస్తువుగా తీసుకురావడానికి తెలంగాణలో ఆ సామాజిక వర్గం పెద్ద సంఖ్యలో, కోస్తా ఆంధ్రలో ఉన్నంత పలుకుబడితో లేదు. స్త్రీ విద్య గురించి మాట్లాడడానికి మొదట అసలు పురుష విద్యే లేదు. అసలు వివిధ సామాజిక వర్గాలు తమలోని లోటుపాట్లను సవరంచుకోవలసిన రాజకీయ అగత్యమేదీ తెలంగాణలో నాడు లేదు. అటువంటి సంస్కరణల వల్ల లబ్ధి పొందే అవకాశం ఉన్నచోట సంస్కరణలు చురుకుగానే సాగాయి. ఉదాహరణకు, నాటి హైదరాబాద్ దళిత ఉద్యమం ఆంతరంగికంగా సంస్కరణ ఉద్యమంగా కూడా ఉండింది. ఆ సంస్కరణలకు ప్రభుత్వ ప్రోత్సాహం, సంస్కరణల ఫలితంగా జీవనస్థాయిలో మెరుగుదల స్పష్టంగా కనిపిస్తున్నందున నాటి పట్టణ దళితులు అందులో చురుకుగా పాల్గొన్నారు. కథావస్తువులలో రెండు ప్రాంతాల మధ్య ఉన్న ఈ తేడా - నాటి తెలంగాణ కథావస్తువుల్లో స్పష్టంగా ప్రతిబింబిస్తుంది. మాడపాటి హనుమంతరావు **హృదయశల్యము** చారిత్రక ఇతివృత్తం తీసుకున్నప్పటికీ, స్త్రీపక్షపాతంతో రాసిన

కథ. ***మృత్యువు, దాని జ్ఞాపకము*** అన్న కథ కరుణ, వైరాగ్యమూ మిళితమై ఉన్న ఒక మానవీయ కథనం. ***హితబోధిని*** లో ప్రచురితమైన ***విషాదము*** అన్న రచన, పూర్తి సంభాషణాత్మకంగా ఉన్నప్పటికీ చిన్నకథగానే చెప్పదగిన రచన. అందులో ఇతివృత్తం - వివాహేతర సంబంధంలో బిడ్డను కన్న ఒక వితంతువు ఆవేదన, బాధ్యత తీసుకోకుండా బిడ్డను చంపిన తండ్రి. 1913లో ఆశించలేనంతటి స్త్రీ పక్షపాతం ఆ రచనలో కనిపిస్తుంది. వీరేశలింగం ప్రభావంతో అదే పత్రికలో వచ్చిన ***రెడ్డిగారి ప్రహసనం***లో ఇతివృత్తం - రెడ్డి కులంలో వధూవరులు పరస్పరం చూసుకోకుండానే పెళ్ళి చేసుకునే ఆనవాయితీ.

మధ్య తరగతి జీవితాల నుంచి ఇతివృత్తం గ్రహించాలని అనుకున్న నాటి రచయితలు అందులో ఘోరంగా విఫలమయ్యారు. ఆ వైఫల్యం వారి వ్యక్తిగతమైనది కాదు. నాటి తెలంగాణ సమాజానిది. వంద సంవత్సరాల క్రితమే కాదు, నేటికి కూడా తెలంగాణలో నిజమైన మధ్య తరగతి ఇంకా రూపొందనేలేదు. ఆర్థిక హోదా రీత్యా మధ్యతరగతిగా చెప్పదగ్గది నేడు పెద్ద తరగతిగానే కనిపిస్తుంది కానీ, సాంస్కృతికంగా దానిని నూటికి నూరుపాళ్ళు మధ్యతరగతిగా ఇంకా పరిగణించలేము. సమాజంలోని అనేక వాస్తవ, ప్రతీకాత్మక విలువల ఘర్షణకు మధ్యతరగతి తగిన వేదిక. ఆ వర్గంలో కలిగే సంచలనం, అది పొందే ప్రకంపనలు, అది చేసే పోరాటాలు, సిద్ధపడే రాజీలు - ఇవన్నీ సమాజపు గతిని అద్భుతంగా చిత్రిస్తాయి. అన్నిటికి మించి, నలుపు తెలుపులుగా ఉండని జీవితం, అనేక సంక్లిష్టతలను ధరించే జీవితం వాస్తవికతను అతి దగ్గరి నుంచి పట్టుకోగలుగుతుంది. నాటి తెలంగాణ జీవితంలో ఆ మధ్యతరగతి ఏది? అసలు విద్యావంతులు ఎక్కడ? పట్టణాలకు వచ్చి వేతనశర్మలైన ఉద్యోగులెక్కడ? స్త్రీ విద్య, సార్వత్రిక విద్య మొదలైనవి మానవ సంబంధాలలో తీసుకువచ్చే కల్లోలం ఎక్కడ?

నాటి తెలంగాణ గ్రామీణ జీవితం సాపేక్షంగా నిశ్చలంగా ఉంది. అంటే దానిలో ఏ కదలికా లేదని కాదు. ఆ కదలికలను తీవ్రం చేసే, ఉధృతం చేసే, కల్లోలపరిచే బాహ్య, ఆంతరంగిక శక్తులు ఏవీ ఇంకా నాటికి బలపడలేదు. గ్రంథాలయాల స్థాపన జరుగుతూ ఉన్నా, అంతకు మునుపు తెలియని పబ్లిక్ లైఫ్ ఏర్పడుతూ ఉన్నా కూడా వాటి ప్రభావాలకు కథారూపం ఇవ్వగలిగిన రచయితలు కూడా లేరు.

తెలుగులో తొలి విడత కథలు ప్రచురితమైన కాలానికి మద్రాసు రాష్ట్రంలో వెయ్యికి 75 మంది చదువుకున్న వారుండగా, హైదరాబాద్ రాజ్యంలో వెయ్యికి 27 మంది మాత్రమే చదువుకున్నవారు. అందులో హిందువుల సంఖ్య వెయ్యికి 23 మాత్రమే (1911 జనాభా లెక్కలు). అందులో తెలుగువారి కంటె మహారాష్ట్రులు చాలా ఎక్కువ. మరాఠీ ప్రాంతాలలో మిడిల్ స్కూళ్ళలో ఇంగ్లీషు కూడా నేర్పుతుండగా, తెలుగు ప్రాంతాలలో ఇంగ్లీషు చెప్పే మిడిల్ స్కూళ్ళు అతి తక్కువ. 1910 నాటికి సెకండరీ విద్య పూర్తిచేసిన హిందువులు 6261 మంది కాగా, ఉన్నతవిద్య చదివినవారు 49 మంది మాత్రమే. 1930 నాటికి (అంటే ఉస్మానియా విశ్వ విద్యాలయం స్థాపించిన 12 సంవత్సరాలకు) ఉన్నత విద్య చదివిన హిందువుల సంఖ్య 483కు పెరిగింది. ఈ గణాంకాలలో స్త్రీల పరిస్థితి ఎట్లా ఉండేదో ఊహించుకోవచ్చు. 1921 జనాభా లెక్కల ప్రకారం ఒక్క గోదావరి జిల్లాలోనే అక్షరాస్యుల సంఖ్య లక్షా పదకొండువేలు. కృష్ణా జిల్లాలో అక్షరాస్యులు లక్షా యాభై మూడు వేలు. గుంటూరు జిల్లాలో లక్షా పాతికవేలు. ఇది మొత్తం హైదరాబాద్ రాజ్య అక్షరాస్యుల సంఖ్యతో సమానం. ఇంగ్లీషు చదువుకున్నవారు 1921 నాటికి గోదావరి జిల్లాలో 16,554, కృష్ణాలో 15,531, గుంటూరులో 17,105 మంది ఉన్నారు.



హైదరాబాద్ రాజ్యంలో మొత్తం అచ్చయిన పుస్తకాలు 1910 నాటికి కేవలం 933 మాత్రమే. అందులో తెలుగు పుస్తకాలు 14 మాత్రమే. కాశీనాథుని నాగేశ్వరరావు 1929లో ప్రకటించిన ఆంధ్ర వాఙ్మయ సూచికలో మొత్తం 12,256 ముద్రిత తెలుగు గ్రంథాలను పేర్కొన్నారు. అందులో తెలంగాణా రచయితల రచనలు 50కి మించవు. ఈ గణాంకాలన్నీ పత్రికలకీ, వచన రచనలకీ, కాల్పనిక రచనలకీ తెలంగాణలో ఎంతమంది పాఠకులు అందుబాటులో ఉన్నారో అంచనా వేయడానికి పనికివస్తాయి.

బ్రిటిష్ ఆంధ్రలో చదువులు, స్కూళ్ళు వంటి ప్రాథమిక సదుపాయాలకు ప్రభుత్వమే పూనుకున్నది. ప్రజలు ఉత్సాహంగా ముందుకు వచ్చినచోట మరింతగా అవకాశాలు కల్పించింది. తెలంగాణలో చదువుల మీద ఆసక్తిని ప్రజలలో కల్గించడానికి ఉద్యమాలు కావలసి వచ్చింది. పిల్లలను చదివించమని, తెలుగు పత్రికలను కొనమని విద్యా ప్రచారకులు, పత్రికా ప్రచారకులు పెద్ద పెద్ద భూస్వాములను ప్రాధేయపడినా, తిరస్కారమే ఎదురయ్యేది. గ్రంథాలయోద్యమం, క్రమంగా పెరిగిన తెలుగు ప్రచురణలు, నెమ్మదిగా అయినప్పటికీ కొంత పెరిగిన విద్యా సదుపాయాలు తెలంగాణలో చదువరులను పెంచాయి. వీటన్నిటి ఫలితం 1935 నుంచి స్పష్టంగా కనిపిస్తుంది. అయితే, ఆలోగానే, తెలంగాణలో ఆధునిక సాహిత్య సంస్కారాన్ని పెంపొందించడానికి నాయకులు తగిన కృషి చేశారు. ఆ కృషిలో ముఖ్య ఘట్టం ***సుజాత*** పత్రిక నిర్వహణ (1927-30).

ఇటీవల వచ్చిన ***తొలితరం తెలంగాణ కథలు*** (సంపాదకులు - ముదిగంటి సుజాతారెడ్డి) లో మొదటి కథ 1912నాటిది అయితే, తరువాతి కథ 1927 నాటిది. ఈ పదిహేనేండ్ల అంతరానికి వివరణ ఇవ్వవలసి ఉంది. ఒకరకంగా చూస్తే ఈ అంతరం వాస్తవమైనది కాకపోవచ్చు. మరొకరకంగా వాస్తవమూ అయి ఉండవచ్చు. ***సుజాత*** వచ్చేవరకు తెలంగాణ కథలకు తగిన వేదిక లేదనే చెప్పాలి. అయితే, పూర్తి సమాచారం ఆధారంతో ఆ నిర్ధారణ చేయలేము. 1922లో ప్రారంభమైన తొలి తెలంగాణ రాజకీయ వార పత్రికలు ***నీలగిరి, తెలుగు*** పత్రికల సంపుటాలు మొత్తంగా ఇప్పుడు లభ్యం కావడంలేదు. కేవలం చెరి ఒక సంవత్సరపు ప్రతులు మాత్రం దొరుకుతున్నాయి. వాటిలో కథాసాహిత్యం లేదు. 1925లో ప్రారంభమైన ద్వైవార పత్రిక ***గోల్కొండ*** కథలను కూడా ప్రచురించింది. వాటికి సంబంధించిన సూచిక ఏదీ లేదు. కథా సాహిత్యాన్ని, వ్యాసాలను కూడా పట్టిక వేసిన **వ్యాససూచి** (సాహిత్య అకాడమీ) తెలంగాణ పత్రికలను పరిగణన లోనికి తీసుకోలేదు. ***ఆంధ్రాభ్యుదయము, దేశబంధు*** పత్రికలు 1927కు ముందే తెలంగాణలో వచ్చాయి. వాటిలో కథలనదగ్గ రచనలు కొన్ని ఉన్నాయి కూడా. అయితే, ఈ పత్రికలు సులువుగా లభ్యంకావడం లేదు.

తెలంగాణలోని చదువరులకు ఉత్తమశ్రేణి సాహిత్యాన్ని అందుబాటులో ఉంచడానికి, రచయితలకు కావలసిన ఎక్స్‌పోజర్‌ను ఇవ్వడానికి ***సుజాత*** పత్రికను స్థాపించారు. మాడపాటి హనుమంతరవు, సురవరం ప్రతాపరెడ్డి ప్రోత్సాహంతో స్థాపితమైన ఈ పత్రికకు పి.ఎన్. శర్మ ఎడిటర్. కోస్తా ఆంధ్ర పత్రికలు నాడు వెలివేసిన గుడిపాటి వెంకటచలం కథలు పది సుజాతలో ప్రచురితమయ్యాయంటే, పత్రికకున్న వ్యాప్తిని అర్థం చేసుకోవచ్చు. సుజాత ప్రచురించిన సిరుగూరి జయరావు రాసిన **పరమాణువులో మేజువాణీ**, ఒద్దిరాజు సీతారామచంద్రరావు రాసిన **అదృశ్య వ్యక్తి** తెలుగులో తొలి సైన్స్‌ఫిక్షన్ రచనలుగా చెప్పుకోవచ్చు. శ్రీశ్రీ ప్రభవ పద్యాలు కూడా 1927లో సుజాతలో ప్రచురితమయ్యాయి. ***భారతి*** కి తెలంగాణ సమాధానంగా వెలువడిన ***సుజాత*** ఎక్కువ

కాలం కొనసాగకపోవడానికి కారణాలు పాఠకులు, చందాదారుల ప్రోత్సాహం లేకపోవడమే అని వేరే చెప్పనక్కరలేదు.

1930 తరువాత వచ్చిన *దక్కన్ కేసరి* పత్రికలో కొడవటిగంటి కుటుంబరావు కథలు అచ్చయ్యాయి. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి తన ప్రబుద్ధాంధ్రలో తెలంగాణ రచయితలకు, రచనలకు తగిన ప్రాధాన్యం ఇస్తూ వచ్చారు. అంటే ఆధునిక వచన రచయితలలో ప్రముఖులందరూ తెలంగాణ పాఠకులకు అందుబాటులో ఉన్నారు. తెలంగాణతో సజీవ సంబంధంలో ఉన్నారు.

గ్రంథాలయ ఉద్యమం కారణంగా, వెల్లువగా వచ్చిపడ్డ నవ్యసాహిత్య గ్రంథాలు, ఉస్మానియా విశ్వవిద్యాలయం అవతరణ తరువాత పెరిగిన ఉన్నత విద్యావకాశాలు, జాతీయోద్యమ ప్రభావాలు ఒక కొత్తతరం సాహిత్యకారులను 1935 నాటికి రంగం మీదికి తీసుకు రాగలిగాయి. వెల్దుర్తి మాణిక్యరావు, కాళోజీ నారాయణరావు, వి.ఆర్. అవధాని, బూర్గుల రంగనాథ రావు, గుండవరం హనుమంతరావు, బోయనేపల్లి రంగారావు, వట్టికోట ఆళ్వారుస్వామి - ఈ తరమంతా 1935 తరువాతనే రంగప్రవేశం చేసింది. వైతాళికులు, ఆంధ్రకేసరి వంటి మిత్రబృందాలు ప్రధానంగా కథకులవే. వీరందరికీ పెద్ద దిక్కుగా, మొత్తం సాహిత్య వాతావరణానికి చోదకశక్తిగా నిలబడ్డ సురవరం ప్రతాపరెడ్డి ఎక్కువగా కథారచన చేసింది 1930లలోనే. కొత్త పరిణామాలు తెలంగాణ జీవనాన్ని ఎంతగా ప్రభావితం చేస్తున్నాయో వీరందరి కథలూ ప్రతిబింబించాయి.

తెలంగాణ సాయుధ పోరాటానికి ముందు వెలువడిన తెలంగాణ సాహిత్యాన్ని సాహిత్య చరిత్రకారులు విస్మరించడానికి మరొక నేపథ్యం - తెలంగాణ కథలు ప్రకటించిన నేపథ్యం. తెలంగాణ రాజకీయాలను ప్రభావితం చేసిన ఆర్య సమాజం, బ్రహ్మ సమాజం, హిందూ ముస్లిం సంబంధాలు, మతపరివర్తనలు - బ్రిటిష్ ఆంధ్ర సమాజానికి ఆసక్తికరమైనవి కావు. జాతీయోద్యమం, ప్రపంచయుద్ధం, ఆర్థికమాంద్యం వంటి అంశాల ప్రభావాలను చిత్రించే తమ కథకు, తెలంగాణ కథ చాలా మెట్లు దిగువన ఉన్నదని భావించి ఉండవచ్చు. కాళోజీ కథలలో ఆర్య సమాజం ప్రభావం ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. ప్రతాపరెడ్డి కథలలో మొగలాయి నాటుదనం, రైతు ముక్కుసూటిదనం, నాజూకుగా ఉండనొల్లని శైలి తొణికిసలాడుతుంటాయి. సంఘ సంస్కరణలు తగ్గుముఖం పట్టి, రాజకీయ జాతీయోద్యమంలో ఉండిన కోస్తా ఆంధ్ర ప్రాంతాలకు, ఇంకా కనీస సంస్కరణల గురించి మాట్లాడే తెలంగాణ సాహిత్యం వెనుకబడినదిగా కనిపించి ఉండవచ్చు. దేశ స్వాతంత్ర్యోద్యమంలో దేశీయ సంస్థానాలు పాలుపంచుకోనక్కరలేదని, దేశీయ పాలకులు సహజమిత్రులని సాక్షాత్తూ గాంధీయే అన్న తరువాత, హైదరాబాద్ వంటి చోట్ల జరిగిన రాజకీయ ఉద్యమాలకు బ్రిటిష్ ఆంధ్రులలో ఏమి గౌరవం ఉంటుంది?

1901లో మొదలైన గ్రంథాలయోద్యమం, 1921లో అవతరించిన ఆంధ్ర జనసంఘం, 1930లో ఏర్పడిన ఆంధ్ర మహాసభ - పరంపరలో చైతన్యాన్ని తీర్చిదిద్దుకుని ముందుకు వెళ్ళినవారు తరువాతి కాలంలో కాంగ్రెస్ - కమ్యూనిస్టు శిబిరానికి దూరంగానే ఉండిపోయారు. ఎల్లాప్రగడ సీతాకుమారి, నందగిరి ఇందిరాదేవి, వెంకటరావు, ప్రతాపరెడ్డి, కాళోజీ మొదలైనవారు సామాజిక అంశాలను, పరిమితమైన రాజకీయ అంశాలను మాత్రమే కథావస్తువులుగా తీసుకున్నారు. ప్రతాపరెడ్డి సుప్రసిద్ధమైన కథ *సంఘం పంతులు*లోని సంఘం ఇంకా కమ్యూనిస్టు సంఘంగా మారని సంఘమే. అయితే, గ్రామాలలో సామాజిక, ఆర్థిక నిర్మాణాలను కలవరపరుస్తున్న సంఘం నిర్మాతలు బ్రిటిష్ ఆంధ్ర నుంచి వస్తున్నవారని ప్రతాపరెడ్డి కథలో సూచన గమనించదగ్గది.



దేశంలో జాతీయోద్యమం తీవ్రం కావడం, రెండో ప్రపంచ యుద్ధారంభం, రజాకార్ల రంగ ప్రవేశం, కమ్యూనిస్టుల నిశ్శబ్ద నిర్మాణం, హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్ అవతరణ, విరమణ... ఇవన్నీ కలిసి 1940-45 మధ్యకాలంలో తెలంగాణలో రాజకీయాలను పరుగులు పెట్టించాయి. అప్పటికి తెలంగాణలో తెలుగు పత్రికల సంఖ్య పెరిగింది. విద్యావంతుల సంఖ్యా పెరిగింది. హైదరాబాద్, సికింద్రాబాద్, వరంగల్, నల్లగొండ, మెదక్, కరీంనగర్, ఖమ్మం వంటి అనేక కేంద్రాలలో సాహిత్యబృందాలు అవతరించాయి. వచన రచన ఉధృతమైంది. అణాగ్రంథమాల, దేశోద్ధారక గ్రంథమాలలకు తోడు అనేక ప్రచురణ బృందాలు చురుకుగా పనిచేశాయి. అయితే, వీరెవరూ తెలంగాణ సాయుధపోరాట కథనాన్ని ఎందుకు చేపట్టలేదు అన్నది ఒక శేష ప్రశ్న. పోరాటంలో మునిగిపోయారు కాబట్టి రాయలేకపోయారు అన్నది సరి అయిన వివరణ కాదు. అసలు తెలంగాణ రచయితలెవ్వరూ పోరాటకథలు రాయలేదన్నది నిజం కాదు. ఆవుల పిచ్చయ్య, కాంచనపల్లి చిన వెంకటరామారావు, పి. వెంకటేశ్వరరావు, పర్చా దుర్గాప్రసాదరావు వంటి రచయితలు చాలామంది రాశారు. కానీ, పోరాట కథారచనను గుత్తగా స్వీకరించినవారు మాత్రం కోస్తా ఆంధ్ర రచయితలే. గ్రామీణ దుర్మార్గాలను చిత్రించడంలో తెలంగాణ రచయిత ఎప్పుడూ వెనుకంజ వేయలేదు. కానీ, వాటి ప్రతిఘటన, దానికోసం జరిగిన నిర్మాణం - వీటిలో సాధారణ తెలంగాణ వచన రచయిత భాగస్వామి కాలేకపోయాడేమో అనిపిస్తుంది. వట్టికోట ఆళ్వారుస్వామి కూడా గ్రామాల్లోని భూస్వామ్యం తీవ్రతను, దానికి వచ్చిన ప్రతిఘటన కలిగించిన ప్రభావాలను చర్చించినంతగా తన కథలలో ప్రత్యక్ష పోరాటాన్ని చిత్రించలేదు.

తెలంగాణ సాయుధ పోరాటం, పోలీసుచర్య, సైనిక ప్రభుత్వం, హైదరాబాద్ రాష్ట్రం, ఆంధ్రప్రదేశ్ అవతరణ - ఈ క్రమాన్నంతా ఒకటిగా తీసుకుంటే వాటి మీద కథలు తెలంగాణ నుంచి చాలానే వచ్చాయి. నెల్లూరు కేశవస్వామి ***యుగాంతం***, ఆళ్వారుస్వామి ***రాజకీయ బాధితులు***, కాళోజీ ***లంకా పునరుద్ధరణ*** మచ్చుకు చెప్పదగ్గ మేలికథలు. హైదరాబాద్ రాష్ట్రం ముక్కలై ఆంధ్రప్రదేశ్‌లో తెలంగాణ కలిసిన తరువాత తెలంగాణ కాంగ్రెస్ నాయకులకు తెలుగు రాజకీయాలలో ప్రాధాన్యం పోయినట్టే, తెలంగాణ సాహిత్యానికి తెలుగు సాహిత్యంలో పరిగణన పోయింది. తెలంగాణ సాయుధ పోరాటాన్ని కమ్యూనిస్టులు ఒక చారిత్రాత్మక పోరాటంగా ప్రచారం చేశారు కాబట్టి 1945 నుంచి తెలంగాణ ఉనికి ఎంతో కొంత అంగీకరించవలసి వచ్చింది తప్ప, అంతకుముందు తెలంగాణ ఏమిటో కమ్యూనిస్టులకు కూడా అక్కరలేకపోయింది. (ఒక్క దేవులపల్లి వెంకటేశ్వరరావుకు మాత్రం మినహాయింపు, ఆయన ఒక్కరే తెలంగాణలో 1915 నుంచి జరుగుతున్న పరిణామాలను ఉద్యమ నేపథ్యంగా పేర్కొన్నారు) కమ్యూనిస్టులు ఆంధ్రప్రాంతంలో ప్రతిష్టించిన వైతాళికులే తెలంగాణకు కూడా వలస వచ్చారు. తెలంగాణ సాహిత్యం 1940లలో తెలుగు సాహిత్యంలో వచ్చి కలిసే ఉపనదిగా మారిపోయింది.

1940ల కంటే ముందు తెలంగాణ కథలు ఇంకా చాలా పరిశీలనకు రావలసి ఉంది. భిన్నమైన రాజకీయ వాతావరణంలో, భిన్నమైన సమస్యాంశాలను స్పృశించిన ఆ కథలలో ఎన్నో నిగూఢమైన ఆసక్తికరమైన అంశాలు, చరిత్రా ఉన్నాయి. ఆ కథలను వాటి మొత్తం నేపథ్యంలో భాగంగా చూడాలి.

1935 నుంచి 1948 వరకు జరిగిన తెలంగాణ కథా సాహిత్య వికసనాన్ని ఎంతో లోతుగా పరిశీలించవలసి ఉన్నది. తెలంగాణలో రాజకీయ ఉద్యమం కూడా వికసిస్తున్న కాలం అది. నిజాం పరిపాలనకు వ్యతిరేకంగా, బాధ్యతాయుత ప్రభుత్వాన్ని, రాజకీయ సంస్కరణలనీ కోరుతున్న

చైతన్యవంతులను జాతీయ కాంగ్రెస్ ధోరణి నిరుత్సాహంలో ముంచెత్తింది. బ్రిటిష్‌వారి నిష్క్రమణ తరువాత భారతీయ ముస్లిముల సంగతేమిటన్న భయాందోళనల ప్రభావం జాతీయ రాజకీయ రంగం మీద, ఆ తరువాత హైదరాబాద్ రాజకీయ చిత్రపటం మీద పడసాగింది. రజాకార్ల అవతరణకు నేపథ్యం అదే. దోచుకోవడం, అణచివేయడం తప్ప గ్రామీణ సమాజం గురించి ఎటువంటి బాధ్యతా స్వీకరించని సరికొత్త భూస్వామ్యవర్గం రైతాంగాన్ని మిలటెంట్ పరిష్కారాల వైపు నెట్టసాగింది. తెలంగాణ-బ్రిటిష్ ఆంధ్ర సరిహద్దుల జిల్లాలలో చైతన్యం కొన్నిచోట్ల జాతీయవాద రూపాన్ని, మరికొన్నిచోట్ల కమ్యూనిస్టు రూపాన్ని తీసుకున్నది. సాంప్రదాయిక భూస్వామ్య శక్తుల నుంచే కొన్ని లిబరల్ శక్తులు వేరుపడసాగాయి. వారిలో కొందరు కమ్యూనిస్టులుగా కూడా మారసాగారు.

1935 నుంచి 1940 దాకా **ఆంధ్రకేసరి** లిఖిత పత్రికను నడిపి, ఆ తరువాత అచ్చుపత్రికగా మార్చిన ఆంధ్రకేసరి బృందం నాటి కథాసాహిత్య చైతన్యానికి విశిష్టమైన గుర్తు. ఆ బృందంలో ఉన్న పదిమంది సభ్యులు వేరువేరు జిల్లాలకు చెందినవారు. ఎవరి జిల్లా మాండలికంలో వారు కథలు రాయాలని ఒక నియమం పెట్టుకుని వారు కథలు రాశారు. **ఆంధ్రకేసరి** అచ్చుపత్రికలో తెలంగాణ మాండలికంలో రాసిన కథలకు ప్రత్యేక ఆహ్వానం పలికింది ఆ బృందం. బూర్గుల రంగనాథరావు, ఎం.ఎస్.రాజలింగం మొదలైనవారు నిర్వహించిన సాధన సమితి తెలంగాణ కథను 1940లో అభివృద్ధి పరిచింది. సాధన సమితి అనేక కథా సంకలనాలను ప్రచురించింది.

తెలంగాణ అన్నది ఒక భౌగోళిక ప్రాంతంగా కాక, ఒక కథావస్తువుగా మారింది తెలంగాణ సాయుధపోరాట కాలంలో. **మీజాన్** పత్రిక సంపాదకుడు అడవి బాపిరాజు తెలంగాణలో కమ్యూనిస్టు పోరాటాన్ని సమర్థించే అనేక కథలను ప్రచురించారు. కమ్యూనిస్టులు నిర్వహించే పత్రికలలో కూడా ఇతరులు తెలంగాణ కథలను రాశారు. 1946 ఎన్నికలలో తెలంగాణలోని ఫ్యూడల్ దాష్టీకం సుందరయ్యగారికి ఒక ప్రచారాంశం అయినట్టే, ఆనాటి ప్రగతిశీల పరాయి కథకులకు తెలంగాణ ఒక కథాంశం అయింది. కథాంశంగా మారిన తెలంగాణ అనేక అవాస్తవ చిత్రీకరణలకు కూడా లోనయింది.

నిర్బంధం నుంచి బయటికి వచ్చిన వట్టికోట ఆళ్వారుస్వామి తెలంగాణ వాస్తవ కథనాన్ని ఇవ్వడానికి ప్రయత్నించారు. తెలంగాణ కథలను ప్రత్యేకంగా ప్రచురించాలని సంకల్పించారు. 1950లలో ఆయన ప్రచురించిన **పరిసరాలు** అన్న రెండు సంపుటాల కథలలో అనేక తెలంగాణేతరుల కథలున్నప్పటికీ, తెలంగాణ వాస్తవికతను పట్టి ఇచ్చే ఉద్దేశంతో ప్రచురించిన సంపుటాలుగా వాటిని పేర్కొనవచ్చు.

తెలంగాణ సాయుధ పోరాట విరమణ, ఆంధ్రప్రదేశ్ అవతరణ తరువాత - తెలుగు సాహిత్యరంగంలో ఒక స్తబ్ధత వచ్చిందని ఆధునిక సాహిత్య చరిత్ర చెబుతూ వచ్చింది. తెలంగాణా వస్తువును ఆశ్రయించి కథలూ, నవలలూ, పాటలూ, కవిత్వాలూ రాసిన కోస్తాంధ్ర రచయితలందరూ సినిమారంగానికి తరలిపోవడమే ఆ స్తబ్దతకు ఒక కారణంగా కూడా చెబుతుంటారు. నిజానికి 1956 తరువాత తెలంగాణ స్తబ్దతలో లేదు. అది ఒకవైపు ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో తనకు కొత్తగా సంక్రమించిన ఉనికితో సర్దుకోలేక సతమతమవుతున్నది. మరొకవైపు అప్పటిదాకా తనకు ఉండిన అస్తిత్వాన్ని క్రమంగా కోల్పోవడం కూడా ప్రారంభమైంది. హైదరాబాద్‌ను ఉవ్వెత్తున ముంచిన మనుషుల వలసలు, పత్రికల వలసలు, రచయితల వలసలు - తెలంగాణ జనాన్ని ఉక్కిరిబిక్కిరి



చేశాయి. మరొకవైపు దశాబ్దాల స్థానిక కృషి ఫలితంగా కొద్దికొద్దిగా స్థిరపడుతున్న అక్షరాస్యత, ఆంధ్ర సారస్వత పరిషత్తు వంటి వాటి కృషి వల్ల పెరుగుతున్న సారస్వత పరిచయం, కాళోజీ, దాశరథి, నారాయణరెడ్డి వంటివారికి మొత్తం తెలుగు సాహిత్యరంగంలో దొరుకుతున్న గుర్తింపు - తెలంగాణ సాహిత్య వాతావరణాన్ని కొత్తగా నిర్వచించసాగాయి. ఖమ్మం, నల్లగొండ, మహబూబ్ నగర్, కరీంనగర్ వంటి అనేక కేంద్రాలలో చిన్నచిన్న సాహిత్య బృందాలు, కేంద్రాలు ఏర్పడడం, పుస్తక ప్రచురణలు ప్రారంభం కావడం జరిగాయి. తెలంగాణ రచయితల సంఘం కూడా ఈ కృషిలో పాలు పంచుకుంది. అయితే, వీటిని ఎవరూ పట్టించుకున్న పాపాన పోలేదు.

తిరిగి తెలంగాణలో వచన సాహిత్య ఉధృతి 1970లలో మొదలైంది. ప్రత్యేక తెలంగాణ ఉద్యమం, నక్సల్బరీ ప్రభావం అనేక **విద్యుల్లతలను** మొలిపించాయి. కథాసాహిత్యంలోకి **బదలా** ఒక వస్తువుగా ప్రవేశించింది. 1947లో కదనరంగంగా, కథావస్తువుగా ఉన్న తెలంగాణ, ఈసారి కదనాన్ని, కథనాన్నీ కూడా తానే నిర్వచించసాగింది. శ్రీకాకుళ ఉద్యమం చల్లారిన తరువాత రంగస్థలం క్రమంగా తెలంగాణవైపు మళ్ళడం, అదే సమయంలో కరీంనగర్ కల్లోలానికీ, కథనానికీ తాను పదును తేరి ఉన్నానని ప్రకటించడం జరిగిపోయాయి. తరువాతి కథ తెలిసిందే. అల్లం రాజయ్య, తుమ్మేటి రఘోత్తమరెడ్డి, బి.ఎస్. రాములు వంటి ఆరితేరిన కథకులు రంగం మీదికి వచ్చారు. ఆధునిక సాహిత్య చరిత్రలో స్థిరపడిన దశలలో విప్లవ సాహిత్యం ఉండడం వల్ల, తెలంగాణ 1970లో తిరిగి ప్రధాన స్రవంతిలోకి వచ్చింది. దళిత, స్త్రీవాద, మైనారిటీవాదాలు తిరిగి కోస్తాంధ్రను రంగంమీదికి తెస్తే, ఇప్పుడు తెలంగాణ స్థానికతావాద ఉద్యమం సాహిత్యంలో తనదైన చరిత్రను, దారిని వెదుక్కొంటున్నది. ఎంతో విలువైన కథాసాహిత్యాన్ని సృష్టిస్తున్నది.

తెలంగాణ తానే వస్తువుగా, తానే రచయితగా, తానే కథనంగా తీర్చిదిద్దుకోవడంలో ఒక పునరావృత్తి ఉన్నది. అలనాటి బ్రిటిష్ సామ్రాజ్యవాదం తెలంగాణను మినహాయించి చేసిన పరిపాలన తెలంగాణలో ఒక రకమైన వాస్తవికతకు కారణమైంది. తరువాతి కాలంలో బ్రిటిష్ ఆంధ్రులు అంతర్గత వలసవాదులు కావడానికి దారితీసింది. ఇప్పుడు కూడా సామ్రాజ్యవాద ప్రపంచీకరణ ఫలితాలు (దళారీ ఫల్గాలే కావచ్చు!) నాటి బ్రిటిషాంధ్ర ప్రాంతాలకే దక్కుతుండగా, దాని విష ఫలితాలు, వనరుల దోపిడి తెలంగాణ అనుభవిస్తున్నది. మొదటిదశలో తనను తాను తెలుసుకోలేకపోయిన తెలంగాణ, నేటి దశలో తనను తాను ఆవిష్కరించుకుంటున్నది.

*

ఆంధ్రప్రదేశ్ ఏర్పడే వరకు తెలంగాణ నుంచి వచ్చిన తెలుగు కథలు 1500 పైగా ఉంటాయని మిత్రుడు, పరిశోధకుడు సంగిశెట్టి శ్రీనివాస్ నిరూపిస్తున్నారు. (దస్త్రమ్, తెలంగాణ కథల సూచి, కవిలె ప్రచురణ 2003.) వాటిలో అధికం ఇంకా మనకు చదువుకోవడానికి అందుబాటులోనే లేవు. దొరికిన వాటిలో చాలామటుకు ఇంకా తగిన పరిశీలనకు నోచుకోలేదు. తెలంగాణ కథ గురించి ఏమి చెప్పినా అది అర్ధసత్యమే. అందరి గురించి, అన్నిటి గురించి తామే ప్రతినిధులుగా వ్యవహరించే ప్రతినిధులకు తప్ప, అన్వేషకులకు ఇంకా ఇది ప్రారంభమే.

*హైదరాబాద్*
*29-08-2003*

# కథలు - కథకులు

## కథ 90 - కథ 2002 వరకు వచ్చిన సంకలనాల్లో ప్రచురించిన కథల వివరాలు

| | | | |
|---|---|---|---|
| 1. సుమనస్పతి | 1. నిశ్శబ్దం | '90 | ఆంధ్రప్రభ (వార) |
| 2. స్వామి | 2. అద్దం | '90 | ఆంధ్రప్రభ (వార) |
| | 3. వానరాలె | '91 | ఆంధ్రప్రభ (వార) |
| | 4. నడక | '96 | ఆంధ్రప్రభ (వార) |
| 3. మధురాంతకం రాజారాం | 5. అంబ పలుకు జగదంబా పలుకు | '90 | ఆంధ్రజ్యోతి (వార) |
| 4. పి. సత్యవతి | 6. ఇల్లలకగానే | '90 | ఉదయం (వార) |
| | 7. అరుణ సంధ్య | '94 | ఆహ్వానం |
| | 8. సూపర్‌మామ్ సిండ్రోమ్ | '96 | సుప్రభాతం |
| 5. ఎ.ఎన్. జగన్నాథ శర్మ | 9. పేగు కాలిన వాసన | '90 | ఆంధ్రజ్యోతి (వార) |
| 6. చక్రవేణు | 10. కువైట్ సావిత్రమ్మ | '90 | ఆంధ్రజ్యోతి (వార) |
| 7. వాడ్రేవు చినవీరభద్రుడు | 11. సుజాత | '90 | ఆంధ్రజ్యోతి (వార) |
| | 12. ప్రశ్నభూమి | 2002 | ప్రజాతంత్ర(ప్రత్యేక) |
| 8. బమ్మిడి జగదీశ్వరరావు | 13. గతుకులు | '90 | ఆంధ్రజ్యోతి (వార) |
| | 14. తెగిన గొళ్ళాలు | '94 | ఆంధ్రప్రభ (వార) |
| | 15. మట్టితీగలు | '99 | ఆంధ్రజ్యోతి (ఆది) |
| 9. కేతు విశ్వనాథరెడ్డి | 16. తేడా | '90 | ఆంధ్రజ్యోతి (దీపా) |
| | 17. రెక్కలు | '91 | ఇండియా టుడే |
| | 18. సతి | '92 | రచన |
| | 19. అంత్యాక్షరి | '96 | ఇండియా టుడే |
| 10. కాట్రగడ్డ దయానంద్ | 20. కర్రావు | '90 | ఆంధ్రజ్యోతి (ఆది) |
| | 21. గూడు | '94 | ఆహ్వానం |
| | 22. పండుటాకు | '95 | ఆహ్వానం |
| | 23. తలపాగా స్వగతం | '98 | ఆంధ్రజ్యోతి (ఆది) |
| | 24. నేల తిమ్మిరి | 2001 | సుజనరంజని |
| | 25. గుండ్లకమ్మ తీరాన | 2002 | ప్రజాసాహితి |
| 11. యర్రమిల్లి జె. శేఖర్ | 26. భూమి పుత్రుడు | '90 | ఉదయం (వార) |
| 12. సాక్షి | 27. తిరగబడ్డ ధర్మం | '90 | ఆంధ్రజ్యోతి (వార) |
| 13. పాపినేని శివశంకర్ | 28. ఇప్పుడూ - ఇక్కడా | '90 | ఆంధ్రజ్యోతి (వార) |
| | 29. చింతలతోపు | '95 | ఆహ్వానం |
| | 30. సగం తెరిచిన తలుపు | '98 | సుప్రభాతం |
| | 31. మనుషులు వదులవుతారు | '99 | ఆంధ్రజ్యోతి (ఆది) |
| 14. గోపి | 32. ఒక తండ్రి | '90 | సృజన |
| 15. శ్రీపతి | 33. ఆటకట్టు | '90 | ఇండియా టుడే |
| 16. మునిపల్లె రాజు | 34. సవితి తమ్ముడు | '91 | ఆంధ్రప్రభ (వార) |
| 17. ఆర్.ఎమ్. ఉమామహేశ్వరరావు | 35. బిడ్డలు గల తల్లి | '91 | ఆంధ్రప్రభ (వార) |
| | 36. మంచివాడు | '93 | ఇండియా టుడే |
| | 37. మొగుడూ పెళ్ళాల ప్రేమకత | '97 | ఆంధ్రజ్యోతి (దీపా) |
| | 38. నోరుగల్ల ఆడది | 2000 | చూపు కథల సంచిక |
| 18. తల్లావఝుల పతంజలి శాస్త్రి | 39. వాల్‌పోస్టర్ | '91 | ఆంధ్రజ్యోతి (వార) |
| | 40. సర్మా | '93 | ఆంధ్రప్రభ (వార) |
| 19. చిలుకూరి దేవపుత్ర | 41. మన్ను తిన్న మనిషి | '91 | ఆంధ్రప్రభ (వార) |
| 20. కె. సదాశివరావు | 42. మానవ ఫాక్టర్ | '91 | ఇండియా టుడే |
| | 43. మరో బహుమతి | '92 | ఆంధ్రజ్యోతి (దీపా) |
| 21. మధురాంతకం నరేంద్ర | 44. అత్యాచారం | '91 | ఆంధ్రజ్యోతి (వార) |
| | 45. నిత్యమూ నిరంతరమూ | '93 | ఆంధ్రప్రభ (వార) |
| | 46. అస్తిత్వానికి అటూ-ఇటూ... | 2001 | విపుల |
| 22. కవనశర్మ | 47. విడాకులు | '91 | ఆంధ్రప్రభ (వార) |
| | 48. ఆమె ఇల్లు | '93 | ఆహ్వానం |
| 23. అబ్బూరి ఛాయాదేవి | 49. ఆఖరికి అయిదు నక్షత్రాలు | '91 | ఆంధ్రజ్యోతి (వార) |
| 24. ఆడెపు లక్ష్మీపతి | 50. ఆక్రోశం | '91 | ఆంధ్రజ్యోతి (వార) |
| | 51. జీవన్ముృతుడు | '95 | విపుల |
| | 52. తిర్యగ్రేఖ | '96 | సాహిత్యనేత్రం |
| | 53. విధ్వంస దృశ్యం | 2000 | ఇండియా టుడే |
| 25. ఎ.వి. రెడ్డి శాస్త్రి | 54. లైబ్రరీలో | '91 | ఆంధ్రజ్యోతి (దీపా) |
| 26. డా॥ వి. చంద్రశేఖరరావు | 55. జీవని | '91 | ఆంధ్రజ్యోతి (దీపా) |
| | 56. డియర్ కామ్రేడ్ | '93 | ఆంధ్రజ్యోతి (వార) |
| | 57. చిట్టచివరి రేడియో నాటకం | '97 | ఆంధ్రజ్యోతి (ఆది) |
| | 58. బఫెల్లోస్ క్లబ్ | '98 | ఆంధ్రజ్యోతి (ఆది) |
| | 59. మాయ లాంతరు | '99 | ఆంధ్రజ్యోతి (ఆది) |
| | 60. ఆవు-పులి మరికొన్ని కథలు | 2002 | ఇండియా టుడే |
| 27. అల్లం రాజయ్య | 61. కమల | '91 | ఆంధ్రజ్యోతి (దీపా) |
| | 62. అతడు | '95 | ఆహ్వానం |
| 28. సింగమనేని నారాయణ | 63. అడుసు | '91 | ఇండియా టుడే |
| 29. గంటేడ గౌరునాయుడు | 64. ఏటిపాట | '92 | కథా వేదిక |
| 30. వివిన మూర్తి | 65. పయనం - పలాయనం | '92 | రచన |
| 31. ఎం.ఎస్. సూర్యనారాయణ | 66. చమురుబావి | '92 | ఆంధ్రజ్యోతి (వార) |
| 32. దాదాహయాత్ | 67. రెండణాల గుగ్గిళ్ళు | '92 | రచన |
| | 68. మురళి ఊదే పాపడు | '95 | ఆంధ్రప్రభ (వార) |
| 33. మహేంద్ర | 69. ముసలమ్మ మరణం | '92 | ఇండియా టుడే |
| | 70. ఇంధనం | '93 | ఆంధ్రప్రభ (వార) |
| 34. కాళీపట్నం రామారావు | 71. సంకల్పం | '92 | రచన |
| 35. జి.ఆర్. మహర్షి | 72. మా ఊరి మహా వైద్యగాడు | '92 | ఆంధ్రజ్యోతి (దీపా) |
| | 73. విధ్వంస దృశ్యం | '93 | ఆంధ్రప్రభ (వార) |
| 36. తుమ్మేటి రఘోత్తమ రెడ్డి | 74. ఉరి | '92 | ఆంధ్రజ్యోతి (దీపా) |
| | 75. జాడ | '93 | సృజన |
| | 76. పనిపిల్ల | '94 | ఆంధ్రజ్యోతి (దీపా) |
| 37. ఓల్గా | 77. ఒక రాజకీయ కథ | '92 | ఇండియా టుడే |
| | 78. తోడు | '93 | ఇండియా టుడే |
| 38. నాగరాజు గంధం | 79. చెరువు | '93 | ఆంధ్రప్రభ (వార) |
| 39. వడ్లమూడి దుర్గాంబ | 80. ఇదీ ప్రశ్న | '93 | ఇండియా టుడే |
| 40. శ్రీరమణ | 81. బంగారు మురుగు | '93 | ఆంధ్రజ్యోతి (వార) |
| 41. తోలేటి జగన్మోహనరావు | 82. మార్పు | '93 | ఆంధ్రప్రభ (వార) |
| | 83. లక్ష్మీ కటాక్షం | '94 | ఇండియా టుడే |
| | 84. కప్పదాలు | 2001 | ఇండియా టుడే |
| 42. భరాగో | 85. అశీర్షకమ్ | '93 | ఆంధ్రప్రభ (వార) |
| 43. కొండేపూడి నిర్మల | 86. అబద్ధం | '94 | ఆంధ్రజ్యోతి (ఆది) |

| | | |
|---|---|---|
| 44. కుప్పిలి పద్మ | 87. మసిగుడ్డ | - '94 - ఆంధ్రజ్యోతి (ఆది) |
| | 88. వి.డి.ఆర్.ఎల్. | - '95 - ఆంధ్రజ్యోతి (వార) |
| | 89. ఇన్‌స్టంట్ లైఫ్ | - 2000 - వార్త (ఆది) |
| | 90. సాలభంజిక | - 2001 - ప్రజాతంత్ర (ప్రత్యేక) |
| 45. ఒమ్మి రమేష్‌బాబు | 91. మూడు రాత్రుల కథ | - '94 - ఆంధ్రజ్యోతి (ఆది) |
| 46. సి. సుజాత | 92. తూకం బతుకు | - '94 - విపుల |
| | 93. మట్టి మారాజు | - '96 - ఆంధ్రజ్యోతి (వార) |
| | 94. రెప్పచాటు ఉప్పెన | - '97 - ఆంధ్రజ్యోతి (ఆది) |
| 47. చిత్ర | 95. సంబంధం | - '94 - ప్రజాసాహితి |
| 48. అనామకుడు | 96. గూళ్ళు | - '94 - ఆంధ్రప్రభ (వార) |
| 49. డా॥ టి. సంపత్‌కుమార్ | 97. లియోసా | - '94 - ఆంధ్రప్రభ (వార) |
| 50. గొరుసు జగదీశ్వరరెడ్డి | 98. వలస పక్షులు | - '94 - ఆంధ్రప్రభ (వార) |
| | 99. గజ ఈతరాలు | - '99 - ఆంధ్రజ్యోతి (ఆది) |
| 51. దగ్గుమాటి పద్మాకర్ | 100. పరిధులూ - ప్రమేయాలూ | - '94 - ఆంధ్రజ్యోతి (దీపా) |
| 52. పి. చంద్రశేఖర్ ఆజాద్ | 101. ప్రయాణం | - '95 - సుప్రభాతం |
| 53. కె.యన్.వై. పతంజలి | 102. పిలక తిరుగుడు పువ్వు | - '95 - ఇండియా టుడే |
| 54. ముళ్ళపూడి సుబ్బారావు | 103. రెండు నదుల మధ్య | - '95 - ఆహ్వానం |
| 55. అల్లం శేషగిరి రావు | 104. చీకటి | - '95 - రచన |
| 56. నవులూరి వెంకటేశ్వరరావు | 105. ఎలుకలబోను | - '96 - విపుల |
| | 106. అహింస | - 2000 - ఆంధ్రప్రభ (వార) |
| 57. శ్రీనివాసమూర్తి | 107. అడివోడు | - '96 - ఆంధ్రజ్యోతి (ఆది) |
| | 108. మెడ మీద వేలాడే కత్తి | - '97 - ఆంధ్రజ్యోతి (ఆది) |
| 58. సన్నపురెడ్డి వెంకటరామిరెడ్డి | 109. చనుబాలు | - '96 - సాహిత్యనేత్రం |
| | 110. కన్నీటి కత్తి | - 2000 - వార్త (ఆది) |
| | 111. పాటలబండి | - 2001 - వార్త (ఆది) |
| 59. డి.ఆర్. ఇంద్ర | 112. ఉత్తుత్తి మనుషులు | - '96 - ఆంధ్రజ్యోతి (వార) |
| 60. జయప్రభ | 113. రసఝరీ యోగం | - '96 - ఆంధ్రప్రభ (వార) |
| 61. కరుణ | 114. తాయమ్మ కథ | - '96 - మహిళా మార్గం |
| 62. ఎ. అప్పల్నాయుడు | 115. ఓ తోట కథ | - '97 - ఆంధ్రజ్యోతి (ఆది) |
| | 116. వాళ్ళు | - '98 - అరుణతార |
| | 117. క్షతగాత్ర గానం | - '99 - వంశధార కథలు |
| 63. కొలకలూరి ఇనాక్ | 118. గొడ్డ దొంగ | - '97 - ఆంధ్రజ్యోతి (ఆది) |
| 64. కాలువ మల్లయ్య | 119. యుద్ధభూమి | - '97 - విపుల |
| 65. బి.ఎస్. రాములు | 120. మెరుగు | - '97 - ఆంధ్రజ్యోతి (వార) |
| | 121. వారసత్వం | - '99 - రచన |
| 66. మహమ్మద్ ఖదీర్‌బాబు | 122. దావత్ | - '97 - ఆంధ్రజ్యోతి (ఆది) |
| | 123. జమీన్ | - '98 - ఆంధ్రజ్యోతి (ఆది) |
| | 124. న్యూ బాంబే టైలర్స్ | - 2000 - చూపు కథలసంచిక |
| | 125. ఖాదర్ లేడు | - 2001 - పర్‌స్పెక్టివ్స్ ప్రచురణ |
| | 126. పెండెం సోడా సెంటర్ | - 2002 - ప్రజాతంత్ర(ప్రత్యేక) |
| 67. వాగప్పగారి సుందర్‌రాజు | 127. నడిమింటి బోడెక్క బసివిరాలయ్యేద | - '97 - మాదిగోడు సంపుటి |
| 68. సోదుం జయరాం | 128. మనువు | - '98 - ఇండియా టుడే |
| 69. గోపిని కరుణాకర్ | 129. దుత్తలో చెందమామ | - '98 - ఆంధ్రజ్యోతి (ఆది) |
| | 130. బారతం బొమ్మలు | - '99 - వార్త (ఆది) |
| | 131. కానుగపూల వాన | - 2000 - తెలుగుకథ డాట్‌కామ్ |



| | | |
|---|---|---|
| 70. ఎస్. జయ | 132. రెక్కలున్న పిల్ల | - '98 - ఆంధ్రజ్యోతి (ఆది) |
| 71. సతీష్ చందర్ | 133. సిగ్గు | - '98 - సుప్రభాతం |
| 72. సొదా | 134. ఫొటోగ్రాఫర్ | - '98 - ఆంధ్రజ్యోతి (ఆది) |
| 73. గోపరాజు నారాయణరావు | 135. క్షమార్పణం | - '98 - ప్రజాసాహితి |
| 74. లెనిన్ ధనిశెట్టి | 136. మౌనవీణ గానమిది | - '98 - ఆంధ్రజ్యోతి (ఆది) |
| | 137. http://www//యంత్రరాక్షసి.com | - '99 - ఆంధ్రజ్యోతి (ఆది) |
| 75. రంగనాయకమ్మ | 138. మురళీ వాళ్ళమ్మ | - '99 - ఆంధ్రజ్యోతి (వార) |
| 76. జలంధర | 139. సహాయం | - '99 - ఇండియా టుడే |
| 77. వాడ్రేవు వీరలక్ష్మీ దేవి | 140. కొండఫలం | - '99 - మా భూమి |
| 78. సువర్ణముఖి | 141. గోరపిట్ట | - '99 - వంశధార కథలు |
| 79. లగుడు బారిసి జాంబ్రి | 142. క్షుద్రక్రీడ | - '99 - ఆంధ్రజ్యోతి (ఆది) |
| 80. చంద్రలత | 143. తోడికోడలు | - '99 - ఇండియా టుడే |
| | 144. కొలీగ్స్ | - 2001 - ఇండియా టుడే |
| | 145. ఆవర్జా | - 2002 - ఇండియా టుడే |
| 81. సురేష్ | 146. ది డెత్ ఫోర్ టోల్డ్ | - '99 - ఆంధ్రజ్యోతి (ఆది) |
| | 147. టైటానిక్ | - '01 - విపుల |
| 82. వి. ప్రతిమ | 148. అక్క ఈగ | - '99 - ఆంధ్రజ్యోతి (ఆది) |
| | 149. రాచపుండు | - 2002 - అమెరికా భారతి |
| 83. కె. వరలక్ష్మి | 150. మట్టి - బంగారం | - '99 - అమెరికా భారతి |
| 84. పెద్దింటి అశోక్‌కుమార్ | 151. వలసపక్షి | - 2000 - సుప్రభాతం |
| | 152. గోస | - 2001 - విజయవిహారం |
| | 153. పీడ | - 2002 - ఆంధ్రజ్యోతి (ఆది) |
| 85. శ్రీకాంత్ | 154. మూడవ అధ్యాయం | - 2000 - ఆంధ్రజ్యోతి (ఆది) |
| | 155. నిశ్శబ్దపు పాట | - 2002 - ఆంధ్రజ్యోతి (ఆది) |
| 86. ఆరి సీతారామయ్య | 156. గట్టు తెగిన చెరువు | - 2000 - ఇండియా టుడే |
| | 157. అవచారం | - 2001 - ఇండియా టుడే |
| 87. సరికొండ చలపతి | 158. కిటికీ | - 2000 - తెలుగుకథ డాట్‌కామ్ |
| 88. అనిసెట్టి శ్రీధర్ | 159. మగాడి పశ్చాత్తాపం | - 2000 - ఇండియా టుడే |
| 89. సాహితి | 160. గుండె లోతు | - 2000 - విపుల |
| 90. ఎమ్వీ రామిరెడ్డి | 161. వైరస్ | - 2000 - రచన |
| 91. నల్లూరి రుక్మిణి | 162. దూరపు కొండలు | - 2001 - సుప్రభాతం |
| 92. జి. ఉమామహేశ్వర్ | 163. నిశ్శబ్ద విప్లవం | - 2001 - ప్రజాతంత్ర |
| 93. ముదిగంటి సుజాతారెడ్డి | 164. నిశ్శబ్దం! నిశ్శబ్దం!! | - 2001 - ఆంధ్రప్రభ |
| 94. వి. అశ్వినికుమార్ | 165. సంకెళ్ళు | - 2001 - వార్త (ఆది) |
| 95. ఇనాయతుల్లా | 166. వలస | - 2001 - కథా సమయం |
| | 167. నిచ్చెన | - 2002 - ప్రజాతంత్ర(ప్రత్యేక) |
| 96. సుంకోజి దేవేంద్రాచారి | 168. నీడ | - 2001 - విపుల |
| | 169. అన్నంగుడ్డ | - 2002 - ఆంధ్రజ్యోతి (ఆది) |
| 97. కె. దేవయాని | 170. పేగుముడి | - 2001 - ఆంధ్రప్రదేశ్ |
| 98. కన్నెగంటి చంద్ర | 171. బతుకు | - 2001 - సుజనరంజని |
| 99. బెజ్జారపు రవీందర్ | 172. నిత్య గాయాల నది | - 2002 - వార్త (ఆది) |
| 100. పి. కమలకుమారి | 173. చూపు | - 2002 - ప్రజాసాహితి |
| 101. డా॥ యం. హరికిషన్ | 174. ఒక చల్లని మేఘం | - 2002 - అరుణతార |
| 102. అప్సర్ | 175. గోరీమా | - 2002 - వార్త (ఆది) |

# సంకలనాలు - ఆవిష్కరణలు

**కథ 90**

కె. శివారెడ్డి అధ్యక్షతన 28-12-1991న హైదరాబాద్ ద్వారకా హోటల్‌లో వేకూరి రామారావు ఆవిష్కరించారు. పేజీలు 152 + 8; వెల రూ. 17.

**కథ 91**

సింగమనేని నారాయణ అధ్యక్షతన 23-8-1992న అనంతపురంలో మధురాంతకం రాజారాం ఆవిష్కరించారు. పేజీలు 172 + 8; వెల రూ. 20.

**కథ 92**

కె. శివారెడ్డి అధ్యక్షతన 22-10-1993న రాజమండ్రిలో చాసో ఆవిష్కరించారు. పేజీలు 156 + 8; వెల రూ. 22.

**కథ 93**

ఎన్. వేణుగోపాల్ అధ్యక్షతన 28-5-1994న బెంగుళూరులో కాళీపట్నం రామారావు ఆవిష్కరించారు. పేజీలు 164 + 8; వెల రూ. 25.

**కథ 94**

కె.పి. రామస్వామి అధ్యక్షతన 13-8-1995న గోదావరిఖనిలో శీలా వీర్రాజు ఆవిష్కరించారు. పేజీలు 152 + 8; వెల రూ. 28.

**కథ 95**

నందిని సిధారెడ్డి అధ్యక్షతన 22-12-96న సిద్ధిపేటలో చలసాని ప్రసాదరావు ఆవిష్కరించారు. పేజీలు 180 + 8; వెల రూ. 33.

**కథ 96**

దేవిప్రియ అధ్యక్షతన 4-10-1997న కొత్తఢిల్లీలో కె. సచ్చిదానందన్ ఆవిష్కరించారు. పేజీలు 136 + 8; వెల రూ. 35.

**కథ 97**

పెనుగొండ లక్ష్మీనారాయణ అధ్యక్షతన 20-9-1998న గుంటూరులో కేతు విశ్వనాథరెడ్డి ఆవిష్కరించారు. పేజీలు 106; వెల రూ. 30.

**కథ 98**

కె. శివారెడ్డి అధ్యక్షతన 10-10-1999న విజయవాడలో భమిడిపాటి జగన్నాథరావు ఆవిష్కరించారు. పేజీలు 122 + 8; వెల రూ. 35.

**కథ 99**

కె. శివారెడ్డి అధ్యక్షతన 16-7-2000న హైదరాబాద్‌లో వల్లంపాటి వెంకటసుబ్బయ్య ఆవిష్కరించారు. పేజీలు 240 + 16; వెల రూ. 40.

**కథ 2000**

కె. శివారెడ్డి అధ్యక్షతన 30-6-2001న అమెరికాలోని ఫిలడెల్ఫియాలో తానా మహాసభల్లో జంపాల చౌదరి ఆవిష్కరించారు. పేజీలు 185 + 10; వెల రూ. 40.

**కథ 2001**

వి.ఆర్. రాసాని అధ్యక్షతన 21-7-2002న తిరుపతిలో పి. సత్యవతి ఆవిష్కరించారు. పేజీలు 244 + 12; వెల రూ. 45.

**కథ 2002**

డా॥ ఎన్. శైలజ అధ్యక్షతన 7-9-2003న ఒంగోలులో అల్లం రాజయ్య ఆవిష్కరించారు. పేజీలు 214 + 10; వెల రూ. 45.